

...ము చేయుచున్నది. గణేశశంకర విద్యార్థి గారి ప్రాణత్యాగము రాగద్వేష పరముగాకను, ప్రేమమయమై సర్వజనామోదమును బడయుచున్నది. గణేశశంకర విద్యార్థిగా రాపన్నులను రక్షించుటకై అభయము నొసంగుచు ప్రాణములను సమర్పించి అమరత్వమును బడయ గలిగిరి. కరాచి కాంగ్రెసు గణేశ శంకరవిద్యార్థిగారి త్యాగమును ప్రశంసించుచు జాతిమత ద్వేషములను నివారించుటకై జనులందరును వారిమార్గము నవలంబించవలయునని తీర్మానించినది. ఈరెండు తీర్మానములందును గల ధర్మసూక్ష్మమును గ...

...రము గాంధిమహాత్ము...
...పుత్ర స్వార్థసిద్ధికి ఆత్మ...
...పరపీడనమునకు లేద...
...చేయుచున్నవి; అహిం...
...పాదించుచున్నవి. కరా...

...చీ ధర్మవిజయము ... ప్తి సంవత్సరము ...ంను సత్యాగ్రహుల కాదరణీయమై గాంధి మహాత్ముడు పూనగల స్వరాజ్య ప్రస్థానము ...కు సాధనభూతమగు గాక! సత్యాగ్రహులు ...రి పావనమైన కనుహూపమైన ఫలమును ...యుట ...నృతిపర్వము. స్వరాజ్య యోధు... ముఖ్యముగను నవయువకులు లీ పరమ ... దేశకళ్యాణమునకును ... ప్రయోజనకరము.

*　*　*

...జ్యము-యువ...

...స్వరాజ్య సంపాదనమునందు ...దేశ... ...ములు ...వేశమును జూపుట సహజము. యువజనోద్రేకమునకు గారణము నిరంకుశప్రభుత్వము వల్ల జనులకుగలిగిన నిరాశయని విశదమగుచున్నది. ప్రపంచమంతయును నవజీవనముతో సంచలించుచున్నపుడు మహాచైతన్యము గల భరత ఖండము జీవరహితమై యుండజాలదు. గాంధి మహాత్మునకు రక్తాంబరధారులొసంగిన స్వాగతము రోషావేశపూరితమైనను భారత యువకునకు సహజమైన ఆగ్రహమును విశదము చేయుచున్నది. నవజీవనసభయందు పూజ్యులైన పండిత మదనమోహన మాళవ్యగారికి ...

...న్నవి. కరాచి మ్యూనిసిపాలిటి అధ్యక్షుడు జేమ్సెట్టి మెహతాగారు యువజనోద్రేకము విషయమై 'పార్శిసంసారము' నందు వ్రాసిన విషయము గాంధిమహాత్ముని నాకర్షించినది. గతవారపు యంగు ఇండియా పత్రికయందు మెహతాగారి హితబోధల విషయమై గాంధిమహాత్ముడు వ్రాసిన యభిప్రాయములు ధర్మాత్ముల లక్ష్యము నాకర్షింపదగియున్నవి. సర్వత్ర చీకటిమాటికి సత్యాగ్రహ ప్రమాణములు చెలరేగుచున్నవి. ద్వేష గీతములు దిగంతములందును వ్యాపకమును గాంచుచున్నవి. బలవంతము నిర్బంధము పని పాటి యగుచున్నవి. వర్తకులు, ఉద్యోగస్థులు, ప్రతి...

610

## చిత్రములు

త్రివర్ణచిత్రములు—గృహపరిశ్రమ; శ్రీరాగ;

సాధారణచిత్రములు—శ్రీమతి సీతాదేవికన్య; శ్రీమతి రాం పియారి కన్య; శ్రీమతి సులోచన కన్య; శ్రీమతి యమునాకన్య; లండనునగరమున వెస్టుమిన్‌స్టరువద్ద థేమ్సునది పయి సూర్యాస్తమయము; పల్లెటూరి ఉత్సవము; యాత్రికులు; శ్రీయుత బుల్‌బుల్, శ్రీమతి పన్నాకన్యగారులు; పూనానగరముదగ్గరనున్న కార్లీగుహాలలోని శిల్పచిత్రము; ఇతరచిత్రములును.—

---

# భారతి చందాదారుల కొక ముఖ్యమైన విజ్ఞప్తి

---

ఈ దిగువ నమోదుపఱచిన సంఖ్యలుగల చందాదారులచందాలు ఈ ప్రమోదూత సం. మాఘమాస నంచికతో ముగియుచున్నవి. ఆయాసంఖ్యల చందాదారులు దయచేసి తిరుగ తమ తమ చందా సొమ్మును మణిఆర్డరుద్వారా పంపుటగాని, వి. పి. పంప ననుజ్ఞ ఇచ్చుట గాని కావింప ప్రార్థించుచున్నాము. అట్లు మార్చి నెల ౧-వ తేదీ లోగా మాకు మణిఆర్డరు గాని వి. పి అనుమతి గాని రాకున్నచో రాబోవు సంచిక వి. పి. ద్వారా పంపగలము చందాదారులు ఆ వి. పి. ని త్రిప్పివేయక దయతో స్వీకరింప ప్రార్థితులు.

చిరునామా మార్పులు 1-వ తేదిలోపల తెలుప ప్రార్థితులు.

1292 1982 2302 2359 3159 3451 3478 3488 3928 3945 3976 4211 4288

4666 4678 4679 4693 4756 5127 5225 5443 5451 5467 5476 5482 5489

5491 5493 5503 5504 5514 5539 5561 5782 5813 5818 5823 5839 6105

6106 6121 6126 6132 6135 6140 6142 6159 6164 6168 6170 6236 6359

6360 6371 6372 6374 6380 6388 6406 6409 6412 6420

—మేనేజరు, భారతి.




చెన్నపట్టణము, ఫిబ్రవరి ౧౯౩౧

సంపుటము ౮ ప్రమోదూత సంవత్సరము మాఘమాసము సంఖ్య ౨

## శ్రీసూక్తిసుధానిధి

శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు

### సందేశతరంగము

౧

పటువాఁకన్ దిరుగాడుసారసమ! నాపై జాలిమై నెట్టెడల్
వరిచేలం దులకించి మించు తిరువణ్వాండూరిఁ బాలించు న
ప్పెరుమాళ్లన్ వరదున్ సుదర్శనధరున్ బింబాధరున్ జేరి దు
ర్భరపాపాహతిఁ దక్కి చిక్కువడు నాపాట్ల న్నివేదింపవే!

౨

చెలువముఁ బ్రేమమున్ మృదులశీలముఁ గల్గిన బోటితోఁ గుతూ
హలమున మేయు నోజలవిహంగమ! నిచ్చలు వేదయజ్ఞఘో
షలఁ దగు నప్పురం బరిగి స్వామి జగత్త్రియగర్భుఁ గాంచి యం
జలి ఘటియించి శ్రీచరణసన్నిధి నామొఱ విన్నవింపవే!

౩

బారులు దీరి యెల్లెడలఁ బంటపొలంబులఁ జేరి మేయుసం
చారవిహంగులార! వరసంపదలన్ విలసిల్లుచున్న వం
దూరి రథాంగపాణిఁ గరుణోదధి బింబఫలోష్ఠు భక్తమం
దారునిఁ జేరి మ్రొక్కిడి నావెత లెంతలఁ జెప్పి చూడరే!

౪

హితభోగాత్మానురాగసిద్ధి నెడఁబాటే లేని రాయంచదం
పతులారా! శ్రుతిఘోష మించు తిరువణ్వాండూరఁ గొల్వున్న యా
శ్రితచింతామణి భక్తవత్సలుని సంసేవించి 'నీదాసి యొ
క్కతె నీకై నగ మయ్యె' నంచు దయ గల్గన్ దెల్పి ప్రార్థింపరే!

౫

అలుకలు, సాంత్వనోక్తులు, నయంబు లెఱింగి ప్రియాసమేతులై
యలరెడు నంచలార! తడియారని పంకములందు శంఖముల్
చెలఁగుపురంబుఁ జేరి తులసీదళదామకిరీటు నావిభున్
గొలిచి నమస్కరించి దయఁగూర్పఁగ నాకయి ప్రస్తుతింపరే!

౬

అలరుం బొన్నలఁ బాడు కోకిలములారా! మీనముల్ దూలుప
ల్వలముల్ గల్గి వెలుంగుచున్న తిరువణ్వాండూరు వేంచేసి వే
ల్పులకున్ వేల్పయి చక్రహస్తుఁ డగు నాలోకేశ్వరుం గాంచి నా
తలఁ పూరన్ భ్రమ దీఱ నవ్విభుని వార్తల్ దెచ్చి రక్షింపరే!

౭

నెమ్మేను మాత్రమే నీలాంబుదము గాని పాటలాధర మేమొ పగడ మమ్మ!
కనుబొమల్ మాత్రమే కార్ముకమ్ములు గాని తరలాక్షు లేమొ కెందమ్మి లమ్మ!
కరములు మాత్రమే కల్పశాఖలు గాని శయము లేమో కుశేశయము లమ్మ!
కాళులుమాత్రమే కరికరంబులు గాని పదము లేమో కోకనదము లమ్మ!
దరసుదర్శనవస్తుమాత్రములె కాని - కరము లేమొ వరాభయకరము లమ్మ!
తిరుపురం బేలు నాసామి గుఱుతు పట్టి - చిన్నిచిలుకమ్మ! నామాట చెప్పి రమ్మ!

౮

విరియం బూచిన పొన్నలున్ బొగడలున్ వేష్టింపఁగాఁ జల్లనౌ
తిరువణ్వాండురుఁ జేరి చిన్నిచిలుకా! దివ్యత్కిరీటోన్నతున్
నరసాంభోదతనున్ జతుర్భుజుని నబ్జాతాక్షు దర్శించి శ్రీ
చరణాబ్జంబులచెంత నాఁ తుదినమస్కారంబు లర్పింపవే!

౯

సరసీజాసనరాజహంసమ! యుషశ్శంఖారవాపూర్ణహా
తిరువణ్వాండురు డాసి దాసి నను నాత్రిం ద్రోసి దాఁగున్నయ
ప్పరమేశున్ హరిఁ గృష్ణదేవుఁ గని శ్రీపాదంబునన్ వ్రాలి దు
ష్కరపాపాహతిఁ దూలు నావెతల నేకాంతంబునన్ దెల్పుమా!

౧౦

వలపుం బుష్పాడిపూఁత నొప్పు మధుపవ్రాతంబులా రా! విని
ర్మలపంపాతటినీతటోత్తరమునన్ రాజిల్లు వండూరి ని
చ్చలుఁ బాలించు దశాస్యదుర్గనిధనున్ శౌరిన్ విలోకించి 'నిం
దలు నా కేల? త్వదర్థమే బ్రదికి యున్నా' నంచు వాక్రువ్వరే!

సోత్ప్రాసతరంగము

౧

నామీఁద వలచూపు నాటింపఁగా నేల? నాయాట భంగంబుసేయ నేల?
ఇది చూచి నీప్రియ లీసడింపఁగ నేల? యొరులు నిన్నాడ నే నోర్వ నేల?
నీకంటెఁ బ్రేయసుల్ నా కెవ్వ రన నేల? మరు లేఁచ నీనంగిమాట లేల?
ఒట్టుసత్యంబులు గట్టిపెట్టుట యేల? నాచెంతఁగూడ నీ నటన లేల?
గచ్చకాయయు బంతి నా కిచ్చివైచి - వంచనలు మాని పదవోయి వారికడకె
ప్రబలలంకాధినాథవైభవవిరామ! - అఖిలమాయాప్రకామ! రామాభిరామ!

౨

చూపుఁదూపుల నన్నుఁ జుట్టుముట్టెద వేల? మారుపోరాడు నీ వార లుండ
నవ్వువెన్నెలవాఁక నన్ను ముంచెద వేల? సరిగంగలాడు నా సవతు లుండ

బర్హిపింఛంబు నాపైని ద్రిప్పెద వేల? మటుమాయపూంద్రుడు నీ మగువ లుండ
మురళీధ్వనుల నన్ను మరలుకొల్పెద వేల? తొత్తులై నాసూడుకత్తె లుండ
గోల నగునన్ను వలపులఁ గూల్ప నేల? - తుట్టతుద కాస లన్నియుఁ దూల్ప నేల?
చిట్టకా ల్మాని పొమ్ము నీ చెలులకడకె - అఖిలమాయాప్రకామ! రామాభిరామ!

సరసీజాక్షులు, పల్లవాధరము, హాసజ్యోత్స్నయున్ సెమ్మదిన్
గరఁగింపన్ బలుబొమ్ములం బడితి నిన్ గాంక్షించి; బర్హాలకా
భరణల్ నీప్రియ లే నెఱుంగుదును! నన్ బాధింపఁగాఁబోక నీ
మురళీగానము విన్చి పిల్చుకొను మాపూఁబోండ్లనే మాధవా!

3

అల పాలేటిని వెన్నఁ గొన్న నెఱజాణా! నేఁటి నీమంపుఁగ
న్నులకున్, నాఁడిన మోవిచెన్నులకు నేనో కారణం బౌర! మా
యలు నాచెంగటనా? నిను న్వలచి నీకై చిక్కునీప్రాణకాం
తల నమ్మింపుము! పొమ్ము వారికడకే! నామెప్పు నీ కేటికిన్!

౪

లోకము లన్నియున్ గడుపులోఁ బ్రళయంబున డాఁచి చిన్నిమ
ర్రాకునఁ బవ్వళించు కపటాత్ముఁడ వెవ్వ రెఱుంగువారు నీ
పోకలు? సోగకన్గవలఁ బొల్చు లతాంగులు క్రీడ సేయు నీ
సైకతభూమినా పసుల సాఁకుట? రా కిటు నన్ గలంపఁగాన్.

౫

కలఁపంబోకుము కల్ల లాడి నను; నీ కన్గప్పుటల్ భూనభం
బులకున్ గ్రొత్తలె? నీ సుదర్శనమె చెప్పం గాదె? వాఙ్మాధురిన్
వలపుల్ చిమ్మెడు నీప్రియల్ వగవ నవ్యక్తోక్తులం బల్కు ము
ద్దుల నాచిల్కలఁ బల్కరింతు! మతి లేదో నీకు గోపాలకా!

౬

మాయాలీలలఁ జూపి నాపసిఁడిబొమ్మం దీసికొన్నంత నే
మాయెన్; నీనటనంబు లే నెఱుఁగనే! యాసించి త్రైలోక్యరా

జ్ఞీయోగ్యల్ రమణీసహస్రములు నిన్నే కొల్చి యుండంగ న
న్నా యి ట్లల్లరిపాలు చేసి యుపహాస్యా లాడుటల్? మాధవా!

౭

జలధిప్రావృతమేదినీవలయరక్షాదక్షా! మాచిత్రముల్
బలిమిన్ గైకొని చిన్నఁబుచ్చు టిది మేలా నీకు? నీయంతవా
రలకైన స్మృతి తప్పు తప్పె గద! యీరట్టేల? మాగుట్టు వా
డల కెక్కించిన వారు వీ రనక చుట్టా లెల్ల నిందింపరే!

౮

విలయంబందు సమస్తజీవులను నీవే మ్రింగి తత్తత్క్రియా
ఫలముల్ మాఱకయుండఁ గ్రమ్మఱ సృజింప న్నేర్చి యన్నింటి క
వ్వలఁ బెల్గొందెడి జ్ఞానమూర్తివి గదా! వాహ్యాళికై తోడిచె
ల్వాలు పిల్వన్ బువ్వుఁదోఁట కేఁగు మము నిల్వంబెట్టెదే మాధవా!

౯

స్వామీ! నినుఁ గోరి నీకటాక్షముల కూరి - బొమ్మరిలు గట్టి తిరుప్రసాదమ్ము వెట్టి
పిలువఁ బిలువంగ వచ్చి నీవెలమిఁ గనక - కాలితోఁ దన్నివైచితే కరుణ మాలి!

౧౦

ముల్లోకములు దేజరిల్ల శోభిల్లు నీ మణికిరీటమునకై మరగి మరగి
ముయ్యేడుకయ్యాల మొన ఱేండ్లఁ జెండు నీ ఖరపరశ్వథధార కెఱఁగి యెఱఁగి
బ్రహ్మాండకోటులఁ బ్రభవింపఁజేయు నీ ధర్మసంకల్పంబుఁ దలఁచి తలఁచి
వ్రజమండలముఁ దన్ప విజయంబు సేయు నీ జలదమోహనమూర్తి వలచి వలచి
అబల లగు మేము, గోపికలైన మేము - విరతి యెఱుఁగని విరహాగ్ని వేఁగవలసె
నీనెనరు గోరుకొను టిందుకే నఁటోయి!-అఖిలమాయాప్రకామ! శ్యామాభిరామ!

# సాహిత్యరత్నాకరకారుడే భాష్యరత్నప్రభాకారుడు

వేమూరి నృసింహశాస్త్రిగారు

శ్రీమ దాదిశంకరాచార్య విరచిత బ్రహ్మసూత్రభాష్యమునకు భావ్యరత్నప్రభ యనువాఖ్యానమును రచించినది శ్రీ రామానందాపరపర్యాయులగు శ్రీ గోవిందానంద సరస్వతీ స్వాములవారు. సాహిత్యరత్నాకర మను అలంకారశాస్త్రగ్రంథమును రచించినది శ్రీ వారణాశి ధర్మభట్టుగారు. ఈ యుభయ నామములు విమర్శింపగ నాశ్రమభేదముచే నొకవ్యక్తికే వర్తించునటుల తేలుచున్నయది. అది యెటులనగ:—

ధర్మభట్టుగారు సర్వశాస్త్రములలో నిరుపమాన పాండిత్యముకలిగి శ్రీరామోపాసన నధికముగ జేసి, యద్వైతజ్ఞానము సంపాదించి 'ఈశ్వరానుగ్రహా దేవ పుంసా మద్వైతవాసనా' అను ప్రమాణమునకు లక్ష్యభూతులై శ్రీ గోపాల సరస్వతీ స్వాముల వారి యనుగ్రహముచే సన్న్యాసాశ్రమమును స్వీకరించి, శ్రీ శాంకరబ్రహ్మ సూత్రభాష్యముపై భాష్యరత్నప్రభ యను వ్యాఖ్యానమును రచియించి లోకోపకారము జేసిరి. ఆ వ్యాఖ్యానమంగళాచరణశ్లోకములలో ప్రథమ శ్లోకమున తమ కిష్టదైవ మగు శ్రీరాముని

"య మిహ కారుణికం శరణంగతో
ఒప్యతిసహాపర అప మహత్పదం;
త మహ మాశు హరిం పర మాశ్రయే
జనకజాంక మనన్తశుభాకృతిం."

అని సగుణ నిర్గుణ రూపముగ నుతించుటయె కాక, చతుస్సూత్రియంశమున సమన్వయ సూత్రభాష్యమునకు వ్యాఖ్య రచించుచు భాట్టప్రాభాకరవృత్తికారాది బహుమతముల నివర ఖండించెడి భాష్యపంక్తులకు వ్యాఖ్య నొసర్చి,

"రామనామ్ని పరే ధామ్ని కృత్స్నామ్నాయసమన్వ
కార్యతాల్పర్యబాధేన సాధితి శుద్ధబుద్ధయే." [యః;

అని సర్వవేదవాక్యములకు వృత్తికారాదులు చేసిన కర్మయందు సమన్వయమునకు బాధ జూపుచు రాము డనే పేరు గల పరమాత్మ యందు సమన్వయము నాబుద్ధికొఱకు సాధింప బడినది యని శ్రీరామపూర్వతాపి న్యుపనిషత్తులో

"రమన్తే యోగినో ఽనన్తే నిత్యానన్దే చిదాత్మని;
ఇతి రామపదే నాసౌ పరం బ్రహ్మాభిధీయతే."

అని ప్రదర్శింపబడిన వ్యుత్పత్త్యనుసారముగ రాముని నిర్గుణపరమాత్మగ భావించి రామభక్తిని విడనాడకుండ సర్వవేదవాక్య సమన్వయమును జూపెను. ఇంతయే కాక బ్రహ్మసూత్రముల నాల్గధ్యాయములలో పదియారు పాదము లుండును. పాదములలో నుండు

ప్రత్యధికరణార్థమును పాదాదియందొకశ్లోకము రామపరముగ రచియించి ముందుగ సర్వాధికరణార్థములను విపశ్చిజనరంజకముగ సూచించిరి. అట్లు ప్రతిపాదాదియం దుండు శ్లోకములనన్నిటి వ్రాసినచో గ్రంథవిస్తర మగు నను భీతిచేత మచ్చున కొకశ్లోకమును మాత్రము వ్రాసి యందలివిశేషముల జూప బూనినాడను. ప్రథమాధ్యాయ ద్వితీయపాదాదిని,

"శ్రీరామం సిద్ధ మత్తారం గుహాశాయిన మన్తరం;
అన్తర్యామిణ మజ్ఞేయం వైశ్వానర మహం భజే."

అనగా ఈపాదమునందుండు సప్తాధికరణార్థమును సంగ్రహముగ శ్రీరామునియం దన్వయించునటులు విశేషణముల ప్రయోగించి యట్టి రాముని నే భజించెద నని స్తుతించెను. అది యెట్లనగ, "సిద్ధం" అనుపదముచేత "సర్వత్రప్రసిద్ధోపదేశాత్" అను సర్వత్రప్రసిద్ధ్యధికరణార్థమును, "అత్తారం" అనుపదముచే "అత్తా చరాచరగ్రహణాత్" అను అత్త్రధికరణార్థమును, "గుహాశాయినం" అను పదముచేత "గుహాం ప్రవిష్టావాత్మానౌ హి తద్దర్శనాత్" అను గుహాధికరణార్థమును, "అంతరం" అను పదముచే, "అన్తర ఉపపత్తేః" అను అన్తరాధికరణార్థమును, "అన్తర్యామిణం" అనుపదముచే "అన్తర్యామ్యధిదైవాదిషు తద్ధర్మవ్యపదేశాత్" అను అన్తర్యామ్యధికరణార్థమును, "అజ్ఞేయం" అనుపదముచే "అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః" అను అదృశ్యత్వాధికరణార్థమును, "వైశ్వానరం" అనుపదముచే "వైశ్వానర స్సాధారణశబ్దవిశేషాత్" అను వైశ్వానరాధికరణార్థమును నిరూపించిరి. భాష్యవ్యాఖ్యానమునగూడ నిటులనె

"అన్తర్యామీ జగత్సాక్షీ సర్వకర్తా రఘూద్వహః;
అతోఽత్ర దోషో ఽశక్య స్స్యాత్ దేవ హ్యేవేతి శాసనాత్."

అనియు,

"పక్ష స్యక్ష్ణోశ్చ పార్శ్వే కరతలయుగళే
కౌస్తుభాభాం దయాంచ
సీతాం కోదండదీక్షా మభయవరయుతాం
వీక్ష్య రామాంగసంగః;
స్వస్యాః క్వ స్యా దితీత్థం హృది కృతమనసా
భాష్యరత్నప్రభేయం
స్వాత్మానందైకలుబ్ధా రఘువరచరణాం
భోజయుగ్మం ప్రపన్నా."

అని శ్రీరామచంద్రునకే కృతిసమర్పణ చేసినారు. ఇక ధర్మాభట్టుగారు తాము రచించిన సాహిత్యరత్నాకరగ్రంథములో, "న వయం విద్యానాథాదివ త్కుక్షింభరయః."అన్నారు. అనగ విద్యానాథకవిగారు ప్రతాపరుద్రీయమను అలంకారగ్రన్థమునురచించి ప్రతాపరుద్రమహారాజుగారికి కృతి నిచ్చుటయె కాక ప్రతిలక్షణమునకు నుదాహరణముగ శ్రీప్రతాపరుద్రమహారాజుగారివిషయమై శ్లోకము రచియించి ప్రతిశ్లోకములో నతనిని తగులవేసిరి. ఈయన అట్లు మనుజునికి కృతి నీయక శ్రీరామభక్తిచే చతుర్విధనాయకులను శ్రీరామలక్ష్మణ భరత శత్రుఘ్నుల నుదాహరించెను. అనగ ధీరోదాత్తనాయకుండు శ్రీరాముం డనియు, ధీరోద్ధతనాయకుండు లక్ష్మణుం డనియు, ధీరశాంతనాయకుడు భరతుం డనియు, ధీర

లలితనాయకుండు శత్రుఘ్నుం డనియును వర్ణించెను. ఇంతియే గాక ధర్మాభట్టుగారు బ్రహ్మామృతవర్షిణి యని యొక వేదాన్తగ్రంథమును శ్రీవ్యాసకృత బ్రహ్మసూత్రములకు గురువృత్తిరూపముగ రచించిరి. 'దీనికి గురువృత్తి' యని, 'బ్రహ్మామృతవర్షిణి' యనియును పేరు లున్నవి. అందు మంగళాచరణముగ రచించిన శ్లోకము

"శ్రీరామపదపద్మద్వ మధ్యగాసంపసాధనం;[గురుం."
నమామి య ప్రసాదోయోగా త్ప్రాణోఽపి సుఖం

అని శ్రీరామభక్తిభరితముగనె యున్నది. అంతమునందు

"విదుషాం కంఠభూషేయం మయా వృత్తిః కృతా [ప్రభో;
వ్యాసనాఙ్ఘ్రిసంస్పృష్టా ప్రీయతే ఽస్తు స్వగా."

అనియు,

"య స్సర్వ్రగుణసిద్ధిసద్ధిరతను
ర్మాత్రగాత్రిత్రిగ్రాంగణః
సుప్తో ఽప్యత్ర స్ఫుట పట్టిణే పరిమితే
కల్పాన్తరేల్పాన్తరే;
య స్సర్వో పరిసన్నిషాంగన యాజ
ప్రజ్ఞా ప్రవాహోన్నజ
ప్రజ్ఞాలభ్యసుఖాకృతిః కృతి మిమాం
రాము స్స గృహ్ణాతు నః."

అని శ్రీరామచంద్రమహాప్రభువుగారికి కృతి సమర్పణ జేసి కృతకృత్యుం డాయెను. మఱియు బ్రహ్మామృతవర్షిణిలో ప్రత్యధ్యాయమునకు, ప్రతిపాదమునకు, ప్రత్యధికరణమునకు సంగతి జూపించుటయు, పూర్వపక్షసిద్ధాన్తములకు ఫలనిరూపణ సేయుటయు భాష్యరత్నప్రభావ్యాఖ్యానమును బోలి యున్నది. కొన్ని స్థలములలో నవియె పంక్తు లున్నవనియు చెప్పవచ్చును. బ్రహ్మామృతవర్షిణి సాక్షాత్తుగ బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యానము. రత్నప్రభ శాంకరభాష్యమునకు వ్యాఖ్యానము. ఇట్టి భేదమే కాని యాశయములో కాని, రచనాశైలిలో కాని యేమి భేదము కాన్పింపదు. ఇతరభాష్యవ్యాఖ్యానములలో, నితరసూత్రవ్యాఖ్యానములలో నీరీతిగ

"విషయో విశయ శ్చైవ పూర్వపక్ష స్తథో త్తరమ్;
సంగతి శ్చేతి పంచాంగం ప్రాంచో ఽధికరణం విదుః"

అని చెప్పబడిన అధికరణపంచావయవములను చూపించి వ్రాయుట లేదు. ఇట్లుండుటకు హేతువు నామభేద కాలభే దాశ్రమభే దావస్థాభేదము లుండినను కర్తృభేదము లేకుండుటయె యని చెప్పి తీరవలయును. ఈరీతిగ శ్రీరామభక్త్యతిశయసామ్యమువలనను, గ్రంథరచనాశైలీసామ్యమువలనను, పంక్త్యర్థసామ్యమువలనను, విద్వత్కథనమువలనను సాహిత్యరత్నాకర బ్రహ్మామృతవర్షిణీకర్తయగు ధర్మాభట్టుగారే తుర్యాశ్రమస్వీకారానంతరమున భాష్యరత్నప్రభాకారు లని చెప్పవలసి యున్నయది.

ఆధునికసంప్రదాయానుసారముగ నిట్టి మహనీయుల జీవితచరిత్ర కొంచెమైన వ్రాయవలసిన యవసరము గలిగి యున్నది కాని పూర్వకాలికులు నూత్నగ్రంథము సంభవించె నేని గ్రంథస్థవిషయముల విమర్శించువారే కాని

గ్రంథకర్తృచరితాదుల విమర్శించువారు కాకుండుటచే నప్పటి గ్రంథప్రణేతలు తమచరిత్రను గ్రంథములో కాని, విడిగ స్వీయచరిత్రరూపమున గాని ప్రకటించువారు కారైరి. ఇట్టి స్థితిలో సన్న్యసాశ్రమస్వీకారముం జేసినవారు పూర్వాశ్రమచరితస్మరణముకూడ పతితహేతువని యతివిధివిధాయక విశ్వేశ్వరస్మృతి ప్రభృతి ధర్మశాస్త్రగ్రంథములలో నిషేధముండుటచే సుతరాం ప్రకటించుటకు వీలులేదు. కాని ప్రకృతమహానుభావుల జీవితచరిత్ర పూర్వోత్తరాశ్రమములలో వారు వ్రాసిన గ్రంథాద్యంతములందలి శ్లోకగద్యలనుబట్టియు, ప్రతీతినిబట్టియు నాబుద్ధికి గోచరమైనంతవఱకు వ్రాయబూనినాడ. దోషజ్ఞులు మన్నింతురుగాక!

ఈ దేశమునందు సూత్రభాష్యప్రవక్తలగు విద్వాంసులు స్వాములవార్లు, ముఖ్యముగ నైజాం దేశమున సుప్రసిద్ధు లగునట్టియు, తర్క-వేదాంతా ద్యనేకశాస్త్రప్రదక్షు లగునట్టియు, అనేకపండితులకు వేదాంతశాస్త్రబోధ జేసినట్టియు, వాదకతాశక్తిలో నద్వితీయు లగునట్టియు శ్రీ పరమహంసపరివ్రాజకాచార్య అచ్యుతస్వాములవారును ఈ భాష్యరత్నప్రభాకారులు పూర్వాశ్రమమున కృష్ణానదీతీరములో నున్న పెదపులివఱ్ఱు అనే గ్రామకాపురస్థుడగు శ్రీ వారణాశి ధర్మాభట్టుగారు సంన్యాసాశ్రమమును గ్రహించి సూత్రభాష్యముపై వ్యాఖ్యను రచించిరని నుడువుచుండెడివారు. అందుకు తార్కాణముగ: నేను కొంతకాలము పెదపులివఱ్ఱు గ్రామములో నివసించితిని. అచ్చట వారణాశివా రున్నారు. వారినడుగగ వారు చెప్పినది యేమన శ్రీ ధర్మాభట్టుగారు తమకు కూటస్థపురుషు డనియు, ఇట్టిగురుస్థలు శాశ్వతముగ నుండుటకు సంధ్యావందనములో కొన్ని మార్పులు జేసి తమసంతతివారి కభ్యాసము చేయించినా రనియు, తమ పితృ పితామహాదు లందరు ధర్మాభట్టుగారు మన మూలపురుషు డని చెప్పెడివా రనియు, వారు రచించిన గ్రంథములు చాలకాలము వరకు తమగృహములలో నుండినవనియు-అవి తాళపత్రలిఖితము లగుటచే కృష్ణానది వరదలవల్ల నశించిన వనియు బహుపర్యాయములు చెప్పిరి. ఇప్పటివారు ధర్మాభట్టుగారికి తొమ్మిదవతరమువారట. వీరు తెలగాణ్యశాఖవారు. హరితసగోత్రకులు.

ఈ తెగవారిలో నెప్పుడు పెద్దవిద్యావంతులు లేకున్నను వీరితాతముత్తాతలు ప్రసిద్ధపండితులై సన్న్యసులకు సైతము భాష్యశ్రవణముం జేయించువారట. పూర్వీకులలో నొకడు ప్రసిద్ధు డుండినదో నాయన మావంశస్థుడే యని చెప్పుకొనుట కలదు కాని కృష్ణాతీరములోనే మఱికొన్ని గ్రామములలో తెలగాణ్యులు వారణాశివా రుండి వారును ధర్మాభట్టుగారు మావంశస్థుడే యని చెప్పుట కలదు కాని వారిది మఱియొకగోత్రము. పులివఱ్ఱులో నున్నవారిది హరితసగోత్రము. ధర్మాభట్టుగారు సాహిత్యరత్నాకరములో స్వయముగ

తమది హారితసగోత్ర మని నుడివియున్నారు. పులివట్టువారి సంధ్యావందనములో ధ్రువోప స్థానము చెప్పుట మున్నగు కొన్నిమార్పు లుండుట, విద్యత్సంతతివా రగుట మున్నగు కారణ కలాపముచే పెదపులివట్టువారే ధర్మా భట్టుగారి సంతతి యని నిశ్చయింపవలసి యు న్నది. సాహిత్యరత్నాకరములో, వారణాసి నుండి వచ్చినవా రగుటచే తాము వారణా సివా రైరనియు, తమరు పండితవంశములో బుట్టినవా రనియు చెప్పుచు, ధర్మాభట్టుగారు తమ తాతగారి పాండిత్యవిశేషము నిట్లు వర్ణించిరి :

"యేన స్వైర మఘాణి పాణినిమతం
ప్రాణాది కాణాదవా
గ్గుంభే స్పష్ట మఘట్టి భట్టగురువా
గుట్టేకి తే పట్టి మే;
నిశ్శంకం నిరటంకి శంకరమతం
చాక్షోద చాక్షోంఘ్రివా
గ్ధ్వనస్యన్వన్యవలా స్యకుండి నిఖిలా
పాషండపండాటపీ."

అని యీ శ్లోకమునందు తమ తాతగారికి షడ్దర్శనములందును పూర్ణపాండితి యున్న టుల వర్ణింపబడి యున్నది.

ఇంకను పేరిపినతండ్రిగారికి వేదమునం దష్టావధానముం జేయు ప్రజ్ఞ కలదని మఱి యొకశ్లోకముచే వర్ణింపబడినది. అది యెట్లన,

"పద క్రమ జటాక్షరక్రమ పదక్ర మా రోహణా
వరోహ విషమక్ర మాక్రమ ముఖావధానాధ్వని;
పరిక్రమణచక్రవర్త్యభిధయా ఽష్టదిగ్రూఢయా
చచార బహుశః క్షితౌ ద్విజరథేన నారాయణః."

అనగ, నారాయణః = నారాయణావధానులగారు; ద్విజరథేన = బ్రహ్మరథముచేత (శ్రీ మహావిష్ణువు గరుడపక్షిరథముచే దిరిగినటు లని వ్యస్తశ్లిష్టరూపకాలంకారము); అష్టదిగ్రూఢయా = ఎనిమిదిదిశలప్రసిద్ధిపడినట్టి; పదక్రమ... అధ్వని = పదము, క్రమము, జట, అక్షరక్రమము, పదక్రమము, ఆరోహణావరోహము, (అనగఘనము, ఘనమాలా మున్నగునవి) విషమక్రమము, అక్రమము లోనగు నవధానమార్గమునందు; పరిక్రమణచక్రవర్త్యభిధయా = తిరుగుటలో చక్రవర్తి యనెడిపేరుతో; క్షితౌ = భూమిపై; బహుశః = అనేకపర్యాయములు; చచార = సంచరించెను.

వేదాధ్యయననిపుణు లెనిమిదిమంది బ్రాహ్మణు లెనిమిదిప్రక్కల కూర్చుండి స్వస్తి చెప్పుచునుండ, ఒకరితో పదము, ఇంకొకరితో క్రమము, మఱియొకరితో జట, వేరొకరితో నక్షరక్రమము, ఇటులనే పదక్రమ, ఘనమాలాదుల నొకసారిగ తప్పకుండ స్వస్తి చెప్పుట మున్నగు నవధానమార్గమందు దిరిగెడివారలలో చక్రవర్తి (గొప్పవాడు) అనే పేరుతో నారాయణమూర్తి గరుడరథముతో దిరిగినటుల పుడమిపై దిరిగినా రని తాత్పర్యము. ఈరీతిగ సాహిత్యరత్నాకరప్రథమతరంగమందున వ్రాసికొనిరి.

మఱియు రత్నాకరములో నచ్చటచ్చట నుదాహరణముల నిచ్చుటకు "మదీయే కృష్ణాస్తవే"యని వ్రాయుటనుబట్టి 'కృష్ణాస్తవ'మని

మఱియొక చిన్న గ్రంథమును రచించినటుల తోచుచున్నది. కృష్ణాస్తవ మను గ్రంథ మిప్పు డెచ్చట కాన్పించుటలేదు. నదీపాతమైన పుస్తకములలో పోయియుండును. ఈసాహిత్యరత్నాకరమునకు గోదావరీతీరస్థిత కాకరపర్తిగ్రామ వాస పండితప్రకాండునిచే 'నౌకా' యని మంచివ్యాఖ్యానము రచింపబడినది. ఆవ్యాఖ్య ముద్రితము కాలేదు. తరువాత శ్రీయుత మల్లాది లక్ష్మణసూరిచే 'మందర' యని మఱియొక వ్యాఖ్యానము రచింపబడినది. దానితో సహా మూలము చెన్నపురిలో నాంధ్రాక్షరముల ముద్రితమై యున్నది.

ఈధర్మాభట్టుగారి కాలము విషయమై సరిగ నాలోచించుటకు తగినయాధారములు లేకుండినను ప్రతాపరుద్రీయకర్త యగు విద్యానాథకవి నామోల్లేఖన చేయుటచే విద్యానాథునికంటె కొంచె మర్వాచీనుడుగనో, లేక సమకాలికుడుగనో యుండవలె నని చెప్పవలసి యున్నది. విద్యానాథుండు శ్రీప్రతాపరుద్రమహారాజుగారి కాలపువాడని వేరుగ చెప్ప నక్కఱ లేదు గద! ప్రతాపరుద్రుం డిప్పటికి నెంతకాలము క్రిందటివాడనునది యాంధ్రదేశ రాజచరిత్రవల్ల సులభముగ తెలిసికొనవచ్చును. ఇంతమాత్ర మూహించుట కవకాశమే కాని పూర్వపు పండితులు కాని, కవీశ్వరులు కాని తమ జీవితచరితమును, కాలమును స్పష్టముగా వ్రాసికొనుట యాచారములో లేనందున మనకును స్పష్టముగ తెలియదు. ఇక నాశ్రమస్వీకారానంతరమున రచించిన భాష్యరత్నప్రభా వ్యాఖ్యాపీఠికాశ్లోకములలో,

"వన్దే చర్మకపాలికోపకరణై ర్వైరాగ్యభాగ్యాత్పరం
నాస్తీతి ప్రదిశన్త మన్తవిధురం శ్రీకాశికేశం శివమ్."

అని శ్రీకాశీవిశ్వనాథాభివందన మాచరించుటచే కాశీలో కొంతకాలము నివసించియుండు రని తలంపవలసి యున్నది. ఇంతియె గాక నాల్గవశ్లోకము :

"కామాక్షీదత్తదుగ్ధప్రసమరసరసనుత
ప్రాజ్యభోజ్యాతిపూజ్య
శ్రీగౌరీనాయకాభిత్వ్యకలనశిఖరా
మార్యలబ్ధాత్మబోధైః;
శ్రీమద్గోపాలగీర్భిః ప్రకటితపరమా
ద్వైతభాసా స్మితాస్య
శ్రీమద్గోవిందవాణీచరణకమలగో
నిర్వృతో౽హం సుధాభిః."

అనగా,

"అయోధ్యా మథురా మాయా కాశీ కాంచీ హ్యవంతికా;
పురీ ద్వారావతీ చైవ సప్తైతా మోక్షదాయకాః."

అని మోక్షదాయకములని ప్రసిద్ధి కెక్కిన పురు లేడింటిలో నొకటి యగు కాంచీనగరమందు విలసిల్లుచుండిన శ్రీకామాక్షీదేవిచే నీయబడిన దేవపూజ్య మగు పాయసాన్నభక్షణచే నతిపూజ్యులైనట్టియు, శివకేశవుల కభేదమును ప్రకటించు నామము గల శివరామార్యుల వలన లబ్ధమగునట్టి యాత్మజ్ఞానము గల శ్రీగోపాలానందసరస్వతీస్వాముల వారిచే ప్రకటింపబడిన యద్వైతజ్ఞానముచే నవ్వుచుండిన (సంతసించిన) శ్రీగోవిందానందసరస్వతీస్వాములవారి పాదపద్మములను తుమ్మెదవలె పొంది యానందించువాడనని తమ గురు,

పరమగురు, పరాపరగురువుల గ్రంథాదియందు సంస్మరించి తమనామమును గూడ తెలియ పరచగూడదని గూఢముగ నుంచుకొనిరి. అయినను గ్రంథముద్రాపకులు—భాష్యప్రవక్తలు అద్వైతమతమునందు గురుశిష్యులకు భేదము లేనందుననో, యేమో కాని గురునామముతోనే యీమహానుభావుల వ్యవహరించుచుండుటం బట్టి-శ్రీగోవిందానందసరస్వతీస్వాముల వారని వ్రాయడమైనది. గ్రంథస్థముగనుండక పోయినను వీరికి రామభక్త్యతిశయమువల్లనో యేమోవ్యవహారములో శ్రీరామానందస్వామి యని మఱియొకనామము ప్రసిద్ధముగనున్నది.

ఈమహానీయులు పూర్వాశ్రమమున ధర్మాభట్టు అనునామముతో రచించిన గ్రంథములు, ప్రసిద్ధముగ నున్నవి, ౧. సాహిత్యరత్నాకరము, ౨. నరకాసురవ్యాయోగము, ౩. కృష్ణాస్తవము, ౪. బ్రహ్మమృతవర్షిణి—ఈ నాలుగు కనుపించుచున్నవి. నవీపాఠమై యెన్ని గ్రంథము లుండినవో తెలియదు. సన్న్యాసాశ్రమ స్వీకారానంతరమున రచించిన గ్రంథము శ్రీ శాంకరబ్రహ్మసూత్రభాష్యరత్నప్రభ యొకటియె. తురీయాశ్రమములో మఱియొకగ్రంథము రచించినటుల వినుట లేదు. ఈ భాష్యరత్నప్రభమీద నొకపండితవర్యుండు సరళమగు వ్యాఖ్యానమును రచించినటులు తెలియవచ్చుచున్నది కాని యది యింతవరకు ముద్రితము కాలేదు. సహృదయులు దాని ముద్రించి లోకోపకారము జేసి సుకృతమును సంపాదించుకొందురు గాక.

పైని జూపబడిన హేతువులవలన శ్రీ భాష్యరత్నప్రభా వ్యాఖ్యాన మాంధ్రదేశస్థిత విద్వత్కర్మందిపుంగవ విరచిత మగుట చేతనే బహుకాలముక్రిందట మనయాంధ్ర లిపిలో బ్రహ్మసూత్రభాష్యము భాష్యరత్నప్రభాసహితముగానే ముద్రిత మైనది. అంతకంటె బహుప్రాచీనము లగు ననేకవ్యాఖ్యానము లుండ నీవ్యాఖ్యాన మొకదానితోనే యేల ముద్రింపనలయును? ఈ వ్యాఖ్యానము సకల దేశములలో వ్యాపించినది కాబట్టి బొంబాయి మొదలగు స్థలములలో దీనితో సహా వ్యాఖ్యాత్రయ సహితముగ ముద్రింపబడినది. అందుచేత భాష్యరత్నప్రభ ఆంధ్రదేశస్థ ధర్మాభట్టవిద్వద్రూపాంతర శ్రీ గోవిందానంద సరస్వతీస్వామివిరచిత మని స్పష్ట మగుచున్నది. మఱియు అధునాతనవిద్వాంసులు జీవిక నిమిత్తము స్కూళ్లు, సంస్కృతపాఠశాల లుండు పట్టణములలో నివసించుచున్నారు. పూర్వుల కట్టియాశ లేనందున తపోయోగ్యమగు మహానదీతీరములందుండు పల్లెటూళ్లలో నివసించువారు కావున శ్రీధర్మాభట్టుగారు కృష్ణానదీతీరమున అతిప్రాచీన శివకేశవ దేవాలయములతో విరాజిల్లు పెదపులివఱ్ఱులో నివసించి రనుటలో సంశయింప కారణము లేదు. కాబట్టి పైని జూపబడిన కారణకలాపముచే ధర్మాభట్టుగారు పెదపులివఱ్ఱుగ్రామ నివాసు లనియు, వీరే శ్రీభాష్యరత్నప్రభాకారు లగు శ్రీగోవిందానందసరస్వతీస్వాములవా రనియు నాకు దృఢమగు నమ్మకము కలిగి యీ వ్యాసమును వ్రాసినాడను.

# నవల

ఆంధ్రభాషకమూల్యాభరణమై తనరారు "నవల" యను సారస్వతవిశేష మాంగ్లభాషాసారస్వత రసము గ్రోలుటం బట్టియే యాంధ్రులకబ్బిన దనుట నిర్వివాదాంశము. నవల యను నామకరణ మాంగ్లేయము నుండియే గ్రహింపబడినది. మృదుమధురమైన యీ నూతనపదము లావణ్యావతి యను నర్థస్ఫురణము గావించుటచేఁ గాఁబోలు, నాంగ్లపదమునకన్న మృదుతరముగ నున్నది. అయినను వింతయు, నూతనము నను నర్థస్ఫురణ మాంగ్లపదమునం దున్నదని మఱువరాదు. రమారమి రెండువందలవత్సరముల క్రిందట నాంగ్లభాషయందు నవల లనంబడు గ్రంథములు లేనే లేవు. వారును మనవలెనే పరభాషలగు "ఇటాలియను" "ఫ్రెంచి" భాషలనుండి యీసారస్వతవిశేషమును గ్రహించి, తొలుదొల్త వింతలు, నూతనము లగుకథలను నవలలని పేర్కొనుచుండిరి. "నావల్" అనుపదము ఫ్రెంచిభాషామాతృకము. క్రమక్రమముగా నాంగ్లభాషయందే పాత్రౌచిత్యాదివిశేషములవలన ముఖ్యముగా నియ్యది యభివృద్ధి గాంచినది.

ఆంగ్ల భాషయందు నవలారచనకు బీజము మాత్రమే వైదేశమునుండి గ్రహింపఁబడినది గాని, తరువాత మొలకలెత్తించి, మొక్కలను బెంచి శాఖోపశాఖలు గల మహావృక్షముగాఁ బెంచుబాధ్యత యాంగ్లేయులయందే యుండెను. ఆంధ్రమునం దట్లు గాక, కొమ్మలు పెరిఁగియున్న వృక్షము నంటుగట్టుటకుఁ బ్రయత్నించుచున్నాము. కడుప్రయత్నమునఁ బెంచినఁ గాని ఫలదాయకము కానేరదని మనవారెఱుంగవలెను. సమూలముగాఁ దెచ్చిన వృక్షమగుటచే నోహదము చాలక కొమ్మలెండినట్లు కానవచ్చినను మనవారు బెగడొంద రాదు.

ఏభాషయందైనను తొలుత పద్యరచనయే సారస్వతమునకు ప్రథమసోపానము. క్రమక్రమముగ వచన రచనయు, నటుతర [illegible]
వెనుక నాటకరచనయు [illegible]
నను పద్యగ్రంథముతో తొ [illegible]
గద్యగ్రంథములు పొడసూప [illegible]
చరిత్ర కొంత యెఱింగింపు "ర [illegible]
మాతనిసమకాలికునిచే రచింపఁబడిన [illegible]
"భారత సావిత్రి" యాగ్రంథమున [illegible]
టచే నావచనరచన రాయవాచకమునకన్న [illegible]
యని తెలిసికొనఁదగును. పదునేడవ శతాబ్ది [illegible]
జైమినిభారతమును, భారతరామాయణాదిగ్రం [illegible]
మఱికొన్ని క్షేత్రమాహాత్మ్యములును వచనమున [illegible]
బడి యుండుటచే వచనరచన మనభాషయందు నవీనము కాదని గ్రహింపఁదగును. వచనరచనానంతరము రాఁగా నాటకరచనయు, నూతనసంపర్కమున సంభవించిన నవలారచనయు, నొక్కసారియే యాంధ్రభాష కుద్భవించినవి. నాటకరచన నవలారచనకన్న నెంతో యుత్కృష్టమైనది. అయినను నవలారచనయందు నాటకరచనానిర్బంధములను విడిచిపుచ్చి యందలి సొగసును మాత్రమే కొంతవఱకు గ్రహింప వీలున్నది. కొంతభాగము పాత్రసంభాషణమూలముగను, తక్కినభాగము గ్రంథకారుని వ్రాఁతవలనను నిరూపింపఁబడుచున్న నవల నాటక వచన రచనావిధానముల రెంటను కల్పింపఁబడినదని చెప్పవచ్చును.

ఆంగ్లభాషయందు మాత్రము నాటకయుగానంతరమే నవలారచన యుద్భవించినది. నాటకరచనానంతరమే నవలాబీజ మింగ్లాండున నాటఁబడుటచే నట్లయినది గాని స్వాభావికముగా వచనరచనయుగానంతరమున నవలారచన యేర్పడవలయునని తోఁచుచున్నది.

ఆంగ్లమునుండియే మనము నవలారచన గ్రహించియుండుటచేతను, ఆంగ్లమునందు నూటయేఁబది వత్సరములనుండి "నవల" మిగుల నభివృద్ధి గాంచియుండుటం బట్టియు, నాభాషయందలి నవలాగుణములను బరిగణించి

పరమగురు, పరాపరగురువుల గ్రం ...ండిరో తెలిసి ...ము. నవల లాహ్లా
సంస్మరించి తమనామమును బడుచున్నవి. ఇవి
పరచగూడదని గూఢముగ గాని, మగవారికొఱకే
నను గ్రంథముద్రాపకుల స్త్రీలును, యువకులును,
అద్వైతమతమునందు తో సంబంధము లేకనే
లేనందుననో, యే నానందించినట్లు, నవలలు
చదివి యానందింపఁదగినవి.
తోనే యీమహా సులభముగా నర్థమగునట్లు గ్రంథ
ముటం బట్టి గ్రంథకర్తవ్యము. కాన మిగుల సులభము
వారని వ్రా కొందఱయభిప్రాయము మాత్రము స్పష్ట
పోయినను ...భముగాను తెలిసికొనఁబడదు. అదియును
గ్రంథకర్తలు సులభముగా నభిప్రాయార్థము
యేమొ...టిని వ్యక్తీకరించుచు నవలలను వ్రాయవలెను.
యట్టియెడల, నానందప్రదాయకములని యనుకొన్న గ్రం
ము లాహ్లాదము నీయకుండుట సరియే కదా, కష్టము
కూడఁ గల్గించుచుండును. చదివిన భాగమే మరల మరల
చదివి యర్థముచేసికొనవలసిన యావశ్యము నవలలందు మా
త్రముండరాదు. సుబోధములు కాని నవలలు నిరర్థ
కములని ప్రత్యేకించి చెప్ప నవసరము లేదు.
సులభముగా రచియింపవలెనన్నంతమాత్రమున వ్యావ
హారిక భాషయందుఁగాని, వ్యాకరణ సాధువు కాని
భాషయందుఁ గాని నవలలను రచియింపవలెనని నియ
మము లేదని సులభముగాఁ దెలిసికొనవచ్చును. అయినను
సంభాషణావసరములందు పాత్రోచితమగు వ్యావహారిక
భాషను, సంస్కృతాంగ్లేయ భాషాసంప్రదాయములం
బట్టి యుపయోగించుట గ్రంథకర్తల యభిప్రాయాను
సారము విడువఁలసి యున్నది. సలక్షణమును, వ్యాకరణ
యుక్తమును నగు భాషయే యాంగ్లేయమున నందుపయో
గింపఁబడుటచే నట్టిదియే యాంధ్రమునఁగూడ ననుక
రింపఁ దగియున్నది. అప్పుడప్పుడు గ్రంథకర్త భాషా
నియమములను దాఁటినయెడల నాతఁడే యుత్తరవాది
యగును. అయినను గ్రంథకర్త లోకమంత స్వాతంత్ర్య
మును జూపకున్న దినదినాభివృద్ధి గాంచవలసిన భాషా
శృంఖలాబద్ధ మగును. మనసున కానందము గొల్పుటయే
నవలాపఠన ప్రధానఫల మయినను, నవలారచనకా
రుఁడు నీతిబోధన తనముఖ్యోద్దేశముగఁ జేసికొనుచుండు టెన్నఁ
డు మఱవరాదు. నీతిబోధన గావింపని నవలలు హేయ
ములును, తుచ్ఛములు నని తలంపవలెను. లోకవ్యవహార
మును నీతిని సులభముగా మనసున కెక్కించుటయందు
నవలల కెంతో సామర్థ్య మున్నది. స్త్రీవిద్య ప్రబలు
చున్న యిక్కాలమున నవల లంగనామణులచే ప్రియ
ముగాఁ గైకొనంబడుచున్నవి. ఆహ్లాదకరములగు గ్రంథము
లగుటచే వయోవనవతులును, యువకులును మిగుల
ప్రీతితో నవలలు చదువుచున్నారు. కావున గ్రంథకాల
క్షేప మలవాటగుటకు నవలాపఠనమే ప్రథమసోపాన
మని తెలిసికొనవలెను. అందువలన నీ గ్రంథములందు
నీతి బోధింపఁబడని పక్షమున నవనీతియే సులభముగా
నూతనవయస్కులకు పట్టుపడును. కొందఱు యువకులు
కాలక్షేపార్థ మేర్పడిన యీగ్రంథములతోడనే కాల
మంతయు వ్యర్థపుచ్చుచుండుటవలన నాంగ్లేయులలో
కొందఱు నవలలను చదువమని యొట్టుపెట్టు
కొన్నవా రున్నారు. అవినీతికరములగు గ్రంథములు
వ్రాయువారు సంఘమున దురాచారమును పెంచినవా
రగుటచే మిగుల గర్హ్యులు.

నవలలమూలమున నీతి రెండువిధములుగా బోధింప
ననువున్నది. యోగ్యప్రవర్తనగల పాత్రలను జిత్రించి
వారివారి గుణగణములను మనసున కెక్కునట్లు ప్రవర్తిం
పఁజేసినచో చదువరుల మనస్సున యోగ్యవర్తనము నాటి,
తత్ప్రవర్తనము లోకకీర్తన పాత్రమగుటచే నవలంబనీయ
మని తోఁచును. ఇది సూటిగా నీతిని బోధించుమార్గము.
రెండవమార్గ మొకవిధముగా మొదటిదానికన్న నుత్తమ
మయినదని చెప్పవచ్చును. దుష్ప్రవర్తనగల పాత్రము
లను జిత్రించి తత్ప్రవర్తనమూలమున వారు చెందు పలు
విధములగు కష్టనిష్ఠురములను స్పష్టీకరించి, యట్లు
ప్రవర్తించుటవలనఁ గలిగిన దోషములును, కష్టములును
చదువరుల మనస్సున భీతిగొల్పున ట్లొనరించినయెడల నవ
లను చదువువారు చెడుత్రోవను పోక సన్మార్గముననే
ప్రవర్తింతురు. రెండువిధములను నీతి బోధింప ననువు
గలదు. రెండవపద్ధతివలన నీతి దృఢతరముగా మనసున



గవర్నరుగారికి హిందూమత ధర్మాదాయచట్టమునుగూర్చి నివేదించుటకు వెడలిన రాయబారులు



గౌతమీ సత్యాగ్రహాశ్రమ సభ్యులు-సీతానగరము

నాటునని కొందఱయభిప్రాయము. నవలలమూలమున లోకానుభవములవఱచుకొనుట పిన్నవారగు చదువరులకు శ్రేయోదాయకము. స్వానుభవమువలన లోకానుభవము కలిగించుకొనుట కెంతోకాలము, ప్రయాసము, నష్టము కలుగును గనుక గ్రంథములమూలముగా నయ్యది తెలిసికొనుట మిక్కిలి లాభకారి.

రమారమి నూటయేఁబదివత్సరముల క్రిందటనుండి యాంగ్లేయభాషలో మంచివిలువగల నవలలు రచియింపఁబడుచు వచ్చెను. లోకానుభవము గలస్త్రీపురుషులు సరసమగు సులభశైలిలో నవలలను రచింపఁజొచ్చిరి. కాలక్రమమున ప్రజామోదము వడయుటచే వేలకొలఁది నవలలు మాసపత్రికలయందును, పుస్తకరూపమునను ప్రకటింపఁబడుచు వచ్చెను. అయినను వానియం దెన్నో మేలురకము గ్రంథము లుండకపోవుటచే వుక్కగొడుగులవలెఁ బొడమాపి యచిరకాలములోనే యవి నశించుచుండెను. మిక్కిలి యుత్కృష్టములయిన గ్రంథములు మాత్రమే భాషయందు మిగులుటచే మంచినవలలు రచించిన గ్రంథకర్త లెందఱో లెక్కకులేరు. ఇట్లే మన భాషయందును లెక్కకు మిక్కిలి పనికిమాలిన, నవలారూపము వహించిన గ్రంథములు వెలువడుచున్నవి గాని వీనియందు బహుస్వల్పగ్రంథములుమాత్రమే మున్ముందు నిలువఁగలవు నిరర్థకములగు నవలలు చదువుటవలన శ్రేష్ఠమగుకాలము వ్యర్థ మగును గనుక బుద్ధిమంతులు మంచిగ్రంథములని పేర్వడసినవానిని మాత్రమే చదువుచు తక్కినకాలము నిరర్థకముగాఁ జననీయకుందురుగాక!

ఆంగ్లభాషయందు స్వకపోలకల్పితములగు నవలలు పెక్కులు చదువఁదగినవున్నవి. అంతటితో సంతృప్తిఁ జెందనేరక ఆంగ్లేయులు పైభాషలయందున్న యుత్కృష్టములగు గ్రంథములను పనివడి స్వభాషలోనికి మార్చుకొని భాషాభివృద్ధి గావించుకొనిరి. ఇప్పుడు మనభాషయందు చాలవఱకు భాషాంతరము లున్నవి. ఖండాంతర భాషలనుండి యనువాదము గావింపఁబడు నవల లెందువలననో మిక్కిలిగా లేవు. ఐరోపాఖండభాషలలో నుత్కృష్టమయిన నవల లెన్నో మనభాషయం దనువదింపఁ బడవలసి యున్నవి. మిక్కిలి యోగ్యములని పేర్వాలసియున్న పైవారి నవలలను మనవారు రుచిచూచినఁ గాని మనభాషయందు చక్కని స్వకపోలకల్పితాఖ్యాయికలు పొడమాపఁజాలవు. సంస్కృతము నందున్న బాణకవికృతమగు “కాదంబరి” మున్నగుగ్రంథములు నవలలని చెప్పవచ్చును గాని వీనియందు భాషావైదుష్యము మిక్కుటమగుటవలన, నవలకు ముఖ్యలక్షణమగు సుబోధకత్వము లేకుండుటవలన నవలలనఁ జెల్లవు. బహుశః కాదంబరి ననుసరించియే స్వకపోలకల్పితమగు “కళాపూర్ణోదయము”ను పింగళి సూరనామాత్యుఁ డుత్కృష్టకథాకల్పనతోఁ దెనుఁగున పద్యప్రబంధము గావించెను. ఈ గ్రంథము పద్యమయముగా వ్రాయఁబడియుండుటచే కేవలము నవల యనం జెల్లదు. కథాచమత్కృతియందు నవలను బోలియున్నను, వర్ణనాంశములఁబట్టి ప్రబంధరూపమునను గ్రంథఫలమునుబట్టియు యాత్రావర్ణనలంబట్టియు పురాణవైఖరిని కళాపూర్ణోదయ మొప్పుచున్నది. వీరేశలింగముగారి రాజశేఖరచరిత్రము నాఁటివఱకు తెనుఁగున కథలుదప్ప, నవల లనుటకుందగిన గ్రంథము లేవియు లేవు. రాజశేఖరచరిత్రము స్వతంత్ర గ్రంథమే యైనను, ఆంగ్లేయనవలల ననుసరించియే వ్రాయఁబడినది. ఇది సాంఘికనవల యగుటచే నాంగ్లములోనికిఁ బరివర్తింపఁబడి యాంగ్లేయులచే నాదరింపఁబడినది.

వస్తుప్రాధాన్యమునుబట్టి యాంగ్లమునందు నవల లెన్నోవిధములుగ గణింపఁబడుచున్నది. కేవలకల్పనాకథ కృత్రిమరత్నమట్లు ప్రకాశించుచున్నను విలువ కడు స్వల్పము. చారిత్రకనవలయందు ఫలమధిక మున్నది గాని, రచియించువాని శక్తిసామర్థ్యములఁబట్టి ప్రకాశించును. పరిశోధకనవలలు బుద్ధివికాసమును గావించును. ఇంతవఱకు మన కీనవలావిశేషములే యాంధ్రభాష నలంకరించి యున్నవి. ఇందు త్తమములైనవి సర్వసాధారణముగా భాషాంతరములే. ఇప్పటికి మనకున్న భాషాంతరములన్నియు, నొకటి రెండు తప్ప, మనదేశభాషలనుండిమాత్రమే తెనిఁగింపఁబడినవి. కేవలకల్పనాకథలనందగినవి కొన్నిమాత్ర మాంగ్లభాషనుండి యనువదింపఁబడినవి. స్వకపోలకల్పితములు విచ్చలవిడిగా నుద్భవిం

చినఁ గాని భాషాంతరములచేమాత్ర మాంధ్ర మభివృద్ధి గాంచినదని చెప్పఁదగదు.

"విక్టరుహ్యూగో" యను ఫ్రెంచికవీశ్వరుని యొక్క ప్రఖ్యాతమగు నొకనవలను దెనిఁగించుచు చారిత్రకనవలను గూర్చి పీఠికయందు నేను వ్రాసినమాటల నిందు మరల నొందుపఱుచుచున్నాను. "కవిచారిత్రికజ్ఞాన మద్భుత మని చెప్పియుంటిమి. సామాన్యగ్రంథకారులు చారిత్రక నవలను వ్రాయఁ దలఁచిరేని, రాజులనామములతోను, అనవసరములగు తేదీలతోను నింపి మామూలు చరిత్రలలోని జ్ఞానమును బ్రకటింతురు. ఇంతమాత్రముచేత నది చరిత్రాత్మకనవల కానేరదు. తా నేకాలమునుగూర్చి వ్రాయుచున్నాఁడో, అప్పటిప్రజలయొక్క సుఖదుఃఖములను, వారిస్థితిగతులను, న్యాయపద్ధతులను, అప్పటివారి జ్ఞానము మొదలగున వెన్నో యంశములను సంపూర్ణముగా నెఱిఁగి వ్రాయుకవియే చరిత్రాత్మకనవలను వ్రాసినవాఁ డగును. ఈసాధనములు సామాన్యచరిత్రలయందు దొరకుట దుర్లభము. ఏకాలమునుగూర్చి వ్రాయుచున్నాఁడో, ఆకాలమునఁ దాను జీవించినట్లు భావించి వ్రాయుటకుఁ దగినబుద్ధిబలమును, కవితాదృష్టియు చారిత్రకనవలా కారున కుండవలసిన ముఖ్యలక్షణములు. అట్టిప్రజ్ఞ "హ్యూగో" కవికి సమగ్రముగా కలదు. ఆంగ్లేయ భాషలో నెన్నోశతలనవల లున్నను, చారిత్రకనవల లత్యల్పములు. అయినను, నిజమయిన చారిత్రకనవలలు, అనఁగా పైని జెప్పిన గుణములు గల నవలలు, మిగుల కొంచెమని వినుచున్నాము. అట్టినవల లాంధ్రదేశమున, దేశచరిత్రాత్మకము లనవి, యుద్భవించుటకుఁ దగినపరికరములు సమకూడలేదు మనచరిత్ర మిక్కిలి చీఁకటిలో నున్న దనుటకు సందేహము లేదు. ముమ్ముం దట్టినవలలు మన కుద్భవించినయెడల నెంతయు నదృష్టవంతులము." దీనినిఁబట్టి చరిత్రాత్మకనవల లెట్లుండవలెనో కొంతవఱకు తేటపడఁగలదు.

కేవలకల్పనాకథల యం దద్భుతవిశేషము లెక్కుడుగా పొడచూపును. సామాన్యముగా నద్భుతకథ లనిపించుకొనునట్టివి వ్రాయు టెంతో సులభము. అమానుషప్రజ్ఞ లన్నిటికి నారోపించినయెడల కావలసినన్ని యద్భుతములు. గొప్పమంత్రవేత్తయో, రాక్షసుఁడో, దైవమో కథలోఁ జొనుపఁబడినయెడల, చెట్లు మనుష్యరూపము గైకొనవచ్చును, మనుష్యులు పక్షులవలె నెగురవచ్చును, అడవులు పట్టణము లగును, పట్టణములు క్షణములో పాఱుచున్న నదీప్రవాహము లగును; ఒకరితల యింకొకరి మోఁకాలున కతుకవచ్చును. ఇట్టిప్రజ్ఞ చేతిలో నున్నయెడల నెంతటి యద్భుతమైన కథనైన నడపింపవచ్చును. ఇట్లు గాక నవలలో నిరూపించిన వన్నియు కాలానుగుణములై, లోకానుభవమునకు విరుద్ధములు కాకుండ, కథ యద్భుతముగను, చమత్కారముగ నున్నట్లు వ్రాయుట కవియొక్క విశేషప్రజ్ఞను వెలిపుచ్చును.

పరిశోధకనవలల యందు బుద్ధివికాసమున కవకాశము కలదు గాని, యిం దద్భుతములగు నమానుషకార్యములు ప్రకటీకృతము లగును. కావున సామాన్యమనుష్యప్రవర్తనము మాటుపడియుండును. ఇట్టినవలల యందు సర్వసాధారణముగా నీతిబోధ శూన్యమైయుండును. చదువరులకు చిక్కుగాఁ దోఁచు సమస్యలు క్రమక్రమమున నెట్లును సమర్థింపఁబడును గావున, ముందేమి వచ్చునో యనుకుతూహలముతోఁ గూడిన యుత్సాహము తప్ప, కఠినసమస్యలు తా మేదో మార్గమున సమర్థింతమనుపట్టుదల యుండనేరదు. అందువలన బుద్ధివికాసమునకైన నంతగా నవకాశ మున్నట్లగపడదు. గ్రంథ మంతయుఁ జదివినవెనుక తొలుత దుర్ఘటముగాఁ గన్పట్టిన కఠినసమస్యలు కడ కెట్లు విశదీకరింపఁబడినవో తెలిసికొని చదువరులు కొంతవఱకు లాభము నొందవచ్చును. హిందీ కన్నడ బంగాళా భాషల నుండి మన కిట్టినవలలు కొన్ని లభించియున్నవి.

ఇఁక మనభాషయం దిప్పటికి పొడచూపని నవలావిశేషములఁగూర్చి చర్చింపవలసియున్నది. ప్రకృతిశాస్త్రాభివృద్ధి విశేషముగాఁ గావించిన పాశ్చాత్యదేశము లందు శాస్త్రసంబంధమగు నవలలు కలవు. ఇందు ప్రత్యేకశాస్త్రవిశేషములను, తన్మార్గమున నూతనాంశములను గనిపెట్టుట మొదలుగాఁగల యంశములు ప్రధానకథాంశములు. ఏశాస్త్రము ననుసరించి వ్రాయఁబడిన

నవల యను శాస్త్రినామమున పిలువఁబడును. ఇట్లే రాజకీయాంశములను చర్చించునవలను రాజకీయనవల లని యేర్పఱుపవచ్చును. శాస్త్రీయములగు నవలలను వ్రాయుట మిగుల దుష్కరము. వ్రాయువానికి శాస్త్రపాండిత్యమునకుఁ దోడు నవల నుత్సాహజనకముగా వ్రాయు సామర్థ్యము కూడ కావలసియుండును. నవలలను వ్రాయువారెంత సమర్థులైనను చదువరులు సామాన్యముగా నట్టి గ్రంథములఁ జదివి యవగాహన చేసికొనుసమర్థత గల వారై యుండవలెను. అనఁగా దేశము నాగరకతఁ జెంది ప్రకృతిశాస్త్రములు జనసామాన్యమునకు సులువుగా బోధపడుచుండవలయును. ఇట్టినవల లుద్భవించుటకు పూర్వము, దేశమున విద్యాభివృద్ధి విశేషముగా నుండవలెను.

మానసికవికారములను దెల్పు ప్రత్యేకనవలలు కొన్ని గలవు. ఇట్టినవలలు కేవలము మనోమార్గరహస్యములనే ప్రకటించుటచే కథాచమత్కృతి మాటుపడియుండును గావున చదువరుల కంతగా నహ్లాదకరమై యుండకున్నను, వారలయూహాపరంపరలకు నైతికమార్గ మేర్పఱచును గావున లాభకారులే యని చెప్పవచ్చును.

ఇవి వ్రాయువారికిని చదువువారికిని కష్టము కల్గించు ననుట కభ్యంతరము లేదు. వేదాంతమార్గములను తమ్మాలమగు ప్రత్యేకపాత్రములను చదువరులకు నేర్పఁగల నవలలను వేదాంత నవలలని పేరిడవచ్చును. ఇట్లే మత సంబంధములగు నవలలను వ్రాయవచ్చును. వీనివలన ప్రత్యేక ఫలము విస్పష్టముగాఁ గనంబడుచునే యుండును.

పైని చెప్పిన యన్నిటికన్నను మిక్కిలి యుపయోగకరములు, ఉత్కృష్టములు నగు నవలావతంసములు సాంఘికములగు స్వాభావికనవలలని యాంగ్లేయాది భాషలయందు పేరొందియున్నవి. ఈఘక్కినవలలు వ్రాయుట కడుసులభమని తోఁచుచుండును గాని, ఇంపగునట్లు నిర్వర్తించుట కడుంగడు దుష్కరమని తెలియఁదగును. సంఘాచారమర్యాదలను సదా చూచుచునే యున్నను నవలారూపమున నయ్యవి ప్రకటించుట సులభకార్యము కాదు. ఉన్న దున్నట్లే చిత్రించి కథయం దిమిడ్చిన స్వాభావికనవల యగునని తలంపరాదు. ఉన్న దున్నట్లే వ్రాసిన మాట్లాడినట్లే వ్రాసిన ట్లపహాస్యమునకు కారణమగును, మనము మాటలాడునప్పుడు ముందువెనుకలు సరిపెట్టుకొనక ప్రతివాక్యము సర్వసాధారణముగా తప్పుగనే పల్కుచుందుము. అన్వయమున్నను లేకున్నను, నభినయప్రకరణాదులనుబట్టి యభిప్రాయము తేటపడుచుండును. అట్లే కార్యములందును ప్రవర్తింతుము. ఒకదానితో నొకటి సంబంధము లేని కార్యముల నెన్నిటినో చేయుచుందుము. అవన్నియు నవలలందుపయుక్తములు కావు. స్వాభావికనవలలందు జనసామాన్యమున మనము సదా చూచుచున్న మంచిచెడుగులను గూర్చియు, నట్టిస్త్రీపురుషులను గూర్చియు అవస్థాభేదములనుబట్టి వారు చేయు చర్యలను గూర్చియు, ప్రకృతిస్వభావము ననుసరించి నవలను రచించువాఁడు వర్ణనలు చేయవలసి యుండును. ఇం దస్వాభావికములగు కేవిషయములకును తావు లేదని వేఱె చెప్పనక్కఱ లేదు. సద్గుణములన్నియు నొకచో ప్రోవుచేసి సృజించిన మగవాఁ డెక్కడను గానరాఁడు. అట్లే సౌందర్యమంతయు మూర్తీభవించిన యాఁడుదియుఁ బ్రపంచమునందునకైనను గానరాదు. ఇదే విధముగ నిలువెల్లను కలుషమైనవాఁ డుండనేరఁడు. కావున నవలలం దిట్టివారిని జొనుపుట స్వభావవిరుద్ధము. ఇట్టి స్వభావవిరుద్ధములయిన పాత్రములను నవలలందుఁ జొనిపి యింతవఱకును మన తెనుఁగువారు స్వాభావికమైన నవల నొక్కటియైన రచింపరు. నవలకు నాయకుఁడైయుండఁదగినవాఁడు సర్వోత్కృష్టుఁడనియు అసామాన్య రూప, గుణసంపన్నుఁడనియు, సకలసౌభాగ్యశాలి యనియు వర్ణించుచుండుట కేవలమన్యాయ్యము. బలసంపన్నుఁడైన నాయకుఁడు జయింపని యుద్ధమే లేదు. అతఁడు ప్రత్యర్థుల నందఱ నవలీలఁ జంపును. వాని భాగ్యమున కాటంకము లెన్నఁడును లేవు. ఇంతటిసౌభాగ్యవంతులు మన కెన్నఁడును గనఁబడకున్నను, నవలలయందు మాత్రము ప్రతిచోటను గానవత్తురు నాయికయవస్థ మఱి దుఃఖాకరముగా నున్నది. ఆమెకు చక్కఁదనమును కొన్ని సుగుణములును దప్ప మఱేయవస్థలును లేవు. నాయకునియందు బద్ధానురాగ యగుటయే యామె కున్న పని. ఇతరమానవకార్యములయం దామె

కేదోక్యముతు లేదు. దుష్టుఁడైనవాఁడు మొదటినుండి కొనవఱకు దుష్టుఁడే. వానికి మనుష్యస్వభావ మన్నది లేదు. ఇఁక నాయికానాయకుల చర్యలన్నియు నత్కృష్టకార్యములే. వారు చేయఁదగిన సామాన్యకృత్యములే లేవు. అట్టిపాత్రలు, అట్టికార్యములును మిక్కిలి స్వభావవిరుద్ధములని చెప్పవలసియున్నది. స్వాభావికనవలలయం దిట్టివానికి తావు లేదు. అందుచేతనే వానియుత్కృష్టత యేర్పడుచున్నది.

సద్గుణములు చదువరుల కింపగునట్లు చేయుచు, సంఘమునందున్న దురాచారములను దొలఁగించుటకును, ఆచారవ్యవహారములు చక్కఁగఁ దెలిసికొనుటకును స్వాభావికనవలలు వారిని బురికొల్పుచుండును. సామాన్యముగా మనము చూచుచున్నట్టిమానవులే యందుఁ బ్రకటింపఁబడుచుండుటచే నట్టివారితో నెట్లు మెలఁగవలెనో, వారి కట్టిచిక్కులు సంభవించి యెట్లు వాని నుండి విముక్తిఁ జెందిరో యన్నియు చదువరులకు గుణపాఠములవంటివి గావున వానిని దెలిసికొన్నందున మిక్కుటమగు ఫలము గలదు. దుర్గుణములచే చెడినవారి చరిత్రము లవలంబనీయములు గాని తెలిసికొనుటయు చదువరుల కావశ్యకమే. అద్దమునందు ప్రతిఫలించినట్లు సాంఘికాచారము లీస్వాభావికనవలలయందు ప్రతిఫలించుటచే నందువారికి నవల వ్రాయనప్పటి సంఘస్థితి యెట్లున్నదియు చక్కఁగాఁ దెలియుచుండును.

ఆంగ్లేయభాషయం దీవిధమగు నవలలను వ్రాసిన పెక్కండ్రు సుప్రసిద్ధులయిరి. కొందఱంగనామణులును స్వాభావికనవలలను వ్రాసి పేరొందియున్నారు. సర్వాంగసౌష్ఠవము నందిన యాంగ్లేయసారస్వతమునఁ బ్రతిష్ఠ గాంచియున్న స్వాభావికనవలల ననుకరించి మనవారిఁక నైన నట్టివి వ్రాయఁబూనుదురుగాక! అట్టివి బొత్తిగా నాంధ్రభాషలో లేవని చెప్పఁజాలము గాని, యింకను చాల వెలువడవలసి యున్నవి. మనకాలమునాఁటి చరిత్రమును వ్రాయుట మిగుల దుష్కరము. ఏకాలము నాఁటివారిని గూర్చియో, ఏదేశమువారిని గూర్చియో తనకుఁ దోఁచినట్లు వ్రాసివేయవచ్చును. అప్పటివారి సంఘస్థితులు తెలియనే తెలియవు. సరిగాఁ దెలిసికొని వ్రాయుటచే చారిత్రకనవల యేర్పడును.

మనపూర్వప్రబంధములవలె ననుక్రమముగా వచ్చుచున్న ముఖ్యకథాభాగమే యన్నినవలలయందును సామాన్యముగాఁ గన్పట్టుచున్నది. యోగీశ్వరులు, రాజపుత్రులు, తురుష్కులు, యుద్ధములు, చాల నవలలయందు సామాన్యకథాంశముగాఁ గానవచ్చుచున్నది. మొత్తముపైని కథ యంతయు నొకదానిని బోలి యింకొకటి యుండును. ఒకనవలయందలి నాయిక నింకొకనవలకు మార్చినను పేరు తప్ప మఱి యేమియు మార్పుఁ జెందదు. గుణములు, రూపము నన్నియు నొక్కటే యచ్చు. ఇట్లే నాయకులను మార్చినను పుస్తకములం దొక్కపంక్తియైనను మార్చనక్కఱ లేదు.

పైనఁ బేర్కొనిన వివిధములగు నవల లన్నియు నూత్రించినట్లే యుండనక్కఱ లేదు. ఒకనవలయందు రెండు గాని, మూఁడు గాని విశేషాంశములు ప్రాముఖ్యముఁ గాంచవచ్చును. చారిత్రకవిషయములను స్వాభావికనవలయందు పొందుపఱుపవచ్చును. పరిశోధకనవల లన్నియు సాధారణముగా కల్పితకథలే యై యుండును. ఒక్కొక్కనవలయం దెన్నివిషయములు గూడియున్నను, ముఖ్యమగుకథాంశ మేదైయుండునో దానిపేరనే నవల పేరు గాంచియుండును.

కవితయందును, నాటకాదులయందును రసము ప్రాముఖ్యము గాంచును. నవలలయందును రసము నిరసింపరానిదే. ఇప్పటి మననవలలయందు శృంగారము మాత్రము కొంతవఱకు దలచూపుచున్నది గాని కడమ రసములు కడునీరసించి యున్నవి. ఆంగ్లగ్రంథకర్తలయందు హాస్యరసము కడుంగడు విరాజిల్లుచున్నది. ఆహ్లాదమునకై యేర్పడినగ్రంథము లగుటచే నవలలం దీరసము మిగుల నాదరణీయమని నాకుఁ దోఁచుచున్నది. ఇయ్యది మన ప్రస్తుతపు నవలలయందు శశవిషాణప్రాయమై పోయినది. నూతన నవలాకారు లీయంశమును గమనింతురుగాక! హాస్యరసప్రపూర్ణమగు గ్రంథము రచించుట మాటమాత్రము హాస్యమనుకొనరాదు.

# మీ జీవితపర్యంతము మీ శిరోజములను కాపాడుకొనుడు

శిరోజములు మిక్కిలి సున్నితమైనవి. వాటిని మీరు సరిగా పోషించిన అది చక్కగా పెరిగి, అందముగా నుండును. లేనిచో వాటిని అలక్ష్యముచేసినట్టి చిహ్నములు ప్రారంభమగును. మీ శిరోజములు యే విషయమునందైనను ఆశాభంగమును గలిగించిన వాటిని భయపరచునట్టి అపాయము లన్నిటినుండి రక్షింపుడు.



## సు సా మ

ప్రాగ్దేశమునందు శిరోజముల నభివృద్ధిపరచునది

కొన్ని యేండ్లనుండి వాటిని లక్ష్యముచేసియుండినను, లేక సరిగా వాటిని పోషించకయుండినను మీ శిరోజముల కిది తప్పక ఆరోగ్యము నొసగును. గడచిన 50 సంవత్సరములనుండి దేశమందంతటను వాడుకలో నున్నది.

ప్రతిచోటను అమ్మబడుచున్నది.

**P. SETT & Co.,**

**Perfumers, Calcutta.**

# లివరు వ్యాధికి అమోఘమైన చికిత్స

మాదిరి ఔషధములు బయలుదేరినవి. మోసపోకుడు.

వీరి ఔషధరాజము అనేకమంది ప్రజలచేతను, గొప్పగొప్ప డాక్టర్లచేతను, ఆమోదింపబడి వేలకువేలుయోగ్యతాపత్రములు పొందియున్నది. గొప్ప గొప్ప డాక్టర్లుగూడ వదలివేసిన

లివరు వ్యాధులను వీరు అతి జయప్రదముగా గ్యారంటీగా నివారణచేయుచున్నారు.

ఎప్పటను యీ లివరువ్యాధికి తగిన ఔషధము లేకపోవుటచే వీరి ఔషధమునే అనేకమంది డాక్టర్లు ప్రతిదినము పోష్టుద్వారా తెప్పించుకొనుచు, వారి వారి రోగులకు వాడి వారి సంతృప్తుల దెలిపియున్నారు.

షరా:—మా ఔషధమును చూచి అనేక మాదిరిఔషధములు బయలుదేరినవి, గాన మోసపోకుండగలందులకై ప్రజలను హెచ్చరించుచున్నాము.

☞ అన్నిచోట్లను వీరి ఔషధరాజములనమ్ముటకు పలుకుబడిగల ఏజంట్లు గావలయును. వివరములకు;

విజయనగరవాస్తవ్యులగు;

## డాక్టర్ జమ్మి వెంకటరమణయ్యగారు,

లివరు అండ్ స్ప్లీనువ్యాధులకు ప్రత్యేకవైద్యులు.

8, సాలెవీధి, మైలాపూరు, మదరాసు.

కావ్యనాటకాదులందునవలెనే నవలలయందు సహితము మనవారు విషాదాంతకథలను వ్రాయ నూహించలేదు. ఈ నూతనవచనప్రబంధమునందైన పూర్వలాక్షణికశృంఖలలను విదల్చుకొని యాంధ్రకవిపుంగవులు విషాదాంతములగు నవలలను రచించి ప్రకృతి ననుసరింతురు గాక! ప్రాముఖ్యముం గాంచిన యితరసారస్వతములందు విషాదాంతగ్రంథము లుత్కృష్టములుగా భావింపబడుచున్నవి. ఈయంశమున మనవారింకను నూతనపథము ద్రొక్కవలసియున్నది.

ముఖ్యముగా నవలలయందు పాటింపదగిన విషయము పాత్రౌచిత్యము. ఇయ్యది నాటకాదులయం దెంతియావశ్యకమో నవలలయందు నంతయావశ్యకమే. పాత్రగుణపోషణముం గూర్చి చెప్పుట సుకరమే కాని పాటించుట దుష్కరము. ఆంగ్లేయనవలలయం దీగుణము చక్కగా పరిపాలింపబడుచున్నది. ఈయంశ మింకను మనవారు గ్రహించినట్లు కాన్పింపదు. నవలలు వ్రాయువారు సాధారణముగా బాలురగుటవలన నీగుణము నిర్వహింపబడదు. చక్కని సులభశైలిని మిక్కిలి మంచి కథను బాల్యమునం దల్లవచ్చును గాని, లోకానుభవమువలననే తెలిసికొనదగు మనుష్యప్రవర్తన రహస్యములు వయసు ముదిరిన పరిశీలకునికే కాని పట్టుపడవు. అందువలన బాలునిచే రచింపబడిన నవల లీవిషయమున మిక్కిలి కుంటుపడియుండుననుట నిస్సంశయము. వయసువలన పరిపక్వమైన పరిశీలనసుసంగతత్వముగల పండితుండు వ్రాసిన స్వాభావికనవలలే యుత్కృష్టములై యుండును గాని తదితరములు కానేరవు. నవలాకారుండు స్వానుభవమును విశదీకరించుచు వ్రాసినట్టి నవలలెంతో మనోహరములుగా నున్నవని యాంగ్లసారస్వతమునుండి గ్రహింపవలసియున్నది. కావున మనవారు నీమార్గమునే త్రొక్కవలసియున్నారు. పాత్రలకుచితముగు ప్రవర్తనలు గల్పించుటయందు మనవారు మిగుల జాగరూకతతో మెలంగవలెను. సమయములనుబట్టియు, స్థితిగతులనుబట్టియు, పాత్రల గుణవిశేషములు మార్పుం జెందుటయుం గలదు. పాత్రముల నుచితరీతిని చిత్రింపవలెనన్న, మనుష్యస్వభావమును చక్కగాం బరికించుట తప్ప మఱియొండుమార్గము లేదు. ఒకగ్రంథమును జూచి ఇంకొకగ్రంథమును వ్రాయుట సహజమైన పాత్రపోషణము గానేరదు. చారిత్రకనవలలందుం గాని, స్వాభావికనవలలందుం గాని సరిగా మనము చదివి చూచినవిధముగనే వ్రాయ నక్కఱలేదు. ఔచితినిబట్టి మార్పులుండుటయే నవలకు శోభాకరము. ఆంగ్లేయసారస్వతమున ప్రఖ్యాతిగాంచిన నవలలన్నిటిలోను స్వాభావికనవలలే హెచ్చుగా నుండుటవలన వానింగూర్చి మిక్కిలిగా వ్రాయవలసివచ్చినది. ఇయ్యవి సాధారణముగా సాంఘికములగుటచేత నుపయుక్తములై సారస్వతమునం బేరు గాంచియున్నవి.

ఆంగ్లమునందువలెనే యాంధ్రమునందును తొలుదొల్త ప్రతిమాసమునం బ్రకటింపబడు పత్రికలయందే విరివిగా నవల యభివృద్ధి గాంచినది. అనేకప్రకరణములుగను, భాగములుగను విభజింపబడు నవల చదువుట కనువుగా నుండును. కొందఱు ప్రతిప్రకరణమునకును నామనిర్దేశము గావింతురు. అందువలన నాప్రకరణమునందు రాబోవు కథ సూచింపబడును. ఇట్టినామకరణమును, గొందఱు తమకేర్పను బ్రకటించు కల్పనలను జూపుటయుం గలదు. కొన్నిపట్ల ప్రకరణమందలి కథను సూచించుచు పూర్వకవికృతగ్రంథభాగముల నుదాహరించుటయుం గలదు. ఇవన్నియు నవలాశరీరమున కగత్యములని చెప్ప వీలు లేదు. ఆంగ్లాదిభాషలయందు కొన్నినవల లతిదీర్ఘములుగా నున్నవి. వినోదమునకై చదువుకొనదగిన యిట్టిగ్రంథము లతి విలువగలవియైన, మనవారు కొనజాలరు. అన్నివిధములచేతను నవలలనుబోలిన చిన్నపొత్తములు "నవలిక" లను పేరం బరగుచున్నవి. ఇవి యాంగ్లభాషయం దతిచమత్కారముగను, మనోహరముగను, చక్కనిభాషయందును మాసపత్రికలయందుం దఱచుగాం బ్రకటింపబడుచుండును. ఇట్టివి మనభాషయందును కొన్ని గలవు. అయినను నవలయం దెన్నిరకము లున్నవో అన్నివిధములు నవలికలయం దున్నట్లు గానరాదు. నవలికలను మనోహరముగా రచియించ నలవాటు గావించుకొని నవలారచనకు గడంగుట మంచిది.

పద్యములతో చిన్నకథలను వ్రాయుటయు నాంగ్లేయపద్ధతియే యని చెప్పవలసియున్నది. అయిన నాంగ్లేయసారస్వతమున నయ్యవి నవలికలని పేర్కొనఁబడుట లేదు. పద్యరచనావిశేషమునం దొకటిగా గణింపఁబడుచున్న యీనవలిక లాంగ్లమునందు సహితము కేవలము కవిత్వమునకును వచనరచనకును సంబంధము గల్పించు కొక్కెమువలె భావింపఁదగును. వీనియం దున్న విశేష మేమనఁగా నవలయందలి సౌభాగ్యమునకుఁ దోడు వీనియందు కవిత్వపు సొంపులును గానవచ్చును. నవలయందుఁగాని నవలికలయందుఁగాని కథ సంకుచితముగను, స్వల్పముగను, కథపట్టునకుఁ దగినట్టుగను నుండుటయే పొసఁగును గాని ప్రబంధములందువలె విశేషముగను, విశేషాలంకారయుక్తముగను నుండరాదు. ఏసంకేతమం గైకొనను నిష్కర్షముగా హద్దేర్పఱుచుట పొసంగ నేరదు గావున నవలలను రచించువారు తమ బుద్ధి నుపయోగించి మర్యాద మీఱక ప్రవర్తింపవలెను. కొందఱాంగ్లేయగ్రంథకర్తలు పాత్రలు ధరించిన వస్త్రాదివిశేషముల నతిసూక్ష్మముగా వర్ణింతురు. ఇందువలనఁ జదువరులకు మిక్కిలి శ్రమ కలుగుచున్నదని నా తాత్పర్యము. ఉచితమును, ముఖ్యమును నగు వస్త్రాద్యలంకారవర్ణనవలన వర్ణింపఁబడిన వ్యక్తి కన్నులకుఁ గట్టినట్లుండును. ఇట్టిసంకేతములందు హద్దు నవలాకారుఁడే యేర్పఱచుకొనవలెను.

వందలకొలంది రచింపఁబడుచున్న నవలలయం దేవి యుత్కృష్టములో తెలిసికొనఁజాలక సామాన్యపాఠకులు తబ్బిబ్బుపడుచుండుట కలదు. వీరికాలము వృథపోకుండ చూచుట సంఘమునకుఁగల బాధ్యతలలో నొకటి. పాఠకులు ప్రసిద్ధపురుషులయొక్క ప్రసిద్ధగ్రంథములనే గైకొనుటవలన కొంతలాభమున్నది. అందువలన మంచిగ్రంథములను వ్రాయు క్రొత్తవారిపుస్తకములను విడువవలసినదే యని సంశయింపవచ్చును. నిష్పక్షపాతముగా మంచిగ్రంథము నెవరిచే రచింపఁబడినను పూజింపఁదగినదని మనకుఁ దోఁచినచో, నట్టిగ్రంథము లేవియో పేర్కొనవలసియుండును. ఉత్తమమధ్యమాధమాదినిర్ణయములను గావించి ప్రతిమాసగ్రంథమును బరిశీలించి యేర్పఱచుపని పండితులు, కృతివిమర్శకులు నగువారియందున్నది. ఈకార్యనిర్వహణమునకుఁ దగినసభ్యు లేర్పడి, నవలలే కాక తక్కినగ్రంథము లన్నియుఁ బరిశీలించి వానికిఁ దగినస్థానమొసంగుటవలన భాషకును, పాఠకులకును, పుస్తకములు రచించువారికి నెంతో మేలు గలదు. ఈపద్ధతి ఫ్రెంచిభాషయందుఁ చాలకాలముక్రిందటఁగలదు. సారస్వతమునకు మేలగు నవీనపద్ధతి మనవా రవలంబింతురుగాక!

---

## పేరంటము

బసవరాజు వెంకట అప్పారావు గారు

'పేరటమునకు వెయ్యామడదూరమైన
చనదగు'నటన్న యార్యభామినులధర్మ
వాక్యము ప్రమాణముగ నెంచి వనిత గ్రీష్మ
తప్తగాత్ర యయ్యును, నాహిమమ్ము గోరి,
పట్టుపుట్టమ్ము దాలిచి, ఫాలభాగ
రచిత కుంకుమతిలక సాంద్రారుణరుచి
సంజకెంజాయతో మైత్రి సల్పుచుండ,
బారులనుదీరి ముత్యాలహార మటుల
వేడ్కతో చెలికత్తెలు వెంట నడువ,
నడుమ వారిలో నొప్పుచు నాయకమణి
యట్లు పేరంటమున కేగునప్పు డామెఁ
గాంచి నేత్రనిర్వాణము గంటి వీవు!

---

# ఆంధ్ర శబ్దచింతామణి పాఠభేదములు

వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు

## ౨

వివక్షులారా!

బాల సరస్వతీయ చింతామణికిని నప్పకవీయ చింతామణికిని గల పాఠభేదములలో వేఱొకటి యీ క్రింద విమర్శింపఁ బడుచున్నది.

శ్లో. "ఆద్యాయాః పంచాశద్వర్ణాః ప్రకృతేస్తు తే దశోనాః స్యుః, షట్త్రింశ దత్ర తేఽన్యే చానుప్రవిశంతి శబ్దయోగవశాత్."

శ్లో. "ద్వివిధాదిమదేదోతో ఽచో వక్రతమావనుస్వారా, కగ చజయుగ టడణ తగన పబమయరలవసహాశ్చంతు హల్వర్గః." (బాల సరస్వతీయ చింతామణి.)

శ్లో. "ఆద్యాయాః పంచాశద్వర్ణాః ప్రకృతేస్తు తే దశోనాః స్యుః, సప్తత్రింశ దిహాన్యే చానుప్రవిశంతి శబ్దయోగవశాత్.

శ్లో. "ద్వివిధాదిమదేదోతో ఽచో వక్రతమా వనుస్వారా, కగ చజయుగ టడణతదన పబమ యరయుగ లయుగ వసహాశ్చ హలః." (అప్పకవీయ చింతామణి.)

పయి పాఠభేదములుగల ద్వివిధ పుస్తకములకును సంస్కృతమున వర్ణము లేఁబది యనియుఁ, బ్రాకృతమున వర్ణములు నలుబది యనియుఁ జెప్పుటలో భేదము లేదు. ఇఁక నచ్చాంధ్రమునకు వర్ణములు ముప్పది యాఱని బాల సరస్వతీయ చింతామణి పాఠము చెప్పుచుండఁగా ముప్పదియేడు వర్ణములని యప్పకవీయ చింతామణి పాఠము వక్కాణించుచున్నది. రెండు పక్షములలోను నలఘు లకారమున కనఁగా దొడ్డలకారమునకు వర్ణసమామ్నాయమునఁ బృథగ్గణన మున్నదనియు, సప్తత్రింశదిత్యాది పాఠపక్షమున నలఘురేఫమునకు సైతము పృథగ్గణనము గలదనియు, షట్త్రింశదిత్యాది పాఠ పక్షమున నలఘు రేఫమునకుఁ బృథగ్గణనము లేదనియుఁ జైచింతామణి శ్లోకములకు వ్యాఖ్యలు చేయఁబడి యున్నవి.

"షట్త్రింశదత్ర-అత్ర శుద్ధవికృతౌ షట్త్రింశద్వర్ణానాం వ్యవహారః. రస్త్వత్ర గృహ్యతే ద్వివిధ ఇతి రేఫస్యాద్వైవిధ్యకథనేన గురురేఫస్య వర్ణమధ్యే పరిగణనద శాయాం 'సప్తత్రింశ దిహాన్యే' ఇత్యప్పకవిపుస్తకపాఠోఽపి సాధురేవ. తస్య రేఫభేదత్వేన అవర్ణాంతరత్వా దపరిగణనదశాయాం అయం పాఠ ఇతి వివేకః." (అహోబలపండితీయము, ౧౩౯ పు.)

కీర్తిశేషు లగు పరవస్తు చిన్నయ సూరి గారు చింతామణి వివరణ మనఁదగు బాలవ్యాకరణమును రచించుటలో నిందలి షట్త్రింశదిత్యాదిపాఠమునె యంగీకరించి "తెలుఁగునకు వర్ణములు ముప్పదియాఱు" (సంజ్ఞా ప. 3 సూ.) అని సూత్రించిరి. ఇదియె నన్నయభట్టాభిప్రేతమనుచు "యవలలవలె రేఫంబును బ్రయత్న (లఘ్వలఘు) భేదంబుచే ద్వివిధంబుగాన శబ్దానుశాసనాదులచే నలఘురేఫము వర్ణాంతరముగా గ్రహింపఁబడదయ్యె" అని యిట్లు త్రిలింగ లక్షణశేషమునఁ (సంజ్ఞా, ౧ సూ.) గీర్తిశేషు లగు బహుజనపల్లి సీతారామాచార్యుల వారిచే వ్రాయఁబడినది. ఈ త్రిలింగలక్షణశేషవాక్యమును బట్టి యలఘులకారముగూడ నచ్చాంధ్రవర్ణ సమామ్నాయమున వేఱుగఁ బరిగణింపఁబడలేదనియు, నచ్చాంధ్రవర్ణ సమామ్నాయములోని ళకారము వర్ణాంతరమనియు నన్నయభట్టు తలంచెనని విశదమగుచున్నది. ఇట్టి యభిప్రాయము బాలవ్యాకరణములోని "వర్ణసమామ్నాయమందలి ళకారము వర్ణాంతరము గాని, యలఘు ళకారము గాదని యెఱుంగునది" (సంజ్ఞాప. ౧౫ సూ.) అను వాక్యము నాధారముగాఁ గొనియే వ్రాయఁబడినదని గ్రహింపనగును.

పయి బాలవ్యాకరణాభిప్రాయములను సరిగ గ్రహింపఁజాలక బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశికా కర్త "...అప్పకవి పుస్తకమందలి పాఠాంతరము పెక్కుఁ గారణములచే సమంజసంబుగ నున్నది. అహోబలపతీయ మిది వక్కాణించెను. (అహోబలపతిచింతామణిపాఠముకన్న నప్పకవిపాఠము సమంజసమని చెప్పలేదని యాతఁడు వ్రాసిన, వెనుక నుదాహరించిన పంక్తుల వలనఁ బాఠకమహాశయులకు విశదము కాకపోదు.) తక్కిన యచ్చవర్ణములభాతిని శకటరేఫంబును వర్ణంబులలోఁ బృథక్కుగాఁ బరిగణించుట న్యాయ్యము." అని యిట్లు వ్యాఖ్యచేయుట కేవలము నవిమృశ్యకృత మనుటకు సందియము లేదు. మఱియుఁ బై నుదాహరించినరీతిని వర్ణసమామ్నాయగత ళకారము వర్ణాంతరమనియు నలఘు లకారము కాదనియు బహుత్వమందాదేశముగా వచ్చునది మాత్రమె యలఘులకారమనియు "ఏళులు, పాళులు, త్రాళులని బహుత్వమందు రలడలకాదేశమయిన ళకారమలఘువు......వర్ణసమామ్నాయమందలి ళకారము వర్ణాంతరముగాని, యలఘుళకారముగాదని యెఱుంగునది" (బాలవ్యాకరణము, సంజ్ఞా. ౧౨ సూ) అను పంక్తులతో స్పష్టముగా బాలవ్యాకరణము చెప్పుచుండఁగా నాగ్రంథములోనిదే యగు "యవలలు లఘ్వలఘువులు మైత్రింబొందయు. రేఫంబులు పొందవు." (బాల.వ్యా. ప్రకీర్ణ. ౩౮ సూ.) అను సూత్రమునకు బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశికాకర్త యుదాహరణము లిచ్చుచోలో "పల, రోలంబక" మున్నగువానిలోని లకారములకును, "తళతళ, వళావళి," మున్నగువానిలోని ళకారములకును యతిప్రాసమైత్రిని జూపుట వక్తృతాత్పర్యావిమర్శనకృతమె యనుటకు సందియము లేదు గదా! పయివిషయముల నొకప్పుడు వెల్లడింపఁగా నాతఁ డట్టి సత్యవిషయము నంగీకరించుటకుఁ బదులుగా స్వవచనస్థాపనపరత్వమున బాలవ్యాకరణ కర్తగారికిఁ గూడఁ దనయభిప్రాయమె యనఁగా వర్ణసమామ్నాయగత ళకార మలఘులకారమను నభిప్రాయమె గలదని చెప్పుచు వెనుక నుదాహరించిన బాల వ్యాకరణ వాక్యమున కీక్రిందిరీతి నపార్థమును జేయ సాహసించెను: "వర్ణసమామ్నాయగతళకారము, వర్ణాంతరము గాని = వర్ణాంతరము గానట్టి యలఘులకారము కాదు, ఇఁక నేమన వర్ణాంతరమయినట్టువంటి యలఘులకారము" అను పద్ధతిని వ్రాసిరి. సూరిగారికే యట్టి యభిప్రాయ మున్నయెడల వెనుక నుదాహరించిన యాసందర్భములో "ఏళులు, పాళులు, త్రాళులని బహుత్వమందు గలడల కాదేశమైన ళకార మలఘువు." అని ళకార విశేషమునకు కలఘుత్వమును మీఁది పంక్తిలో విశేషించి చెప్పియుందురా? మఱియు నట్లుగాన లఘుళకారమును వర్ణసమామ్నాయములోఁ బరిగణించి యున్నయెడలఁ దుల్యన్యాయమున నలఘు రేఫమును గూడ వర్ణసమామ్నాయములో వేఱుగఁ బరిగణించి యుండరా? ఇఁక నాసందర్భమున ళకార విశేషమును వర్ణసమామ్నాయములోఁ బఠించియుండుటచేత నది యలఘు లకారమని యెవ్వరేని భ్రమించి తత్సమానన్యాయమున నలఘురేఫమునుగూడ నేల వర్ణసమామ్నాయమునఁ జేర్పరయిరని గుప్తార్థప్రకాశికాకర్తలవలెనే శంకింతురేమో యని తలఁచియే సూరిగారు లఘ్వలఘు లకార నిరూపణసందర్భమున వెనుక నుదాహరించినరీతిని "వర్ణసమామ్నాయగతళకారము వర్ణాంతరముగాని, యలఘుళకారము గాదని యెఱుంగునది" అని యిట్లు వ్రాసిరని యెవ్వరికేని తోఁపక మానదు గదా!

ఇఁక బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణ కర్తలచ్చాంధ్రవర్ణసమామ్నాయ గత ళకారము వర్ణాంతరమనియు, నలఘు లకారము కాదనియు, బహువచనమునందాదేశముగా వచ్చినది మాత్రమె యలఘులకారమనియు నన్నయాభిప్రాయవర్ణనము చేయుట సరి యగునా, కాదా? యనువిషయము విమర్శింపవలసియున్నది. ళకారసామాన్యమెల్ల నలఘు లకారమె యైనయెడలఁ దత్సమానన్యాయమున నింకను "నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యంస్యాత్" అని యిట్లు రేఫద్వయమునకును బరస్పర వైధర్మ్యము నుద్ఘోషించుచుండుటచే నంతకన్న నెక్కుడు యావశ్యకత్వమున—నన్నయభట్టారకునిచేత శకటరేఫముగూడ ళకారమువలెనే వర్ణాంతరముగాఁ బరిగణింపఁబడవలసి యుండునుగదా!

అట్లు పరిగణింపని పక్షమునందును "షట్త్రింశదత్ర", "యలరవసహాళంతుహల్వర్గః" అను పాఠములు, శకార సామాన్యము నలఘువుగా నన్నయభట్టారకుఁడు తలంచి యుండలేదనియు నచ్చాంధ్ర శకారమును ద్వివిధముగా నెంచి యుండెననియు నూహించుటకుఁ బ్రబల నిదర్శనములయి యున్నవి. చాలవఱకీరీతిని విమర్శించియే సూరిగారు అహోబలపండితాదుల వ్యాఖ్యల నుల్లంఘించి నన్నయ భట్టారకాభిప్రాయమును నిర్ణయించుకొని యట్లు వ్రాసిరని తోఁచుచున్నది. ఈ సూరిగారిపద్ధతి యాయన వ్యాకరణమునకు నన్నయాభిప్రాయము సరిపడునట్లు కల్పింపఁబడినది. కాన వీరి యీ యూహ సాకల్యముగ నాంధ్రశబ్దచింతామణికి సరిపడదు. అలఘు లకారమును వేఱుగను, వర్ణసమామ్నాయగత శకారమును వేఱుగను నన్నయభట్టారకుఁడు తలంచె నన్న విషయమునఁ జింతామణి బాలవ్యాకరణములకు భేదములేదు. ఇఁక సూరిగారు వివరించినట్లు "ఏళులు, పాళులు, త్రాళులని బహుత్వమునందు ర ల డ ల కాదేశమైన శకార మలఘు" వనెడి విషయమమాత్రము చింతామణికి సరిపడదు. నన్నయభట్టారకుఁ డొక్క రేఫమునకు మాత్రమె 'రోలః' అను సూత్రముచే లకారాదేశమును విధించెను గాని ల డ లకు లకారాదేశమును విధించియుండలేదు. ఇఁక "రలయో ర్లడయో స్తద్వ ల్లళయో శ్శసయోరపి; వబయోర్నణయో శ్చాంతే సవిసర్గావిసర్గయోః; సబిందుకాబిందుకయో స్స్యాదభేదేన కల్పనమ్" (అహోబ. ౧౩౭ పుట), అను మొదలగు కారికలనుబట్టి "పాడి-పాళ్ళు.....అంబలి—అంబళ్ళు ..... లడళానామ భేదాభిధానాత్ రూపమేకంతత్" (అహో. ౩౩౮ పుట) అను రీతిని వ్రాయఁబడిన యహోబలపండితీయ గ్రంథము చొప్పున లకారాదేశమును లడలకు నన్నయభట్టు తలంచి యుండెననుట యెంతమాత్రమును సరికాదు. ఇట్టి ప్రక్రియలో నభేద కల్పనా కారికలను బట్టి లకారాదేశమును విధించుటయే నన్నయభట్టారకునకు సమ్మతమైన యెడల నట్టి కారికలలో రలలకుఁ గూడ నభేదాభిధాన ముండుటచేత నాతఁడు "రోలః" అనెడి రేఫమునకు లకారము నాదేశించిన సూత్రమును బునరుక్తముగాఁ జెప్పి యుండఁడు గదా! కాఁగా "ఊరు, ఊరులు, ఊళ్లు, కాలు, కాలులు, కాళ్లు" మున్నగు చోట్ల నొకప్పుడు లఘు లకారముగాఁ గాని, వర్ణాంతరముగాఁ గాని యుండి మఱొక యప్పుడు శకారోచ్చారణ రూపమగు మార్పు నొందిన యది మాత్రమె లకారముపై నొకబొట్టు పెట్టి లిపిగల యలఘు లకారమనియు నెన్నఁడును మార్పులేక యేకరీతిని శకారోచ్చారణముతో మాత్రమె యుండెడి శకారము (నూళ్) వర్ణాంతరమగు వర్ణ సమామ్నాయగత శకారమనియు నాతఁడు తలంచియుండునని గ్రహింపనగును. శకారోచ్చారణము గల శబ్దముల కిట్టి వైజాత్య ముండుటచేత నాతఁ డట్లు ద్వైవిధ్యము నంగీకరించి యుండు ననెడి పైయూహ మఱింత దృఢమూల మగుచున్నది. అతనికాలమున "త్రాడు—త్రాడులు—త్రాళ్లు" అను రూపములె గ్రాంథికతా వ్యవస్థ నందఁదగి యుండుటచేతను, "త్రాళ్లు" అను రూపమప్పటి కింకను గ్రాహ్యము కాకుండుటచేతను డకారమున కాతఁడు లకారాదేశమును విధించి యుండలేదు. త్రాడ్లు మున్నగు రూపము లాతని కాలమున వాడుకలో నున్నట్లు శాసన విమర్శకుల కెల్ల విదితమె గదా! పయి విషయమును నారచించిన చింతామణి వ్యాసములలో విపులముగ విమర్శించి యున్నాను. పయిసందర్భమును బట్టి, "షట్త్రింశదత్ర", "యరలవ సహాళంతు హల్వర్గః", "దంత్యచజౌ సురురలౌచ బిందుయుతౌ" అనుపాఠములు పరస్పర సంబంధము గలిగి నన్నయాభిప్రేతములని విశ్వసింపఁదగియుండి ప్రామాణికము లగుచున్నవని స్పష్టపడు చున్నది గదా!

అప్పకవి పుస్తకము తప్పఁ దక్కిన చింతామణి పుస్తకములందెల్ల "షట్త్రింశదత్ర", "యరలవసహాళమ్" అను పాఠములె యగపడు చుండుటచేతను, నప్పకవి పుస్తక పాఠమును గూడ సాధువుగా నంగీకరించిన యహోబల పండితుఁడు సైతము షట్త్రింశ దిత్యాది పాఠమునే మూలముగా గ్రహించుటచేతను షట్త్రింశదిత్యాది పాఠమె ప్రామాణికమనుట యుక్తముగా నుండును గదా! మఱియు నిర్బాధముగ నగపడుచున్న సప్తత్రింశ దిత్యాది పాఠము నుపేక్షించి శకారమునకు

ద్వైవిధ్యము గల్పించినం గాని మసురుపకంతున్నట్టి షట్త్రింశ దిత్యాది పాఠము నెవ్వాను గల్పించి యుండ రనుటకు సందేహ ముండదు గదా! శకార ద్వైవిధ్య కల్పనా రూపమగు నావశ్యకత యుండుటచేతనే యట్టి ద్వైవిధ్యము గల్పించుకొనుటయు స్థూలదృష్టిని బోడ మని కారణముచేఁ గావలయు షట్త్రింశదిత్యాది పాఠ ము నుపేక్షించి యప్పకవి గాని యంతకుఁ బూర్వులె వ్వరైనం గాని నిర్వ్యాజముగ నగపడెడి "సప్తత్రింశ" దిత్యాది పాఠమును గల్పించి యుండవచ్చు ననుట యెం తయు సంభావ్యమై యున్నది గదా!

ఈరీతిని శకార ద్వైవిధ్యమును, షట్త్రింశ దిత్యాదిపాఠముచేత నన్నయాభిప్రేతముగా నూహిం చుటయే కాక యాతఁడు చింతామణిలోఁ జెప్పిన యాంధ్రలిప్యుద్ధారక కారికలలోని "వంత్యావజౌ గుమర లౌచ బిందుయుతౌ" అనుదానిచేత నట్టి యూహను సిద్ధాంతము చేయుటయు మిక్కిలియుక్తమై యున్నది. రలల లఘ్వలఘూచ్చారణభేదము దత్కాలమున స్పష్ట ముగ వాడుకలో నుండుటఁ జేసి యట్టిభేదమును లిపితో గుర్తించుటకయి లఘురలలపై నొకబొట్టుపెట్టి వానిని నలఘురలలకు గుఱుతుగ నెన్నవలెనని పై కారికకర్థ మును గ్రహింపనగును. కాఁగా నట్టిగురు రలలను లఘు రలల భేదములనుగా నేకరీతి నంగీకరించి "యరల వ సహాళంతు హల్వర్గః" అని ప్రత్యేకముగ నొక్క ళకారమును మాత్రము వర్ణసమామ్నాయమున మరల రేఫసామ్యమునకు విలక్షణముగాఁ జేర్కొనుటచేత నన్నయభట్టారకుఁ డలఘులకారముగన్న వర్ణసమామ్నా యగత ళకారమును విభిన్నముగ నంగీకరించెనని నిర్ణ యించుటకు సందేహ ముండదు గదా!

వర్ణసమామ్నాయగత ళకారమునకును, నలఘు లకారమునకును నుచ్చారణమునందంతగా భేద మగపడ కున్నను వాని చరిత్రములు విభిన్నములగుటచేత వర్ణసమా మ్నాయమున ళకారము వేఱుగఁ బరిగణింపఁబడెననియు నాకారణముచేతనే యట్టిభేదము పాటింపఁబడక యలఘు లకారముగూడ ళకార లిపితోనే వ్రాయఁబడు వాడుక తటస్థించెననియు గ్రహింపవలసియున్నది. సూక్ష్మ దృష్టితోఁ బరిశీలించునపుడు మాత్రము తత్త్వజ్ఞులయుచ్చా రణమునందు వర్ణసమామ్నాయ గత ళకారాపేక్షచే నలఘులకారముయొక్క యుచ్చారణమునం దించుక తేలిక భాసిల్లకపోదని విమర్శకు లెన్నుదురుగాక. పైరీతినె యలఘురేఫమునుగూడ లఘురేఫము తలపై బొట్టుంచెడి గుఱుతుతో వ్రాయక 'ఱ' అను ద్రావిడదేశ ప్రసిద్ధ వర్ణాం తరముతో వ్రాయుటమాత్రమె గ్రాహ్యమై యున్నది.

ఆంధ్రలిప్యుద్ధారక శ్లోకములు ప్రాచీన లిపి స్వరూపమును గ్రహింపఁజాలని లేఖకపాఠ కాదు లుపే క్షించి వ్రాయక విడిచిన మాతృకలు బాలసరస్వతికి లభిం చుటచేతఁగాని బాలసరస్వతియే వాని నట్లు విడుచుట చేతఁగాని బాలసరస్వతీయ చింతామణిలో నగపడ కున్నను నప్పకవీయ చింతామణిలో నవి నిల్చియుండుట చేతను, ప్రాచీనలేఖనపద్ధతి కవి సరిపడియుండుటచేఁ బ్రాచీన లిపి స్వరూపము నెఱుంగని తరువాతి వారు ప్రక్షిప్తము చేసిరనుట యసంభావ్యమగుటచేతను, బాల సరస్వత్యప్పకవులకంటె నతిప్రాచీనుఁడగు నన్నయార్యుఁ డట్టి చింతామణిలిపి ననువదించి తనకాలమునకు సరిగా సవరించి యుండుటచేతను నవి ప్రక్షిప్తములే మోయని శంకించుట కవకాశము లేదు. ఈ విషయమును నా రచించిన చింతా మణి వ్యాసములలో విపులముగాఁ జర్చించియున్నాను.

యరల లఘ్వలఘుధ్వనులకుఁ బ్రత్యేకముగ వర్ణ సమామ్నాయమునఁ బరిగణనము లేనట్లే రలల లఘ్వ లఘుధ్వనులకును బ్రత్యేకపరిగణనము లేకుండుట సంస్కృ తవ్యాకరణ మార్గ సమ్మతమును యుక్తి సహమును నగు టం జేసియు, నట్లు లఘ్వలఘు యరల భేదములకుఁ బ్రత్యేక పరిగణనము చేయునట్లు రలల లఘ్వలఘు ధ్వనుల కును నన్నయ భట్టారకుఁడు ప్రత్యేక పరిగణనము చేయ లేదని చెప్పుటయే న్యాయ్య మగుటం జేసియు, రలల లఘ్వలఘుధ్వనులకుఁ బ్రత్యేక పరిగణనమును జేయని పక్షములోనిదగు "షట్త్రింశదత్ర", "యరలవసహాళమ్" అను పాఠములే నన్నయభట్టారక ప్రోక్తములనియుఁ దద్విలక్షణములగు "సప్తత్రింశదిహ", "యురయుగలయుగ ..." అను పాఠములు నన్నయప్రోక్తములు కావనియు విమర్శకులగు విద్వాంసులు గ్రహింతురు గాక!

# గడ్డిపరక

విమర్శకాగ్రేసర కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు

గడ్డిపరకరో! నీదైన ఘనత నెల్లఁ
దెలియఁజాలనియల్పజనులు నినుఁ గని
గడ్డిపరక యని లఘువుగను గణింత్రు
దేవమహిమంబు లెస్సగాఁ దెలుపలేవె
స్థిరకు సుకృతి హెచ్చుగాఁ జేయలేవె
నీదు బ్రదుకును నీయంత నీవు సరిగ
జరుపుకొనలేవె జగదీశుకరుణ మీఱ
క్షితికి ఘనతరంబగు నలంకృతివి గావె
ఎందు నున్నది నీలోప మెంచి చూడ
అర్కచంద్రాదు లెవ్వానిహస్తమహిమ
సింహశరభాదు లెవ్వానిచేతినేర్పు
నరవరేణ్యాదు లెవ్వానికరచతురత
జన్మ మెత్తిరో, యవ్వానిశయవిశేష
మునను నీవును జన్మంబుఁ బొందినావు.

పరమపురుషునిచ్ఛాశక్తివలనఁ గలుగు
జీవకళమహిమంబును జెప్పటందు
తృణమ! గజము నీ వొకరీతిఁ దెలుపుచుంద్రు
సృష్టికర్తసామర్థ్యంబు స్పష్టముగను
వ్యక్తపఱచెనునీశక్తి యల్ప మగునె
ప్రజ తృణజలసమృద్ధి నేపట్ల నైన
వలయు నంచును గోరుటవలన నీదు
నమితమగు ప్రయోజన మెల్ల నరయవలయుఁ
బాల బాలవృద్ధులను గాపాడునట్టి
గోగణంబులు నీదైనకూర్మిఁ గాదె
ఈయఁగాఁజాలు నాపాలు వేయునేల
కసవ! తగ నీవు మొదవులగ్రాస మైన
కారణంబునఁ గాదె యఖండమగును
పాఁడి మొదవులపొదుఁగులఁ బాలు పుట్టు

క్రతుపవిత్రితబర్హిస్సు గడ్డి కాదె
క్రమ మహాచాప లగునది గడ్డి కాదె
కప్పు పలుకొంపలందున గడ్డి కాదె.

జీవజాలంబునకు నీవు చేసెడునుప
కృతుల నన్నిటి మాకు నగ్గింపఁదరమె
దయను బ్రజలకు నిట్టు లాధారమౌదు
కోరకుండఁగఁ బ్రత్యుపకార మెపుడు
నీవు పెంతువు జీవాళి నెనరు మీఱ
నిన్నుఁ బెంచెడివార లీనేల లేరు
ఎవరు పెంచుట లేకున్న నేపు మీఱ
నల్లిబిల్లిగ నల్గడ లల్లుకొనుచు
నేలఁ గలనీరు నీయంత నీవె ద్రావి
మేదినిం గలసారంబు మెసవి నీవె
ఘాసమా! భాసురం బగుగ్రాస మౌదు
జగదవనపావనతరగోజాతమునకును
తరమె నుతియింప నీదైనత్యాగమహిమ
పగుల యాచించి సాహాయ్యపరతఁ గనక
తగుస్వయంకృషి చేసి నే తనువు నడపు
నీదువరజీవయాత్ర వర్ణింపఁగలమె
కలిసి పేనినత్రాడయి కరిని కట్టి
కలిసియుండుట మేలని తెలుపు దీవు
జీవు లిఁక నిన్నుఁ దేలికచేయుటెల్ల
అల్పమైయుండు పాపకార్యంబు కాదె
ఈవె గన వృద్ధి మేటివం చెన్నఁబడవె
పట్టువలె నుండుమృదువైన పరక లంది
పచ్చలను దాపినట్టుగా బయళులందు
దట్టముగ వ్యాప్తినిం గాంచి తళతళ మను
తుహినబిందుసందోహమున మహితమైన

ముక్తయుపుజాలునుం బొంది పొలుపు మీఱఁ
గనెడువారికి నెంతయో కనులపండు
వౌనఁగ ధర కలంకారమై యొప్ప దీవు
సర్వనాథుండు బహిరంగసభను జేసి
రాజకార్యవిచారంబు రాణ సలుప
బయలఁ బఱచిన రత్నకంబళము లనఁగ
నీవు వ్యాపించియున్నట్టితావు లెల్ల
నొప్పి కవిశిఖామణులెల్ల రూహ లొలయ
నుతులఁ గావింపఁ దగి యుందు చతురగతులఁ
చిత్రకారుండు తలఁచుఁ బచ్చిక తనర్చు
పట్లఁ జిత్రించి తననేర్పు వ్యక్తపఱుపఁ
గవులు చిత్రకారులు నిట్లు కాంక్షమీఱ
నిన్ను వర్ణింప నెంచుట నెన్నఁదగదె
రత్నములపరీక్షను నీకుఁ బ్రజ్ఞ కలదు
నిన్ను నాధారముగఁ గొని నీలములను
రత్నవణిజులు శోధింత్రు క్రమముగాను
ఇట్టినీచాతురిఁ బొగడ నెవరితరము
నీదుచరిత మద్భుతమును నిర్మలంబు
ముట్టఁ జాలిరె నిను వహ్నిముఖులఁ దొల్లి
హనుమ నినుఁ గదలింపఁజాలెనె యొకింత
ఇట్టినీశక్తి సామాన్య మెట్టులౌను
కాకదనుజుని వెన్నంటి లోకసమితిఁ
దఱుమఁగాఁజాలి యుంటివి తహతహ పడి
కేశవుం డైనరాముని కేలనుండి
బయలు దేరినమహిమంబువలనఁ గాదె
అనఘ! హరికరస్పర్శనం బబ్బియుండఁ
దేలి కొల్లాడవో నీవు తెలియరాదు
ఘనతి నీలోన నెంతయో గాంచి గాదె
పూతసీతామహాదేవి పూర్వమందు
నిన్ను నునిచెను దనకును నీచుఁడైన
రావణునకును నడుమ స్వరక్షగాఁగ
అల్ప మేరీతి నౌదు వీ వరసిచూడ
జానకీరాము లీరీతిగాను నిన్ను
ఘనతపఱుపంగ నీకెట్లు కలుగుఁ గొఱంత
పూరుషోత్తమముఖ్యులపూజ నందు
విఘ్నపతి కెంతొ నీమీఁద ప్రీతి కొలుచు
సిద్ధి చాలదె తెల్ప నీపెద్దతనము
మిడుత నినుఁజూచుకొని గాదె మిడిసిపడును
ఎన్నొగుణమణిగణముల నెసఁగుచున్నఁ
బేరుపెంపులు నీ కింక వెలయలేదు
నిజము తృణ మని తేలిక నిన్నుఁ జేసి
పల్కుచుందురు ప్రజ ముగ్ధభావణముల
ఇందు కొక్కటి హేతువం చెన్నఁదగును
నగ్గ లగువారికే సదా యశము వచ్చు
ననుచు నెన్నంగఁ దరమౌనె యరసిచూడ
స్థిరను "పుణ్యై ర్యశో లభ్యతే" యనియెడు
ప్రాజ్ఞవాక్యంబు లెపుడైన వ్యర్థమగునె
సర్వసులభంబు గాకుండుస్థలములందుఁ
బరులయుపచారములఁ జాలఁ బడసి పడసి
పైకి నెగఁబ్రాఁకి మిన్నందుభంగిగాను
దంభవేషంబు లెన్నియో తాల్చి మిగుల
ఘనతెరు లనుచుఁ బిలిపించుకొనెడుపట్ల
సత్యమైనను గాకున్న సాగుఁ గీర్తి
సర్వదశలందు నీవు సుసాధ్య మగుచు
దోహదంబుల నేని నందుటను గనక
యెల్లయెడలను నీయంత నీవె పెరిఁగి
బాలకాళికి నైనను బట్టువడుచు
పరులు గారాబమునఁ బెంచుసరణి గనక
నేయందునఁ బ్రాఁకుచు నిచ్చ లుండఁ
దేలికగఁ జూడరే నిన్నుఁ దృణకణంబ!

క. దొడ్డతనం బెంతో కఱ
పడ్డకతన నీయెడలను బహుమతి నిడుదుఱ
గడ్డిపరక, నూటపదా
గ్లడ్డక కొమ్మా సువర్ణహారవువరుసల్!



పూనానగరముదగ్గరనున్న కార్లీగుహలలోని శిల్పచిత్రము

'టైమ్సు ఆఫ్ ఇండియా' వారపత్రిక.



లండనునగరమున వెస్ట్మిన్‌స్టరువద్ద థేమ్సునదిపయి సూర్యాస్తమయము

**31-12-1930 నాడు పగలు ఘం. 2-20 కు తీసిన ఛాయాచిత్రము. E. N. P.**

విద్వాన్ జి. జె. సోమయాజిగారు, M.A., L.T

౨

కాళిదాసుఁడు రచియించిన గ్రంథములన్నిటిని బరీక్షించి యందలి విశేషముల నిఁక ముందు రాఁబోవు వ్యాసములలో వ్యక్తపఱపవలయునని యూహించి వానిలో మొదటిదగు ఋతుసంహారమును గుఱించి వ్రాయఁబూనియున్నాను. ఒకకవి రచియించిన గ్రంథములను బరీక్షించునప్పు డాగ్రంథముల నొకవరుసగా గ్రహియించి విమర్శనమునకు దొరఁకొనవలయును. విమర్శనీయములగు గ్రంథములలో నేది ప్రాచీనమో యేది యర్వాచీనమో కనుఁగొని యావరుసనే మన మవలంబించిన యెడల యుక్తముగానుండును. ఇట్టి వరుసను మన మనుసరించిన యెడల నాకవియొక్క కవితాశిల్పమునందుఁ గాలక్రమమునఁ గలిగిన పరిణామమును, నాయన భాషాజ్ఞానమునందుఁ గాలగతిని గలిగిన వైశాల్యమును, బూర్వకావ్యములలోని భావములెట్లుత్తర కావ్యములలోఁ బెంపొందింపఁబడి వన్నెపెట్టఁబడినవియును జక్కఁగా గుర్తెఱుఁగుట కవకాశములుండును. షేక్స్పియరు మొదలగు పాశ్చాత్యమహాకవుల కృతులను బరీక్షించునప్పు డిట్టి క్రమమునే విమర్శకులు పాటించియుండిరి. ఇఁకఁ గాళిదాసుని విషయమున నిట్టి క్రమమును బాటించుట కొంచెము కష్టమయినది. కాళిదాసుఁడేకాలమున జీవించియుండెనో నిశ్చయించుటకు వీలులేని మన కాతని గ్రంథముల పౌర్వాపర్యముల నిర్ణయించుటకు సామగ్రి వలసినంత లేదని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. అయినను విమర్శకులు కాళిదాసగ్రంథములఁ బరీక్షించి, యందలి భావమును, గథాసంవిధానమును, బాత్రపోషణమును, విమర్శించి యందేది తొలుత రచియింపఁబడినదో యేది తరువాత వ్రాయఁబడినదో నిర్ణయించుటకుఁ బ్రయత్నించిరి. అట్టి విమర్శనమునందు ఋతుసంహారము కాళిదాసుని బాల్యావస్థ వ్రాయఁబడిన గ్రంథముగా నున్నదని యూహింపఁబడినది. కావునఁ బ్రప్రథమమున నద్దానినే పరీక్షించెదను.

ఋతుసంహార మనఁగా ఋతువులకూడిక యని యర్థము. ఇట్టికూడిక నుద్దేశించి వ్రాయఁబడుటచే నభేదోపచారముచేఁ గావ్యమునకును నాపేరు వచ్చినది. సంహారః—Grouping together (Apte); సంక్షేపః. (శబ్దకల్పద్రుమం)

ఇందు షడృతువులును మనోహరముగా నాఱు సర్గములలో వర్ణింపఁబడినవి. వానిలో మొదటిదానియం దిరువదియెనిమిది శ్లోకములలో గ్రీష్మకాలము వర్ణింపఁబడినది. అందు మొదటి పది లేక పండ్రెండు శ్లోకములయందును నీనిదాఘకాలమునఁ గామిజనులెట్లు జీవితమును వెళ్లఁబుత్తురో, యే యే పదార్థములు వారికిఁ బ్రీతిదాయకములో తెలుపఁబడినవి. ఈగ్రీష్మకాలమునందలి యరణ్యములలోని దావాగ్నులును, గాననములందలి సత్త్వములు తృషాకులములై జాతివైరములనుగూడ మఱచి చేయుచుండు చర్యలును, సుడిగాలిచే భూమిపయినుండి పయికి లేచు ధూళీచక్రములును వర్ణింపఁబడినవి.

వర్షకాలమనెడు నృపుండు, అంభోధరమత్తకుంజరుండును, దటిత్పతాకుండును, నశనిశబ్దమర్దలుండును నయి వచ్చినట్లు రెండవ సర్గమునందు వర్ణింపఁబడినది. ఇందు మేఘమండలావృతంబగు నాకాశమును, దటిదింద్రచాపాదుల దర్శనంబును, వినూత్నకందళులును, బ్రవృద్ధజలవేగవిరాజమానంబులగు నదులును బర్హిసంఘముల నృత్యములును, స్త్రీలు ధరించు పుష్పాలంకారములును, విరహిజనుల యవస్థలును జక్కఁగా వర్ణింపఁబడినవి. ఇందున్న శ్లోకము లిరువదియెనిమిది.

కాశాంశుకయు, వికచపద్మమనోజ్ఞవక్త్రయు, సున్మాదహంసరవనూపురనాదరమ్యయుఁ, బక్వశాలి లలితానత గాత్రయష్టియునగు శరత్కాలము నవవధువు రూపరమ్యయయి వచ్చుచున్నదని మూఁడవసర్గమునందు

వర్ణింపఁబడినది. శరత్కాలపుటాకాశము, మేఘములు, తత్కాలమునందలి పుష్పములు, కాదంబకారండవాది పక్షిసమూహములంబులయిన నదులు, తత్కాలవాయువులు, స్త్రీలయొక్క పుష్పాలంకారములు, మొదలగునవి యన్నియును చక్కఁగా నిరువదియారు శ్లోకములలో నిందు వర్ణింపఁబడినవి.

నాల్గవసర్గమునందు గ్రీష్మప్రాప్తమగు హేమంతఋతువు పదునెన్మిది శ్లోకములలో మనోహరముగాఁ జిత్రింపఁబడినది. నవప్రవాళములు, పడుచుండెడు మంచు, స్త్రీలాకాలమునందు ధరించుచుండెడు స్వచ్ఛహారములు, స్వర్ణభూషణములనుధరియింపకుండుట, ఆ స్త్రీల ఘూర్ణితరతివిహ్వలయుక్తములగు నంగములతోఁ గూడిన స్త్రీలు, మొదలగునవి యాసర్గమునందు వర్ణితములు.

శిశిరకాలమునందలి శాల్యంశుభములును, తాంబూలవిలేపనస్రజములను గ్రహించి వాసగృహంబులఁ బ్రవేశించెడు స్త్రీలు, కామిజనులు ప్రియాయుక్తులయి కామరతి ప్రబోధకంబగు మద్యమును పానముచేయుట మొదలగునవి యన్నియును బదునారు శ్లోకములలో నైదవసర్గమునరసపుష్టి యగునట్లు వర్ణింపఁబడినవి.

ఆఱవసర్గమునందు, ఫుల్లచూతాంకురతీక్ష్ణసాయకుండును, ద్విరేఫమాలావిలసద్ధనుర్గుణుండును నగు వసంతయోద్ధ విరహిజనుల మానసములను భేదించుటకు నరుగుదెంచుకాల మిరువదియెన్మిది శ్లోకములలో శ్రోత్రపేయముగా వర్ణింపఁబడినది. వసంతకాలము నందలి ప్రకృతిరామణీయక మంతయు నీసర్గమునందు మూర్తీభవించినట్లు చిత్రింపఁబడినది.

సహృదయహృదయాహ్లాదకారి యగు నీకావ్యమును రచియించిన యాతఁడు మేఘసందేశాది కావ్యము'ను రచియించిన కాళిదాసుఁడు గాఁడనియు వేఱొక్కఁడనియు నాతనిపేరుగూడఁ గాళిదాసుఁడయి యుండిన నుండియుండవచ్చుననియును డాక్టరు నోబెలు మొదలగు విమర్శకు లభిప్రాయపడుచున్నారు. మఱి కొందఱు పండితులు, డాక్టరు కీతు, మేక్డొనలు దొరగార్లును నా కాళిదాసునిచేతనే యీకావ్యమును రచియింపఁబడినదనియును నాతని ప్రథమగ్రంథ మిదియై యుండవచ్చునని యును నూహించుచున్నారు. ఈ రెండు పక్షములవారికిని ఋతుసంహారమునందలి భావ, శైలి మొదలగునవియే ముఖ్యాధారములుగాని బహిర్గతములగు నుదాహరణము లేవియును నెక్కడుగానున్నట్లులేదు. ఇకనీ రెండు పక్షములవారి వాదములను ననువదించి యాపయిని గ్రంథకర్తృత్వమును నిర్ణయించుటకుఁ బ్రయత్నించుచున్నాను.

ఋతుసంహారకావ్యమును గాళిదాసుఁడు రచియింపలేదని చెప్పువారి వాదము:

౧. నేపాళదేశము నుండి చీనాదేశమునకుఁ దీసికొనిపోఁబడిన యొకానొక వ్రాఁతపుస్తకమునందు, 'కుమారసంభవము, మేఘసందేశము, రఘువంశము' అను మూఁడు కావ్యములయొక్క మొదటి శ్లోకములను మాత్రము వ్రాసి తుదిని "ప్రియకావ్యం, ఏతత్ త్రయకావ్యమ్" అని కష్టముతో ననిశ్చితముగా గుర్తింపఁబడిన వాక్యముఁగూడ వ్రాసియున్నారు. పయి వ్రాఁతప్రతియొక్క కాలము (క్రీ. శ.) 1200సం. అని డాక్టరు నోబెలుగారభిప్రాయపడుచున్నారు గాని మఱి కొందఱాయభిప్రాయము నామోదింపలేదు. మొత్తము మీఁద నావ్రాఁతప్రతి పదుమూఁడవశతాబ్దమునకుఁ జేరినదేమో యని బలమైన సంశయము కలుగుచున్నది గావున నా కాలమునఁ గాళిదాసుని ఋతుసంహారముఁగూడ నుండిన యెడల నందు దాని నుదాహరించి యుండవలయును. కావున నాకాలమునందు ఋతుసంహారము గ్రంథరూపముగాఁ గాళిదాసకృతమను పేరితో వ్యవహరింపఁబడుచుండెనట్లూహించుటకు బలమగు నవకాశము లభియించుచున్నది.

౨. మల్లినాథుఁడు మాఘకృతమగు శిశుపాలవధ మనంబడెడు మహాకావ్యములోని ౧౩వ సర్గమందలి యిరువదినాల్గవ శ్లోకములోనున్న "అవనీయసంభ్రమవికాసిభర్తృభిః"యను సమాసము నర్థమును వివరించుటలో 'వికాసిభర్తృభిః' యను దానిలోనున్న వికాసిశబ్దమునకు పుంవద్భావము "స్త్రియాః పుంవద్భాషితపుంస్కాదనూఙ్ సమానాధికరణే స్త్రియామపూరణీ ప్రియాదిషు" అను సూత్రములోని ప్రియాదిగణగతమగు భర్తృశబ్దము పర

మందుండునప్పుడు రాదుగదా యని పూర్వపక్షము చేసికొని దానినిఁ బ్రత్యాఖ్యానముఁ జేయునప్పుడు, రఘువంశము లోని ౧౩ వ సర్గమందలి ౧౯ వ శ్లోకములో నున్న దృఢభక్తిః అనురూపమును సాధించునప్పుడును, మేఘ సందేశమునందు ౧ వ సర్గము ౩౬ వ శ్లోకములో నున్న 'దృష్టభక్తిః' యనురూపము నిష్పత్తిని వివరించునప్పుడును నీవిషయము నాచేఁ జక్కఁగాఁ జర్చింపఁబడినదనియును దెల్ప నభిప్రాయముతో నీ క్రింది విధమునఁ జెప్పి యున్నాఁడు:—

"అత్ర దేశస్సర్వ మస్మాభిః కాళిదాసత్రయసంజీవి న్యాం 'దృఢభక్తిరితి జ్యేష్ఠ' ఇత్యాదిషు వివేచితమ్"

ఇంతియగాక రఘువంశవ్యాఖ్యానమునందు,

"మల్లినాథకవిస్సోయం మందాత్మానుజిఘృక్షయా,
వ్యాచష్టే కాళిదాసీయం కావ్యత్రయ మనాకులమ్."

అని వ్రాయఁబడిన శ్లోకమునందునుఁ గాళిదాసత్రయమను పదము నుపయోగించియున్నాఁడు గావునను, నాతఁడు మూఁడు కావ్యములకే (కాళిదాసునివి) వ్యాఖ్యానమును వ్రాసియున్నాఁడు గావునను నాతని కాలమగు పదు నాల్గవ శతాబ్దమున ఋతుసంహారము కాళిదాసుని గ్రంథముగాఁ బ్రచారములో నున్నట్లు లేదు. ఇక్కడి 'కాళిదాసత్రయమ్' అను శబ్దమునకు 'లోకత్రయమ్', 'వేదత్రయమ్' అను వానివలెనే మూఁడు మాత్రమే యని యర్థముఁ జెప్పవలయునని డాక్టరు నోబెలుగారు విర చించియున్నారు.

3. ఋతుసంహారము రసవంతములయి ప్రౌఢము లగు కాళిదాసుని యితర కావ్యములతో సరిపోల్పఁదగినది కాదు గావునను, నందలి కవిత్వపద్ధతులకును దక్కిన కాళి దాస కావ్యములలోని కవిత్వపుఁ బద్ధతులకును జాలభేద మగపడుగావునను నిది యొరునచే రచియింపఁబడినది కాఁ జాలదనియు మఱికొందఱూహించుచున్నారు.

౪. ఈ గ్రంథమునం దొక్కశబ్దమే తిరిగి తిరిగి యుపయోగింపఁబడుచుఁ దత్కర్తయొక్క శబ్దదారిద్ర్య మును సూచించుచున్నది గావున నియ్యది కాళిదాస కృతముగాదని చెప్పనగునని కొందఱనుచున్నారు.

౫. కావ్యమునకు శోభాకరములగు నలంకారము లను గాళిదాసుఁడు మేఘసందేశాది కావ్యములలో ననేకములుగా నుపయోగించుటచేతను, తత్పద్ధతి ఋతు సంహారమునకు దూరమగుటచేతను నీకావ్యము కాళిదాసు నిది కాఁజాలదని యింకఁగొందఱూహించుచున్నారు.

౬. మేఘసందేశాదికావ్యములఁ బట్టి చూడఁగాఁ గాళిదాసునకు నర్థాంతరన్యాసము నుపయోగించుట మిక్కిలి ప్రీతిహేతువని తెలియవచ్చుచుండఁగా నట్టి యభిరుచియేమియును నీకావ్యమునందుఁ గన్పడుట లేదు గావునను నియ్యది కాళిదాసుని కావ్యము గాదనుట యుక్త ముగానున్నట్లు తోఁచుచున్నది.

౭. లక్షణ గ్రంథములలోఁ గాళిదాసుని మూఁడు గ్రంథములనుండియే శ్లోకము లుదాహరింపఁబడినవి గాని ఋతుసంహారమునుండి యొక్క శ్లోకమయిన నుదాహ రింపఁబడకుండుట గూడఁ బయియభిప్రాయమునే దృఢ పఱచుచున్నది.

౮. కాళిదాసుని గ్రంథములకు వ్యాఖ్యానములు వ్రాసినవారిలో నెల్లఁ బ్రాచీనుఁడును, పదియవ శతాబ్ద మున నుండిన ట్లూహింపఁబడినవాఁడును నగు వల్లభ దేవుఁడును మూఁడు కావ్యములకే వ్యాఖ్యానములు వ్రాసి యున్నాఁడు గాని యీ కావ్యమునకు వ్యాఖ్యానమును వ్రాయుటగాని దానిని దన వ్యాఖ్యానములో నుదాహ రించుటగాని, యొనరించియుండలేదు గావునఁ బయి యభిప్రాయమే సరియైనదగు నవచ్చును.

౯. ఇఁక సుభాషితములను గ్రంథములనుండి సేక రించి పుస్తకములుగాఁ గూరిచియున్న వారుగూడఁ గాళిదాసుని ఋతుసంహారమునుండి శ్లోకములను గ్రహి యించినట్లు లేదు. వల్లభదేవుఁడు కూర్చిన 'సుభాషి తావళి' యను పద్యరాశియందుమాత్రము, ౧౬౭౪, ౧౬౭౮ సంఖ్యలు గల పద్యములుగా ఋతుసంహారము నందలి యాఱవ సర్గములోని ౧౬, ౧౯ సంఖ్యలుగల శ్లోకములను వసంతర్తువర్ణనమను శీర్షిక క్రింద నుదాహ రించియున్నాఁడు. ఈ వల్లభదేవుఁడును గాళిదాస గ్రంథ వ్యాఖ్యాతయగు వల్లభదేవుఁడును వేఱువేఱు మను

ష్యులనియు, వారు ౧౫-వ, శతాబ్దము నందును, ౧౦-వ శతాబ్దమునందును నివసించి యున్న ట్లూహింపవగునని యును 'పీటరు పన్' గారు వ్రాయుచున్నారు.

౧౦. ఈ కావ్యమునందు హృదయంగమములైన ప్రకృతి వర్ణనము లున్నవనియును, నిట్టి వర్ణనమును గాళిదాసుఁడే చేసియున్న ట్లూహింపదగు ననియును నభిప్రాయపడు పండితుల వాక్యమును బ్రత్యాఖ్యానము చేయునప్పుడు డాక్టరు నోబెలుగారిట్లు చెప్పుచున్నారు:

"The greater half of that Kavya is stuffed with erotic verses of the cheapest type. And on the other hand any one who knows Kalidasa's genuine works will concede that there are really fine pictures of landscape not in the Ritusamhara but rather in the Meghasandesa in the verses in which the poet describes the way the cloud is to travel, or in the first sarga of Kumarasambhava, the greater part of which is devoted to the description of the Himalaya Mountains."

పయిని దెలుపఁబడిన యుక్తులెంత మట్టుకు సత్యములో మన మిప్పుడు పరీక్షించి రెండవ వాదము వారు తెలుపు యుక్తులను వివరింపవలసి యున్నది.

౧. మొదటియుక్తియందుఁ జెప్పఁబడిన చీనాదేశమునకుఁ గొనిపోఁబడిన వ్రాఁతప్రతియందలి వాక్యమును బట్టి మన మేమియును నిర్ణయించుటకు వీలులేదు. ఆపంక్తియొక్క యర్థమును సరిగా నిర్ణయింప నవకాశము లేదు. ఆకాలమునందున్న కాళిదాస కావ్యములన్నిటిని గూడ నుదాహరింపవలయు నను నిచ్చ యాపుస్తకమును వ్రాసిన వానికుండెనో లేదో నిర్ణయించుటకు మనకే యవకాశమును లేదు. ఒకప్పు డాపుస్తకమును వ్రాసిన యాతనికిఁ గాళిదాసుని గ్రంథములన్నిటి నుదాహరింపవలయునను నూహ యుండి యుండినను నాతఁడు దిరిగిన హిందూదేశభాగములో నీఋతుసంహారకావ్యమునకుఁ బ్రచారముండి యుండక పోవుటచే నాతఁడు దాని నుదాహరించుట మానియుండ వచ్చును. కాబట్టి యొక్క వ్రాఁతప్రతియందు ఋతుసంహారమును దెలుపకపోయినంతమాత్రమునఁ గాళిదాస కృతమగు ఋతుసంహారమను గ్రంథ మాకాలమునందుండి యుండలేదనుట కేమియు నవకాశము లేదు.

౨. త్రయశబ్దమునకుఁ గాళిదాస కావ్యములు మూఁడే యని యర్థముఁ జెప్పుట మల్లినాథుని యభిప్రాయ మనుటగూడఁ బరిహాసహము గానేరదు. 'లోకత్రయమ్' అను శబ్దమునందు మూఁడులోకములు చెప్పఁబడియుండుటచే నితరలోకములు లేవనిగాని, వేదత్రయమని చెప్పఁబడుటచే నితరవేదములు లేవనిగాని యూహించుట కేవలమయుక్తికము. 'బ్రాహ్మణ త్రయమ్' అని చెప్పిన యెడల లోకములో ముగ్గురు బ్రాహ్మణులే యున్నారని యూహించుట యెంతయుక్తమో పయివాదమును నంతయుక్తమనియే తెలుపనగును. త్రయమ్ అను పదము వాడుటచేతనే యితరకావ్యమునుండిన ట్లూహింపఁదగునని యును బ్రతిపక్షులు తెలుపుచున్నారు. ఇది యటుండఁగాఁ గాళిదాసుఁడు వ్రాసెనని యెల్లరును నొప్పుకొనిన యితరములగు రూపకములు గూడ నుండఁగా మల్లినాథుఁడు మూఁడేయని యెంచి త్రయశబ్దమును వాడెననుట బాగు లేదు. ఒకప్పుడు మిగిలిన గ్రంథములు రూపకములగుటచే నుపేక్షింపఁ బడినవని సమాధానము చెప్ప వచ్చినను బయిగ్రంథములయందు నియతముగా స్ఫురించు ధర్మములగు కాళిదాస కర్తృత్వమును, కావ్యత్వమును దృశ్యశ్రవ్యకావ్యసామాన్యము గావున నాసమాధాన మయుక్తికమనియే తేలుచున్నది. అయిన యెడల మల్లినాథుఁ డుపయోగించిన త్రయశబ్దములవలన దాను వ్యాఖ్యానము వ్రాసిన మూఁడు కావ్యములు మాత్రమనిగాని, లేక లోకములోఁ బ్రసిద్ధములుగా సంస్కృతభాషాభ్యాసకులచేఁ బఠింపఁబడుచున్న మూఁడు కావ్యములనిగాని, యాతఁడుద్దేశించినట్లు నిర్ణయింపనగునుగాని వేఱుగాదు.

రఘువంశ వ్యాఖ్యానము నందలి శ్లోకములోనున్న 'మందాత్మానుజిఘృక్షయా' యనునది భాషాభ్యాసము చేయువారి నుద్దేశించి చెప్పఁబడినదేయగు ననియే తోఁచుచున్నది. ఇంతియగాక "భారతీ కాళిదాసస్య కువ్యాఖ్యావిషమూర్ఛితా, ఏషా సంజీవినీ

టీకాం తామ ద్యోత్షిపయిష్యతి." అను శ్లోకమును మీఁద నుదాహరింపఁబడిన శ్లోకములతోఁ గలిపి చదివి మల్లినాథుఁడు కువ్యాఖ్యా విషమూర్ఛితమైన కాళిదాస భారతికి వ్యాఖ్య వ్రాసి పునర్జీవము గలుగునట్లు చేసెను గాని యట్లుగాని కాళిదాస కావ్యము లన్నిటికిని వ్యాఖ్యానములు వ్రాయుటకుఁ బూనుకొన లేదనియును గొంద ఱూహించుచున్నారు. కాఁబట్టి మల్లినాథుఁడు వ్యాఖ్యానము వ్రాయలేను గావున నియ్యది యాతని కాలమున నుండలేదను యుక్తి పైదానిచేతనే పరాస్తమగుచున్నది. ఆకాలమునందుఁ బ్రసిద్ధికెక్కి బాలకులచేతఁ బఠింపఁ బడుచుఁ గాళిదాస త్రయమను పేర వ్యవహరింపఁబడు చున్న కావ్యములకు మాత్రమే వ్యాఖ్యానముచేసి యప్ర టీకప్రసిద్ధమగు ఋతుసంహారమును విడిచెనని చెప్పుటయే యుక్తమన వచ్చును.

ఋతుసంహారము కష్టమయిన కావ్యము గాద నియు, నందుఁ దన పాండిత్యమును బ్రకటించుటకు మల్లినాథున కవకాశము లభింపదు గావున దాని నాతఁడు విడిచియుండవచ్చుననియును జెప్పు డాక్టరు కీతుగారి యూహ సమంజసముగాఁ గనుపట్టుట లేదు. వ్యాఖ్యానములు వ్రాయుట పాఠకానుగ్రహార్థమనియు, స్వపాండిత్యప్రకర్షకొఱకుఁ గాదనియు మల్లినాథుని యవతారికా శ్లోకములచే నిశ్చయింపనగును.

"ఇహాన్వయముఖేనైవ సర్వం వ్యాఖ్యాయతే మయా, నామూలం లిఖ్యతే కించిన్నానపేక్షిత ముచ్యతే" యని చెప్పుటయు దానిని సాగించుకొనుట యుఁ దన పాండిత్యమును జూపించుటయే ముఖ్యోద్దేశముగాఁ గల వ్యాఖ్యాతకుఁ బొసఁగదు.

౩. ఋతుసంహారమునందలి కవిత్వమునకును గాళిదాసుని యితరకావ్యముల కవిత్వమునకును భేద మున్నదని చెప్పుటచే నాతని కర్తృత్వము నిషిద్ధము కాఁజాలదు. ఈరెండు కవిత్వములకును భేదమున్నను నాభేదము సంపూర్ణవైలక్షణ్యమును భిన్నకర్తృత్వమును నిరూపించుటకుఁ దగినంతటిది గాదని పరీక్ష చేసినయెడల నిశ్చయము కాఁగలదు. ఇంతియగాక ప్రపంచమునం దన్నిదేశములలోను నన్ని భాషలయందును గూడ లభియించు నేకకవి కర్తృక గ్రంథములను బరీక్షించుచో నిట్టి భేదము కన్పించు ననుట నిర్వివాదము. షేక్స్పియరు పిన్నవయసులో వ్రాసిన నాటకములకును బ్రౌఢిమఁ దాల్చిన తరువాత వ్రాసిన నాటకములకును గవితయందు భేదము లేదనిగాని, యున్నంత మాత్రమున నవి యేక కవి కృతములు గావనిగాని యేవిమర్శకుఁడు చెప్పుటకు సాహసింపఁగలఁడు?

ఈ యభిప్రాయమునే డాక్టరు కీతుగారు క్రింది వాక్యములలో వెలిపుచ్చుచున్నారు:

"- - That great many poets have shown marked changes of power and form in the course of their careers and that the gulf between their early and their late, their best and their worst work, is often infinitely greater than that between the Ritusamhara and the other three Kavyas ascribed to Kalidasa. The differences between Meghaduta and Ritusamhara are legitimately interesting as traces of poetic development, but they have no value as evidence for difference of authorship".

కాళిదాసుని కవితాశక్తి ఋతుసంహారము వ్రాయునప్పుడు బాల్యావస్థలో నున్నదనియు నంతకంత కది ప్రౌఢమయ్యెననియును ముమ్మందు నిర్ణయింపఁ బడును.

౪. ఈగ్రంథమునం దొకొక్కశబ్దము తిరిగి తిరిగి యుపయోగింపఁబడుచున్నది గావున నిది కాళిదాసునిది గాదను యుక్తియును సరిలేదు. ఉపయోగించిన శబ్దమునే తిరిగి కొన్ని స్థలములయందు రసస్ఫురణమునకో ప్రసాదగుణమునకో కవి యుపయోగింపవలసియేయుండు నని సర్వకవిసామాన్యముగాఁ జెప్పక తప్పదు. ఇది యిట్లుండఁ గాళిదాసునకుఁ బయిపద్యములో నుపయోగించిన పదమునే తరువాతి పద్యమునందును నుపయోగించుట యభ్యాసమేమో యను సంశయము మేఘసందేశమునందున్న శ్లోకములను బరీక్షించినఁ దప్పక కలుగుచున్నది. మేఘసందేశము:—(శ్లోకసంఖ్య:వావిళ్లవారిప్రతి)

| సర్గము | శ్లోకము | పదము |
|---|---|---|
| ౨ | ౪౩ | దృష్టిపాతమ్ |
| ,, | ౪౪ | దృష్టి రాలుప్యతే మే |
| ,, | ౪౩ | ఉత్ప్రేక్ష్యామి |
| ,, | ౪౫ | పశ్యంతీనామ్ |
| ,, | ౩౬ | స్తనితవిముఖాః |
| ,, | ౩౮ | స్తనితవచనైః |
| ,, | ౩౬ | సహస్వ |
| ,, | ౪౪ | సహతే |
| ,, | ౩౬ | గాఢోపగూఢమ్ |
| ,, | ౪౧ | గాఢతప్తేన |
| ,, | ౪౯ | గాఢోష్మాభిః |
| ,, | ౪౧ | ప్రతను తనునా |
| ,, | ౪౩ | ప్రతనుషు |
| ,, | ౩౧ | విరహదివసే |
| ,, | ౩౩ | ప్రథమవిరహే |
| ,, | ౪౧ | ఉత్కంఠముత్కంఠితేన |
| ,, | ౪౨ | ఉత్కంఠావిరచితపదమ్. |

ఈ పయి నుదాహరింపఁబడిన వానినిబట్టి యొకసారి యుపయోగింపఁబడిన పదము నింకొకసారివాడుట కాళిదాసుని కభిమతమని యనుట నదియును నా సందర్భముల యందుఁ బునరుక్తము గాక రసపోషకముగనే యున్నదనియును దేలుచున్నదిగదా!

ఉపయోగించిన పదములు, జెప్పిన భావమును దిరిగి ఋతుసంహారములో నెక్కడెక్కడనుపయోగింపఁబడిన యవి, ముందు విరిపఁబడును. ఇట్టి వానిలోఁ గొన్ని తప్పక వాడి తీరవలసిన పనియును, గొన్ని యాతని కట్లు వాడుట యభిరుచిని గలిగించునవి గావున వచ్చిన పనియును, మఱికొన్ని ఋతుసంహారము వ్రాయునప్పు డాతని కవిత బాల్యదశలో నుండుటచే వచ్చినవి యనియును నూహింప నగును.

౫. తక్కిన కావ్యములవలెఁ గాళిదాసుఁ డిందలంకారములను విశేషముగా వాడియుండ లేదనుట గూడ బలమయిన యుక్తి గాదు. అను ప్రాసము, యమకము, అను శబ్దాలంకారములు తక్కిన గ్రంథములలో నున్నట్లే ఋతుసంహారమునందును గాళిదాసునిచే వాడఁబడి యున్నవి. మేఘదూతమునందు దీపకాలంకారము వాడఁబడినట్లే లేదు. ఆయలంకారము రఘువంశ, కుమారసంభవములయందును ఋతుసంహారమునందును గూడ ననేకస్థలములయందు వాడఁబడినది. ఇట్టి వాదములనుబట్టి మేఘసందేశ కర్తృత్వమును శంకింప వీలగునా? అలంకారముల నుపయోగించుటలో భేదమున్న దనినంతమాత్రమున గ్రంథ కర్తృత్వమును వేఱొకరి కారోపించుట సరికాదు.

౬. కాళిదాసునకు నర్థాంతర న్యాసాలంకార ముపయోగించుట ప్రీతిదాయకమనియే చెప్పనగునుగాని యాప్రీతి తొలియవస్థలో నుండక యంతంతకుఁ బెరిగి కొన్ని కొన్ని కావ్యములయందు విశేషముగాఁ గనుపడుచున్న దేమో యనియూ మన మూహించుట కవకాశము కన్పించు చున్నది.

అర్థాంతర న్యాసాలంకారము నుపయోగించుటను గుఱించి కీతుగారిట్లు వ్రాయుచున్నారు:

"The arthantharanyasa is a figure admirably adapted for the latter poem (Meghadutam) with its constant contrast between the lot of the Yaksha and his former happiness, and the misery of the Yaksha and the happy state of the cloud while it is far less appropriate in the Ritu-samhara which lacks any such motive nor is there any ground for holding that if genuine the two Kavyas must be closely connected in time".

అర్థాంతర న్యాసము నుపయోగించుట కవకాశములు మేఘసందేశమునం దెక్కువ యనియును, ఋతుసంహారము నందంతగా లేవనియును జెప్పుపయి యూహ సరిగా నున్నట్లు తోఁపదు. మేఘసందేశమునందు వర్ణింపఁబడినట్టి విరహము వంటిదే ఋతుసంహారమునందును వర్ణింపఁబడినది. చూడుఁడు. ౧ వ సర్గము, శ్లో. ౧౧; ౨ వ సర్గము, శ్లో. ౧౨, ౧౯, ౨౩; ౫ వ సర్గము, శ్లో. ౯, ౧౫. ఋతువర్ణనము చేయుటలో శిశుపాల వధమం

జేయుచుండనిదే జీవింపఁజాలఁడు. కాఁబట్టి వానికి సేవాధర్మము నెఱవేర్చుటయుఁ గడుసులభముగ నేయుండును. అతఁ డాడంబరమున కెద్దియు నాదరింపఁడు. (౩-౪ వ అధ్యాయములను, ౫, ౬వ అధ్యాయములకు గలిపిచూడుము)

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ.

వ్యాఖ్యానము:—యోగీశ్వరుఁడగు కృష్ణుఁడనఁగా నను భవసిద్ధమగు విశుద్ధజ్ఞానము. ధనుర్ధరుండగు నర్జునుఁడనఁగా నా విశుద్ధజ్ఞానము ననుసరించుక్రియ లేక కర్మ. ఈ రెంటను సమావేశ మగుచో సంజయుఁడు చెప్పిన చందమున సకలసంపదలు, సద్గుణములు నెలయు ననుటలో నాశ్చర్య మేమి కలదు?

గీతాశాస్త్రమునందు ప్రతిపాదితమైన "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" యనెడి పూర్ణయోగాదర్శమును గాంధిమహాత్ముని వ్యాఖ్యానము విస్పష్టము చేయుచున్నది. గీతా ప్రయోజనము దేశకాలపాత్రాతీతమైన పూర్ణయోగము గాని సంకుచితమైన సన్న్యాసయోగము గాదు. చరాచర ప్రపంచము కర్మబద్ధమై నరించుచున్నది. ఫలత్యాగరూపమైన, ఆత్మపరాయణమైన, భగవదర్పితమైన కర్మయోగమునందు సన్న్యాసయోగము, భక్తియోగము, జ్ఞానయోగము పరిపక్వము లగుచున్నవి. కర్మయోగారూఢుఁడు స్థితప్రజ్ఞుఁడై సర్వమును తనయందును, తనను సర్వమునందును జూచుచు బ్రహ్మనిర్వాణమును బడయుచున్నాఁడు. జీవయాత్రకు పరమార్గమును సాధకసాధనసాధ్యరూపములను సుబోధము చేయుచున్న భగవద్గీత సకలజనులకును నిత్యమును పారాయణయోగ్యముగ నున్నది.

శ్రీయుత బలరామకృష్ణయ్యగారు గాంధిమహాత్ముని గీతావ్యాఖ్యానమున కాంధ్రానువాదమును జేసి యాంధ్రుల ధన్యవాదములకు బాత్రు లగుచున్నారు. బలరామకృష్ణయ్యగారి భక్తిశ్రద్ధలు, కార్యదీక్ష, పాండిత్యము, శైలి ఆంధ్రలోకమునకు సుపరిచితములు. ఆంధ్రులు, బలరామకృష్ణయ్యగారి నిష్కామయోగమునకు స్వాగతంబు నొసంగి, గీతామృతమును గ్రోలి, స్వధర్మపరాయణులగుటకు భగవంతు డనుగ్రహించుగాత!

# గ్రంథస్వీకారము

## విప్రసంకల్ప సంగ్రహము

క్రౌను సైజున పుటలు ౧౫౦. వెల ౧-౪-౦.

గ్రంథకర్త:—ఆదిమాంధ్ర రాపాక రామస్వామి గారు, మునికోటాలి, రఘుదేవపురం పోస్టు (రాజమండ్రి తాలూకా).

---

## శుకవాక్యము (పద్యకావ్యము)

క్రౌను సైజు, ౫౯ పుటలు, వెల రు. ౦-౬-౦.

రచయిత:—పంద్యాగం వేంకటసుబ్బయ్యగారు, 'విద్వాన్', ఆంధ్రోపాధ్యాయుడు, హిందూ మధ్యమ పాఠశాల, ధూళిపూడి.

---

## సుగుణమణి (పద్యకావ్యము)

క్రౌను, ౪౫ పేజీలు, వెల రు. ౦-౮-౦.

కృతికర్త:—విశ్వనాథ నరసింహముగారు, బి. ఏ. విలాసము:—చెంగలరావు పేట, విశాఖపట్టము.

---

## మోహనమురళి

డిమ్మి ౧౬ పుటల సైజు, పుటలు ౧౭. వెల రు. ౧-౧-౦.

ప్రకాశకులు:—పి. డి. మల్లికార్జున్ గారు, శ్రీ ఆంధ్రహరనాథ తత్త్వప్రచారిణీసభ, శ్రీహరనాథ ఆశ్రమము, ద్వారకాతిరుమల (ప. గోదావరిజిల్లా)

---

## సనాతనధర్మము

క్రౌను సైజున పుటలు ౨౯౫, వెల రు ౧-౮-౦.

రాజమహేంద్రవరము హిందూసమాజము వారి ప్రచురణము.

---

## గీతాశతశ్లోకి (అరవము)

క్రౌను, పేజీలు ౧౪౮, వెల తెలియదు.

ప్రకాశకులు:—సరస్వతీసంఘము, ౨౦, పిడారియార్ కోవిల్ వీథి, మదరాసు.

---

(౧) శివపురాణము (ఏడు సంపుటములు)

డిమ్మీసైజు, వెల సంపుట మొకటికి రు. ౧-౮-౦.

(౨) బ్రహ్మపురాణము (రెండు సంపుటములు)

డిమ్మీసైజు, ౮౦౦ పేజీలు, వెల సంపుట మొకటికి రు. ౧-౮-౦.

(౩) వామనపురాణము-(మూడుసంపుటములు)

డిమ్మీసైజు, వెల సంపుట మొకటికి రు. ౧-౮-౦.

సంపాదకుడు:—వడకుదుటి వీరరాజు పంతులుగారు, పురాణగ్రంథమాలిక, పిఠాపురము.

---

ఆంధ్రమీమాంసార్థసారము

డిమ్మీసైజు, పుటలు ౭౫. వెల రు. ౧-౦-౦.

గ్రంథకర్త:—కూచిమంచి గోపాలకృష్ణమ్మగారు. ప్రకాశకులు:—కూచిమంచి రామమూర్తిగారు, కూచిమంచివారి అగ్రహారము, అమలాపురము.

---

(౧) సత్యనారాయణ స్తవము

ఏబది పద్యములచిన్నపుస్తకము, వెల రు ౦-౨-౦.

(౨) గంగాలహరి

డిమ్మీసైజు, పేజీలు ౧౨. వెల రు. ౦-౪-౦.

గ్రంథకర్త:—పండితా రాఘవుల నాగభూషణముగారు. ప్రకాశకులు: కవితాభిలాషిణీ సంఘము, ముమ్మిడివరము, తూర్పు గోదావరిజిల్లా.

---

దాస్యమోచనము

గ్రంథకర్త: శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు, పిఠాపురము. క్రౌను ౮౮ పుటలు. వెల ౮ అ.

---

రత్నపేటిక

'మొదటియర. తంజావూరు నాయకుడగు రఘునాథ నాయకుని బాలరామాయణమును, గోపరాజు జీమూతవాహన చరిత్రమును గలది.' శ్రీపాదలక్ష్మీపతి శాస్త్రిగారిచే పరిష్కరింపబడి ప్రకటింపబడినది. క్రౌను ౬౨ పుటలు. వెల ౮ అణాలు.

---

హిందీ తెలుగు స్వబోధిని

లేఖకులు: మోటూరి సత్యనారాయణగారు, పండిత ఆనంధనందన్‌గారు. అనువాదకులు: భ. వెంకట సుబ్బయ్యగారు. ప్రకాశకులు: దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ట్రిప్లికేను, మదరాసు. క్రౌను ౨౧౮ పుటలు. వెల ౧౨ అణాలు.

---

# పత్రికాస్వీకారము

## జ్యోతిష చంద్రిక

ఆంగ్లమాసపత్రిక. సంపు. ౧, సంచి. ౨. సంపాదకులు: పండిత, జ్యోతిషీ ఏ. వి. ఆర్. శర్మగారు.

విలాసము: మేనేజరు, 'జ్యోతిష చంద్రిక', ట్రిప్లికేన, మద్రాసు.

జ్యోతిషమువంటి శాస్త్రమునకు ప్రత్యేకము పత్రిక యుండుట ఆవశ్యకము. కాన ఈపత్రిక ఆదరణీయము. ఇందు జ్యోతిషవిషయములు సులభముగ చదువరుల మనసులకు పట్టించు ప్రయత్నము కన్పడును. శాస్త్రమునుగూర్చి మంచి వ్యాసములు ప్రకటించుచో ఈపత్రిక తన ప్రయోజనము నెఱవేర్చుకొనుటలో ముందడుగు వేయుచున్నదనుకోవచ్చును.

---

## గృహలక్ష్మి

(సంక్రాంతి సంచిక: జనవరి, ౧౯౩౧.) సంపు. ౩, సంచిక ౧౧.

---

# శ్రీ రుక్మిణీ సందేశము

సీరము సుభద్రయాంబ గారు

నా తలిదండ్రు లన్య నరనాయకులన్ నిరసించి నిన్ను జా
మాతగఁ జేసికొంటకును మానసమందుఁ దలంప, రుక్మి మ
ద్భ్రాత శఠించి నన్ను శిశుపాలున కీయఁగ నిశ్చయించినాఁ
డో తరుణీమనోజ! మనియుంటిని నీ మహిమంబె నమ్ముచున్.

వరమందార మరంద మెల్లపుడుఁ ద్రావంగోరు చున్నట్టి బం
భర మెన్నండయినం దదన్యకుసుమ ప్రాంతంబునం జేరునే?
పురుషశ్రేష్ఠ! త్వదీయ చింతనమునం బొల్పారు నా మానసం
బొరు నొక్కించుకయుం దలంచుటకు నెట్లొప్పున్? వివేకింపుమా.

వనరుహ పత్రనేత్ర, యదువంశ సుధాంబుధి పూర్ణచంద్ర, నీ
యనుపమ రూపమున్, గుణచయంబును, ధైర్య పరాక్రమంబులున్,
వినుత మహాద్భుతక్రియలు, వీనుల విందుగ విన్నదాది నా
మన మవశీకృతం బయి క్రమక్రమతన్ భవదైక్యమై చనెన్.

ధరణీదేవవచోనువర్ణితములున్, త్రైలోక్య సంస్తుత్యముల్,
పరమాశ్చర్యకరత్వదీయ చరితల్ భావంబునన్ నిల్పి నిన్
వరునింగా వరియించి, నా కరము చేపట్టంగ వాంఛించితిన్
సరసీజేక్షణ, నన్నలజ్జితనుగా సందేహముం బొందెదో?

కన్యాధర్మము విస్మరించి, పితలం గన్గప్పి, దైన్యంబుగా
మాన్యున్ మద్గురు వేఁడి పంపితిని; నా మర్యాద కాపాడి, న
న్ధన్యం జేయఁగ రమ్ము; రాక్షస విధిన్ నన్గొమ్ము; రాజన్యమూ
ర్ధన్యా, జన్యమునందు నన్యులకు సాధ్యంబౌనె నిన్నడ్డఁగన్?

హిమనగజాలయంబునకు నేఁ జని క్రమ్మఱి వచ్చు దారిలో
రమణ, గ్రహింపు మత్కరము, రాణ్ణివహం బరుదొంది కాంచ; నిన్
దమకముతోడ వేఁడు పదదాసిని, రుక్మిణి, నార్తరక్ష, యో
కమలదళాక్ష, వైరిమదగర్వవిభంజన, భక్తరంజనా!

---



# ప్రాయ విశేషములు

భారతరాజ్యాంగము మాంటాగు గారు ఒకప్పుడు చెప్పినట్లు ఎల్లపుడును అ యోమయముగ నుండుటయె సంభవమని ప్రాజ్ఞులకు సంశయము కలుగు చుండును. ప్రభుత్వ మవలంబించుచున్న నిర్బంధవిధానము నిరాశకు కారణ మగుచున్నది. నూతన సంవత్సరారంభమున ఇర్విను ప్రభువు భారతీయులకు రెండు ఆర్డినెన్సులను అనుగ్రహించిరి. సామ్రాజ్యశాసనసభ మూడు వారములలో గూడుచుండగా ఒకసారి కాలము తీరిన ఆర్డినెన్సును తిరిగి తీవ్రతరరూపమునను వినిర్మించుట రాజ్యాంగ పరిజ్ఞానమునకు నిదర్శనము గాజాలదు. ఇర్విను ప్రభువునకు తియ్యని మాటలును, కఠిన శాసనములును వరదానములుగను గనుపడుచున్నవి.

ప్రెస్ ఆర్డినెన్సు ముద్రణాలయములను, పత్రికలను నిర్బంధింపగల విధమును హైకోర్టులుసైతె మంగీకరించి వానినిస్సహాయస్థితిని విశదము చేసినవి. విద్యావిహీనులైన ప్రజలకువార్తా ప్రచురణమైనను సాధ్యము గాని స్థితిగతులను ప్రెస్ ఆర్డినెన్సు గల్పించుచున్నది. రెండవ ఆర్డినెన్సు మానవులకు సామాన్యమైన ధర్మోపదేశాధికారమును ప్రతిషేధించుచున్నది. తాము చెడుచు తమకుటుంబమునకు, సంఘమునకు హానిని గలుగజేయుచున్న త్రాగుబోతులను సాధురీతిని నివారించుట మానవులకు సామాన్యధర్మము. త్రాగుబోతుదనమును సాధువర్తనమునను నిరోధించుట దోషము కాదని హైకోర్టులు తీర్మానించినవి. పూజ్యమైన స్వదేశనీతును అన్ని జాతులవారును ఆచరించుచున్నారు. రెండవ ఆర్డినెన్సు లోకకల్యాణకరమైన మానవస్వాతంత్ర్యమును అరికట్టుచున్నది. హింసాదౌర్జన్యములను నిరోధించుటకు సర్మితమైన దండన నవరణశాసనము సర్వవ్యాపకమును గాంచి ప్రజల సకలవిధములైన ఆందోళనములను నిరోధించుచున్నది. శ్రీమతి కమలా నెహ్రూగారీ శాసనమునకు గురియై నిర్బంధింపబడిరి. దేశమునందు 70,000 మంది దేశభక్తులు నిర్బంధముల ననుభవించుచున్నపుడు రాజప్రతినిధి కలకత్తా యందు యూరపియను సంఘసమక్షమున గావించిన హితోపదేశము యూరపియనులకు హితమైనను భారతీయులకు మాత్రము హితవు కాజాలదు. రౌండుటేబిలు సమావేశమును గురించి ఇర్విను ప్రభువు చేసిన స్తోత్రపాఠము నిరాధారమని లండను వార్తలు తెలుపుచునే యున్నవి. ఇట్టి కష్ట స్థితియందైనను శాంతికాములైన భారతీయనాయకులు కలకత్తాయందు సంప్రాప్తమైన దౌర్జన్యహత్యలను నిరసించుట ధర్మమై యున్నది.

దలి యారవ సర్గములోని ౪౩, ౪౫ శ్లోకములలో మాఘునిచే నర్థాంతరన్యాస ముపయోగింపఁ బడినది: "నమహతా మహతాః క్వనవారయః"; "పరిభవో౽రిభవో హి సుదుస్సహః". ఇంతియకాక జలక్రీడా వర్ణనమునందు, (కీతుగారు పైనిఁ జెప్పినట్టిది కాని స్థలమునందు) మాఘ కావ్యములో నెనిమిదవ సర్గమునందు, ౭, ౧౦, ౧౯, ౧౮, ౨౧, ౨౨, ౨౮, ౪౫, ౫౪, ౫౫, ౫౭, ౫౯, ౬౧, ౬౯, సంఖ్యలుగల శ్లోకములలోను నీయర్థాంతర న్యాసాలంకారము వాడఁబడి యున్నది. ఇంతియగాక శిశుపాల వధమునందే ౯వ సర్గమునందలి ప్రదోష వర్ణనములో ౫, ౬, ౧౪, ౧౬, ౨౩, ౨౯, ౩౩, ౪౩, ౫౭, ౬౮ సంఖ్యలుగల శ్లోకములలోను నర్థాంతర న్యాస ముపయోగింపఁబడినది. కావున నర్థాంతరన్యాస ముపయోగించుటకు మేఘసందేశమువంటి కథయే కావల యుననునియమము లేదనియు, నయ్యాది కవియొక్క ప్రతిభాదికముల తోడను, నిచ్ఛతోడను గూడినదిగాని యన్యము గాదనియుఁ దేలుచున్నది. ఈ యభిప్రాయమును బలపఱచుటకుఁ గావలసి నన్నియుదాహరణములు కిరాతార్జునీయము రఘువంశము కుమారసంభవము మొదలగు కావ్యములలోఁ గలవు.

౭. లక్షణ గ్రంథములలో నుదాహరింపఁ బడిన శ్లోకములయందు ఋతుసంహార శ్లోకములు లేకుండుట, ఋతుసంహారము విశేషము ప్రఖ్యాతమగు గ్రంథము గాక పోవుటచేత నయి యుండవచ్చును. ఇంతకును వల్లభదేవునిచే సుభాషితావళియందుఁ గాళిదాస కృతములని ఋతు సంహారము నందున్న శ్లోకములు రెండుదాహరింపఁబడుటవలన నాగ్రంథము వల్లభదేవుని కాలము నాఁటికిఁ గాళిదాస కృతమను వాడుక ప్రబలముగా నుండెనని యొప్పుకొనక తప్పదు.

౮. వల్లభదేవుఁడు ఋతుసంహారమునకు వ్యాఖ్యానము వ్రాయలేదు గావున నయ్యది యాతని కాలమందుఁ గాళిదాసుని గ్రంథముగాఁ దెలియఁబడి యుండలేదనుటయు మల్లినాథ వ్యాఖ్యానవిషయకమగు యుక్తివంటిదే గావున దానికి సమాధానము వేఱె చెప్ప నక్కఱలేదు.

౯. పదవాక్యరత్నాకరమునందు చెప్పఁబడినది కేవలమభిరుచిపయి నాధారపడియుండుటచేతను నయ్యది సహృదయైకవేద్యమే యగుటచేతను నద్దానిని సహృదయ హృదయ నిర్ణయమునకే విడిచిపెట్టెదను. నేను మాత్రము ఋతుసంహారము నందలి ప్రకృతివర్ణనము కాళిదాసునిచే వ్రాయఁబడిన దానివలెనే మనోహరముగా నున్నదను నభిప్రాయమును గలిగియున్నాను.

ఋతుసంహారము కాళిదాసకృతమనువారిలో ముఖ్యులగు డాక్టరు కీతు మొదలగువారు తమవాదమును స్థాపించుకొనుట కింకొక యుక్తిని జెప్పుచున్నారు. మాలవశక సంవత్సరము ౫౨౯ కిసమగు ౪౭౩-౪ A.D. సంవత్సరమునందు వత్సభట్టి యను నాతనిచే వ్రాయఁబడి మందసరము (Mandasor) దగ్గఱనున్న సూర్యదేవాలయమునందు స్థాపింపఁబడిన పద్యాత్మకమగు శిలాశాసనములోని కొన్నిశ్లోకములు ఋతుసంహార శ్లోకములలోఁ గొన్నిటిఁబోలియున్నవి. కావున నీగ్రంథమాశాసనమునకు ముందు వ్రాయఁబడినదనియును గాళిదాసునిచేతనే రచియింపఁబడియుండవచ్చుననియు వారూహించుచున్నారు. ఈశాసనమునందు ౪౪ శ్లోకములున్నవి. ఇందుఁ గుమారగుప్త చక్రవర్తియొక్క ప్రశస్తియు నాతని సామంతులును దశపురనాథులును నగు విశ్వవర్మ బంధువర్మల ప్రాశస్త్యము, దేవాలయమును బట్టుసాలీల పరివృత్తు కట్టించినవిషయమును, నాసంవత్సరమును, నప్పటిశీతకాలపు వర్ణనమును, తరువాత నాగుడిపడిపోఁగా దిరిగి బాగుచేయఁబడిన దినములును నప్పటి ఋతువర్ణనమును గన్పట్టుచున్నవి. శాసనములు వ్రాయువారు నాకాలమునఁ గావ్యములయందలి శైలి ననుకరించుచుండిరనియును నట్టి యనుకరణము నీశాసనమునందు మనము చూడవచ్చుననియును విమర్శకు లూహించుచున్నారు.

శాసనమునందలి ౩౧ వ శ్లోకము:

రామాసనాథరచనే దరభాస్కరాంశు వహ్ని ప్రతాపసుభగే, జలలీనమీనే; చంద్రాంశు హర్మ్యతల చందన తాళవృంత హారోపభోగ (ర) రహితే హిమదగ్ధ పద్మే.

౩౩ వ శ్లోకము:

స్మరవశగతరుణజన వల్లభాంగనా విపులకాంతపీనోరు, స్తనజఘన ఘనాలింగన నిర్భర్త్సిత తుహిన హిమపాతే.

౩౪ వ శ్లోకమునందలి తుదిభాగము:

... . ......ఋతౌ నేవ్యఘునస్వనే.

ఈపయి రెండును ఋతుసంహారమునందలి యయిదవ సర్గములోని తొమ్మిదవ శ్లోకమును (శ్లో. పయోధరైః కుంకుమరాగపింజరైః......) బోలియున్నవని చెప్పఁబడినది.

ఈపయి శ్లోకములలో సాదృశ్యమున్నదా లేదా యనువిషయమును పర్యాలోచనకు పాఠకులే నిర్ణయింతురుగాక. సాదృశ్యమున్నదని యొప్పుకొనిన తరువాతను గొన్ని ప్రశ్నలు బయలుదేఱుచున్నవి. ఈ సాదృశ్యమాత్రమునుబట్టి వత్సభట్టి ఋతుసంహారమును జూచియే వ్రాసెనని సిద్ధాంతము చేయవలునా? మఱి యే గ్రంథమందును నిట్టివర్ణనము లేదా? అట్టి యితర గ్రంథములను జూచి వత్సభట్టి యనుకరించెనని యేల చెప్పరాదు? ఇతరకవ్యనుకరణములు పయిశాసనమునందు లేవా? ఈ ప్రశ్నలకు సమాధానమేమనఁగా: వత్సభట్టి తనశాసనమునందుఁ గాళిదాసుని కావ్యముల నన్నిటిని ననుకరించెనని యాయా గ్రంథములనుండి శ్లోకముల నెత్తి చూపవచ్చును. ఇట్లువత్సభట్టి కాళిదాసుని రచనాపద్ధతిని, నభిప్రాయములను విపులముగా ననుకరించెనని పండితులయభిప్రాయము గావున, ఋతుసంహారమును బోలిన రచన లిందుఁ గన్పట్టుచుండుటచే నీయనుకరణము కూడఁ గాళిదాసగ్రంథములనుండియే యగునని యూహించుట కెక్కువ యవకాశము గలుగుచున్నది. ఈ శాసనమునందలి తక్కిన యనుకరణములు రఘువంశాదికావ్యముల సందర్భములలో వ్రాయఁబడును.

ఋతుసంహారమునందు వత్సరారంభమును ఋతురాజమును నగు వసంతర్తువుతో వర్ణనమారంభింపఁబడక గ్రీష్మర్తువుతో నారంభింపఁబడినది ఇట్టి యసందర్భపు మార్పును గాళిదాసుఁడు చేసియుండఁడని మరికొందఱూహించుచున్నారు. కాని కాళిదాసుఁడు పంచాంగమునందు వ్రాయునట్లే వసంతర్తువుతో నారంభించి వ్రాసెదనని శపథముచేసి యుండలేదు. కావున నిది దోషమని యునిట్టి రచన కాళిదాసునిచేఁ జేయఁబడి యుండదనియు నూహించుట కవకాశము కనుపట్టదు. సర్వజనహృదయానందకరమగు వసంతర్తువును వర్ణించుచుఁ గావ్యమునంతమొనరించిన యెడల యుక్తమని యూహించి కాళిదాసుఁడు గ్రీష్మముతో నారంభించి వసంతర్తువుతో ముగించెనని నాకుఁ దోఁచుచున్నది. గ్రీష్మకాలమునందలి యుష్ణముచే నెండిపోయిన వృక్షములును, దపించుచున్న మృగసంతతులన్ని జాతుర్భ్రమమునందు వర్ణింపఁబడి తుది నాహ్లాదకరమగు మావిచిగుళ్ళు కోయిల మొదలగునవి వర్ణింపఁబడుటచే మొదటఁ గొంచెము (కొన్ని) భయజనకములగు విషయములను జదివి తుది నానంద జనకములగు విషయములను జదువుటవలనఁ బాఠకునకు నొక విధమగు తుష్టియు నానందమును గలుగుట కవకాశముగలదు. ఈ పయి యభిప్రాయముతోడనే కాళిదాసుఁ డిట్లు వ్రాసియుండ వచ్చును.

ఋతుసంహార కర్తృత్వమును గుఱించి యింతకుముందనేకములగు యుక్తులను వితర్కించితిమి. ఇన్ని యుక్తులును బ్రతియుక్తులతోఁగూడియున్నవేగాని నిర్బాధకమయినవి గావు. ఇఁక నాయభిప్రాయ మేమనఁగాఁ గాళిదాసుఁడే ఋతుసంహార కర్తయయి యుండుననియును నాగ్రంథ మాతని బాల్యకాలములోనే వ్రాయఁబడి యుండ వచ్చుననియును జెప్పుచున్నాను. ఈరెంటికిని నాకుఁదోఁచిన యుక్తులను గ్రిందనిచ్చుచున్నాను. సాధారణముగా నొకకవి తొలుత వ్రాసినగ్రంథములయందలి యభిప్రాయములును శైలియును దరువాత నాతఁడు రచియించిన కావ్యములయందుఁ గన్పట్టుచునే యుండును. మొదటి కావ్యములయందలి కల్పనలు తరువాతి గ్రంథములలో వన్నెపెట్టఁబడి చిత్రింపఁబడుచుండును. ఇట్టిది తెనుఁగు కవులగు తిక్కన, రామరాజభూషణుఁడు మొదలగు వారి కావ్యములయందును, నాంగ్లకవులగు షేక్స్పియరు, బైరను మొదలగువారి

# ప్రఖ్యాతికొరకు ద్రవ్యము నాశ మొనరింపబడును



కాళ్ళగొలత పంపబడును.

ఓట్టో సుగంధరాజ్ నిరుపమానమైన అత్తరు. దాని సువాసన వారమురోజులవరకు కల్గియుండును. అది మనసున కుల్లాసమును హృదయమునకు హాయినొసంగును. ప్రతివారిని ఆకర్షించును. అధిక ప్రశంస యనవసరము. ఒక బుడ్డి ధర 0-6-0 అణాలు (ఏడణాలు) మాత్రమే. 12 బుడ్లనొక్కమారుగా రు. 4-8-0 కు కొనువారికి 3 (మూడు) సొంపైన డమ్మీ రిస్టువాచీలు, 2 (రెండు) జేబిపాకెట్టు వాచీలు, 10 సంవత్సరముల గ్యారంటీగల ఒక బర్మా టైంపీను సైతము పార్సెలుతో పంపబడును. ఈ గడియారములు మాత్రమే గాక ఒక మంచి ఫౌంటెన్ పెన్, ఒక మంచి టార్చ్‌ల్యాంప్, ఒక జత మంచి పంప్‌షూసుకూడ ఉచితముగ నొసంగబడును. ఆర్డరుతోపాటు ప్యాకింగుపోస్టేజి ప్రత్యేకము.

**SARMA BROS., & CO.,**

**Post Box No. 6795 Bara Bazzar, CALCUTTA. (Section 15.)**

---

# వి చి త్ర త ర జ్యో తి ష ము

జాతకమున్నాసరే, లేకున్నాసరే, పువ్వు, బంగారు, వస్తువు, దేవుడు, వీట్లపేర్లువ్రాసి "ప్రశ్న" యని వ్రాసినచో ప్రశ్నయు, జవాబునువచ్చును. రు. 1. సం॥ర ఫలితము నెలవారీ రు. 2. జీవితచరిత్ర రు. 5. హోలైఫ్ నెలవారి రు. 25.

శ్రీ మేధా అష్ట్రిలాజికల్ బ్యీరో, కాశీబుగ్గ, గంజాం.

---

# లోధ్ర

## స్త్రీలపాలిటి వరప్రసాదిని

గర్భాశయ సంబంధమగు ముట్టుకుట్టు - కుసుమరోగము, సోమరోగము - అకాలబహిష్ఠి, బహిష్ఠి నిలిచిపోవుట, గర్భస్రావము, సంతానహీనత మొదలగు వ్యాధులకిది అభయప్రదాత. మేహజ్వరములను, జలుబును, దగ్గును, బలహీనతను, రక్తహీనతను, అజీర్తిని నమ్మకముగ కుదర్చగలదు.

వెల పెద్దబుడ్డి రు 3 లు; చిన్నది 1-10-0 అన్ని మందులషాపులలో దొరకును.

కేసరికుటీరం, ఆయుర్వేద ఔషధశాల, ఎగ్మూర్, మద్రాసు.

---

# తా మ ర తై ల ము

తామరలకు మంచిమందు. ప్రతియింట నుండతగినది. డబ్బి 1-కి 0-6-0 డజను 1-కి 3-8-0.

బొంబాయి - - - అమృతాంజనం డిపో, - - - మదరాసు.

గ్రంథములందును గన్పించుచున్నది. కాఁబట్టి ఋతుసంహారము నందలి వర్ణనములు భావములు మొదలగునవి రఘువంశాది కావ్యములయం దెంతవట్టుకుఁ గన్పించుచున్నవో మనము పరీక్షించి నిర్ణయించిన యెడలఁ బయి గ్రంథము కాళిదాసకృత మగునా కాదా యను ప్రశ్నమునకు సమాధాన మొసంగుటలో నెంతయు నుపయోగకారి యగుచున్నది. ఋతుసంహారమును దక్కిన కాళిదాసకృతకావ్యములతోఁ గలిపి పరీక్షింపఁగా నాకుఁ గన్పట్టిన సాదృశ్యముల నీక్రింద నిచ్చుచున్నాను.

ఋతుసంహారము నందలి ప్రథమ సర్గములోని మొదటి శ్లోకము:

"ప్రచండసూర్యః స్పృహణీయచంద్రమాః
సదావగాహక్షమవారిసంచయః,
దినాంతరమ్యో ఽభ్యుపశాంతమన్మథో
నిదాఘకాలో ఽయ ముపాగతః ప్రియే."

అభిజ్ఞాన శాకుంతలమునందలి ప్రథమాంకములోని ఋతువర్ణనపు శ్లోకము నిదె తలఁపించుచున్నది.

శ్లో. సుభగసలిలావగాహాః పాటలసంసర్గసురభివనవాతాః, ప్రచ్ఛాయసులభనిద్రా దివసాః పరిణామరమణీయాః.

౧. ఋతు సం. i. 2. క్వచి ద్విచిత్రం జలయంత్రమందిరమ్.

మే. పూ. 64. సురయువతయో యంత్రధారాగృహత్వమ్.

ఇందు దేవకాంతలు మేఘమును యంత్రధారాగృహముగా నొనరించి సేవింతురని చెప్పఁబడినది. రెండిటియందును జలయంత్ర ప్రతివర్ణనము సమానము.

౨. ఋ. i. 9. సితేషు హర్మ్యేషు నిశాసు యోషితామ్.

ఋ. i. 3. సువాసితం హర్మ్యతలం మనోహరమ్.

మే. ఉ. 7. యస్యాం యక్షాః సితమణిమయా న్యేత్య హర్మ్యస్థలాని.

సితహర్మ్యవర్ణనము రెంటను సమానము.

3. ఋ. i. 3 ప్రియాముఖోచ్ఛ్వాసవికంపితం మధు. కామిజనులు ప్రియలతోఁ గలిసి మధువును సేవింతురనియును, నయ్యది స్త్రీలకు సౌందర్యమును నుత్సాహమును గలుగఁజేయుననియును గాళిదాసుఁ డనేకస్థలములయందు వర్ణించి యున్నాఁడు. అవకాశమయిన స్థలములయం దన్నిటియందును నీమధువును దత్పానమును సరసముగా వర్ణించుచు నుండును.

మే. ఉ. 5. ఆసేవంతే మధు రతిఫలమ్.

కు. i. 13. అనాసవాఖ్యం కరణం మదస్య.

మే. ఉ. మధునయనయో ర్విభ్రమాదేశదక్షమ్.

మే. పూ. 63. హిత్వా హాలామభిమతరసాం రేవతీలోచనాంకామ్.

రఘు. ix. 7. న చ కశ్చి ప్రతిమాభరణం మధు.

ఋ. iv. 11. పుష్పాసవామోదసుగంధి వక్త్రమ్.

ఋ. v. 10. సుగంధినిశ్వాసవికంపితోత్పలం, మనోహరం కామరతి ప్రబోధకమ్; నిశాసు హృష్టాః సహ కామిభిః స్త్రియః, పిబన్తి మద్యం మదనీయ ముత్తమమ్.

ఋ. v. 5. ముఖాసవామోదిత వక్త్రపంకజాః.

కు. iii. 38. పుష్పాసవాఘూర్ణిత నేత్రశోభి ప్రియాముఖమ్.

కు. iv. 12. నయనాన్యరుణాని ఘూర్ణయన్ వచనాని స్ఖలయన్ పదేపదే, అసతి త్వయి వారుణీమదః ప్రమదానా మధునా విడంబనా.

ఋ. iv. 10. నేత్రేషు లోలో మదిరాలసేషు.

౪. ఋ. i. 4. శిరోరుహైః స్నానకషాయవాసితైః.

ఋ. v. 12. అగురుసురభిధూపామోదితం కేశపాశమ్.

మే. పూ. 36. జాలోద్గీర్ణై రుపచితవపుః కేశసంస్కారధూపైః.

కు. పూ. 37. తోయక్రీడానిరతయువతిస్నానతిక్తైర్మరుద్భిః.

స్త్రీల కేశపాశములను, శరీర సుగంధమును వర్ణించుట యందుఁ గాళిదాసునకు సాధారణముగాఁ బ్రీతి.

౫. ఋ. i. 11. భిన్నాంజన సన్నిభం నభః.

ఋ. ii. 2. క్వచిత్ప్రభిన్నాంజనరాశిసన్నిభైః.

మే. పూ. 62. ఉత్పశ్యామి త్వయి తటగతే స్నిగ్ధభిన్నాంజనాభే.

ఋ iii 5. భిన్నాంజనప్రచయకాన్తినభో మనోజ్ఞమ్.

భిన్నాంజనవర్ణోపమానము తుల్యము.

౬. స్త్రీల జిహ్మములయిన వీక్షణములను భ్రూవిలాసములను వర్ణించుటయందుఁ గాళిదాసుఁడు సమర్థుఁడు. ఇట్టి భ్రూవిక్షేపములు స్త్రీలసౌందర్యమును హెచ్చించుననని యాతని యభిప్రాయముగాఁ దోఁచుచున్నది.

మే. పూ. 25. సభ్రూభంగం ముఖమివ పయో వేత్రవత్యాశ్చలోర్మి.

ఋ. i. 12. సవిభ్రమైః సస్మితజిహ్మవీక్షితైః.

ఋ. iii. 17. భ్రూవిభ్రమాశ్చ రుచిరాః.

ఋ. iv. 11. భ్రూక్షేపజిహ్మానివ వీక్షణాని.

మే. పూ. 16. భ్రూవికారానభిజ్ఞైః ప్రీతిస్నిగ్ధైః జనపదవధూలోచనైః.

మే. పూ. 50. పరిచితభ్రూలతా విభ్రమాణాం... ......దశపురవధూనేత్ర కౌతూహలానామ్.

మే. ఉ. 12. సభ్రూభంగప్రహితనయనైః కామిలక్ష్యేష్వమోఘైః.

మధుపానము చే నయనవిభ్రమ మధికమగుననుచుఁ దెలుపు వర్ణనములను మూఁడు గొన్నిటి నుదాహరించి యున్నాను.

౭. మదగజములకును మేఘములకును గల సాదృశ్యమును గవి తిరిగితిరిగి వర్ణించుటయందు ప్రీతిగలవాఁడుగాఁ గన్పించుచున్నాఁడు.

ఋ. ii. 15. వనద్విపానాం నవవారిదస్వనైః, మదాన్వితానాం ధ్వనతాం ముహుర్ముహుః; కపోలదేశా విమలోత్పలప్రభాః, సభృంగయూథైః మదవారిభిశ్చితాః.

ఋ. ii. 1. అంభోధరమత్తకుంజరః.

మే పూ. 2. వప్రక్రీడాపరిణతగజప్రేక్షణీయం దదర్శ.

మే. పూ. 58. ఇందు శరభమృగములకు మేఘమునందు గజభ్రాంతి కల్పింపఁబడినది. (సింహభ్రాంతియని కొందఱు).

మే. ఉ. 20. గత్యాపస్యః కలభతనుతాం. ఇందును మేఘమునకును గజమునకును గల సాదృశ్యము వివక్షింపఁబడినది.

మే. పూ. 35. త్వామివ కరిణో వృష్టిమంతః ప్రభేదాత్.

ఈ క్రిందు మేఘనాదమునకును మద్దెల చప్పుడునకును గల సాదృశ్యము వర్ణింపఁబడినది.

ఋ. ii. 1. అశనిశబ్దమర్దలః.

మే. పూ. 60. నిర్హ్రాదస్తే మురజ ఇవ చేత్.

మే. పూ. 38. కుర్వన్ సంధ్యాబలిపటహతాం శూలినః శ్లాఘనీయాం, మామంద్రాణాం ఫలమవికలం లప్స్యసే గర్జితానామ్.

మే. ఉ. 1. సంగీతాయ ప్రహతమురజాః స్నిగ్ధగంభీరఘోషమ్.

ఋ ii. 4. వలాహకాశ్చాశనిశబ్దమర్దలాః.

౮. స్త్రీల యలంకారములను వర్ణించుట యందును గాళిదాసుఁడు తన కావ్యములయం దొక్క విషయము భావమునే తిరిగి తిరిగి చెప్పుచు వచ్చుచున్నట్లు క్రింది యుదాహరణములవలనఁ దెలియనగును.

ఋ. i. 5. నితాంతలాక్షారసరాగరంజితైః.

మే. ఉ. 12. లాక్షారాగం చరణకమలన్యాసయోగ్యమ్.

కు. i 33. నిక్షేపణాద్రాగ మివోద్గిరంతౌ.

౯. స్త్రీల నడకలను వర్ణించునప్పుడును నొక్కమార్గమునే కవి యనేకస్థలములయందు నడపియున్నాఁడు.

ఋ. i. 5. నితంబినీనాం చరణైః సనూపురైః పదే పదే హంసరుతానుకారిభిః.

కు. i. సా రాజహంసైరివ సన్నతాంగీ గతేషు లీలాంచిత విక్రమేషు, వ్యనీయత ప్రత్యుపదేశ లుబ్ధై రాదిత్సుభి ర్నూపురశింజితాని.

ఋ. iv. 3. నూపురై ర్హంసరుతం భజద్భిః.

ఋ iii. 25. కామంచ హంసవచనం మణినూపురేషు.

౧౧. స్త్రీలు ధరించు హారములను, దానివలనఁగలుగు శోభను వర్ణించుటయందుఁ గాళిదాసునకుఁ బ్రీతి మెండు.

ఋ. i. 6. తుషారగౌరార్పితహారశేఖరాః.

మే. ఉ. 11. ముక్తాజాలైః స్తన పరిసరచ్ఛిన్న సూత్రైశ్చ హారైః.

ఋ. i. 6. పయోధరాశ్చందనపంకచర్చితాః.

కు. v. 8. విముచ్య సా హార మహార్యనిశ్చయా విలోలయష్టిప్రవిలుప్తచందనమ్.

ఋ. i. 8. సహారయష్టిస్తన మండలార్పణైః.

౧౧. వర్ష కాలమునందలి చాతకపక్షులను వర్ణించుట.

ఋ. ii. 3. తృషాకులై శ్చాతక పక్షిణాం కులైః.

మే. పూ. 22. అంభోబిందుగ్రహణచతురాం శ్చాతకాన్ వీక్ష్యమాణాః.

మే. ఉ. 54. నిశ్శబ్దోఽపి ప్రదిశసి జలం యాచితశ్చాతకేభ్యః.

౧౨. వర్ష కాలమునందలి మేఘగంభీరస్వనమును వర్షపాతమును వర్ణించుట.

ఋ. ii. 3. శ్రోత్ర మనోహర స్వనాః.

మే. పూ. 12. తచ్ఛ్రుత్వా తే శ్రవణసుభగం గర్జితమ్.

ఋ. ii. 3. తోయధరావలంబినః.

శా. v. భవంతి నమ్రా స్తరవః ఫలాగమైర్నవాంబుభిర్భూరివిలంబినో ఘనాః.

ఋ. ii. 3. ప్రయాన్తి మందం బహుధారవర్షిణో వలాహకాః.

మే. పూ. 52. ధారాపాతై స్త్వమివ కమలాన్యభ్యవర్షన్ముఖాని.

మే. పూ. 57. అర్హస్యేవం శమయితు మలం వారిధారాసహస్రైః.

౧౩. మయూఖజాలముతోఁగూడిన వైడూర్యములకును, గడ్డి చిగుళ్ళకును గల సాదృశ్యమును దెల్పుట.

ఋ. ii 5. ప్రభిన్న వైడూర్యనిభై స్తృణాంకురైః.

మే. పూ. 33. ఘాసశ్యామాన్ మరకతమణీ నున్మయూఖ ప్రరోహాన్.

౧౪. వర్ష కాలమునందలి కందళులను వర్ణించుట.

ఋ. ii. 5. సమాచితా ప్రోత్థితకందళీదళైః.

మే. పూ. 31. కందళీశ్చానుకచ్ఛమ్.

౧౫. మయూరౌత్సుక్యమును వర్ణించుట.

ఋ ii.6. ప్రనృత్తనృత్యం కుల మద్యబర్హిణామ్.

మే. పూ. 23. శుక్లాపాంగైః సజలనయనైః స్వాగతీకృత్య కేకాః.

మే. పూ. 36. బంధుప్రీత్యా భవనశిఖిభి ర్దత్తనృత్యోపహారః.

విక్ర. v. ఘర్మచ్ఛేదా త్పటుతరగిరః......

౧౬. లేళ్లను వానియొక్క సహజ భీతియును, వాని చంచల నేత్రములును నవి సగము కొఱుకఁగా మిగిలిన దర్భాంకురములును గాళిదాసునకు సాధారణముగా వర్ణనీయ విషయములు.

ఋ. ii. 8. ఉద్గత కోమలాంకురై ర్విచిత్రనీలై ర్హరిణీముఖక్షతైః.

శా. i. 1. దర్భై రర్ధావలీఢైః శ్రమ వివృత ముఖభ్రంశిభిః.

ఋ. ii. 9. విలోలనేత్రోత్పలశోభితాననై ర్మృగైః సమంతా దుపజాతసాధ్వసైః.

శా. i. విశ్వాసోపగమా దభిన్నగతయః శబ్దం సహంతే మృగాః.

కు. i. 46. ప్రవాత నీలోత్పల నిర్విశేష మధీర విప్రేక్షిత మాయతాక్ష్యాః, తయా గృహీతంను మృగాంగనాభ్య స్తతో గృహీతంను మృగాంగనాభిః.

౧౭. అభిసారికలను, వారి గమనమును వర్ణించుట.

ఋ. ii. 10. అభీక్ష్ణ ముచ్చైర్ధ్వనతా పయోముచా, ఘనాన్ధకారీకృత శర్వరీవ్యపి ; తటిత్ప్రభా దర్శిత మార్గభూమయః ప్రయాన్తి రాగాదభిసారికాః స్త్రియః.

మే. పూ. 41. గచ్ఛంతీనాం రమణవసతిం యోషితాం తత్ర నక్తం, రుద్ధాలోకే నరపతిపథే సూచిభేద్యై స్తమోభిః; సౌదామన్యా కనకనికషస్నిగ్ధయా దర్శయోర్వీం, తోయోత్సర్గ స్తనితవిముఖో మాస్మభూ రుజ్జయిన్యాః.

మే. ఉ. 12. నైశో మార్గః సవితురుదయే సూచ్యతే కామినీనామ్

కు. iv. 11. రజనీతిమిరావగుంఠితే పురమార్గే ఘనశబ్దవిక్లవాః, వసతిం ప్రియ కామినాం ప్రియా స్త్వదృతే ప్రాపయితుం క ఈశ్వరః.

౧౫. పాంథ స్త్రీలయొక్క యవస్థను వర్ణించుటలో ఋతుసంహారమునందు సాధారణ ధర్మములుగాఁ జెప్పఁబడిన వానినే మేఘసందేశమునందు యక్షకాంతను సంబంధించినవానిఁగాఁ గవి చెప్పియున్నాఁడు.

ఋ. ii. 12 విలోచనేందీవర వారిబిందుభిః.

మే. ఉ. 23. నూనం తస్యాః ప్రబలరుదితోచ్ఛూననేత్రం ప్రియాయాః.

మే. ఉ. 28. తామేవోష్ణై ర్విరహమహతీమశ్రుభి ర్యాపయంతీమ్.

ఋ. ii. 12. నిరస్తమాల్యాభరణానులేపనాః.

మే. ఉ. 30 శుద్ధస్నానాత్పరుష మలకం నూన మాగండలంబమ్.

ఋ. ii. 12. స్థితా నిరాశాః ప్రమదాః ప్రవాసినాం.

మే. పూ. 8. ప్రేక్షిష్యంతే పథికవనితాః ప్రత్యయా దాశ్వసంత్యః.

౧౬. ఋ. ii. 16– శ్లోకమునందలి పర్వత వర్ణనము కుమార సంభవమునందలి హిమాలయ వర్ణనమును దలఁపించుచున్నది.

ఋ. ii. 16. సితోత్పలాభాంబుద చుంబితోపలాః, సమాచితాః ప్రస్రవణైః సమంతతః.

కు. i. 5. ఆమేఖలం సంచరతాం ఘనానాం, ఛాయా మధస్సానుగతాం నిషేవ్య; ఉద్వేజితా వృష్టిభి రాశ్రయంతే, శృంగాణి యస్యాతపవన్తి సిద్ధాః.

౧౭. కుసుమ వాసనలతోఁ గూడియుండి జలబిందువులను వహించు వాయువులను, రతిప్రబోధకములగు ప్రభాత వాయువులను వర్ణించుటయందుఁ గాళిదాసునకుఁ బ్రీతి.

ఋ ii. 17. కదంబ సర్జార్జున కేతకీవనం,
వికంపయం స్తత్కుసుమాధివాసితః;
ససీకరాంభోధర సంగశీతలః,
సమీరణః కం నకరోతి సోత్సుకమ్.

కు. i. 15 భాగీరథీనిర్ఝరశీకరాణాం వోఢా ముహుః కంపితదేవదారుః, యద్వాయుః.

మే. పూ. 46 త్వన్నిష్యందోచ్ఛ్వసితవసుధా గంధసంపర్కరమ్యః, శీతో వాతః పరిణమయితా కాననోదుంబరాణామ్.

మే. ఉ. 6. మందాకిన్యాః సలిలశిశిరైః సేవ్యమానా మరుద్భిః

మే. పూ. 32. యత్ర స్త్రీణాం హరతి సురతగ్లాని మంగానుకూలః, శిప్రావాతః ప్రియతమ ఇవ ప్రార్థనా చాటుకారః.

ఋ. iii. 15. ఉత్కంపయత్యతితరాం పవనః ప్రభాతే, పత్రాంతలగ్నతుహినాంబు విధూయమానః

౧౮. స్త్రీలు సాధారణముగాఁ బుష్పములను ధరించుచుండురనియును నాపుష్పములు తత్తదృతువున కనుగుణముగా నుండుననియును, శరీరమునకు నలంకారములకంటె పుష్పములవలననే యధికమగు శోభ కలుగుననియును గాళిదాసుని యభిప్రాయముగాఁ గన్పట్టుచున్నది.

ఋ. ii. 18. కృతావతంసైః కుసుమైః సుగంధిభిః.

ఋ. ii. 20 మాలాః కదంబనవకేసరకేతకీభి
రాయోజితాః శిరసి బిభ్రతి యోషితోఽద్య,
కర్ణాంతరేషు కకుభద్రుమమంజరీభి
రిచ్ఛానుకూలరచితా నవతంసకాంశ్చ.

ఋ. ii. 21. పుష్పావతంస సురభీకృత కేశపాశాః.

మే. ఉ. 11. గత్యుత్కమ్పా దలకపతితై ర్యత్ర మందారపుష్పైః, పత్రచ్ఛేదైః కనకకమలైః కర్ణవిభ్రంశిభిశ్చ.

మే. ఉ. 13. పుష్పోద్భేదం సహకిసలయై ర్భూషణానాం వికల్పాన్.

మే. ఉ. 2. హస్తే లీలాకమలమలకే బాలకుందానువిద్ధం, నీతా లోధ్రప్రసవరజసా పాండుతామాననే శ్రీః; చూడాపాశే నవకురవకం చారుకర్ణే శిరీషం, సీమంతే చ త్వదుపగమజం యత్ర నీపం వధూనామ్.

ఋ. ii. 24. శిరసి వకుళమాలాం మాలతీభిస్సమేతాం, వికసితనవపుష్పై ర్యూథికాకుట్మలైశ్చ; వికచనవకదంబైః కర్ణపూరం వధూనాం, రచయతి జలదౌఘః కాంతవత్కాల ఏషః.

ఋ. iii. 19. కేశా న్నితాంతఘననీలవికుంచితాగ్రా, నాపూరయన్తి వనితా నవమాలతీభిః; కర్ణేషు చ ప్రవరకాంచనకుండలేషు, నీలోత్పలాని వివిధాని నివేశయన్తి.

ఋ. vi. 5. కర్ణేషు యోగ్యం నవకర్ణికారం,
చలేషు నీలే ష్వలకే ష్వశోకమ్;
పుష్పం చ ఫుల్లం నవమాలికాయాః,
ప్రయాంతి కాంతిం ప్రమదాజనానామ్.

కు. iii 53. అశోకనిర్భర్త్సిత పద్మరాగమాకృష్టహేమద్యుతి కర్ణికారమ్, ముక్తాకలాపీకృతసిందువారం వసంతపుష్పాభరణం వహంతీ.

కు. 4. 18. రచితం రతిపండిత త్వయా స్వయమంగేషు మమేద మార్తవమ్, ధ్రియతే కుసుమప్రసాధనమ్.

౨౨. కేతకీ పుష్పముల యొక్క వర్ణనమును గవి పలుమఱు ననేకస్థలములయందుఁ జేసియున్నాఁడు.

ఋ. ii. 23. హసితమివ విధత్తే సూచిభిః కేతకీనామ్.

ఋ. ii. 17. కదంబసర్జార్జునకేతకీవనమ్.

మే. పూ. 24. పాండుచ్ఛాయోపవనవృతయః కేతకైః సూచిభిన్నైః.

౨౩. మేఘమునకును, పర్వతమునకును గలుగు సంబంధమును వర్ణించుటలోఁ గవి సదృశములయిన భావములను వెలిపుచ్చుచున్నాఁడు.

ఋ. ii. 27. జలధరవినతానా మాశ్రయో౽స్మాకముచ్చై, రయమితి జలసేకై స్తోయదా స్తోయనమ్రాః; అతిశయపరుషాభి ర్గ్రీష్మవహ్నేః శిఖాభిః, సముపజనితతాపం హ్లాదయన్తీవ వింధ్యమ్.

మే. పూ. 12. కాలే కాలే భవతి భవతో యస్య సంయోగమేత్య, స్నేహవ్యక్తిశ్చిరవిరహజం ముంచతో బాష్పముష్ణమ్.

మే. పూ. 17. త్వామాసారప్రశమితవనోపప్లవం సాధు మూర్ధ్నా, వక్ష్యత్యధ్వశ్రమపరిగతం సానుమానామ్రకూటః.

మే. పూ. 53. బాధేతోల్కాక్షపితచమరీవాలభారో దవాగ్నిః, అర్హస్యేనం శమయితు మలం వారిధారాసహస్రైః.

౨౪. స్త్రీలయొక్క ప్రత్యంగసౌందర్యమును వర్ణించి దానికిఁ జమత్కారముగాఁ బ్రకృతిసామ్యమును, ప్రకృతికి స్త్రీశరీరసాదృశ్యమును నిరూపించుటయందుఁ గవి సమర్థుఁడు.

ఋ. 3. 17. హంసైర్జితా సులలితా గతి రంగనానా, మంభోరుహై ర్వికసితై ర్ముఖచంద్రకాంతిః; నీలోత్పలై ర్మదకలాని విలోకితాని, భ్రూవిభ్రమాశ్చ రుచిరా స్తనుభి స్తరంగైః.

ఋ. 3. 24. అసితనయనలక్ష్మీం లక్షయిత్వోత్పలేషు, క్వణితకనకకాంచీం మత్తహంసస్వనేషు; అధరరుచిరశోభాం బంధుజీవే ప్రియాణాం, పథికజన ఇదానీం రోదితి భ్రాంతచిత్తః

మే. ఉ. 43. శ్యామాస్వంగం చకితహరిణీప్రేక్షణే దృష్టిపాతం, వక్త్రచ్ఛాయాం శశిని శిఖినాం బర్హభారేషు కేశాన్; ఉత్పశ్యామి ప్రతనుషు నదీవీచిషు భ్రూవిలాసాన్, హంతైకస్మిన్ క్వచిదపి న తే చండి సాదృశ్యమస్తి.

రఘు 8. 59. కలమన్యభృతాసు భాషితంకలహంసీషుగతం మదాలసమ్, హరిణీషు విలోలమీక్షితం పవనాధూతలతాసు విభ్రమాః.

విక్రమోర్వశీయము నాల్గవ యంకమునందుఁ బురూరవసుఁడు తన ప్రియురాలి గుఱించి విలపించుచుఁ దన భార్యయొక్క ప్రత్యంగసాదృశ్యముగల పక్ష్యాదుల నుద్దేశించి పలుకునప్పుడును బయిభావములవచ్చునట్లే పలికెను.

విక్ర. iv. 80. హంస ప్రయచ్ఛ మే కాంతాంగతిరస్యాస్త్వయాహృతా, విభావితైకదేశేన దేయం యదభియుజ్యతే.

౨౫. నదులను స్త్రీరూపముగా వర్ణించుటయందీకవికిఁ జాలప్రీతి. మేఘసందేశమునందలి, వేత్రవతి, నిర్వింధ్యము. నదులనన్నిటిని నావిధమునసే వర్ణించెను.

ఋ. iii. 3. చంచన్మనోజ్ఞశఫరీరసనాకలాపాః
పర్యన్తసంస్థితసితాండజపంక్తిహారాః,
నద్యోవిశాలపులినాన్తనితంబబింబాః.
మందం ప్రయాంతిప్రమదాః ప్రమదా ఇవాద్య.

విక్ర. iv. 28. తరంగభ్రూభంగాః క్షుభితవిహగశ్రేణిరశనా, వికర్షంతీ ఫేనం వసనమివ సంరంభశిథిలమ్; యథావిద్ధం యాతి స్ఖలితమభిసంధాయ బహుశః, నదీభావే నేయం ధ్రువమసహనా సా పరిణతా.

౨౬. ఋ iii. 22. విగతకలుషమంభఃశ్యానపంకా ధరిత్రీ.

రఘు. iv. 24. సరితః కుర్వతీ గాధాః పథశ్చాశ్యానకర్దమాన్.

౨౭. నిర్దయమగురతమును, బరిష్వంగమును గవి వర్ణించుచు నిర్దయమను పదము నుపయోగించుచుండును.

ఋ. iv. 12. నిర్దయమంగనానాం రతోపభోగోనవయాపనానాం.

ఋ. v. 7. ప్రకామకామైర్యువభిస్సనిర్దయం, నిశాసు దీర్ఘాస్వభిరామితాశ్చిరమ్.

మే. ఉ. 45. మామాకాశప్రణిహితభుజం నిర్దయాశ్లేషహేతోః.

౨౮. నిశ్శ్వాసవాతములను వర్ణించుట కాళిదాసునకు నొకయభ్యాసమువలెఁ గన్పట్టుచున్నది.

ఋ. iv. 11. నిశ్శ్వాసవాతైస్సురభీకృతాంగః.

కు. iii 56. సుగన్ధినిశ్శ్వాసవివృద్ధతృష్ణం.

విక్ర iv. యది సురభిమవాప్స్యస్తన్ముఖోచ్ఛ్వాసిగంధం.

రఘు. v. సౌరభ్యమీప్సురివ తే ముఖమారుతస్య.

౨౯. స్త్రీల యవయవములను వర్ణించునప్పుడు కాళిదాసుఁడు సాధారణముగాఁ బీనస్తనములను విశాలజఘనములను వర్ణించుచుండును.

ఋ. iv.15. పీనోన్నతస్తనభరానతగాత్రయష్ట్యః.

ఋ. v. 14. పృథుజఘనభరార్తాః కించిదానమ్రమధ్యాః, స్తనభరపరిఖేదాన్మందమందం వ్రజన్త్యః

ఋ. vi. 10. మధ్యేషునిమ్నా జఘనేషుపీనాః.

మే. ఉ. 21. శ్రోణీభారాదలసగమనా స్తోకనమ్రా స్తనాభ్యామ్.

౩౦. వసంతర్తువును వర్ణించునప్పుడశోక స్థలములలోని విషయములు సమానముగాఁ గనుపట్టుచున్నవి.

ఋ. vi. 1. ప్రఫుల్లచూతాంకుర తీక్ష్ణసాయకో ద్విరేఫమాలావిలసద్ధనుర్గుణః.

కు. iii. 27. సద్యః ప్రవాళోద్గమచారుపత్రే నీతే సమాప్తిం నవచూతబాణే, నివేశయామాస మధుర్ద్విరేఫాన్ నామాక్షరాణీవ మనోభవస్య.

కు. iv. 14. హరితారుణచారుబంధనః కలపుంస్కోకిలశబ్దసూచితః.

౩౧. పత్రలేఖములతోఁ గూడిన ముఖములపయిఁ బుట్టు స్వేద బిందువులను గవి వర్ణించుచుండుటయందభిలాష గలవాఁడు.

ఋ. vi. 7. సపత్రలేఖేషు విలాసినీనాం
వక్త్రేషు హేమాంబురుహోపమేషు,
రత్నాన్తరే మౌక్తికసంగరమ్యః
స్వేదాగమో విస్తరతాముపైతి.

ఋ. iii. ౩౩. స్వేదోద్గమః కింపురుషాంగనానాం చక్రే పదం పత్రవిశేషకేషు.

కు. iii. ౩౮. గీతాంతరేషు శ్రమవారిలేశైః కించిత్సముచ్ఛ్వాసితపత్రలేఖమ్.

౩౮. వసంతవర్ణనమందలి యీ క్రింది శ్లోకములకు స్పష్టమగు సాదృశ్యము గనుపించుచున్నది.

ఋ. vi. 14. పుంస్కోకిల శ్చూతరసాసవేన
మత్తః ప్రియాం చుంబతి రాగహృష్టః.
కూజద్ద్విరేఫోఽ ప్యయ మంబుజస్థః
ప్రియం ప్రియాయాః ప్రకరోతి చాటు.

కు. iii. 32. చూతాంకురాస్వాదకషాయకంఠః
పుంస్కోకిలో యన్మధురం చుకూజ.

కు. iii. 36. మధు ద్విరేఫః కుసుమైకపాత్రే
పపౌ ప్రియాం స్వా మను వర్తమానః.

ఋ. vi. 21. పుంస్కోకిలైః కలవచోభి రుపాత్తహర్షైః.

ఇట్టిసాదృశ్యము లనంతములుగా నున్నట్లు నిరూపింపవచ్చును గాని స్థలము చాలమిం జేసి యింతటితో విరమించుచున్నాను. ఈపయినీయంబడిన కల్పనాసాదృశ్యములను భావసాదృశ్యములను బరీక్షించిన తరువాత ఋతుసంహారము కాళిదాసకృతముగాదని చెప్పుట కెవ్వఁడును సాహసింపఁ జాలఁడని నాయభిప్రాయము. ఈ పయి సాదృశ్యములు మఱికొన్ని గ్రంథములయందును వేఱు కవులచే వ్రాయఁబడిన వానియందుఁ గనుపట్టవచ్చును గాని యయ్యవి యిట్లింతయధికముగానుండవు. వివాదస్థమైన ప్రకృతవిషయమును నిర్ణయించుటకు గ్రంథస్థమగు సాక్ష్యమింతకంటె నెక్కుడేమి కావలయును.

ఇఁక ఋతుసంహారమునందుఁ గాళిదాసుని కవిత్వము బాల్యదశలోనున్నదని నేనామోదించిన యభిప్రాయమునకుఁ దగిన యుక్తు లీయవలసియున్నది. సుప్రసిద్ధులగు నన్నిదేశముల కవులచే వ్రాయఁబడిన బాల్యావస్థయందలి కవిత్వమునకును ప్రౌఢావస్థయందలి కవిత్వమునకును జాలభేద మున్నదని యింతకుముందే తెలిపియుంటిని గదా: ఇప్పుడు ఋతుసంహారపుఁ గవిత్వమునకును దక్కిన కాళిదాసకావ్యముల కవిత్వమునకును గల భేదమును బరీక్షించుచున్నాను.

I. ఋతుసంహారమునందుఁ బునరుక్తులు విశేషముగాఁ గన్పట్టుచున్నవి. శబ్దపౌనరుక్త్యమును నర్థపౌనరుక్త్యమును వర్ణనవిషయములయందలి పౌనరుక్త్యమును గుఱించి డాక్టరు నోబెలుగారు తయారుచేసిన పట్టికను గ్రింద నిచ్చుచున్నాను.

ఇష్—ధాతువు యొక్క రూపములు:—(రోమను సంకెలు సర్గములు. ఇంగ్లీషు అంకెలు పద్యములు).

I 1, 10, 11, 13, 15, 17, 18, 20, 22

ఉత్సుక—I, 6; II 9; 17. VI 15, 17.

ఉత్కంఠ—III 5, 11, 14, 15.

భృశ. II. 8; III 7, 11, 18, 20, 21, IV, 4, 8, 9. V, 8, 9, 15, VI, 25.

ప్రకరోతి VI, 14; 15; కుర్వంతి, VI. 16. కుర్వంతి VI, 17, 24; యాంతి I, 2, యాతి I, 9.

యాంతి II, 7, 10; ప్రయాంతి III, 3, IV, 4. ప్రయాతి III, 7, II. 13; III 25. యాతి IV, 10; ప్రయాతి IV. 14 ప్రయాంతి. V. 2 రుచా I, 2, 3, భృశం I, 9, 11, 13, 17; II, 11; V. 9.

కామినః I, 3, కామినాం I, 4, సుప్త I, 8 ప్రసుప్తాని I, 9, ప్రనంద I, 10, నభస్సిత I, 15, 16 భోగినః I, 16, విలోలజిహ్వ I, 14, 20, తృషాకులం I, 21, తృషాకులైః II, 3 సమాచితం II, 2, 5, 9, చితః II, 15 సమాచితాః II, 16 తటిత్ II, 10, 11, అవలంబి II 18, 19 అవతంస II, 20, 21 నవజలకణ II, 25, 26, ప్రచయ III, 5, 6 స్వస్థస్థిత III, 14, 16. కాంతిః III, 17, 18 వ్యోమ III, 21, 22 విలాసినీనాం IV, 2, 3, గాత్రయష్టయః IV, 15, 17 తుషార V, 3, 4, ప్రమదాజన VI 3, 5, 9, 11.

ఇతరములయిన వానియందుఁ గన్పట్టు పునరుక్తులు:

ఇట్టిపునరుక్తులు కొన్ని సాదృశ్యములను గుఱించి యీయఁబడిన యుదాహరణములలో నున్నవి. అయినను వట్టివానిని నే నేర్చి కొంచెమిక్కడను నిచ్చెదను.

సువాసితం హర్మ్యతల. I,3. సితేషు హర్మ్యేషు. I, 9.

నితంబబింబైః సుదుకూలమేఖలైః. I, 4.

నితంబదేశాశ్చ సహేమమేఖలాః. I, 6.

సుతంత్రిగీతం మదనస్య దీపనమ్. I, 3.

సవల్లకీకాకలిగీతనిస్వనైః. I, 8.

ప్రచండసూర్యాతపతాపితా మహీ. I, 10.

ప్రచండాతపతాపితా. I, II.

ఉత్ప్లుత్య భేకస్తృషితస్య భోగినః ఫణాతపత్రస్య తలే నిషీదతి. I, 18.

విషాగ్నిసూర్యాతపతాపితః ఫణీ న హంతి మండూకకులం తృషాకులమ్. I, 20.

అశని శబ్ద మర్దలైః. II, 1.

అశని శబ్ద మర్దలైః. II, 4.

ప్రభిన్నవైడూర్యనిభైస్తృణాంకురైః. II, 5

తృణోత్కరైరుద్గతకోమలాంకురైః. II, 8.

శక్రధనుర్విభూషితాః. II, 19.

సేంద్రచాపైః. II, 22.

ఆపక్వశాలిలలితానతగాత్రయష్టిః. III, 1.

ఫలభరానతశాలిజాలాన్. III, 10.

కుసుమభరనతానాం లాసకః పాదపానామ్.II,26.

ఆనర్తయం స్తరువరాన్కుసుమావనమ్రాన్.III,10

సప్తచ్ఛదైః కుసుమభారనతైః. III, 2.

సప్తచ్ఛదానుపగతాః కుసుమోద్గమశ్రీః. III, 13.

ఇట్టిపునరుక్తులనేకము లున్నవి గాని గ్రంథవిస్తరభీతిచే నుదాహరింపమానుకొంటిని. ఇన్ని పునరుక్తులున్నను గావ్యమును జదువుచు రసాస్వాదనచేయు సమయమునందుఁ బునరుక్తులుగా మదికిఁ దోఁచుటయే లేదు. అయినను గూడ నిన్ని పునరుక్తులుండుట యీ కవిత్వము యొక్క బాల్యావస్థను సూచించును.

II. అర్థాంతరన్యాసములను సాధారణముగా నుపయోగించుట కాళిదాసుని ప్రౌఢకావ్యములయందుఁ గనఁబట్టుచున్నది. అట్టి దిందుఁ గానరాదు గావున నియ్యది కాళిదాసుని తొలివయసున వ్రాయఁబడిన దనవచ్చును.

III. కవియొక్క సామర్థ్యము తన కావ్యమునకుఁ దగువస్తువు నెంచుకొనుటలోఁ జక్కఁగా నుపయోగింపఁబడుచున్నది. కథ రససంతముగా నుండు నెడల నల్పుఁడగు కవి వ్రాసినను నది చదువుట కింపుగా నుండును. రసవిహీనమగు కథను గ్రహించి మహాకవి వ్రాయఁబూనినను బాఠకుల నంతగా మెప్పింపఁజాలఁడు. ఋతుసంహారమునందలి విషయము కేవలవర్ణనప్రధాన మయినది. ఇట్టి విషయమును గ్రహించి వ్రాయునప్పుడు, కథను గ్రహించి వ్రాయునప్పటివలెఁ గవి రసమును బుట్టింపఁజాలఁడు. రఘువంశాది కావ్యముల వస్తువునకును నీకావ్యమునందలి వస్తువునకును గూడ నిట్టిభేదమే యున్నది. కావ్యమునకుఁ దగిన విషయము నెంచుకొనఁ దగిన సామర్థ్యము కాళిదాసునకు లేనికాలమున నియ్యది వ్రాయఁబడియుండును.

IV. కాళిదాసుని ప్రౌఢగ్రంథములయందలి రసస్ఫూర్తి యీకావ్యమునందుఁ గలుగువానికంటెఁ జాల వేగముగాఁ గలుగుచున్నది. ఇంతియగాక యాకావ్యములయందు విప్రలంభశృంగారము, కరుణ మొదలగునవి చాల పుష్టిని జెందియున్నవి. మేఘసందేశమునందలి రతివిలాపమునకును, రఘువంశమునందలి యజవిలాపమునకును, విక్రమోర్వశీయమునందలి పురూరవసుని విప్రలంభమునకును, శాకుంతలమునందలి దుష్యంతునియొక్క స్థైర్యము మొదలగు వానికిని నెనయనవచ్చు విషయము లిందు లేవు. ఇట్టి రసములను బుట్టించు శక్తి వయస్సు మీరుచుండఁగాఁ గవిత్వము పటుత్వమును జెందుచుండఁగాఁ గలుగుచుండును. షేక్స్పియరు నాటకములందును నిట్టిమార్పే కన్పించుచున్నదని డౌడనుగారు చెప్పుచున్నారు.

"—he dared to confront the most awful problems of life and could at will either stoically detain his mind from the contemplation of the unknown, or could brood upon it with long and wistful intensity; and at the same time his feelings increasing in order and swiftness grew in massiveness and complexity".

ఇంతియుగాక కావ్యమునందలి పాత్రలును, వర్ణన విషయములును వ్యక్తిగతములు (concrete) లేక విశేషములుగా నున్నయెడల నవి రసాలంబనములగుట కవకాశ మెక్కుడుండును. అవి జాతిగతములు (abstract) లేక సామాన్యములుగా నుండునప్పుడంత చక్కఁగా రసాలంబనములు గాఁజాలవు ఒకజాతిగాఁ బతివ్రతలయొక్క విరహావస్థలను గావ్యమునందు వర్ణించునప్పటికంటె నాయికావస్థలగు సీతారామలు లేక యక్షుని ప్రియురాలు నను వ్యక్తులయొక్క వర్ణించినయెడల రసస్ఫూర్తి చక్కఁగాఁ గలుగఁ గలదు. ఋతుసంహారమునందలి వర్ణనములు, కథలేదు గనుక, కేవలము జాతినిష్ఠములుగానే యున్నవి గాని వ్యక్తిగతములు కావు. షేక్స్పియరుయొక్క ప్రౌఢకవిత్వమునందుఁ గూడ నిట్టినేర్పు గలిగినట్లు డౌడెనగారభిప్రాయపడుచున్నారు: "If his ideas tend to become abstr act and notional he plunges them into concrete matter in order that they may enrich and vitalise themselves".

V. ఋతుసంహారములో నున్న వర్ణనములును, భావములును దక్కిన కావ్యములలోఁ బెంపొందింపఁబడి వన్నె పెట్టఁబడినయట్లు ముందిచ్చిన యుదాహరణములఁ బట్టి తెలియుకతప్పదు. ఋతుసంహారమునందలి పథికవనితల వెతయే వేరే విస్తృతినిఁ బొంది మేఘసందేశములోని యక్షినిఁ జేరినది. ఋతుసంహారమునందలి భోగులభోగములే యలకాపట్టణమునందలి యక్షుల జీవనముల వర్ణించుపట్ల విస్తృతిఁ గాంచినవి. ఈ కావ్యమునందలి వసంతర్తువర్ణనమే కుమారసంభవమునందలి వసంతవర్ణనమునకు మూలమయినది. రఘువంశమునందలి ఋతువర్ణనములకుఁ గూడ మూలము లిందు లేకపోలేదు. పయివాని కన్నిటికిని నుదాహరణములు పయి నిచ్చిన పట్టికలో నున్నవి.

మొత్తముమీఁద ఋతుసంహారము కాళిదాస విరచితమనియు, నయ్యది బాల్యావస్థయందే వ్రాయఁబడినదనియుఁ జెప్పువారితో నేనేకీభవించుచున్నాను.

ఈపయి నొసంగఁబడిన శ్లోక సాదృశ్యముల నన్నిటినిఁ బరీక్షించియు, నితరు లెవరైనఁ గాళిదాసుని గ్రంథములఁ గాంచి యందలి కల్పనల ననుకరించుచు ఋతుసంహారమును రచియించి కాళిదాసుని పేరిఁ బెట్టియుండవచ్చునని వాదింపవచ్చును. కాని ఋతుసంహారమునందలి కల్పనలు, భావములును వెనుకటి కావ్యములయందు వన్నె పెట్టఁబడినవని నేను చూపించిన యుదాహరణములం బట్టి తేలుచున్నది గదా! పయికవి తెక్కిన కాళిదాసకావ్యములను జూచి వ్రాసినయెడల నిట్టి క్రమపరిణామ ముండుట కవకాశము లేదుగదా! ఇట్టి కవితాపరిణామమును గాంచియుఁ గూడఁ బయికీతిని వాదించువారి నేవిధమునైనను నొప్పించుట సాధ్యము గాదు గావున నా విషయమునుండి విరమించెదను.

ఇఁకమీఁద నీకావ్యమునందలి రసమును నిర్ణయింపవలయును. ఈఋతువర్ణనమను చిత్రమును రచియించుటకుఁ గవియొక్క చక్కని భిత్తికనుగల్పించియున్నాఁడు. ప్రియుఁడు తన ప్రియురాలికిఁ జెప్పినట్లు గ్రంథమును ప్రారంభించియున్నాఁడు.

నిదాఘకాలో௨యముపాగతః ప్రియే. I. 1.

ఘనాగమః కామిజనప్రియః ప్రియే. II. 1.

మూఁడు నాలుగు సర్గములయందీ సంబోధనము లేకయే కవి వర్ణనమునకుఁ దొరఁకొనినాఁడు వర్ణనాగ్రస్తమనం దీప్రియాసంబోధనమును మఱచెనో, లేక పూర్వసర్గమునందలి సంబోధనమే యనువర్తించుచున్నది గదా పునరుక్తియేగులకని మానివేసెనో తెలియదు. రెండవ పద్ధతి నొప్పుకొను నెడల నైదవ సర్గమునందలి 'నిరోరు కాలం శిశిరాహ్వయం శృణు' V. 1. అను పునస్సంబోధనమునకు స్థలము లేక పోవలసివచ్చును. అటువ

సర్గమందు 'వసంతయోద్ధా సముపాగతః ప్రియే'(VI. 1.) యని తిరిగి ప్రబోధము చేయఁబడినది. దీనినిబట్టి చూడఁగాఁ బ్రతిసర్గము మొదటనుగూడ నీ సంబోధనముఁ జేయుటఁ గవి వివక్షించినట్లు తోఁచుచున్నది. ఈ సంబోధనములచేఁ గవి యీ గ్రంథమును శృంగారరసప్రధానమగు దానినిగాఁ జేయుట కుద్దేశించె ననుట తెల్లముగా నున్నది. గ్రంథమునందలి విషయమును బరీక్షించినను గూడ నీయభిప్రాయమే స్థిరపడుచున్నది. ఆయా ఋతువులయందలి ప్రకృతి యందంతయును స్త్రీపురుషుల శృంగార పర్యవసాయిగానే వర్ణింపఁబడినట్లు పాఠకులకు విశదముగదా! అంగములుగా నైనను దక్కిన రసముల కంతగా నిందు ప్రవేశమున్నట్లు లేదు.

ఈ ఋతుసంహారము ఖండకావ్య మనఁబడెడు తెగకుఁ జేరుచున్నది. సాహిత్యదర్పణము నందు ఖండకావ్యలక్షణ మిట్లు చెప్పఁబడినది: "ఖండకావ్యం భవేత్కావ్యస్యైకదేశానుసారి చ— యథా మేఘదూతాదిః". కావ్యమునందలి యేకదేశము ఋతువర్ణనముగదా. అట్టి యేకదేశమును గురించి వ్రాయఁబడినది గావున నియ్యది ఖండకావ్య మనఁబడఁ దగియున్నది.

ఈ గ్రంథమునకు సమమయిన కావ్య మాంగ్లభాషయందును గలదు. అది 'Seasons' (ఋతువులు) అను పేర 18 వ శతాబ్దమున థోంప్సన్ (Thompson) అను నాయనచే వ్రాయఁబడినది. ఈ రెంటికిని గల సామ్యవైషమ్యములను గాళిదాసుని కళాప్రతిభలను గురించి వ్రాయువ్యాసములలోఁ జర్చింతును.

చిన్నవయసులో నిట్టి సరసమగు కావ్యమును రచియించి వన్నెఁ గాంచిన కాళిదాసుఁ డెంతయుఁ బ్రశంసార్హుఁడు.

---

## పూరుషుండు

శ్రీ విక్రమదేవవర్మగారు

ఇడుమ గలుగంగ ధైర్యంబు విడనివాఁడు
కడఁగు పని ముగింపం బట్టు గలుగువాఁడు
దైన్య మెప్పుడు నొందక తిరుగువాఁడు
పుట్టువారిలో నిక్కంపుఁ బూరుషుండు.

న్యాయ మెపుడును విడువక నడుచువాఁడు
చెప్పు భంగిఁ గార్యంబులఁ జేయువాఁడు
పిఱికితనమును మదినుండి పెఱుకువాఁడు
పుట్టువారిలో నిక్కంపుఁ బూరుషుండు.

ధూపము గాలుచు న్మనుజ
తుష్టిఁ బొగం దగఁ జేయుచుండఁగా
దీపము గాలుచుం దనదు
దీప్తిని లోకుల కిచ్చుచుండఁగా
శ్రీపతిభక్తుఁడై జనుల
సేమము సేయఁ గడంగు పూరుషుం
డాపద కింక మిత్తికి న
వంతయు జంకునె? పూన్కి మానునే?

---

# ఆంధ్ర ముద్రారాక్షస విమర్శనము

(వెనుకటిసంచిక తరువాయి)

కీ. శే. కళాప్రపూర్ణ, మహోపాధ్యాయ, వేదము వేంకటరాయశాస్త్రిలుగారు

### కథాసంగ్రహము: పీఠిక

(౧) "చాణక్యుఁడను నొక బ్రాహ్మణుఁడు తన పాదమున గ్రుచ్చుకొన్నదను కోపముచే నొకగడ్డిపోకను ముక్కముక్కలుగాఁ ద్రుంచి మండుటను జూచి యాతఁడతికోపస్వభావుఁడనియు." కోపమే కావించినదా? కారణము వలదా? (౨) "నందగృహమునకుఁ బోయి యొక యున్నతాసనముపైఁ గూర్చుండె." అగ్రభోజన పీఠముననని కథగాని ఉన్నతాసన మని గాదు (౩) "నందులతని బలవంతముగ జుట్టు పట్టి క్రిందఁ బడలాగిరి." వారి యాజ్ఞచే భటులు లాగిరిగాని వారే లాగలేదు. (౪) "సభామధ్యమున." సభగాదు, భోజనశాల. (౫) "చంద్రగుప్తునకు రాజ్యమిచ్చి కాని జుట్టు ముడివైచికొనననని ప్రతిజ్ఞపట్టె." ఇది తప్పు. ఆసమయములో నందరాజుల నందఱిని నాశముచేసెద నని యాతఁడు ప్రతిజ్ఞ చేసెనే గాని చంద్రగుప్తునికి రాజ్యమిచ్చెదనని గాదు. భోజనశాలనుండి యస్మదుక్తరీతిని ప్రతిజ్ఞచేసి చాణక్యుఁడు చంద్రగుప్తగృహమునకుఁ బోయి అచట (౬) చంద్రగుప్తునికి "నీకు నందరాజ్యమిచ్చెద"నని వాగ్దానము చేసెను. అంతియగాని యీ వాగ్దానము అనువాదకులు వ్రాసినట్లు నందకృతావమానమునకు పూర్వముగాదు. (౭) "నందుల నందఱఁ జంపెను." ఈ బ్రాహ్మణుఁడు వారినందఱి నెట్లు చంపఁగలిగెను? ఆభిచారికములవలన నని వక్తవ్యావచనము దోషము. (౮) "నందుల కాప్తబంధువగు పర్వతేశ్వరునిఁ జంపించె." పర్వతేశ్వరుఁడు మ్లేచ్ఛరాజు; నందులు క్షత్త్రియులు. వీరికతఁ డాప్తబంధువెట్లు? (౯) "విషకన్య నొకతెను కేరఁదీసికొని యుండె." విషకన్యను అభిచారముచే కుండమునుండి పుట్టించినారు. దానితో సంగమించినవాఁడు చచ్చి అది మాయమగును. దానిని సృజించినవాఁడు చాణక్యమిత్రుఁడు రాక్షసుని యొద్ద క్షపణకవేషమున నున్న ఇందుశర్మయను బ్రాహ్మణుఁడు. ఆకన్యను పర్వతేశ్వరచంద్రగుప్త రాక్షస చాణక్యాదులు సభచేసి యుండఁగా రాక్షసుఁడు చంద్రగుప్తున కర్పించెను. చాణక్యుఁడు కల్పించి పర్వతేశ్వరునికి దానిని రాక్షసుని చేతనే యిప్పించెను. అంతియ గాని, (౧౦) చాణక్యుఁడు చారులవలన నెఱుఁగలేదు. (౧౧) "తన గూఢచారుల వలనఁ దెలిసికొని." చాణక్యుఁడు రాక్షసప్రయత్నములను ఆయాసందర్భములలో తన ప్రతిభావిశేషముచే నెఱింగెనే కాని గూఢచారులవలన నెఱుంగలేదు. ఆవిషయము సమగ్రముగా ద్వితీయాంకమున విశదీకృతమయి యున్నది. వీరు కథ తెలియకయే ఈ గ్రంథమును రచించినారు. రచించియు కథం గనలేకున్నారు. (౧౨) "నందుల నందఱిం జంపెను. తరువాత నందుల కాప్తసచివుఁడగు........పర్వతేశ్వరుని జంపించె. అంత రాక్షసుఁడు............సర్వార్థసిద్ధిని గుఱించి ప్రయత్నము నేసి." నందుల నందఱిం జంపిన వెనుక సర్వార్థసిద్ధి యెక్కడ? 'అందఱిం' జంపి యనఁగా సర్వార్థసిద్ధిని గూడఁ జంపెననియే గదా యర్థము. 'అంత రాక్షసుఁడు.....ప్రయత్నము నేసి' యనుట యసంగతి. కథలో రాక్షసుఁడు ప్రయత్నము చేసిన పిమ్మటనే చాణక్యుని యుక్తివలన సర్వార్థసిద్ధి మడిసెనని యున్నది. (౧౩) "చందనదాసుఁడు చంపఁబడనున్నాఁడని విని......పాటలీపుత్రమునకు వచ్చెను." ఇది సరిగాదు, పాటలీపురమునకు వచ్చి వినెను.

### ఈనాటకమున వచ్చు పాత్రములు

(౧) "మఱియుఁ బ్రసంగవశమునఁ గొందఱు రాజులను భటులను వత్తురు." 'మఱియు' శబ్దస్వారస్యముచే

ఈ కొందఱు రాజులును నాటకపాత్రములే యని తోఁచుచున్నది. నాటకపాత్రోదాహృతులుగాని రాజపాత్రములెవరును ఈ నాటకములో లేరు. కొందఱు ప్రస్తావింపఁబడియున్నారు. వారు పాత్రములు గారు. అనువాదకులు పాత్రశబ్దార్థము తెలియఁగక యీగతిం బొరఁబాటు చేసిరి కాఁబలయును.

## ప్ర స్తా వ న.

పు. ౧. (౧) "విశాఖదత్తునిచే నభినవముగా రచియింపఁబడి... సుపర్ల అనంతరాయనిచేఁ దెనిఁగింపఁబడిన 'ముద్రారాక్షస'మను నాటకమును." అనువాదకులే విశాఖదత్తకవి యీ ముద్రారాక్షసమును ౧౧౪౦ సంవత్సరముల క్రిందట చేసినాఁడని టీలాంగుగారి మతము ననువదించియున్నారు. కావున "అభినవముగా" అను పదమును చోటు మార్చి 'విశాఖదత్తునిచే రచియింపఁబడి... ...సుపర్ల అనంతరాయనిచే అభినవముగా...' అని వాక్యమును దిద్దికొనిన తెలివిగానుండును. (౨) "సభికులు." 'సభికాద్యూతకారకాః', 'సభాసద స్సభాస్తారా స్సభ్యాస్సామాజికాశ్చ తే' అను నమరవాక్యముల వలన సభికు లనఁగా జూదగాండ్రనియు, సభ్యులనఁగా సభాసదులనియు విశద మగుచున్నది. సభ్యార్థమున సభికశబ్దమును బ్రయోగించుకొనుట అసమంజసము. (౩) "సంతోష దాయకమే" ఇదియొక క్రియ్యాని పదముగా అనువాదకుల కిష్టమయియున్నది. "మీరందఱు క్షేమముతో నుండుటయే సంతోషదాయకము." "మిగుల సంతోషదాయకముగా నున్నది."

పు. ౨. (౧) "సంగీత మారంభించెదను." మూలమున "గృహిణీమాహూయ...సంగీతక మనుతిష్ఠామి" అని యున్నది. సంగీతకము స్త్రీలపాట. సంగీత మనఁగా సామాన్యమయినపాట. అనువాదకులీ విశేష మెఱుఁగక కకారము నెత్తివేసికొనిరని తోఁచుచున్నది. (౨) "పావనులనుగాఁ జేయుటకై యెవరయిన నతిథులు వచ్చిరా?" మూలమున "అభిమతా వా భవన మతిథయ స్సంప్రాప్తాః"—"ప్రియులయిన యతిథులెవరయిన నింటికి వచ్చిరా" అని యున్నదిగాని పావనులను జేయుటకై యని లేదు. అభిమతశబ్దార్థమును అనువాదకులు పావనార్థముగా భ్రమించిరి కాఁబోలు!

## ప్రథమాంకము

పు. ౪. (౧) "చాణ—వత్స, ఆసనము తీసికొనిరా! శిష్య—స్వామీ! అచటకుఁ బోయి కూర్చుండుఁడు."... ఆసనము తెమ్మని చాణక్యుఁ డాజ్ఞాపింపఁగా ఆసనము తేక 'ఆసన మచట నున్నది. అచ్చటికిఁబోయి కూర్చుండుఁడు.' అనుట పొగరుబోతుతన మనిపించుకొనును. అనువాదకులు మూలార్థము సరిగా తెలియఁగలేదు. మూలములో "చాణ—వత్స, కూర్చుండఁగోరెద" అని యున్నది. ఆసనము తెమ్మనిలేదు. (౨) "అదిగో, ఆ ద్వారగముఖమున"—మూలములో 'ఇదిగో' అని యున్నది. (౩) "ఆ ద్వారగముఖమున", 'ఇయం ద్వారప్రకోష్ఠశాలా' అని మూలము. 'ఇది ద్వారము చెంగటి చావడి' అని యర్థము. ద్వారముఖ మర్థముగాదు. (౩ఎ) "ఎల్లప్పుడును ఆసనముంచఁబడియే యుండును." ఎల్లప్పుడును ఆసనముంచఁబడియే యుండునని సార్వకాలికతను చాణక్యునికి శిష్యుఁడు చెప్పుట పొగరే. మూలము: 'ఇయం సన్నిహిత వేత్రాసనైవ' అని యొకపాఠము. 'సదాసన్నిహిత' యను జబ్బుపాఠమునే అనువాదకులు గ్రహించినారు. (౪) "నీదుశ్శీలత కాదుసుమీ!" దీనికి మూలము: 'ఉపాధ్యాయసహభూః శిష్యజనే దుశ్శీలతా' (తారానాథగారి పాఠము). దీనికి ధుండిరాజవ్యాఖ్య—"శిష్యజనే విషయే, దుశ్శీలతా ఉపాలంభన శీలతా, అశ్వేప్యప రాధే శిష్యజనం ప్రత్యుపాలంభన ముపాధ్యాయానాం సహజో దోష ఇత్యర్థః." అని. ఇందువలన దుశ్శీలత ఉపాధ్యాయులదిగానే మూలోక్తము గాని శిష్యులదిగాఁ గాదు. అనువాదకు లీవ్యాఖ్యం గనక 'శిష్యజనదుశ్శీలతా' యను పాఠమును గ్రహించినారు. అది సరి యయిన పాఠముగాదు. 'ఉపాధ్యాయ సహభూః' అను విశేషణమును త్యజించినారు. (౫) "జనకవధామర్షితుఁడయిన" మలయకేతువుజనకుఁ డెవఁడో! మూలమున 'పర్వతక పుత్రేణ మలయకేతునా' అనియున్నది వీరు 'పర్వతక పుత్రేణ' అను విశేషణమును వదలినారు. (౬) "నంద

రాజ్యమును పంచియిచ్చెదనని ప్రోత్సాహ పఱచి". పంచుటకు రెండవపాలివాఁ డేఁడు? నందకులము నశించెను గదా! మఱి నందరాజ్యమెల్లను సహకారియయిన యీ మలయకేతువునకే యీయరాదా? మూలము: "సకల నన్దరాజ్యపరిపణనప్రోత్సాహితేన"–'నందరాజ్య మెల్ల నీకు ఈసాహాయ్యమునకు వెలగా ఇచ్చెదనని ప్రోత్సాహపఱిచి' అని యర్థము. మూలార్థమును అనువాదకు లెఱుంగరయిరి.

పు ౫. (౧) "వదంతి". 'నీను నందకులము' మొదలుకొని 'కొన్నాఁడు' అనునిఱకును ఈవదంతి. ఈవాక్య ప్రణాళికయెల్ల వదంతిశబ్దము చెవిని పడువఱకు ఎట్లు జ్ఞాపకముండును? అదినుండి నిరాకాంక్షుయయినందున పరాకుపడి వదంతిశబ్దశ్రవణముచే మరల స్మరణక్లేశము నొసంగి స్మరణకు ప్రాయికముగా రాక పైవాక్యార్థ బోధకుం గూడ ప్రతిబంధకముగా నగపడును.

పు. ౬. (౧) "ఈవిషయమున నింక వేఱుప్రయత్నయ లేవియుఁ జేయనక్కఱలేదు." ఈయర్థముగల పాఠము లేదు. (౨) "వాఁడు మలయకేతువును...వచ్చులోపలనే. ...సర్వార్థసిద్ధిని చంపించినాఁడను." సర్వార్థసిద్ధిని చంపించునప్పటికి రాక్షసుఁడు మలయకేతువుతోఁ జేరలేదు. వానింగూడి చంద్రగుప్తుని మీఁదికి వచ్చునను సూచనయే లేదు. సర్వార్థసిద్ధి చచ్చినవెనుక రాక్షసుఁడు నందవంశీయుఁడు ఎవ్వఁడును లేనందున మలయకేతువుం గలసె. కథ యిట్లుండఁగా అనువాదకులు 'యావత్' అను పదమున కర్థము తెలియక యీ యపభ్రష్టము నొనరించినారు. మూలార్థము: 'ఈయాలోచనచేతనే పాపము! తపోవనగతునయినను నందవంశ్యుని సర్వార్థసిద్ధిని చంపించితిని. అట్లయినను (నందవంశము నిర్మూలమయినను) రాక్షసుఁడు మలయకేతువుంజేరి 'యావ దేనం నత్యాపి వర్దాన్వయే నమూల మున్మూలితే ఒపీత్యర్థః' అని ఢుండిరాజవ్యాఖ్య. ఈ తెలుఁగువలన ముందు రాక్షసుఁడు మలయకేతువుం గూడినట్లును, పిమ్మట చాణక్యుఁడు సర్వార్థసిద్ధిని చంపించినట్లును కథ వైపరీత్యము నొందుచున్నది. ఈతర్జుమా మూలద్రోహిగా నున్నది. (౩) "నా కత్యంతప్రియమిత్రుఁడగు భాగురాయణునిచేత" ఇందు 'నా కత్యంతప్రియమిత్రుఁ'డనుట తప్పు; అమూలకము. చాణక్యునికి భాగురాయణప్రభృతులు భృత్యులుగాని మిత్రులుగారు.

పు. ౭. (౧) "కొన్నిదినములలో వానిని స్వాధీనపఱుచుకొనఁగలను." మూలము: 'ప్రజ్ఞయా నిగ్రహీతుమ్'. ప్రజ్ఞచేత పట్టి దండింపఁగలను అని యర్థము. నిగ్రహ శబ్దార్థము తెలియక పడిన పాటిది. (౨) "అనురాగమును, అహంకారమును గల వారలు నెఱుఁగుటకై." మూలము: 'అను రక్తాపరక్తజన జిజ్ఞాసయా' –ని. అపరక్తులనఁగా అనువాదకులు అహంకారము గలవారని వ్రాసినారు. అదితప్పు. "అపరక్త-Discontented, dissatisfied, disaffected. చన్ద్రగుప్తాదపరక్తాః. Mu. 1." Apte. (౩) "చంద్రగుప్తునియందు భక్తివిశ్వాసములు గలవారై." ఇది పరమాసహ్యముగా నున్నది. "చన్ద్రగుప్తసహోత్థాయినః" అనిమూలము. "ఉత్థాయిన్-Rising (fig. also). చన్ద్రగుప్తసహోత్థాయినః. Mu 3." Apte. చంద్రగుప్తునితోఁగూడ వృద్ధిపొందువారని తాత్పర్యము. (౪) "తమకేర్పఱిచిన పనులను చక్కఁగ నెఱవేర్చునున్నారు." పాడు తర్జుమా. మూలము: "తత్తత్కారణముత్పాద్య కృతకృత్యతామాపాదితాః." 'ఆయాకారణము కల్పించి ధన్యులుగాఁ జేయఁబడిరి.' అనఁగా వారికి నానా నిమిత్తములు, బహుమానములు, ఉత్తమపదములు నొసంగి తుష్టులంజేసి యున్నాఁడనని చాణక్యహృదయము. (౫) "అతిజాగరూకులైన యాప్తులను." ఇచట 'పరీక్షిత భక్తయః' అను విశేషమును అనువాదకులు వదలినారు. (౬) "కుసుమపురమునకుఁ జని......మైత్రిని సంపాదించుకొని యుండుమని పంపినాఁడను." మూలవిరుద్ధము. 'ఉపనీయ' అనఁగా 'తెచ్చి'; 'చని' గాదు. 'సఖ్యం గ్రాహితః' (అతనికి నందమంత్రులకును) 'సఖ్యము చేసితి'నని యర్థముగాని 'సఖ్యము చేసికొమ్మని పంపితి' నని గాదు. (౭) "నమ్మకముంచి యున్నాఁడని తెలిసినది." అని తెలిసినదనుట సొంతకవనము; మూలమున లేదు. నమ్మకముంచియుండుట చాణక్యుఁడు ప్రత్యక్షముగానే

ఎఱిఁగినవాఁడు. ఆకథ చదివినఁ దెలియును. (౭) "అప్పుడెల్లరును మాదెసఁ దలలెత్తి చూడనోడుదురు."– తెలివితక్కువమాట. 'మాయందు ప్రయత్నలోప మేమియు లేదు.' అని మూలార్థము.

పు. ౮. (౧) "ఇతరదేవతలను గొల్చువారి ప్రాణములను హరించువాఁడు... నాపదరా నీయఁడు." ఇందు నాలుగు పంక్తులు మూలమున రెండు ఆర్యావృత్తములు. వానిని అనువాదకులు గద్యీకరించినారు. మూలముతో నర్థసంబంధము కూడ మిక్కిలి తగ్గించినారు. (౨) "ఎట్టి దుర్మార్గుఁడయినను యుగభక్తుఁడైన్నఁ జేను వినాశ మొందఁడు. కావుననే సర్వలోకము హరించువాఁడు నాకేమియు నాపదరా నీయఁడు." ఇది స్వకీయార్థకుఁడెను. మూలార్థము: "మఱియును భక్తిప్రాప్యకమునఁ గొనఁబడెనేని పురుషునకే శివసనుండును.(ఇందు కుస్పష్టాంశము) "సర్వలోకముల సంపువాఁడయిన యమునిచే మేము జీవించుచున్నాము." దీనిని ఎట్లు పాడుచేసినారో చూచుకొనుఁడు! (౩) "శిష్యుఁడు– ఛీ! మూర్ఖ! సకలధర్మవేదియైన మాయుపాధ్యాయునకు నీవేమి యుపదేశించెదవురా?" మూలార్థము: 'ఛీ, మూర్ఖుఁడా, మాయుపాధ్యాయులకన్న నీవు ధర్మవేత్తవఁటరా!' (౪) "అట్లే నాకుఁ దెలియని యంశములు... దెలిసియుండవచ్చును." ఈభాగము నిర్మూలము; విద్యార్థివివాదసరణిం బరిణతము. (౫) "సర్వజ్ఞుఁడగు మాయుపాధ్యాయు నవమానించుచున్నావా?" 'మాయుపాధ్యాయుని సర్వజ్ఞతను దొంగిలింపఁగోరుచున్నావు.' అని మూలార్థము. (౬) "తెలిసిన నీకేమి; తెలియకున్న నీకేమి?" ఉభయత్ర 'నీకు' పదమును తీసివేయవలయును. ఈసంగతులు నిష్ప్రయోజనములని వక్తృహృదయము.

పు. ౯. (౧) "తెలిసికొనుము." 'జానాసి–ఎఱుంగుదువు' అని మూలము. (౨) "వారివారికిఁ గల కష్టముల నన్నిటిని"—'తేషు తేషు విరాగకారణేషు'—'ఆయా విరాగకారణములను.' The various causes of disaffection అని మూలార్థము. దాని నిట్లు వెక్కిరించినారు.

పు. ౧౦. (౧) "ఏమి! క్షపణకుఁడు నాశత్రువునందు పక్షపాతమును వహించినాఁ డనిపించుకొనుచున్నాఁడా!" ఈభాషితమునందు మూలమున 'సవర్ష మాత్మగతమ్' అని సంకేతమున్నది. దానిని తొలఁగించి ఈభాషితమును చాణుఁడు వినునట్లు చేయుట తప్పు. (౨) "అనిపించుకొనుచున్నాఁడా!" అను భాగము నిర్మూలము. ఆసంకేతమును గ్రహించి యీనిర్మూలము నెత్తివేసిన ఈవాక్యమున నర్థము మాఱును. చూచుకొనుఁడు. (౩) "చాణ: (తనలో) అహో నేఁబంపిన శివసిద్ధి గదా!" అర్థిమాయినట అసంబద్ధపలపితముగా నున్నది. మూలార్థము: "శివసిద్ధి మావేఁగువాఁడుగదా!" వీరి యాతెనుఁగున ఈవాక్యమువలన చాణక్యునికి క్షపణకుఁడేవాఁడో తెలియనట్లు, ఈవాక్యమునఁ దెలిసినట్లును గ్రహింపవలసియున్నది. ముందే యెఱిఁగినందులకు అనుగుణముగా 'వాఁడు నాకార్యమును పూర్ణముగా నెఱవేర్చును.' ఇట్టి యీరీతి నేమియు స్వగతవాక్యము లేదు. (౪) "ఒక కాయస్థజాతివాఁడుకూడ మనకు విరోధుఁడయినాఁడా!" అనువాదకులు 'మాకు' అనుటకు 'మనకు' అని ప్రయోగించినారు. (౫) విరోధశబ్దార్థమును అనువాదకులు గ్రహింపఁజేయలేదు. విరోధుఁడని యొక మహాదర్థకపదము కల్పించి ద్వేషియను నర్థమునఁ బ్రయోగించినారు 'విరోధః' '1. Opposition, 6. enmity, hostility.' Apte. 'విరోధుఁ'డను పదము తప్పు. 'విరోధము' అనవలయును. (౬) ముసళ్ల పండుగ ముందున్నది. 'కాయస్థజాతివాఁడుగూడ విరోధుడైనాఁడా' అనుటచే అనువాదకులు చాణక్యునికీద్వేషము ఇంతకుముందు తెలియనట్లగపఱిచినారు. ఈభాషితమునకే తృతీయపంక్తియందు 'కావుననే వాని నణఁచివేయుటకై సిద్ధార్థకుని నియోగించినాఁడను' అనుటచే అనువాదకులే చాణక్యునికీవిషయము చక్కఁగా తెలిసియేయున్నట్లును, అందులకతఁడు ప్రతివిధానము చేసియే యున్నట్లును తెలిపినాఁడు. ఇసీ! ఏమి ఈతర్జిమా సాహసము. "కాయస్థ......నాఁడా!" అను వాక్యమునకు మూలము. "కాయస్థ ఇతి లఘ్వీ మాత్రా." 'కాయస్థుఁడనునది చిన్నమాత్ర' అని యర్థము. క్షణములో దానిని మ్రింగివేయఁగలను. అని భావము. (౭) "వాని నణఁచివేయుట

కయి" మూలపదమునకు సంబంధములేని తెనుఁగు తర్జుమా ముక్కయిది. దీనిమూలము: 'సుహృచ్ఛద్మనా'. 'మిత్రవ్యాజమున' అని యర్థము. 'కాయస్థునికి మిత్రుఁడుగా నభినయించుచు వానియొద్ద చాణక్యప్రణిధి సిద్ధార్థకుఁడున్నాఁడు' అని భావము. ౮. "చాణక్యునకు రెండవ హృదయము". చాణక్యున కనుట తప్పు. రాక్షసునకు అని మూలము.

పు. ౧౧. (౧) "ఇప్పుడు నాచేతిలో రాక్షసుని యుంగరము కాదు. రాక్షసుడే చిక్కువడియున్నాఁడు." ఇంతకల్ల మూలమున "రాక్షసుఁడే నా వ్రేలికి మిత్రమయ్యెనని గదా చెప్పవలయును." (౨) "అభ్యంతర గృహమునుండి." మూలము: "ఎక్కడో అవసరకాదో" 'ఒకగదినుండి' అని అర్థము. (౩) "వాఁడువెళ్లినాఁడు, వాఁడు వెళ్లినాఁడు." మూలములో 'వాఁడు వాఁడు' అను పదములు లేవు. (౪) "స్త్రీ కలకలము." దీనికి మూలము: 'శఙ్కాపరిగ్రహానివేదయిష్యతి మ్.' 'భయపడుటను దెలుపుచుట్టి' అని యర్థము. అనువాదకులు దీనిని త్యజించినారు. కారణమరయుఁడు. (౫) "నాయెదుట ద్వారము నొద్ద' లుపఁబడియుండ". ఇది మూలమున లేదు. (౬) "ద్వారమున కావల నొక స్త్రీ". మూలమున 'ద్వారమందు' అనియే యున్నది; 'ఆవల' అని లేదు. (౭) "బాహులతను చాఁచి". మూలమున ఈబహువచనము గాని, చాచుటగాని లేదు. 'కోమలమయిన బాహులతతో' అని మూలము (౮) "లాగినది-" "నిష్క్రమన్త్యా" 'బైటకువచ్చుచు' అని మూలమున క్రియావిశేషమున్నది. దానిని అనువాదకులు వదలినారు అర్థము తెలిసికొనుండదు (౯) "నడవ కడపమీఁద". ఇది తప్పు. 'గదికడపమీఁదు' అని యుండవలెను. ఆమెగదినుండి వెలువడలేదు. జాఱిన యుంగరము ఆమెయున్న గదిగడపమీఁదఁ బడక దూరమునకుండు నడవగడపమీఁద ఎట్లు పడును? చేయి విసరఁగాఁ బడెనా? ఆప్రకారము మూలమున లేదు. 'దేహళీబంధమిఙ్మ-గడపమీఁద' అని మూలము. కథ తెలియకయే తర్జుమా! (౧౦) "ఒక కులకాంతవలె". మూలమున 'ఒక' లేదు. 'ప్రణామనిభృతేవ' అని కులకాంతకు విశేషణమున్నది. దానిని అనువాదకులు వదలినారు. 'నమస్కారనిశ్చలవలె' అని తదర్థము. (౧౧) "నాపాదములపై వ్రాలినది" మూలము: "మమచరణపార్శ్వం సమాగత్య నిశ్చలా సంవృత్తా". 'నాపాదముల చెంతకు వచ్చి కదలకయుండెను' అని యర్థము. 'సంవృత్తా' శబ్దము ఉపమాన విశేషణంబుచు కఠినమయ్యెఁగావలయు.

పు. ౧౨. (౧) "చాణ:—...శోణోత్తరా! ఏమి విశేషములు? ఏమిపనిగలిగి వచ్చితివి?" మూలమున 'ఏమి విశేషములు' అను మాటలేదు. చాణక్యునిచే నిట్లు ప్రశ్నదములు పలికించుట యుచితముగాదు. (౨) "నమస్కారపూర్వకముగా". ఎవరుచేసిన నమస్కారమిది? శోణోత్తరదా? చంద్రగుప్తునిదా? మూలమున "శిక్షేకమలముకుళాకార మంజలిం నివేశ్య"—'శిరమున తామరమొగ్గ రూపున మోడ్పుఁగేలుంచుకొని' అని చంద్రగుప్తుఁడు చాణక్యునికి (శోణోత్తరకుఁ గాదు) చేయు నమస్కారమునకు విశేషణమున్నది. దీనిని అనువాదకులు త్యజించుటకును, నమస్కారమును శోణోత్తరదిగా వ్రాయుటకును కారణము పీఠికలో వారు నాకు చెప్పినట్లు మూఁడు ప్రతులలో బాగున్నదాని గ్రహించుటయే గాఁబోలును! పు. ౧౩. (౧) "గుణవంతులకు బ్రాహ్మణులకే". మూలమున 'గుణవంతులకే' అని యున్నది. బ్రాహ్మణశబ్దము లేదు. (౨) "విద్యావంతులకు". మూలమున 'గుణవంతులను' అని యున్నది. ఉద్దేశ్యధేయతాభావమునకయి 'గుణవంతులు' అనియే యుండవలయును. విద్యయే ప్రధానముగాదు గావునను, గుణము ప్రధానము గావునను (నాంతరీయకవ్యాపారముచే విద్యయును గుణమునందు చేరుఁగాక). మూలకారులు విద్యను జెప్పక గుణమును జెప్పినారు. అతెలివిని తర్జుమా కర్తలు గ్రహింపక చెఱిచినారు. (౩) "ఈసంగతులను ఉత్తరమున వ్రాయవలసినదే." మూలము: 'ఉత్తరోఽయం లేఖార్థః.' అర్థము: 'ఈవిషయము జాబులోఁ మిమ్మటి భాగముగా నుండనోపును.' అనువాదకులు ఉత్తరశబ్దమునకు రాజమహేంద్రవరవ్యావహారికార్థమును గ్రహించినారు. ఆదేశమున ఉత్తరమన 'జాబు' అనుటకు వ్యవహారము. ఆయర్థము గ్రాంథికము గాదని అనువాదకు లెఱుఁగరు. 'లేఖార్థః' అనఁగా

తర్జుమాకర్తలు 'వ్రాఁతకొంటకు' అనఁగా 'వ్రాయవలసినదే' అని యర్థము గావించికొనిన ట్లగపడుచున్నది. 'లేఖార్థః—లేఖయనఁగా జాబు. అర్థః=విషయము. దీని విషయముక్కాల—మూలమున (౪) 'పూర్వ కథమస్తు.' పూర్వభాగమేది గాదగుశా— అని యర్థము. దానిని అనువాదకులు 'కాని కొన్ని సంగతులు వ్రాసినతరువాత నీసంగతులు వ్రాయవలయును గనుక మొట్టమొదట నేమి వ్రాయుట?' అనిరబ్బురు లాగినట్లు ఒకటియు నరపంక్తిగా లాగినారు. ఇందుల కారణము ఉత్తరశబ్దార్థము గోచరింపమియే. (౫) "(అని దేనినో వ్రాసి)"—ఈసంకేతవాక్యము టేలాంగు గారి ముద్రణమున నున్నది. మఱికొన్నిట లేదు. లేమియే శ్రేయము. ఎట్లనఁగా 'అథవా న లిఖామి' అని పూర్వోత్తరవాక్యము దీనికి విరుద్ధము. దీని పూర్వవాక్యము ఇతరప్రతులయందు 'సర్వ మనభివ్యక్తమే వాస్తామ్'—'అంతయు నస్పష్టముగానే యుండుఁగాక!' సర్వ మనుటకు టేలాంగుగారు పూర్వమనుపాఠమును గ్రహించినారు. అనువాదకులు దేనిం గ్రహించిరో తెలియదు. 'వీరిపేళ్లు' అని తెనిఁగించిరి. అది యీ రెండుపాఠములకు సంబంధపడదు. మూఁడవపాఠము లేదు. కొన్ని ప్రతులయందు 'నీ వీయుత్తరము సిద్ధార్థకునిచేతికిచ్చి' అను నీసర్వమూలవిపరీతవాక్యము నవంతరము '...కర్ణే కథయిత్వా'—'చెవిలో చెప్పి' అని సంకేత మున్నది. ఆసంకేతము 'ఏమో వ్రాసి' యను సంకేతమునకు విరుద్ధమగును గావున టేలాంగుగారు దానిం ద్యజించినారు. ఇందువలన టేలాంగు గారు చాణక్యుఁడు ఏమో వ్రాసియిచ్చినట్లే అభిప్రాయపడిన ట్లగపడుచున్నది. అవిషయమునే అనువాదకులు నిర్భయముగా నొక్కి నొక్కి—లిపినారు. అందుకై మూలాతిక్రమణములు మూఁడు చేసినారు. 1. 'నీ వీయుత్తరమును సిద్ధార్థకునిచేతికిచ్చి' 2. 'మరల' 3. 'నేనంపిన యుత్తరమని'. చాణక్యుఁడు జాబువ్రాసి యీలేదు; చెవిని చెప్పిపంపినాఁడు. ఒకటి: పదిపండ్రెండు వత్సరములనుండి ప్రసిద్ధుఁడయిన ప్రతిమంత్రి చాణక్యుఁడు తన యెదిరిమంత్రి కాయస్థునిచేతిలో తనవ్రాఁతను, తనకు సర్వకార్యసాధకమైన యీ వ్రాఁతను—రాక్షసునిచేతఁ బడినయెడల తనకు సర్వకార్యభంజకమగు దానిని—పడనిచ్చునని నమ్మశక్యము గాదు. రెండు:—తమమతమున కనుకూలమనియెంచి టేలాంగు గారు గ్రహించిన 'పూర్వమ్' అనుపాఠము సరిగాదు. పూర్వ మనభివ్యక్తమేని ఉత్తరము మాత్ర మభివ్యక్తముగా నున్నదా? అంతెల్ల అనభివ్యక్తముగానే యున్నది. కావున 'సర్వమ్' అనుపాఠమే సరి. మూఁడు:—అప్రకారము చాణక్యుఁడు జాబే యిచ్చినయెడల 'ఏభి రక్షరైః' అను పదములకు పూర్వము 'లిఖితమును చేతనిచ్చి' అని సంకేత ముండవలయును. అది లేదు. నాలుగు:—సిద్ధార్థకుఁడు శకటదాసుని వ్రాఁతను దెచ్చియిచ్చెనే కాని దాని యసలును—చాణక్యలిఖితమును తెచ్చియీయలేదు. దానిగతి యేమాయెనో చాణక్యుఁడును అడుగలేదు. ఈహేతువులచేత వ్రాయకయే చెప్పిపంపె ననుమతమే యనుమతముగా నున్నది.

పు. ౧౪. (౧) 'ఎవరికెవరేవిషయమయి వ్రాసిరో దానిని నేను తనలో స్వయముగాఁ జెప్పెదనని'—మూలము: 'కో నామికస్యాపి స్వయం వాచ్యమితి.' అర్థము: 'ఎవఁడో, ఎవనికో స్వయముగా చదువుకొనఁదగినది.' ఇది సిద్ధార్థకుఁడు శకటదాసునికి చెప్పవలసిన సమాధానవాక్యము. దీనిని అనువాదకులు సిద్ధార్థకునికి చాణక్యుఁడు చెప్పు సమాధానవాక్యముగా భావించి చెఱిచినారు. సిద్ధార్థకుఁడు భృత్యమాత్రుఁడు; వానికి చాణక్యుఁ డీరహస్యమును తెలిపెదనని సమాధానవచన మంపుట కేవల మనుచితము. ఇందులకనుగుణముగా వాఁడు శకటదాసలిఖితలేఖముం గొనివచ్చి యిచ్చినప్పుడు వాఁడనుగనులేదు; చాణక్యుఁడు చెప్పనులేదు. (౨) "తీసికొనిరమ్మని చెప్పుము" 'కూడదు సుమీ' అను పిమ్మట 'అని చెప్పుము' అని యున్న మూలానుగుణముగా నుండును. (౩) "చాణ—(తీసికొని చదివి)"—ఇచట 'తీసికొని' అను మాటవెంబడి 'అహో దర్శనీయా అక్షరాణామ్'—'ఆహా! అక్షరము లెంత యందముగా నున్నవి' అను వాక్యమును అనువాదకులు త్యజించినారు. (౪) "ఇంక నేమిచేయవలయును?" దీనికి పూర్వము 'ఆర్య, ఇదిగో లేఖ, ముద్రవేసితిని' అని మూల మున్నది. దానిని అనువాదకు లేలనో విడిచినారు. (౫) "మిక్కిలి యాప్తుఁడయినవానిని నియోగింపవలసిన

యుండవలయుననగా". '(విక్రీ)-లి' శబ్దము సాంకేతికవిశ్వము; అమూలకము. 'అప్పుడయినవానిని'-ఇంగ్లీషు మూలమున 'ఆత్మనా ఽగ్నిక్షేప్తరే' అని పాఠ మున్నది. 'తాను స్వయముగా చేయవలసిన' అని యర్థము. అది అనువాదకులు గ్రహించినదానికన్న మంచిపాఠము. (౭) "సిద్ధా- ఆర్యా, ఆజ్ఞాపింపుము" ఇందు ఆర్యాశబ్దమునకు ముందు "సహర్షమ్" అని సంకేతమున్నది. దానిని అనువాదకులు తొలఁగించినారు. (౮) "ఆజ్ఞాపింపుము; ఇట్టి విషయమునందు నియోగించుట నన్నుఁ గృతార్థునిఁ జేయుటయే గదా!" మూలము: 'ఆర్య, అనుగృహీతోఽస్మి. ఆజ్ఞాపయత్వార్యః కిమనేన దాసజనేనార్యస్యానుష్ఠాతవ్యమ్'. అర్థము: 'ఆర్యా మహాప్రసాదము, ఈదాసజనునిచేత నార్యునికి కావలసిన కార్యమేమో యాజ్ఞాపింపుము.' దీనిని రూపుమాపినారు. (౯) "కనుసన్న చేత". మూలమున '...దత్తాక్షిసంకోచసంజ్ఞామ్' అని. దాని యర్థము: 'కోపమున కనుకొంటిని సంకోచించుటయను సంజ్ఞను' సంజ్ఞాస్వరూపమును అనువాదకులు మానినారు. (౧౦) "వారిని దిట్టుము."-ఇది యమూలకము. (౧౧) "సంకెళ్లను విడఁదీసి."-ఇది యమూలకము. (౧౨) "ఆతనియొద్దనే యుండుడి". 'రాక్షసఏవ కఞ్చిత్కాలం సేవితవ్యః'-అని మూలము. 'రాక్షసునే కొంచెము కాలము సేవింపవలసినది.' కొంచెము కాలమనుటను అనువాదకులు మానినారు. (౧౩) "అతఁడు తనసేనలుగొని మనపట్టణసమీపమునకు వచ్చినపుడు". ఇది యమూలకము.

పు. ౧౫. (౧) "జీవసిద్ధికి సంకెళ్లు తగిలించి" సంకెళ్ల ప్రశంస అమూలకము. (౨) "ముండనాదిక్రియలు జరిగించి"-'సనికారమ్' అనిమూలము. 'ముండనాదిక్రియలు' అమూలకము. (౩) "మహాప్రసాదము"-అనుగృహీతుఁడు చెప్పవలసిన మాట యిది. (౪) "చాణ:- వత్స! ఇంకొకటి తరువాత కాయస్థజాతివాఁడయిన శకటదాసుఁడు రాక్షసునిచేఁ బ్రేరేపింపఁబడి నన్నుఁ జంపుటకుఁ బ్రయత్నము చేయుచున్నాఁడు; కనుక వానిని శూలములచేఁ బొడిచి చంపి వాని కుటుంబమును గారాగృహమునఁ బడఁద్రోయవలయుననియు వారితోఁ జెప్పుము."-ఈవాక్యముకన్న పనికిమాలిన తర్జుమా యుండునా? 'తరువాత'-దేనికి తరువాత? 'నన్నుఁ జంపుటకు'-చాణక్యునిఁ జంపుటకు అని అనువాదకుని పదవార్థము. చంద్రగుప్తుని జంపుటకని విశాఖదత్తకవి వాక్యార్థము. ఈతప్పు చాణక్యుని పూర్వభాషితమందే ఆరంభమైనది. (౫) "శ్రీచంద్రగుప్తమహారాజుగారి యాజ్ఞయైనదని" - అనువాదకులకు మూలమున ముక్కలన్వయింపలేదు. ఇందు చంద్రగుప్తవాక్యము లేనేలేదు. అంతయు చాణక్యవాక్యముగానే యున్నది. ఇది తప్పు. మూలమున 'కాలపాశికదండపాశికులతో చెప్పితమ్మ' అనునది తప్ప కడమచాణక్యభాషితమెల్ల చంద్రగుప్తవచనము. చాణక్యుఁడు ఈయాజ్ఞలను చంద్రగుప్తనామమునఁ బంపుచున్నాఁడు గాని తన పేరఁ బంపలేదు. అట్లే చంద్రగుప్తనామయిన పయిచాణక్యభాషితమును చాణక్యవచనముగానే గణించినారు. పూర్వవాక్యములో "చంద్రగుప్తమహారాజుగారి యాజ్ఞయైనదని" అనుమాట 'విపాలఁగొట్టుఁడని' అనుమాటకు తరువాత నుండవలెను. అట్లే యాద్వితీయభాషితము 'వత్స... బడఁద్రోయవలయు ననియు చంద్రగుప్తమహారాజుగారి యాజ్ఞయైనదని వారితోఁ జెప్పుము.' అని యుండవలయును. మూలమున ప్రథమభాషితమందే 'నృపతిరస్మానాజ్ఞాపయతి' - 'నృపతియే ఆజ్ఞాపించుచున్నాఁడు' అని యుపక్రమమే అగుటచేత రెండుభాషితములకును అది యన్వయించినది. అనువాదకులకు తెలిసినదిగాదు. (౬) "శూలముచేఁ బొడిచిచంపి." అనువాదకులు శూలశబ్దార్థము తెలియఁగరయిరి. శూలమనఁగా కొఱ్ఱు. అది భూమిలోఁ బాతియుండును. ఇట కొఱ్ఱువేయుట చెప్పఁబడినది. మూలము: 'శూలమారోప్యతామ్' అని. 'శూలమెక్కింపవలసినది' అని దాని అర్థము. (౭) "ఏమి! రాక్షసుని?" మూలము "హన్త, గృహీతో రాక్షసః". అర్థము: ఆహా రాక్షసుఁడు పట్టుపడినాఁడు. చాణక్యుఁడు సిద్ధార్థకవచనము శుభోపశ్రుతిగాఁ గ్రహించి ఆ శుభశకునముచే రాక్షసుఁడు పట్టుపడునని యూహించి సంతసమ్మునచే తనలో నట్లు పలికినాఁడు. ప్రశ్న చేయలేదు. అనువాదకులు దానిని ప్రశ్న చేసినారు.

పు. ౧౬. (౧) "ప్రభువు వారి యాజ్ఞ"—పూర్వోక్త చంద్రగుప్త భాషితములు చాణక్య భాషితములుగా మార్చిన తప్పును ఈ భాషితములనైన ఎఱుంగ రయిరి; దిద్దికొనరయిరి. "ఈ వాక్యమునకు మూలమును జక్కఁగ ననుసరింపలేదు. నిష్ప్రయోజనముగా అనువాదకులెల్లకో మార్పులు చేయుట! మూలార్థము: "శిష్యుడు—ఉపాధ్యాయుఁడా, కాలపాశికుఁడును, దండపాశికుఁడును ఉపాధ్యాయునికి విన్నవించుచున్నారు: 'ఇది సెలవిచ్చుచున్నారు చంద్రగుప్త మహారాజుగారి యాజ్ఞ' అని." (౨) "ఇందుకేకదా నేను పర్యాసిద్ధము చేసికొనివచ్చినాఁడను." ఇది అమూలకము. (౩) "నాకిప్పుడు కారాగృహవాసముగాని, మరణముగాని తటస్థించునని నమ్మకొని"— ఇదియు అనువాదకుని సొంతకల్పనము. (౪) "రాక్షసునికుటుంబము నవమానించు" ఇదియు అనువాదకుని కల్పనయే. (౫) "అతిజాగ్రత్తతోఁ గాపాడవలయును"—మూలార్థము: 'ఆపదకుఁ గొని పోవుడు' అని. (౬) "రాక్షసునికుటుంబము క్షేమముతో నుండునేని... సరే!" ఇదియు అమూలకము. (౭) "సుహృద్విపత్తులను కన్నులారఁ జూచుచుంటవలన దుఃఖసాగరములో మునిఁగియున్న నేనిట్టిమర్యాదనందుట కనర్హుఁడను." మూలము: "కిన్న జానాత్యార్యః, యథా, అనుచిత ఉపచారః హృదయస్య పరిభవాదపి దుఃఖముత్పాదయతి". అర్థము: 'ఆర్యునికి తెలియదా యేమి? అనుచితమయిన సత్కారము హృదయమునకు తిరస్కారముకన్న నెక్కువ దుఃఖమును గలిగించును'. దీనినెట్లు పాడుచేసినారో చూచుకొనుఁడు.

పు. ౧౭. (౧). "మనమిరువురమును యేకాభిప్రాయముండే యున్నవారము."- పాడు [illegible]. మూలము: "సంభావితమే వేద మస్మద్విధో గృహజనః-" అర్థము: 'ఇది మాబోంట్లతో నీకు నుచితమే.' (౨) "ఇప్పుడీ దుష్టుఁడేమి యుద్దేశించికొని యున్నాఁడో"-మూలానువాదములకు సంబంధము లేదు. మూలము: 'కిం ప్రత్యుత్తమ నేన కితవేనకిమపి.' అర్థము: 'ఈధూర్తుఁడేమి యుద్ఘాటన చేయుచున్నాఁడు?' 'మాబోఁటివారితో' అనుటచేత రాక్షసమైత్రిని, చాణక్యుఁడెఱిఁగి, యుద్ఘాటన చేయుచున్నాఁడని చందనదాసుఁడు తలఁచెను. ఈవాక్యము ప్రశ్నగాదు. అనువాదకులు ప్రశ్నగాఁ గొనుటయేగాక సర్వథా నాశముచేసినారు. (౩) "దేవర యనుగ్రహము పూర్ణముగాఁ గలిగియుండుటచే జనులందఱి వర్తకమును జక్కఁగ జరుగుచున్నప్పుడు నా వర్తకము మాత్రమేల జరుగకుండును?" మూలము: "ఆర్యస్య ప్రసాదేన అఖణ్డితా మే వాణిజ్యా" అర్థము: 'ఔను. ఆర్యుని ప్రసాదముచే నావ్యాపార మఖండితముగా నున్నది.'

పు. ౧౮. (౧) "అట్టివాని నొక్కని నైనఁ దమ రెఱుంగుదురా?"- అమూలకము; సముచితమును గాదు. (౨) "నీవు సంపాదించినది అట్టి విరోధమే." మూలము: 'అయమీదృశో విరోధః.' 'అది యిట్టి విరోధము'. 'రక్షసి' - 'రాక్షసగృహజనమును నీయింటఁ గాపాడుచున్నావు' అను నర్థముగల యీ 'రక్షసి' పదమును అనువాదకులు వదలినారు.

---

# మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే గాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుఁడు, 'భారతి'.



# వృషభవిజ్ఞప్తి

కవితావినోద, డాక్టరు నిడమర్తి ఈశ్వరప్ప గారు,
B.A.. M. O. B., F. M. H. C.

పెట్టినదానితోఁ దనివిం గని కర్షక, డొక్క మాఁడిన
న్బట్టినపట్టు నూని బహువత్సరముల్ గృషి సల్పి నిన్ను న
ప్పట్టున నెట్టిలోపమునఁ బొల్పడనీయక సేవఁ జేసి యి
ప్పట్టున వార్ధకమ్మునను వ్రాలితిఁ దూలితి నెట్లు బ్రోతువో!

ఎముకలే కాని రక్తమాంసములు లేవు - బడుగ నైతిని శక్తియు నుడిగె నేఁడు
మేఁతమైన మేయఁగలేను; జేతు నెట్లు - సేవ లింకమీఁదఁ గావుమా సేద్యకాఁడ!

మునుపటి నాయొనర్చిన యమూల్య మమేయమునైన సేవ నీ
మనమున నెంచుమయ్య, యభిమానము నాపయి నుంచుమయ్య, న
న్ననరునఁ బ్రోవుమయ్య, ఇఁక నీదయ యంటేఁగదయ్య, నీటనే
మునిచెదొ, పాల ముంచెదవొ! పున్నెము నీయది, నాది భాగ్యముల్.

అమితసేవల నంది మ మ్మమ్ముచుంట - యేఱు దాఁటి తెప్పఁ దగులనేసినట్ల
వార్ధకంబున మ మ్మొడఁబాయకుంట - నమ్ము మిహపరమ్ములసాధనమ్ము సుమ్ము!

తనకుమాలినధర్మ మనక నీ కిచ్చితి నాతల్లిపాలు చిన్నతనమందు
అనుపమానమ్ముగాఁ జను వీడినంత ధూర్వహుఁడనై యుంటి జవ్వనమునందు

భుజబలంబునఁ బీడభూము లెన్నెన్ని చేర్చితి నెంతో ధనము నీచేతియందు
చచ్చి చర్మమునుఁ బైజారుగా నర్పించి నీపాదముల పీడనోప ముందు
మమత నేను నీ వనెడి భేదమును మాని - యొడలు దాఁచక నీసేవ లొనరిచి తుది
ముదిమి నవశత నుపకారభుక్తిఁ గోరు - నన్ను విడనాడ నీ కేటి న్యాయమయ్య!

అడుగిడంజాల మునికోలఁ బొడువనేల? - నేలఁ గూలిన నన్నెత్తఁజాల వీవు
తోఁక నులిపియు, విఱిచియుఁ బీఁకెదకట! - నిష్ప్రయోజనమేసుమ్ము నీదుశక్తి.

మూఁపునఁ గాయ గాయఁ బలుమోటగుబండ్లను లాగిలాగి నా
సాపుటరంధ్రముల్ నురువు సాంద్రతఁ గ్రమ్మిన నూపిరాడ కా
యూఁపునఁ బర్వులెత్తి బహుయోజనముల్ నినుఁ గొంచుఁబోయి నీ
ప్రాపున నమ్ము నన్నుఁ బెడఁబాయఁగ నీ కెటు బుద్ధి పుట్టునో!

సకలముఁ దాన నీ కగుచు సౌఖ్యముఁ గూర్చెడి నీయనుంగుపు
త్రికుఁడు త్వదీయకర్మవశతన్ రసభంగముగాఁగ నెన్నఁడో
వెకలియో, కుంటివాఁడో, యవివేకియో, గ్రుడ్డియో యౌచు నిష్ప్రయో
జకుఁ డగునేని వానిని బజారునఁ బెట్టెదె విక్రయింపఁగాన్?

ముకుఁద్రాడులంబోసి ముష్కంబులంగొట్టి చుఱ్ఱుచుఱ్ఱున మేనిచుట్టుఁ గాల్చి
కోడ్కాల నెడలించి కొలబత్తెముల మేపి పనులందు రాచి అంపానఁ బెట్టి
మాగాముఁ జేసిన మఱిపదుగురు నెక్కి బండి నిసుకనేలఁ బర్వఁజేసి
కొరడాల బాదియుఁ గోలలం బొడిచియు బొమికలు సడలంగఁ గుములఁగొట్టి
దొంతిరూకల మమ్ముఁ గొన్నంత నెంత - స్వామ్య మున్నను మమ్మిట్టిపాట్లఁ బెట్టఁ
దగదు, నీకు ముమ్మాటికిం దగదు, తగదు-నరుఁడ, మాపాలి యమకింకరుఁడ వీవ!

పనిఁ జలుపలేని పసరముల్ భారమైన - నేల విడువవు పశుశరణాలయమున?
కటికవాని బిచ్చంపురూకలకు మమ్ముఁ - జంప నమ్మిన నీ కట్టిచావె వచ్చు.

ఎండయనక వాననక నీకండనుండి - ధనపతిగ నిన్నుఁ జేయ నిర్దయత నన్ను
"ఖూసా" యొనరించి నీచపుంగూడుఁ గుడువ-వెలితిఁబడెదవే గిజగొట్టు పిసినిగొట్ట!

జలతారుకండువా ల్తలపాగ మెఱయుభూషలును నెమ్మిన వన్నెలను బెట్టఁ
బలువురు గుమిగూడి పాయక తోడరా బాజాబజంత్రీలు బలిసి కొలువ
సూత్రధారుఁడు దారి సూపింప నీ వేఁగఁ గాళ్ల నందియలు ఘల్లల్లురనఁగఁ
బురజను ల్నినుఁ గాంచి పొరిపొరి దృఢభక్తిఁ దడయక నీకాళ్లు గడిగియెత్త
రాచ తీవి నీ వూరేఁగ రథ్యలందు - మెచ్చి సింహాద్రియప్పన్న వచ్చెనంచు
నతముఁ బూజింతు రాలవంశమున కీవ-నంగ నాణెము త్రెమ్మవే గంగిరెద్ద !

ననుఁ గాంచి నాపాట్ల కనుకంపఁ జెందక యేలకయ్యానికిఁ గాలుద్రవ్వ ?
దిక్కులు మార్మ్రోయ గ్రుక్కవీడక పెల్లు పలుమాఱు లేల ఱంకెల నిడంగ ?
దిబ్బలం గొమ్ములం ద్రొబ్బి వప్రక్రీడ నేలమంటిని మింటి కెగురఁ జిమ్మ
కండకావరమునం గన్నుఁగానక క్రొవ్వి యేల “బస్తీమేనవాలు” సేయ ?
నీకు సరియైనచో నన్ను డీకొనంగ-నగు. “యథేచ్ఛంవిహార” యంచు నచ్చు విడువ
సంచరింతువు. నీపూర్వ జని నదెట్టి-పున్నెములఁ జేసినావొ యాఁబోత నీవు.

విభుల సేవించి యుపకార వేతనమున-నొక్కదమ్మిడీ తగ్గిన హక్కుకొలఁదిఁ
బీఁకులాడెదు నరులార ! నాకుమాత్ర-మకట పట్టెఁడు గడ్డికే హక్కు లేదె ?

“ఎద్దుమొద్దు స్వరూప” మం చేల మమ్ము-నెత్తిపొడుచుచు మీవారు హేళనమ్ముఁ
జేతురో ? మీరు లెస్స యోజించికొనుఁడు-మొద్దొ, మొఱకొ లేకున్న మీ
[ముద్ద యెటులో ?

ఇప్పుడిప్పుడు గాదె మీ యింతులు భువి-మిమ్మునుం గౌరవమ్మున మించువారు
భువిని దివి ననాదిగను మాబోఁటులన్నఁ-బూజ్యతకుఁ బవిత్రతకును మొదటివారు.

మాయాఁడువారల మలమూత్రములనెకా -మీ దేహగేహము ల్మేలుఁ గనుట
జననమొందిన దాద చనునంతకును మీకుఁ-దత్పయోధార లాధారమగుచు
యజనమ్ములందు నిత్యాగ్నిహోమములందు హవ్యకవ్య ప్రద లరయ వార
పూతలై పితృదినమ్ములవారె భుక్తశేషములారగింపం బ్రశస్తశమలు
దండిగా వార లిచ్చు దుగ్ధముల నెల్లఁ-బీల్చి పిప్పులఁ జేసి వే విడుటె కాక
కటకటా ! కసాయికి వారిఁ గట్టిపెట్టు-మిమ్ముఁబోలు కృతఘ్నుల నిమ్మహిఁ గన.

కుంభవృష్టిఁ బాలఁ గురిపింపఁ బచ్చిగా-నాకి మేసి పిదపఁ బస్తునిడరె?
పాలతోడ క్షుత్పిపాసలు వోవునే? - ఇంతకృతఘ్నత మెఱుఁగ రెట్టిపసులో ?

వంధ్యలైనపసుల పాపఫలంబొ, పు-న్నామనరకమో యనంగ వారి
వధ్యభూమిఁ జేర్చువారు మీగొడ్డాండ్రఁ-జంపియిడెదరో పిశాచములకు ?

పశులపాట్లను దొలఁగింప బౌరుషంబు - నిండుమగవాఁడవేని నీకుండకున్న?
మనుభవులు వెట్టు మాగోడుమాన్పలేని - నీదుపశుపతిబిరుదంబు నెగడదు శివ!

గిరులను జేరి ముక్కును బిగించి తపంబులు సేయు నీకును
బరిణయమున్ బొనర్చి యులువాకిలిఁ గూర్చఁగ నెంచు మన్మథున్
బరముఁ బరోపకారపరు భస్మమొనర్చు కృతఘ్నమూర్తి వే
వరుసను మమ్ముఁ బ్రోచెదవు త్వత్ప్రియవాహనబాంధవంబులన్.

వృషభవాహుఁడవయి మమ్ము వృషభములను-బ్రోవఁగంకణముం గట్ట వీవదేల ?
కాలకాలుండ వీ వఱకంటఁ జూడ - మాఁడుదుర్దశ నిఁక మాకు గోడు తీఱు.

మీకు మితిలేనిసొమ్ము మాగోకులమ్ము - అలమహాదేవువాహనమ్ములము మేము
ద్విగుణితంబగుభక్తిం దగుదు మింకఁ - బెనుచుఁడీ మమ్ముఁ దుదిదాఁక మనుజులార!

---

మున్నంగి లక్ష్మీనరసింహశర్మగారు

శ్రీ మొక్కపాటి సుబ్బరాయుఁడు

జాతమున వెలనాటివైదికుఁడు; విద్వద్వంశ్యుఁడు. వర్ణమాలతరగతి మొదలు పట్టపరీక్షవఱకుఁ దదేకదీక్షగా వ్యాసంగము సాగించినాఁడు. అధ్యయనమున విసివియెఱుఁగఁడు; విరామము గోరఁడు. పాఠ్యముల నుపేక్షించి యెఱుఁగఁడు; పరీక్ష తప్పుట యెఱుఁగఁడు. కాగుణింతము మొదలు కావ్యాక్షేపనునకు వెడలునంతవఱకు రామబాణమువలెఁ



శ్రీ మొక్కపాటి సుబ్బారాయఁడు

బఱచినాఁడు. పాండిత్యవిదాహముతోఁ జదివినాఁడు గాని పరీక్షల వాలాయము దీర్చుకొనుటకుఁ గాదు......చదివి మఱవలేదు; మఱచి చదువలేదు. నిరంతర విద్యాబుభుత్సువు;— అగ్నిదేవునకువంటి జీర్ణశక్తి.

ఆంగ్లమున నారితేఱిరి నని సంస్కృతాంధ్రముల నిరాదరింపఁడు. కవితారసలుబ్ధుఁడయ్యు గ్రంథములు రచించి గంధర్వకోలాహలము చేయఁడు. విమర్శకత్వమున "విశ్వగుణాదర్శము"ను మిగిలిన జాణయయ్యు రాద్ధాంతసిద్ధాంతములకు దొరఁకొనఁడు. స్వదేశభక్తి పరతంత్రత క్రియయందుఁ బ్రయోగించినాఁడు గాని సభాముఖములనుండి శంఖ మొత్తలేదు. పరిభవము చూపలేదు; ప్రకటనము నభిలషింపలేదు; స్తుతికి మురియఁడు; నిందకు వెఱవఁడు.

* * *

అధ్యాపకత్వము నే వరించినాఁడు. చెన్నపురి న్యూయింగ్టన్ కళాశాలలోఁ బ్రవేశించినాఁడు. విద్యార్థిగ నున్న శ్రీ శ్రీ వేంకటకుమార మహీపతి సూర్యరాయ రాజకుమారునకు దేశికుఁడైనాఁడు తదుపరి ప్రభుఁడు పీఠికాపురి సంస్థానమునకు పట్టాభిషిక్తుఁ డగుటతో సుబ్బరాయఁడు అంతరంగ కార్యదక్షుఁడైనాఁడు; అనంతరము దివాన్ పదవి నలంకరించినాఁడు; సంస్థానపాలనమున కుపక్రమించినాఁడు. ప్రభునకు సహృదయుఁడై మెలఁగినాఁడు. ప్రభుత్వమునకుఁ బురోహితుఁడై సాచివ్యము నెఱపినాఁడు. నీతిని రక్షించి నిజధర్మమును నిర్వర్తించినాఁడు. సుద్దికన్న బుద్ధి తీవ్ర

మైనది. స్థూలమునకన్న సూక్ష్మమును గని పట్టఁగల చుఱుకైన చూపు. పదినిమిషము లలోఁ బరోగినిఁ బరీక్షించి నిదానము చెప్పఁ గల మనీషావంతుఁడు. భూతిజీవనమున పంచ తంత్రము పాఠము సెప్పఁగల ప్రవీణుఁడు. ఉదా రతతో గభీరతగల హృదయము. పారమా ర్థిక చింతతో ప్రాపంచికనటన సాగించిన నట రాజు. కంటి జెదరుతో కమాయిష్ చెలాయిం చినాఁడు గాని గడబిడలతోఁ గాలక్షేపము చేయలేదు. శక్తికి మిగిలిన ఉపకారములను జేసినాఁడు గాని చెల్లియుఁ జెడుగు దలంపఁడు. అధికారిత్వమున దయాధర్మములు పఱపినాఁ డు. కృత్రిమబ్రాహ్మణత్వము దొలఁగినాఁడు. చిత్తసంస్కార మందినాఁడు. ఆంధ్రప్రముఖు లలో గణ్యుఁ డనిపించుకొన్నాఁడు. సూర్య రాయప్రభునివదాన్యతకు దోహద మొనర్చి నాఁడు. గడించి గంటఁగట్టినది ధర్మము గాని ధనము గాదు.

* * *

ఆతనిచూపునఁగల తీక్ష్ణత ప్రజ్ఞగాని దర్ప ము గాదు. ఆమాటయందుఁగలమితి సత్త్వము గాని స్వాతిశయము గాదు. ఆముఖమునఁ గల గాంభీర్యము శాంతత గాని అహంత గాదు. ఆ వాదమునఁగల చాతుర్యము సరళత గాని సర్వ జ్ఞత గాదు. ఆంధ్రదేవీ లాలాటికలోని మణి వలెఁ బ్రకాశింపవలసినవాఁడు! ఆంధ్రలోకము నకు అస్తమళని ప్రారంభమైనది! మధ్యందిన మార్తాండుఁడువలె వెలుఁగుచు నస్తంగతుఁడై నాఁడు! పిన్నవయసుననే పెద్దకీర్తి వడసినాఁడు! ఆతనిచరిత్ర శేషించినది; ఆంధ్రసంతతికిఁ జిర స్మరణీయ మైనది!—అనుసరణీయమైనది!!

"సుకృతీ గతాయుః"!!!

---

## మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందా దారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముం దున్నది. చందా దారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము.

మేనేజరు, 'భారతి.'



పల్లెటూరి ఉత్సవము

శ్రీమతి రాణిదేవిగారు రచియించిన చిత్రము.

—'టైమ్సు ఆఫ్ ఇండియా' వారపత్రిక.



యాత్రికులు

చిత్రకారుడు: శ్రీ రవీంద్రనాథ చక్రవర్తి గారు.

— 'టైమ్సు ఆఫ్ ఇండియా' వారపత్రిక.




# గుజ్జెన్నగూడు

వాళ్ళ నాన్నగారు కచేరీసావిట్లో కూచుని ఏమో రాసుకుంటున్నారు వాళ్లమ్మ పెరట్లో నూతిదగ్గిర బట్టలు ఉతుకుతోంది.

సూరి ఇంట్లో చెంబులన్నీ ముందర పడేసుకొని చింతపండు గుజ్జుకలిపి వాటికి పట్టించి తోముతోంది.

సీతీ వెంకీ అప్పుడే చద్దన్నం తిని తూర్పు వేపువసారాలోకి వచ్చారు.

“వెంకీ నీజడవిప్పేసి మళ్లీ వేసిపెట్టనా?” అంది సీతి తీరికూచుని “అమ్మకొత్తుంది” అంది వెంకి. “కొట్టదులే, ఇలారా నీకు ఎంచక్కా బాగా జడేసిపెడతాను, ఏం” అని వెంకిని చెయ్యిపట్టుకొని దగ్గిరిసా లాక్కుంది.

“నాకు జడెయ్యొద్దు” అని వెంకిమూతిముడిచి ఏడవబోయింది.

“ఇంతట్లోకే ఏడవాలిటే అమ్మా. మాట్లాడితే నెత్తిమీదకొస్తుంది నీళ్లకుండ” అంది సీతి.

వెంకి మాట్లాడకుండా ఇంట్లోకివెళ్లి వాళ్ల నాన్న పరుపుకిందదాచుకున్న లక్కపిడతలు రెండూ, విరిగిపోయిన దొండకాయ ఒకటీ, చింతగింజలూ, కుండపెంకులు రెండూ తెచ్చి వసారాలో ఒకమూల కూర్చొని అవన్నీ ఒక దానిమీద ఒకటిపెట్టి ఆడుకొంటోంది.

“నన్నుకూడా ఆడుకోనియ్యవుటే వెంకీ” అంది సీతి.

“ఊహు” అంది వెంకి.

“నాలక్కపిడతలుకూడా నేను తేనా” అందిసీతి.

"ఊఁ" అంది వెంకి.

సీతికూడా ఇంట్లోకి వెళ్లి గూట్లో దాచుకొన్న నాలుగు లక్కపిడతలూ, ఒక గాజుబొమ్మా, ఒక పేడబొమ్మా, రెండు చిన్న నాగవిల్లి కుండపిడతలూ, ఒకరంగు గుడ్డపీలికా తెచ్చింది. "వెంకీ, ఇవన్నీ పెట్టి మనిద్దరం ఆడుకుందావేఁ" అంద సీతి.

"ఆడుకుందావేఁ" అంది వెంకి.

సీతి ఆ లక్కపిడతలూ అన్నీ ఒకమూలకు చేర్చి రంగుగుడ్డ అడ్డంగా కట్టింది. వెంకి రంగు గుడ్డలోంచి తొంగి చూస్తోంది.

సీతి ఆ లక్కపిడతలన్నీ ఒకదానిమీద ఒకటి పేర్చి గోడదగ్గిరే పెట్టింది. కుండపిడత మీద ఒక దోండకాయపెట్టి పెంకు మూత పెట్టింది. "నీకు అన్నం వండిపెట్టనా" అంది సీతి.

"అన్న వేఁదీ" అంది వెంకి.

నాలుగు చింతగింజలు కుండపిడతలో వేసి "ఇదిగో అన్నం. వెంకీ, పొయ్యూదమ్మా" అంది సీతి.

వెంకి బుగ్గలు బూరటించి పొయ్యూదుతోంది.

"కుతకుత గుజ్జెన్నా
కుతకుత గుజ్జెన్నా"

అని సీతి పాడడం మొదలెట్టింది. కొంతసేపు పాటయిం తరువాత సీతి వెంకిని దగ్గిరికి పిలిచి "వెంకీ, వెంకీ, నువ్వెం, అమ్మదగ్గిరికెళ్లి కంది పప్పు అడుగు. గుజ్జెన్న గూళ్లు వండుకుందాం" అని అంది.

వెంకి గబగబ పరుగెత్తు కెళ్లింద వాళ్లమ్మ దగ్గిరికి. వెళ్లి "అమ్మా, ఊఁ ఊఁ" అంటూ కూ చుంది.

వాళ్లమ్మ ఉతికినబట్టలు పిడుస్తూ, "ఎందుకే వెంకీ, అలా మూలుగుతావు" అంది.

"నా క్కందిపప్పెత్తవూ" అని వెంకి మరీ మూలిగింది.

"ఇప్పుడే కాదుటే అన్నాలు తిన్నారు. అప్పుడే కందిపప్పా" అంది వాళ్లమ్మ.

"ఊఁ, ఊఁ, నా క్కందిపప్పెత్తవుతే అమ్మా" అని వెంకి మూలుగుతూనే ఉంది.

"కడుపునొప్పి వస్తుంది. మధ్యాన్నం పెడతాలే అమ్మా" అంది వాళ్లమ్మ.

"నా కిప్పు డెత్తవూ నా కిప్పుడెత్తవూ" అని వెంకి మారాం పెట్టింది.

"ఇప్పుడు మడి కందిపప్పు ఎలాగ ముట్టుకుంటానే" అంది వాళ్లమ్మ.

"ఊఁ ఊఁ కంది పప్పెత్తవ్" అని వెంకి మూలుగుతూనే ఉంది. సూరిచెంబులు తోమి తొలుస్తూ "అమ్మా ఆగూట్లో బుట్ట లో ఉంది కాదుటే కందిపప్పు. అది మడిదికాదు" అంది.

"అయితే. చెయ్యి కడుక్కొని వెళ్లి దానికి రెండు బద్దలు పెట్టు" అంది వాళ్లమ్మ.

గబగబా చేతులు కడుక్కొని సూరి లేచింది. "పరికిణీ ఎలా తడిసి పోయిందో చూ డొసే. చెంబులు తోమే టప్పుడు పరికిణీ వెనక్కి కట్టు కోమని చెప్పలేదూ" అంది వాళ్లమ్మ.

సూరి ఇంట్లోకివెళ్లింది. సూరి పరికిణీపట్టుకొని వెంకికూడా ఇంట్లోకి వెళ్లింది.

గుప్పెడు కందిపప్పు తాను తీసికొని, వెంకికి చేతినిండా కందిపప్పు పోసింది.

వెంకి కందిపప్పుపట్టుకొని వసారాలోకి సీతిదగ్గిరికి వచ్చింది.

వెంకిచేతిలో కందపప్పు సీతిపుచ్చుకొని కుండ పిడతలోపోసి "ఇక్కడే చూస్తూఉండు వెంకీ" అని చెప్పి వాళ్లమ్మదగ్గిరికి సీతి పరుగెత్తుకు వెళ్లింది.

"అమ్మా, అమ్మా నాకు బెల్లమ్ముక్కెట్టవూ?" అంది సీతి.

"చెయ్యారుకోలేదమ్మా అయినా ఇప్పుడు బెల్లమ్ముక్కేమిటి" అంది వాళ్లమ్మ.

"వెంకికీ సూరికీ కందిపప్పెట్టేవు కాదూ ఇప్పుడు" అంది సీతి.

"నీకూ కందిపప్పెడుతుందిలే సూరి. వెళ్లి దాన్నడుగు" అంది వాళ్లమ్మ.

"ఊఁ, నాక్కందిపప్పక్కర్లేదు. అమ్మా నాకు బెల్లమ్ముక్కెట్టవూ?" అంది సీతి.

"చెయ్యారుకోలేదంటే కాదూ" అంది వాళ్లమ్మ.

"ఊఁ, ఊఁ, అమ్మా నాకు బెల్లమ్ముక్కెట్టవూ" అని సీతి మూతిముడిచింది.

"నీ పెట్టలేనమ్మా ఇప్పుడు" అంది వాళ్లమ్మ. సీతి వాళ్లనాన్నదగ్గిరికి ఏడుస్తూ వెళ్లి "నాన్నా నాన్నా అమ్మేం, నాకు బెల్లమ్ముక్క పెట్టనంటోంది. వెంకికి కందిపప్పెట్టేది కాని" అని చెప్పింది.

"ఎందుకే అమ్మా ఇప్పుడు బెల్లంముక్కా" అన్నాడు వాళ్లనాన్న.

"నాకు బెల్లమ్ముక్కెట్టమనవు నాన్నా, నే నాడుకుంటాను" అంది సీతి.

"ఏమే, ఒసేవ్, దీనికి కొంచెం బెల్లమ్ముక్కెట్టూ" అని వాళ్లనాన్న కేకేశాడు.

సీతి లోపలికి పరుగెత్తికెళ్లిందివాళ్ల అమ్మదగ్గిరికి.

"ఇందమ్మా, బెల్లముక్కా. ఆరోజుకారోజు అల్లరెక్కువౌతోంది" అంద వాళ్లమ్మ.

బెల్లంముక్కతీసుకొని సీతి వసారాలోకి వచ్చింది.

వెంకి కందిపప్పు ఒక్కొక్కబద్దే తింటూ కూచుంది.

"కందిపప్పంతా తినేస్తున్నావా వెంకీ"అంది సీతి.

వెంకి మాట్లాడలేదు.

ఇంతట్లోకే సూరికూడా వచ్చింది అక్కడికి.

"సీతీ, ఒసేవ్ నేనుకూడా ఆడొద్దుటే" అంద సూరి.

"నీకు కందపప్పేదీ" అంది సీతి.

"ఇదుగో" అంద సూరి.

కందపప్పంతా కలబోసుకొని ఒకకుండపిడతలో పోశారు; చిల్లపెంకు మూతెట్టారు.

మూడు చింతగింజలు పొయ్యిలాచేసి దాని మీద కుండపిడతపెట్టారు. వెంకి పొయ్యిఊదుతోంది. బెల్లంముక్క ఒక లక్కపిడతలో వేసి

దాన్ని ఇంకోపొయ్యిమీద పెట్టారు. సూరి ఆపొయ్యి ఊదుతోంది. మిగిలిన లక్కపిడతలూ, దొండకాయలూ, చింతగింజలూ బొమ్మా గోడపంచనే పెట్టారు.

"సీతీ, నువ్వెళ్లి దొడ్లో బాదంఆకులు తేవే" అంది సూరి.

"వంటయిందా" అంది సీతి.

"అయిందే చప్పున రావే" అంది సూరి.

సీతి గబగబపరుగెత్తుకువెళ్లి బాదంఆకులు తెచ్చింది.

"ఇది అన్నయ్యకీ, ఇది వెంకికీ, ఇది సీతికీ, ఇది సూరికీ, ఇద బొమ్మకీ" అని అన్ని ఆకులూ వేశారు.

"ఇంకా అన్నం ఉడకలేదే" అంది సూరి ఒక కందిబద్దపట్టిచూచి.

సూరీ సీతీ వెంకీ చప్పట్లుకొడుతూ కొంతసేపు పాడారు

"కుతికుతగుజ్జెన్నా
కుతికుతిగుజ్జెన్నా
వండీ కందపప్పు
తిసిబెల్లం"

అని చాలాసేపు పాడారు.

తరవాత అన్ని ఆకులలోనూ సూరి వడ్డించింది కొంచెంకందిపప్పూ ఒకపిసరు బెల్లమున్నూ. సూరివిస్తరిదగ్గిర సూరికూర్చుంది, సీతి విస్తరి దగ్గిర సీతి, వెంకివిస్తరిదగ్గిర వెంకీ కూర్చున్నారు! బొమ్మవిస్తరిదగ్గిర బొమ్మను నిలబెట్టేరు. అన్నయ్య విస్తరిఖాళీగాఉంచారు. కూర్చోబోయేటప్పుడు అందరూ ఒకరి కొకరు.

"అక్కలిక్రా మొక్కలిపీటా
కూచోకూచో వదినా వదినా
అక్కలిక్రా మొక్కలిపీటా
కూచోకూచో వదినా వదినా"

అని అనుకొన్నారు.

తరవాత ఎవరికందిపప్పు వారూ ఎవరిబెల్లం వారూ తినేశారు. అన్నయ్య విస్తరిలోదీ, బొమ్మ విస్తరిలోదీ అలా ఉండిపోయింది. అన్నయ్యవిస్తరిలోది అన్నయ్యకు పెడతామన్నారు. బొమ్మవిస్తరిలోద సీతి తీసుకుంటానని తగువుపెట్టింద.

"బొమ్మ నాదిగదా ఏమిటమ్మా" అంద సీతి.

"బొమ్మనీదైతేమాత్రం" అంద సూరి.

"కందిపప్పూనాదే" అంద సీతి.

"అవునుపాపం. కందిపప్పునీదేం!" అంద సూరి.

ఇంతట్లోకే వాళ్లన్నయ్య ఇంట్లోంచి వచ్చాడు.

"ఏంశావురా, అన్నయ్యా, ఈకందపప్పు కిందిల" అంది సూరి.

"ఈబొమ్మ నాదికాదురా అన్నయ్యా, అంచేత కందిపప్పూ నాదే" అంద సీతి.

"మరి నాకేదీ కందిపప్పు" అన్నాడు వాళ్ల న్నయ్య.

"ఇదగోనురా నీవిస్తరీ. ఈబొమ్మదుంపర కంది పప్పు అందరమూ పంచుకొందాము" అంది సూరి.

సీతి, పనికి రాదంది.

అప్పుడు వాళ్లన్నయ్య తనవిస్తట్లో కందిపప్పూ, బొమ్మవిస్తట్లో కందిపప్పూ ఒక్కమాటుతీసుకొని నోట్లో పోశేసుకొని పారిపోయాడు నవ్వుతూను.

సీతికి ఉడుకుబోత్తనం వచ్చింది. సూరికూడా కోపం వచ్చింది. ఇద్దరూ కలిసి వాళ్లన్నయ్యని

"నారాయణ నారాయణ
నక్కతోక
కూర్చునిలేస్తే
కుక్కతోక"

అని అంటూ నవ్వుతూ పాడారు.

వాళ్లన్నయ్య పేరు నారాయణ.

వెంకికూడా వాళ్లతోటి కలిసి

"నారాయం నారాయం
నక్కతోకా
కూతునిలేతే
కుక్కతోకా"

అని పాడింది.

"ఏమిట్రా ఆ అల్లరి" అని వాళ్లనాన్నగారు సావిట్లోంచి కేకవేశారు.

అందరూ నాలిక కరుచుకొని ఉలక్కుండా పలక్కుండా ఊరుకొన్నారు.

---

# "నీఋణం బెట్లు దీర్చుకో నేర్తుఁ జెలియ ?"

పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులుగారు

గంగాజలాభిషేకంబు గావింపంగఁ గచభరంబున నీరు గారుచుండ
తడిపైరికలోన దాఁగుడుమూఁత లాడుచుఁ జిబ్బరంబుగ గుబ్బ లుబ్బుచుండ
మేఘంబుపైనఁ గ్రొమ్మెఱపట్లు మేనిపైఁ బీతకౌశేయంబు వెలుఁగుచుండ
పవడమ్ముపై వెన్నెలవిధాన ముద్దుఁగెమ్మోవిపైఁ జిఱునవ్వు మురియుచుండ
నాడుతోడమీఁదఁ గూర్చుండి నీదుమేను, నాకు దయసేయు మన నీయ లేక లేక
తుదకు దయచేసి నన్ను సంతుష్టుఁ జేయు, నీఋణం బెట్లు దీర్చుకో నేర్తుఁ జెలియ!

---

# ధుమాలమ్మ ఓఘాయిత్యం

నాలుగు వేళ్లూ నోట్లోకి వెళ్లాలంటే చివరికి రెండు ముక్కలేనా నోట్లో లేకపోతే చిక్కగదా అనే నమ్మకంతో (ఆ నమ్మకం ఇప్పుడు కొంత మరమ్మతు చేయించాలి!) వెనక, నేను నగరంలో యథాశక్తి చదువు చెప్పుకుంటూ ఉండేవాణ్ణి. పరాయిగ్రామం అవడంచేత, అక్కడ ఒకరి మేడకొట్టు మాట్లాడుకుని, నేను ఒక్కణ్ణీ అందులో సుఖంగా ఉండేవాణ్ణి. ఒంటెత్తుతనం నాకు అసహ్యం అయినా ఒంటరిగా ఉండడం ఇష్టం. చొప్పున మా మామకి అవూళ్లో ఏదో "వ్యవహారపు పని" ఉండి ఆ టైములో అక్కడికి ఓసారి వచ్చాడు. వచ్చి, సరే, నా కొట్లోనే బసచేశాడు. పూర్వకుల్ల యింట్లోనే మేం మూతిముడుచుకునే వాళ్లం. రోజంతా అతను వ్యవహారం చూసుకుని నిశోయింతరవాత ఇల్లు వెతుక్కుంటూ వచ్చేవాడు. అందుచేత మేం కసిదీరా కబుర్లు చెప్పుకోడానికేనా వీలులేకపోయింది. ఒకనాడు పొద్దున్న స్నానాదికం అయింతరవాత అతను "మరి పనిపూర్తి అయింది, వెడతాన్రా," అన్నాడు. "సరేలే, మరిగి పోలేదు, ఉండవోయ్!" అన్నాను. అతను "అల్లా కాదురా!" అన్నాడు "అక్కర్లే, మంచిమాట చేసుకుని, పదిగంటల రైల్లో కొట్టేద్దుగాన్లే" అని అతన్ని ఆపుచేశాను. నేను నా చిన్న కుర్చీమీద కూచున్నాను. అతను పెట్టె సర్దడం మానేసి పడక కుర్చీలో వెన్ను వాల్చాడు. "మళ్లీ ఎన్నాళ్లకో కలుసుకోడం, ఏమన్నా మాట్లాడుకోవచ్చని ఆగమన్నాను, మామా!" అన్నాను. అని కొంతసేపు మా సంసారపు గొడవలు స్మరించుకున్నాం. "ఏమిటో, ఇల్లానే ఉంటూంటుందిరా! ఏం జరగవలిసి ఉందో! కానీ!" దగ్గిరికి వచ్చాం.

అతను—సరేగాని, అన్నట్టు జ్ఞాపకం వచ్చింది, ఈ యింటావిడ పేరేమిటి?

నేను—ధుమాలమ్మగారు.

అ—నేను ఇందాకా నూతి దగ్గిరికి వెళ్లినప్పుడు, ధుమాలమ్మని చెయ్యిపట్టుగుని నూతికి ఎడంగా లాక్కెడుతున్నాడు, ఆవిడ మొగుడా? అంతే అయివుంటుంది.

నే—సరే మామా. మామూలే. ఆయన పేరు సరప్ప. ఆవిడ నూతిలో పడతానని బెదిరిస్తూన్నప్పుడల్లా ఆయన అల్లా ఒతిమాలుకని ఆవిణ్ణి వెనక్కి లాక్కెడుతూంటాడట.

అ—కారణం?

నే—బ్రహ్మకి తెలియాలి. వాళ్లకి పడదుట. అనుదినం షష్టాష్టకం పోరు!

అ—ఆమాత్రం పడకపోడం, పోరూ, ఎక్కడ పడితే అక్కడే ఉంటాయి. ఇంట్లో పిల్ల ఒకర్తున్నట్టుంది, ఆ పిల్లెవరు? కూతురా?

నే—ఆవిడ పేరు మాణమ్మ. ఆవిడ ధుమాలమ్మగారి చెల్లెలి కూతురట. వీరు దగ్గిరికి తీసుకుని పెళ్లీ పేరంటం జరిపారు.

అ—అది సరప్పకి అట్టే ఇష్టం లేదేమో!

నే—లేదనే విన్నాను, నేను. తన తమ్ముడు కొడుకుని తమరు పెంచుగుని ఉండ వలిసిందని ఆయన ఊవాట.

అ—ఇంకేం? ఆమాట ధుమాలమ్మకి కిట్టదన్నమాట!

నే—ఎల్లా కిట్టుతుంది, ఆస్తి ఆవిడ పేరనే ఉన్నప్పుడూ!

అ—సరప్ప కేవలం గువ్వా అన్నమాట?

నే—నఖశిఖ పర్యంతం! అంచేత, తగాకాలా తోకట్లూ చూసుగోడానికయితేం, పాలాంమీదికెళ్లి అయివేదీలూ ఆంబారాలూ నోల్లుకొని ఇంట్లో వేసుగో

డాని కయితేం, మంచి కయితేం, చెడ్డకయితేం వీధులో పనీ ఇంట్లో పనీ అన్నీ ఆవిడ అహోరించుకుని పలికించేగాని, ఆయన పూర్విక పుల్లరసాయితో కూడా లేదుట. అందుకనే, ఆయన్ని—శాస్త్రం చెప్పిన తీర వాయిగా—ధుమాలమ్మ పెనిమిటి అంటే తప్ప ఎవ్వరూ ఎరగరు. అతనికి పొద్దుం పెల్చపెంలో ఉండే రకాలు మాత్రం తుణ్ణంగా వచ్చుట. ఆరకాలన్నీ అతని మొహం మీదే చూడొచ్చు.

అ—పాపం! అమాయికుడు! రోజూ ఆవిణ్ణి బతిమాల్తాడే! రోజూ పడతానన్నేది ఎన్నటికీ పడదని ఎరగడు.

నే—నేనూ అదే చూస్తున్నాను, మామా. నాకు ఇక్కణ్ణించి ఎరగోట్లోటికి వపాయిం చెయ్యాలని ఉంది. ఆవిడ నూతులో పడాలని అదుగో ఇదుగో అని అర్నెల్లనించి పట్టుట. వెనక వీళ్లింట్లోనుయ్యి, పడడానికి ఎంత మాత్రం వీలైంది కాక పోబట్టి, అది పూడిపించేసి, ఆవిడ ఇప్పుడున్న నుయ్యి దింపించిందని పుకారు. నుయ్యి ఇరుకైపోయి మనిషిప్రాణాలు మధ్య దార్లోనే పోతే, జలమరణపుణ్యం ప్రాప్తించదని ఆవిడ మతంట.

అ—వెనకటికి ఓ పూర్వసువాసిని తన ఆడపడుచు మీద గట్టిగా లేచుకొచ్చి, తమరి దొడ్లో ఉన్న నరనూతిలో నూకబోయి పైనే చిక్కడి ఉరుకుం దిట—ఒళ్లి పొదుం బిరడాలాగ. అప్పుడు, ఎండు కొబ్బరికాయ పెంకుబద్దల కొట్టినట్టు ఆ పైవరంతా బద్దలు కొట్టి ఆవిణ్ణి విడిపించారట.

నే—వెనక, ఈవిడ, చలి అని కొన్నాళ్లూ, చట్టు బండలని కొన్నాళ్లూ, కాలు బెణికిందని కొంత కాలం, ముగుడు ఊళ్లో లేడని కొన్నిరోజులూ జాప్యం చేసిందిట గాని, ఈసారి చాలామంది పరిచయాలతో రూఢిగా పడతానని చెబుతోందిట. పైగా, ఎక్కడా చెప్పద్దని ప్రతీవాళ్లచేతా కేటాయింపుగా చేతులో చెయ్యి వేయించుకుని, ఊరందరితోనూ తనే చెప్పిందిట.

అ—అంతమంది పెద్దల దగ్గిర తనే చేసిన శపథం తను నిలబెట్టుకో లేకపోతే, మళ్లీ వెళ్లి వాళ్లమొహం ఎల్లా చూడడం అని ఆవిడ భయం అయి ఉంటుంది అదీ గాక, వాళ్లంతా తనని ఎంతమాత్రం స్త్రీత్వంగాని, మాటనిలకడైగాని లేని వ్యక్తి కింద గట్టి తేలిక చేస్తారని ఆవిడ సంకల్పం బహుశా.

నే—ఏమో! ఆవిడ ఎప్పుడో అఘాయిత్యం చేస్తుందనుకుంటాను, మామా.

అ—నే అల్లా అనుకోను. ఆయన అల్లా వెనక్కి లాగుతూన్న కొద్దీ ఆవిడ అల్లా ముందుకి సాగుతూం టుంది. లాగుడు లేని సాగుడు ఉండదు, తెగసాగుడు అంతకన్నా ఉండదు. కొందరు కొందరు దెబ్బలాటల్లో, మధ్యవర్తులు ఆపు చేస్తూన్న కొద్దీ, ఎదరపార్టీమీద ఎగురుతూంటారు—అనాల్సింది తగిలే దెబ్బలుఎల్లానూ ఉండవని వాళ్లకి తెలుసును గనక. అయ్యా, తీర్చిన కొద్దీ అములు ఎక్కువ!

నే—నిజమేస్మీ. కొందరు రోగులు ఇంట్లో ఊరుకోమనేవాళ్లు ఉంటూన్న కొద్దీ మూలుగు అధికం చేస్తూంటారు.

అ—అందుచేత, ఆవిణ్ణి ఎవరేనా నూతులోకి గెంటాలిగాని, ఆవిడ ఉరకదు; నాదీ పూచీ!

నే—(గడియారంకేసి చూసి) అబ్బో! తొమ్మిదింబావు! నువ్వు మరి ఆగనన్నావు! హోటలికి పోయి లంఖణం చెయ్యగొడతాం నడు. పట్టుపంచె కట్టుకో! నేను కిందికెళ్లి కాళ్లు కడుక్కొస్తాను.

అని, లేచి, నేను అద్దం ఎదట కూచుని కొంచెం ఏదో అభినయించి, పైమీద రుమాలువేసుకుని, మేడ మెట్లు ఓటి దిగి, రెండో దానిమీద పాదం పెట్టే సరికి, దభేలుమని ఘోరంత శబ్దం అయింది. నాగుండె గుభేలు మంది. పడ్డది నేనా, మేడా అనిపించింది. ఒక్కక్షణం నేను నిశ్చేష్టుణ్ణయి పోయి (అప్పుడప్పుడే చెప్పుకున్న సంగతులు స్మరణకి రావడం వల్ల!), నిదానించి, వెనక్కి తిరిగి చూశాను. మామయ్య, "ఆవిడే గావును, మన సంభాషణ విన్లేదు కదా!" అన్నాడు. నేను గబగబా కిందికి దిగి దొడ్లోకి పరిగెట్టాను. "మా అమ్మ నూతులో

పడ్డదండోయ్, వెళ్లిపోయిందండోయ్!" అని ఎప్పట్లేస్తూ మహాలక్ష్మమ్మగారు ఎంతో ఇదిగా వాపోవడం, ఇటూ అటూ కంగారుగా నడవడం మొదలెట్టింది. నేనూ నూతి దగ్గిరికి వెళ్లేసరికి, అంతట్లో ఎల్లా తెలుస్తుందో, ఇసకేస్తే రాలకుండా హద్దులేని జనం పోగయ్యారు. అంతాకూడా నూతి గోడమీదవాలి నూతులోకి తొంగి చూస్తున్నారు. ఎక్కడా శబ్దం అన్నమాట లేదు. నూతులో పడ్డ ఘుబాలమ్మగారు ఎల్లా కనిపిస్తుందో చూడాలని నాకూ అనిపించి, నేనుకూడా ఓ కుర్రాణ్ణి పెబాయించి కాస్త సందు చేసుకుని, తలమాత్రం నూతిలోకి దూర్చి చూశాను. ఆవిడ మునిగి పోయింది, అక్కడక్కడ బుడగలు వస్తున్నాయి. నేను నాతల బయటికి ఊడలాక్కుని మామామ ఇంకా దిగలేదేమో అని చూస్తున్నాను. పక్కని మహాలక్ష్మమ్మ సరప్పగారూ ఒకర్ని ఒకరు నువ్వే అంటే నువ్వే అని చాలాదీనిగా అనుకుంటున్నారు. అపళంగా జనం అంతా ఏక కంఠంతో "ఆఁ" అన్నారు. అదేమిటో అని నేను మళ్లీ లోపలికి తలపెడితినిగదా, ఆవిడ తేలింది. వచ్చిన వాళ్లల్లో ఎవళ్లూ ఏమీ వెంట లేకుండా ఉరాగా చక్కా వచ్చారు—'సిరికిం చెప్పడు' లాగ. ఒకాయన పక్కనున్న తోట్లపాదుకోసం అల్లిన డొక్కనారతాడు ఊడలాగి ఆవిడికి అందించబోయాడు. ఆవిడ అనేకలకొస పట్టుగోవాలని యత్నించింది గాని, తాడు పట్టుమీద లేకుండా కుక్కతోకలా అల్లాడ్డంవల్ల ఆవిడికి అదీ పట్టు దొరక్క ఆవిడ మళ్లీ మునిగిపోయింది. ఈలోపుగా ఆయన తాడుపైకి తోడుకుని దాని చివర ఓ ఇటికిబొంత కట్టి "ఈమాటు తేస్తే ఆవిడికి తాడుపట్టంకుతుంది" అంటూ మళ్లీ వేశాడు. వేయన అన్నట్టుగానే ఆవిడ మళ్లీ తేలింది, జనం అంతా 'అదుగో' అని ఒక్కకేకేశారు ఆవిడికి తాడూ దొరికింది. "అమ్మయ్య" అనుకున్నారు అందరూను. కానైతేం, ఆవిడ కేవలం తను నీళ్లల్లోనే ఉండి ఆతాడు తను మాత్రంగా పట్టుకుంటే తీరిపోనా, దానికి వేళ్లాడ్డం మొదలెట్టిందిగావును, గబ్బిలం లాగ, ఆవెధవతాడు టుప్పుమని తెగనూనూ, ఆవిడ మళ్లీ యథాప్రకారం హరోంహరని గంగాప్రవేశం అవనూనూ! ఇంతలో మామామ పట్టుబట్ట పింజెట్టి కట్టుగుని, తను బట్టంగారేదు గునే జనప నారతాడు ఊపదీసి చేత్తో పుచ్చుగుని వచ్చాడు.

నేను—ఇంతసేపా రావు, ఏంజేస్తున్నావ్, మామా!

అతను—ఇంతసేపా రావు, మీరు ఏంజేశారో అల్లాంటిదే!

అనట్టుగా ఇందాకటి తాడేసినాయన, తనే శ్రమపడతూన్నట్టు నలుగురూ అనుకోవాలని, మామామ చేతులోంచి ఆ జనపనారతాడు దొరకపుచ్చుకుని, ఓకొస పట్టుకుని, ఆతాడుచుట్ట చుట్టపళంగా నూతులో వేశాడు. సగ్గా ఆసమయానికి ఆవిడపైకి తేల మేకాక, తాడుచుట్టవెళ్లి ఆవిడకంఠానికి పడింది. అప్పుడు ఆతాడు పట్టుకుని, ఆవిడ, "అప్ప్ప్ప" అంది. నూతులోంచి వస్తూన్నధ్వనేమో, అది సరిగ్గా ఎల్లాఉందీ, గ్రామఫోనులో "హాహాహా" అనే నవ్వ్వట్లా ఉందంటే నమ్మండి, అంతే శాంతోటి, ఆవిడ గ్రామఫోనుకి రికార్డులు ఇవ్వకుండానే, ఇవ్వకపోవడంలో ఉండే అపకీర్తి ఆవిడికి తొలగిపోయింది. "వెళ్లు పట్లొద్దుల్తున్నాయండోయ్, ఇ నేను ఆగలేను, ఈ వేసినతాడేనా గట్టిదేనా కాస్తంత!" అని ఆవిడ అరిచింది. ఏమిటి అంటే ఏమిటి ధరి అన్నారు కొందరు. ఇంతలో ఒకనూక్కమ్మగద్ది నూతులో ఒక పక్కని పైనించి కిందికి కొంతకొంత ఎడంగా మెట్టుండడం కనిపెట్టి, అల్లాంటివి మెట్టునుకోటి నీటిమట్టానికి కిందకూడా ఉండితీరుతుందని ఊహించి, తాడేసినాయన చేతులోంచి కొస ఊడిపుచ్చుగుని, మెల్లిగా తను ఆమెట్లున్న పక్కకి జరిగి ఆకొస అక్కడికి జేర్చాడు. అప్పుడావిడికి ఆమెట్టు, పాదానికి గోచరించి, ఆవిడ దానిమీద చాలాబరువు ఆనేటట్టు ఓపాదం మీద నుంచుని, తూలిపోకుండా మాత్రం తాడుపట్టుగుంది జనానికి మనస్సు కొంతకొంత కుదటపడింది. ఇహ నావిడ పెల్లగిలి పైకి రావడం మాట!

ఒకడు—ఇప్పుడు లోపలికి ఓకుర్చీ పంపిస్తే!

ఇంకోడు—ఏడిసినట్టే ఉంది, ఆవిడ అందులో కూర్చోడం ఎల్లా!

మరోడు—ఓ మేనాలాంటిది దింపితే!

నేను—మీ పుణ్యమాయిరి, నిమ్మళంగా మాట్లాడండి.

తాడేసినాయన—ఆవిడ పుణ్యస్త్రీ గనక జుట్టుకి గాలం వేస్తే! ప్రాణం దక్కేటప్పుడు శాస్త్ర గీస్త్ర కుపోవడం లెఖ్ఖాపత్రం ఏమిటున్నాయి!

మెట్లు మాసినాయన—నిచ్చెన దింపాలండీ! తెలియకుండా చెబుతారేం?

పరప్ప—(తనకుడా మాతులో తలెట్టి) నీకు పిచ్చి కోపం గాని, నేనుమాత్రం ఏమన్నానే! నిప్పుకేస్తారు ఎక్కు పక్కగా.

ధు—మళ్లీ నా నెత్తిమీదికి నిచ్చెనో ఎందుకయ్యా? నిచ్చెనా నిరుపయోగమూను! నేను భస్త్రాన్నంటే చావ నిశ్చయం? బాబూ మీరంతా వెళ్లిపోండి. నేను ఉత్తం బలవంతంచేసుగుని ప్రాణం పోగొట్టుకుంటాను. మళ్లా మిలుకుతాను. నాలుగు గుక్కలు తాగుతాను భస్త్రాను. తీరిపోతుంది.

స—(ఎడం చేతులో సాకుం వేసుకుంటూ) నిచ్చెన వెళ్యాడీ! మహాపక్కాగా వస్తుంది పెళ్లికూతుర్లాగా!

ధు—ఓరి వీడి పెళ్లి పేలాలు వేగా! వీడి మొహాం తగలెట్టా! కాపురానికి వచ్చినప్పణ్ణించి చూస్తాను, వీడి కోత ఆపంకోత! పుస్తె ముడేసినప్పణ్ణించి చూస్తాను, వీకతిట్లు వీడితిట్లు తెలబడి! కోపిష్ఠుగు తినేస్తున్నాడు మరీను! ఎన్నాళ్లని ఎన్నాళ్లని! ఒకరోజూ రెండురోజులూనా! మొగుడైతే మాత్రం, విధవముగుడు! ఇంత అన్యాయమా! హవ్వ! ఒళ్లు మండుకొస్తుంది!

స—(చేతులో పొడుం యూనత్తూ కుడి గంధ్రం ద్వారానే పీల్చి) నువ్వు నీళ్లల్లో ఉండే జ్యోతివే! కాని, మొగుణ్ణి తిడుతున్నావ్, అనుభవిస్తావ్ లే!

ధు—అయ్యా, వింటున్నారా! మొగుడయేది, వారయేది, వీరయేది, నాది ఇంకోరిచేత మాటపడే ఘటంకాదు! మరి! చెప్పద్దూ! మావంశం అంతా మహా అభిమానం గలవంశం. అందులో నాకు మహారోషం. మంచికి మంచిదాన్నే గాని, ఆజ్ఞలూ అధికారాలూ నా దగ్గిర సాగవ్!

స—(సకిలించి, చప్పరించి) నీరోషం ఊక్కారోషం! నాకు మల్లే ప్రపంచం అంతావచ్చి నీకు కైవారం చేస్తారనుకున్నావేం?

ధు—వాడు మాట్లాడితే నేను మళ్లీ పడతానర్రా! ఇంకా వాజన్మంగుకర్రా!

మణెమ్మ—అమ్మోయ్!

ధు—ఓయ్! ఏం తల్లీ!

మ—మరేం,

ధు—ఊఁ

మ—నువ్వు నచ్చిపోతావ్! పోతే నాకు భయమేవ్! (అని ఏడుస్తుంది.)

ధు—భయమా అమ్మా! మామ్మే! (అని ఏడుస్తుంది.)

మ—నువ్వుపోతే నేనూ పోతాను!

ధు—అమ్మా, అమ్మా! నేనందుకు ఒప్పుతానా? అందులో నువ్వు ఉత్తదానవా? నేను రెండు పాపాలు కూడా ఎక్కడ చుట్టుకోను మొదటి! అందుకోసమే నా వస్తాన్లే అమ్మా! చచ్చిపాన్లే ఏడవకు.

(అని తనలో) ఎదో ఇంతసబ్బగంగా అయిన వాడికి సిద్ధమైనా పిల్లేకొచ్చిందిగదా ఈపిల్ల మూలంగానూ! నే లేకపోతే ఈనాటి బాగుల్ది బొత్తిగా బేజారెత్తిపోతుందిగదా ఖర్మం!

ఈసరికి తామూ నిచ్చెనా తెచ్చి, నిచ్చెన మెట్టుకి తాడు ముడేసి, నూతిమీదికి ఓ మూలం తెచ్చివేసి, దానిమీద ఇటో ఇద్దరూ అటో ఇద్దరూ పరాధ్యానం లేకుండా పీఠం వేసింతరవాత, దానిమీంచి నిచ్చెన దింపారు. అప్పుడు మామాము మెట్లు మాసిన ఆయనతో "అయ్యా, తమరే ఆ'జ్ఞి ప్రతిక్షించారు గనక, పూర్తిగా ఉద్ధరిస్తే బాగుంటుంద" అన్నాడు. ఆయనా దిగడానికి చొక్కా గట్రాతీసి, బట్ట బిగించికట్టుకున్నాడు. అప్పుడు సరప్ప, తన పొడుంకాయకున్న బిరడా తిప్పుతూ.—

"సిగ్గూ శరం ఉండాలి. ఎదురుగుండా కొంపంత మొగుడు, చుట్టూ బోలెడుజనం, పగలు, పరాయిస్త్రీ మీద చెయ్యి వెయ్యడానికి తయారవడమా! అందులోనూ, నూతులో ఇరుకుగా ఉంటేకమాను, జనం ఓరి కోరు తగలక మానరు! అదే చాలని తెగించేవాళ్లు కొందరూ! ఛీ!" అన్నాడు.

అందరికీ పోదామా అనిపించింది.

కాని, మామామ నా కేసి కన్నుగీటి పరప్పగారి రెక్కట్టుగుని, నాతో 'పట్రా' అన్నాడు. నాకూ స్ఫురించింది. మేం ఇద్దరం ఆయన్ని గంటీకావిడేసి, ఎత్తి లేపి, నూతులో వేళ్లాడుతూన్న నిచ్చెనమీద వాలింపించి, తాడొదిలేశాం. మావాడు, "నువ్వేవెళ్లి తీసుకురావయ్యా అవిణ్ణి!" అన్నాడు. నిచ్చెన బరబరా కిందికి వెళ్లింది. ఆవిడ మళ్లీ వెలరేసింది. "స్వర్గానికెళ్లినా, జన్మాంతరంలోనూ, వీడేటర్రా నాకూ! ఓ మూల కప్పలకీ వాటికీ హడిలి ఛస్తూంటే, ఈఘోరాన్ని చూడ లడం ఎందుకర్రా నామీదికీ! వేళ్లు కొంకర్లుపోయాయి, తాడట్టుగోలేను. మెట్టు మీదెట్టిన పాదం కొయ్యి జారింది, నుంచోలేను. నాప్రాణాలు పోతున్నాయ్!" అంటూ కేకలేసింది. అయినా సరే, పరప్ప, ఆమాటలు వినిపించుగోక, ఆవిడ ఖాళీపాదం పట్టుగుని, ఆవిడ కిమ్మనకుండా ఊరుకోడం శుభసూచకం అనుకుని, ఆపాదం తీసిగెల్లి నెమ్మదిగా నిచ్చెనమెట్టు మీద పెట్టించి, అక్కడికి తనకి విజయం సిద్ధించిందనుకుని, తనో పెద్ద శృంగార నాయకుడైపోయినట్టు భ్రమించి, చిరునవ్వునవ్వి, "ఒసేవ్, జలక్రీడ విషయం పోల్చా లన్నా, పాదగ్రహణం గురించి పోల్చాలన్నా, నాకు ఒక్కటే ఉపమానం స్ఫురణకొస్తోంది" అన్నాడు. మామామ "అమ్మ, అసాధ్యుడే ఈయనా!" అన్నాడు. ఈవ్యవధిలో ఆవిడ "వన్, టూ, త్రీ" అని ఊపుతీసుకుని, ఆయనవాక్యం పూర్తిచేసిన కాస్సేపటికి, కంచు చెంబుగుడిలో మడమతాపు తిన్నట్టు, ఆయన మూతి మీద ఒక్కటిచ్చుకుంది. పాపం పరప్ప దెబ్బతోటి ఉండచుట్టుకుపోయి మూటల్లా నీళ్లలో పడ్డాడు. కొన్ని పళ్లు ఊడడంచేత కాబోలు నీళ్లు అక్కడక్కడ ఎరుపెక్కాయి. 'హరీ' అన్నాను నేను. మామామ "జలక్రీడ రక్తి కట్టింది" అన్నాడు. ఇంతలో పరప్ప తెప్పరిల్లి లేచి, పైవాళ్లకి దణ్ణంపెట్టి, నిచ్చెన పట్టుగున్నాడు. ఇదో బ్రహ్మహత్యకుడా మనకెందుకని నిచ్చెనపైకి తోడెయ్యమన్నాం. పరప్పగారు అక్షీపస్తూ గట్టున పడ్డాడు. మేం ఆయనతో మరి మాట్లాడలేదు. మెట్లు చూసి నాకున్ను మానింపి, వాడేసినాయన తనే దిగాలనుకున్నాడు. కాని, మామామకి కుడా ఆయన స్వభావం కొంచెం తెలిసినట్లుంది, మెట్లుచూసి నాయన్నే దిగమని మళ్లీ ప్రార్థించాడు. ఆయన పెనుపట్టుగున్న తాడుకొస మామామ చేతికిచ్చి, తను నిచ్చెన ఎక్కేకిందికి వెళ్లి "సుబ్బమ్మగారూ! మీకు స్వర్గం, మీసాటి ఏలోకంలోనూ లేరు, నే బాధా ఎరుగుదును. దయచేసి నిచ్చెన ఎక్కండి" అన్నాడు. "నూరంగా పట్టుకుంటే నేను ఏం చెప్పనూ! అల్లాగే! కాని, నిచ్చెనమెట్టు ఘుట్టదేనా? నన్నూ నిచ్చెన్నీ కూడా ఈడవాలేమో, వాడు కాస్త జమిలిగా ఉండేది లేకపోతారూ!" అంది ఆవిడ. ఆయన, "ఫర్వాలేదు ఎక్కండీ!" అని, ఆవిడ ఎక్కేదికి తగవాటు చేశకోక. "ఇంత పాప త్రయంగా ఘటానివి ఎందుకు పడ్డావమ్మా అసలూ" అని కాస్త పుల్ల విరుపుగా అన్నాడు. అక్కడితోటి, ఆవిడకి మళ్లీ పూని, ఉక్రోషం బలిసి, "నాకు వణుకొస్తోందండోయ్! నేను ఆగలేనండోయ్! ఈనిచ్చెనకి మెట్లు ఏడేనండోయ్! అవి ఏడవడం నాకు అశుభం అండోయ్! నన్ను బతికుండగానే చావమన్నారటండోయ్!" అని గోల ప్రారంభించింది. నూతులో ఆయన "నువ్వేకాదు, అంతా అంతే. నోరుమూసుగోవమ్మా!" అన్నాడు. అని ఆవిడ వొదిలిపెట్టిన తాడట్టుగుని ఆవిడ ఇదివరకు నుంచున్నచోట తను నుంచున్నాడు. ఆవిడ గోల లెక్క చెయ్యక నలుగురైదుగురం కలిసి అమాంతంగా నిచ్చెన పైకి లాగబోయాం. ఆవిడకి కోపం మరీ వచ్చిపోయింది గావును, నిచ్చెన వొదిలిపెట్టి, తాటిపండు పడ్డట్టు మళ్లీ పడింది నీళ్లలో. లాగుతూన్న బరువు అథాత్తుగా తగ్గడం చేత, లాగేవాళ్లం మేం అంతా ఓడిమీద ఓకుపడ్డాం లుంగలు చుట్టుగుని. "ఒస్, అదేమిట్రా" అని మామామ

మాకేసిమాసి జాలిపడుతూ తాడుకొస వొదిలెయ్యడం చేత, నూతులో మెట్టుమీద నుంచున్నాయన కూడా నీళ్ళల్లో పడ్డాడు. అప్పుడు నేం లేచి, దులుపుగుని, నిచ్చెన మళ్ళీ దింపి, రెండు తాళ్ళు మళ్ళీ వేసి, ఓతాడట్టుగుని ఆయన్ని నిలబెట్టుకుని, రెండోతాడుతో ఆవిణ్ణి నిచ్చెనకి అంటుగట్టుకుని కేకేశాం. పాపం ఆయన అల్లానే చేశాడు. నిచ్చెన ఎల్లాగైతేం, పైకి ఈడిచారు కట్లువిప్పి ఆవిణ్ణి విడిపించారు. తర్వాత ఆవిడ సగప్ప దగ్గిరికెళ్ళి "ఏమకట్ల నిచ్చెనా, నువ్వు తెప్పించావ్, నీతాడు తెగా!" అని ఓతాడుచ్చుకుని అది తెగేట్టు కొట్టింది. సరప్ప కొంచెం పొడుం చేతులో విదుల్చుకుని, "అబ్బ! ఏమిదీ, కూర ఘేయూ!" అని కాస్తకసురుకుని, పళ్ళబాధచేత నోరు మూసుకున్నాడు.

అంతా నక్కా పోయారు. అక్కడికి పదకొండు గంటలయింది. మేం హోటలికివెళ్ళి భోజనం చేశాం. ఆ సాయంత్రం మానాన్న వాళ్ళ ఊరికివెళ్ళిపోయాడు కొంత కాలానికి, సుబ్బమ్మ నూతులో పడడానికి కారణం తెలిసిందా అని నాకు అతను ఉత్తరం రాశాడు. నేను దాసీదాన్ని కనుక్కుంటే చెప్పింది. ఆవిడ మామూలు కోపంలో ఉన్నప్పుడు ఆయన ఒక్కడే బతిమాలుకుంటాడట. విశేషకోపంలో పడ్డప్పుడు, కూతురుకూడా ఓ చెయ్యిపట్టుకుంటుందిట. ఆరోజున ఆవిడ నూతిగోడ మీదెక్కి నూతులోకి వాలిపోతుంటే, కూతురు ఎడం చెయ్యీ, భర్త కుడిచెయ్యీ పట్టుకుని బతిమాల్తున్నారట. ఆవిడ, ఇద్దరూ పట్టుగున్నప్పుడు చెయ్యి వదిలిసిన హరామీ పెంకితనం చేస్తోందిట. ఆయనకి విసిగెత్తి "పోస్తే, ఇంతకంటె నన్ను చావమన్నావా యేమిటి?" అని అఘాత్తుగా కుడిచెయ్యి వొదిలేశాట్ట. ఆవిడ, అజాగ్రత్తవల్ల నూతులోకి పిల్లి మంత్రం వేసిందట. అందుకని, ఆవిడ పడాలని పడకపోయినా, పడాలని పడేవాళ్ళ యత్నం నాయాసంగా సంపాదించడమేకాక, పరిసరాలున్నగ్గర అన్నమాటకి క్రియకనపరిచి, ఆత్మగౌరవం నిలబెట్టుకుందిట. ఈసంగతి నేను మావాడికి తెలియపరిచాను.

---

# శకుంతలా సమాశ్వాసరాగమాలిక

రసభూషణ, దివాన్, శ్రీరాజా వత్సవాయ వెంకటనీలాద్రి రాజుగారు

శ్రీమతి, కాంతారసీమనేల, వసింపు, మతిహిరణ్మయకుట్టిమాంగణముల
ననుభవింపును, చతురబ్ధిపర్యంత సామ్రాజ్యవైభవము శ్యామాలలామ
నవమోహనాంగి, మానసములోపల నాటిపరిభవక్లేశంబు మరచిపొమ్ము
కట్టుదు యువరాజపట్టమీ బాలసింహేంద్రమర్దనుని సింహేంద్రమధ్య
పరవశంకరాభరణంబు ప్రాప్తమయిన - నాటనుండియు సంస్మరణంబు వొడమి
నేగుచుండంగ, నీతోడి యోగమిపుడు గలిగె, కల్యాణిమద్భాగ్యములు ఫలించె.

---

# కుటుంబ తరంగిణి ౪

## "టెన్నిసు ద్వంద్వం"

కవికొండల వేంకటరావుగారు, బి. ఏ. బి. యల్.

ప్రతీకథలోని పాత్రలకు పేర్లుంచి, ప్రతీకథలోని దృశ్యములకు స్థలనిర్దేశము చేసి యీనాళ్ల నేదైనా వ్రాయవలె నంటూ వస్తే, ఇప్పటివరకు వరుసను పూర్వకాలపు పెద్దలల్లా గూటిస్తుంటారని నాకు తోచదు. పూర్వం ఏమైనా రామాయణం, భారతం, భాగవతం ఇత్యాది గ్రంథాలుంటే, రావణాసురుని లంకా అంటే, అది మాచినద్దాము, ఏదో నిజమైన లంక అనే యీ పేరు యుండేదని కాదారికిన్నీ. తద్వారే కురుక్షేత్రమన్నా, ద్వారక అన్నా, పైగా అప్పటి వర్ణనలు కూడా అలాగే, అవనాలు పట్టడానికి వీలు లేకుండా, నాయకులను గురించి వ్రాయవలె నంటూ వచ్చినా, "సీమంతునీసామ నే బోలు దేహమువాడు" డనీ, లేక పట్నాలను గురించి అయినా, "హా! నమ్మరా, దవి కాలాగరుధూపధూమవర్తులలో యుద్ధంబులో యిప్పుడున్" అని వ్రాసేవారు.

ఈనాళ్ల వల్లాగా మరి? ఏదైనా రచిస్తే వీధి వీధి నులువులాలూ చూపిస్తారు. వీధుల్లో లేచే దుమ్ము రెండెడ్లబండి లెల్ల లేచిందో, మూనిసిపాలిటీ తంత్రాల లేచిందో తెలిసికోనేటంత నిపుణతగా వర్ణిస్తారు. వ్రేలి వేలికణుపు నిణుపు కొలిచి అక్కడ పెడతారు. ఎవరు? గ్రంథకారులు. ఇక చదువరులైనా తెలుసుకున్న అపరాధపరిశోధన చాతుర్యమునెల్ల వెలయింప నెంచిలి నిజము నరయ తహతహపడిపోతూ, కనబడ్డవస్తువు నల్లా గుర్తించబోతారు.

అందుచేత అటువంటి ప్రమాదం గాని, అటువంటి ప్రయాస గాని ఎవ్వరికి ఏకోశమందూ కలుగకుండా వుండే పద్ధతిని "శీను" అని నామీదే పెట్టుకుని యీ కథ వ్రాస్తున్నాను. "నా ఇల్లాలు" అని వ్రాస్తే "నేను" అనేవానియొక్క భార్య అని అనుకోండి. "నా బిడ్డలు" అని వ్రాస్తే "నేను" అనేవానియొక్క బాదరబందీ అనుకోండి. వట్టిమాట. లేకపోతే తగువే లేదు. "నేను" "నా" అని కాక, "నీవు," "వాడు," "అది" మున్నగు సర్వనామములు వచ్చేసరికి ఆ కాగుతారేమో. తత్తత్సందర్భానుసారంగా "నీవు," "వాడు," "అది" అని అనుకోండి.

ఇదంతా చెప్పబోయే కథాపటిమ నవేమిటంటే, యింతా యుపోద్ఘాతం ఇచ్చే దెందుకూ అంటే, ఈ కథ చదువుతూంటే, "వ్యక్తులను మనస్సులలో ప్రవర్తించుకోకండి" అన్న గమనిక బాగా బోధపడాలని; అంతకంటె మరేమీ లేదు.

నేనొకనాడు "రైలు" ప్రయాణం చేస్తూ మధ్య ఒక "స్టేషను"లో దిగాను. రాత్రి పదిగంటలైంది. నా అంతట నేనై దిగినప్పుడు నాకెవరు వచ్చి నన్ను తీసుకొని వెళ్లి ఆదరించేవారుంటారని ఎవరూ అనుకోనే [illegible] వాపోయేవారుండరు.

కాని పిలకుండా కోరకుండా ఒకబండివాడు వచ్చి "అయ్యా! బండెక్కండి" అన్నాడు. "బాడుగ ఎం"తన్నా "మీకు తోచినంత యియ్యండి" అన్నాడు. "ఎక్కడికి తీసికొని వెళతావు?" అని అడిగాను. "తమ యిష్టం" అన్నాడు. "అయితే తిన్నగా యీపట్నంలో ఉన్న ఉన్నతపాఠశాల ప్రధానోపాధ్యాయుల వారియింటికి తోలు" అన్నాను. అంటే "రామనాధంగారి యింటికాండి?" అన్నాడు. "ఆఁ! వారే!" అని నాతోడు కాలిబండి యిచ్చి బండిలో చాపక్రింద పెట్టి, నేను లోపలకు సర్దుకుని గొడుగు చేరిక విడుకొని కూర్చున్నాను. బండి గబగబా నడుస్తూంది.

నాలుగైదు పురపాలక దీపస్తంభాలు దాటింది బండి. అక్కడో సందులో ఒక త్రొక్కుడుబండి ఎదురై టంగున గంట కొట్టింది: లేకపోతే అది వస్తూంది అని

మాకు తెలియకే పోను. దానికేసి చూచినాను. దాని మీద మనిషి వానవాలుపట్టి అమాంతంగా నాబండిలో నుంచి నేను దిగి,—అ త్రోక్కుడుబండి వడివడి 'రైలు స్టేషన్' కేసి పోతూంది,—కొంతదూరం వెంబడించి, "అపవోయి! కేకేస్తోంటే అదే తొక్కుకుపోవడం! ఆపు! పాపారావు! ఆపవోయి!" అన్నాను. ఆయాసంగా వున్నా అందినంత గొంతు కత్తి యాలిచాను. వెంటనే పాపారావు త్రోక్కుడుబండి దిగి వెనక్కి చూచి, "నీవా? ఎవరో అనుకున్నాను. నేను జబుగుగా, 'మెయిల్లో' ఉత్తరం వెయ్యడానికి వెడుతున్నా. నీవు 'మెయిలు' దిగి వస్తున్నావు లాగుంది. మాయింటికే వెళ్లు. మరెక్కడికైనా వెళ్లేవు గనుక. మాతండ్రిగారింటనే వున్నారు. నీవెంకాలే నేనూ వస్తున్నాను. అదిగో! మొదటిగంట అప్పుడే కొట్టినారు. జరుగురువుత్తరం!" అంటూ 'స్టేషన్' దెసకు చాతీ త్రిప్పి త్రోక్కుడుబండి యెక్కి పోతున్నాడు. ఏమిటా వుత్తరం? "కవనా?" "కార్డా?" అని పరీక్షిద్దామనుకున్నాను గాని తిరిగి అతడు వచ్చినప్పుడు అడిగితే సరిపోతుందనుకొని, ఏమిటని మహాభాగ్యము అని నాలో నే ననుకొని, అతని త్రోక్కుడుబండి కొత్రోప్పి అతనిని సాగనంపి నా బండికోసం చూచాను. ఏది? బండి లేదు. బండితోపాటు నా గొడుగూ, జోడూ కూడా పోయినవి. "సరే! ఇన్నాళ్లకు బండి ముందాక్కడకు కిలాడీలో పడ్డాను. ఎప్పుడూ ఎవడూ నా గొడుగూ జోడూ ఎత్తుకుపోలేదు." అని నావు నిమిషం సంక్రింపుగా నోచించి, ఆయోజనతోనే మిత్రుని మొక్కంపు దారి అతిగమనంలో రామచంద్రరావుగారి యింటికి వచ్చా.

ఎప్పుడైనా రామచంద్రరావుగారి యింటికి నే వెళ్లడమంటూ వచ్చిందా అంటే నాకాలిజోడు చప్పుడుంటే అని వారియింటిల్లిపాదికీ అవనాలు. ఇంకా అంతమాటన్నీ రస్తానున్నా ననగానే పిల్లా జెల్లా తలుపు దీసి, "ఓహో! వచ్చావా మావాం!" అంటూ వావి కల్పించి ఆహ్వానించి, కాళ్లు కడుక్కోడానికి నీళ్లు మున్నాగుక వుంచి, ఫలహారాలవేళైతే ఫలహారం పెట్టి, భోజనాలవేళైతే భోజనానికి లెమ్మని, ఎంతో మర్యాద చేసేవారు.

నాడు తలుపే తీయలేదు. తలుపు తీయకపోవడానికి పోనీ నాకాలిజోడు లేనికారణమనుకున్నా, రామచంద్రరావుగారూ అని పిలిచినా పలుకలేదే, ఎవరూ రాలే. తలుపుసందంట చూచా—సింహద్వారపు తలుపేగా చూచినా ఖరవా లేదా—చూచానే గాని సింహద్వారపు తలుపునకు కన్నాలూ సందులూ వుంటాయా? గట్టిగా బిగించి గడవేసి వుంది. "రామచంద్రరావుగారూ! రామచంద్రరావుగారూ!" అని రెండుమార్లు కేకేసా. రెండోకే కొక్కాయి యున్నట్లయింది.

ఇంట్లోనుంచి యెవరో వచ్చి తలుపుతీసి వెంటనే మళ్లీ పోతూ "పీధిగదిలో కూర్చుండే పలికినారు కారు అప్పడాలొత్తడం ఇంకాకాలే? లేండి! మరికట్టకోండి!" అని ఎవరితోనో అన్నట్లుయింది. ఆమాటకు పీధిగదిలోనుండి "ఏంచిటంటున్నావు? అప్పడాలు మెత్తపడిపోతున్నాయి అనా? నడించు. 'స్తున్నా'" నన్నట్టయింది. నేనూ గొంతుకలనుబట్టి ఆరెండుగొంతుకలూ, మొదటిది రామచంద్రరావుగారి భార్యది రెండవది రామచంద్రరావుగారిది అని గ్రహించి గబుక్కున తోయదలచుకొన్న తలుపు మెల్లిగాతోసి చల్లగా నడవలో అడుగుపెట్టి, ఏమీ ఎరుగనట్లు "రామచంద్రరావుగారింట్లో ఉన్నారా?" అన్నాను.

రామచంద్రరావుగారు ఈవలకు వచ్చినారు. చొక్కా లేదు. పంచెకట్టు గుండాగు కట్టు. ఎలా వున్న మనిషి అలా వచ్చినట్లు తోచింది. కళ్లనుండే కళ్లజోడు చేతి వ్రేళ్ల వ్రేలాడిస్తూ పట్టుకుని యుండడాన్ని పట్టి ఏదో మెదడుపని జరుగుతూ వ్రాతో అప్పుడే అయి యీవలకు వస్తూవున్నట్లు తట్టింది. కాని పూర్వోక్త సంభాషణాన్ని పుచ్చుకు చూస్తే అప్పడాలొత్తి కూడా యీవలకు రావడానికి అవకాశంవున్నట్లు నా ఆలోచన పోయింది. ఎన్ని, ఎన్ని, ఆలోచనలైనా ఆయన్ని చూచి నేను చేయగలుగుతున్నాను గాని ఆయనకు నన్ను గురించి యొక్క ఆలోచనా తట్టినట్లుగ

పడలేదు నన్ను కూర్చోమనలేదు. ఎప్పుడు వచ్చావని అడుగలేదు. దాహం కావాలా అని అడుగలేదు. భోజనం చేసినారా అని ప్రశ్నించలేదు.—నేనుమాత్రం "కోటు" బొత్తాలు విప్పి కోటుతీసి గోడమేకుకు తగిలిస్తూ, గొంతు సవరించుకుంటూలోపలి చొక్కా బొత్తాలుతీసి జేబురుమాలతో మెడా, నొసలూ, తుడుచుకుంటూ "పిల్లలూ అంతా కులాసాగానున్నారా?" అన్నాను. రామచంద్రరావుగారు నామాట వినిపించుకోకుండానే వెనక్కి పడగటింటి వైపుకు మొగంత్రిప్పి "అమ్మీ!"— భార్యను అమ్మీ అని పిలవడం ఆయనకు ముద్దు— "అమ్మీ! అబ్బాయి వెళ్లాడా రైలుస్టేషనుకి? మెయిలందుకుందంటావా? లేదా? మెయిలులో వుత్తరం పడివుంటుందంటావా? లేదా?" అని లోపలకు లోపలకు వెళ్లి కాళ్లుకడుక్కొని మడికట్టుకునే ముందు భార్యతో వాలుగుడచ్చాలుకొట్టి భాగ్యమున్నేసి ఏకెంతు మెతుకులో నోట్లో పడేసుకుని యీవలపడే రకంగా అడిగినారు. ఇల్లాలు "మెయిల్లో పడక యీ త్తరం యీవల పడుతుందా? మడికట్టుకోండి! లెండి!" అని లోపలకు రమ్మన్నట్లు గాజులాడించి, "ఎవరో వచ్చినట్లున్నారు. నడవలో ఉన్నారు. కనుక్కున్నారా వారిని?" అంది.

నేనప్పటికి నడవలో నిలబడక వీధిగుమ్మంలోనికి వచ్చి రస్తామీద చీకట్లో నించున్నాను—"మెయిలు దగ్గరకు వెళ్లిన పాపారావు తిరిగి వస్తూవుంటాడు. అతని ద్వారాగాని ఆ నాడాతిథ్య మాయింట మనకు జరుగనేరదు. ఎందుచేతనో భార్యాభర్త లిద్దరూ ఏమరుపాటు చెందియున్నారు" అని అనుకుంటూ—

ఆ నా పరోక్షమందు, రామచంద్రరావుగారు నడవలోనికివచ్చి "ఎవరూ లేరిక్కడ? ఈనడవలో కోటు తగిలించేసి వీధితలుపు తీసేసిపోయినా డబ్బాయి" అని పటక్కున వీధితలుపు గడవేసి- నేను ఉండండి, ఉండండి, అని అనడానికూడా సిగ్గుపడి పోయేటంత సుభాలున తలుపు గడవేసి వెళ్లిపోయినారు. బహుశః నడవలోని నాకోటు ఆయనతీసి తనకుమారుని పడకగదిలో తగిలించి వుంటారని నాయూహ—ఊహేం?

ముందుకత కొంచెం వెనక్కి నెట్టిచూస్తే అంతపనీ జరిగింది సందేహంలే—తగిలించి తిన్నగా పెరటిలో నూతి దగ్గరకు వెళ్లి స్నానం ప్రారంభించియుంటారని నాయభిప్రాయం. ఏమా అంటే చేపమీదచేద చేదమీదచేద చేదుతూ చేదచేదడం "అమ్మీ! పడ్డించు రాత్రి పదకొండయినట్టుంది. ఎప్పుడూ ఇంతసేపు పనిదగ్గర కూర్చోలేదు. బుర్ర మండిపోతూంది. చూడు నిమ్మకాయ పసారాలో పెట్టు. సుశీలా రాఘవా నిద్రపోయేరా? ఏమిటి?" అని ఎదో ఒకటి అడుగుతూ వున్నట్టు వినబడ్డాది వీధిలోకంటే యింటి కప్పుపై నున్న అంతరాళాన్నే.

నాకేం చేయడానికి తోచలేదు. "పరాయివాడు బంధివాడు గొడుగూ జోడూ అపహరిస్తాడనే దురుద్దేశ్యం కొద్దీ బంధి తోలుకుపోతే వూరుకున్నానా లేదా? అలాంటప్పుడు నాస్నేహితుడు నాకోటు జాగ్రత్తపెట్టే సదుద్దేశ్యంతో తలుపువేసికొన్నాడు తగువు పెట్టడమేలా? ఏమీ బాగుండదు. "తలుపు తీయండి. లోపల నా కోటుంది" అని తిరిగి తలుపు తట్టడం గడుసుపనము కాదు. ఈసంగతి పాపారావు వచ్చినతరువాత చెప్పడంకూడా అంత లాయకుకాదు" అని అనుకొని ఇక చేసేదేమిటి అనే నిరాశకొద్దీ, అలాలోపల చొక్కాయి బొత్తాలు తీసిన బొత్తాలు తీసినట్లుంచి, తుడుచుకునే జేబురుమాలు వ్రేళ్లనే మెలేసుకుంటూ వుండిపోయినాను. ఉండి ఉండి ఊరుకుండలేక "ఆలస్యమైతే మెత్తపడ్డ అప్పడాలింకా మెత్తపడి పోతాయేమో పోనీ కేకేస్తేం" అని ఒక నిశ్చయానికివచ్చి తలుపుదగ్గరకు వెళ్లి ఆమాటు పాపారావును పిలిచినట్టు పిలుద్దాం అని యూహించి "పాపారావు! పాపారావు!" అని కేకేశాను. "పాపారావు ఇంట్లో లేడు. మెయిలు దగ్గరకు వెళ్లినాడు. ఇంకా రాలేదు." అని లోపలనుంచే హాజరు జవాబుగా వారింట్లో ఎప్పుడూ పొదికట్టున కూర్చుండే ముసలమ్మ కూకేసింది. "బలే పరాభవం ఈరాత్రి—దీనికంతకూ కారణం నామామోలు కోడు లేకపోవడమే యని చింతించి; ఆ బండివాడెవడో "పోలీసు స్టేషన్"లో ఫిర్యాదుచేస్తే తెలుస్తుంది, మరీన్ని యీ అర్ధరాత్రి ఈపట్నంలో ఎక్కడకు వెళ్లినా అపాయమే, పురపాలకసంఘ

దీపాలుకూడా ఆరిపోతాయి, “పోలీసుస్టేషన్”లో ఏ “లాంతరు”లో ఏదో ఎప్పుడూ వెలుగుతూ వుంటుంది, రెండువిధాలా కలిసొస్తుంది” అని మరొక మార్గంగా “పోలీసుస్టేషన్”కు వెళ్లినాను. స్నేహితునింట ఆతిథ్యానికి నీళ్లు వదులుకున్నాను.

నేను పోలీసుస్టేషన్‌కు వెళ్లేసరికి అక్కడ ఒక ‘లాంతరు “స్టేషన్”లో వ్రేలాడుతూ వెలుగుతూంది. ఆవెలుగుముందు వలయాకారంగా గోడ కమర్చబడ్డ, ప్రతిరోజూ తోముతూ ఒకవాడూ పేల్చని పెదపెద్ద తుపాకులు తుపాకుల యొక్క మూరుకు వూడలు పొడుపుడు బాకులు, ధగధగ మెరిసి పోతున్నాయి. ఆధగధగద్యుతి తప్ప వేరే అక్కడు ‘చైతన్యం’ మరొకటి నాకగపించలేదు. రక్షకభటులంతా తిళ్లకుపోయి యున్నారనుకుంటాను. లేదు. ఒకరిద్దరు గోడలకు జేర్లబడి నిదరపోతున్నారు. ‘పరిశీలనాధికారి’ ప్రశాన్తంగా ఒక లాల్చీతో మేజాబల్ల ముందుకూర్చుని కలంచేత పుచ్చుకుని దినచర్య పుస్తకంలోని పుటలు పూర్తి చేసి కొంటున్నాడు. నేను ఆయన్ని పూరింకాంచి పరకాయించి చూస్తూ గుమ్మా దగ్గరకు వెళ్లి “ఏమండీ? ఇక్కడి అధికార్లు యెవరు? ఉన్నారా?” అన్నాను. అనే సరికి తలెత్తిచూచేరాయన. ఆయన తలెత్తి చూచేసరికి ఆయన నన్ను నేను ఆయన్ని ఆనవాలు పట్టేని “ఓహో! ప్రసాదరావు! ఇలా వచ్చావేంవిటి? ఈయూరు నీకుబదిలీ అయిందా యేమి!” అని అతను నన్ను, “నీవేనా యేమి యిక్కడ పరిశీలనాధికారివి -రమణప్పంతులూ!- బహుకుదిరం నేడు. ఎన్నాళ్లయి చూచేనోయి! నిన్ను-” అని నేను అన్లే, కుశల ప్రశ్నలు వేసికొని, కుశలోపరి, అతను నాకై ఒక కుర్చీ బరబరా లాగిన చప్పుడు తప్ప మరో చప్పుడు తెలియనంత నిశ్శబ్దంలో ఇద్దఱమున్నూ మునిగిపోయి క్రమక్రమంగా పిచ్చాపాటీలోకి దిగిపోయేం.

నేనూ అతడూ ప్రవేశపరీక్షా తరగతి వరకు సహాధ్యాయులము. ఇద్దఱం ఒక్కసారే కృతార్థులమైనాం. నేనింకా పట్టపరీక్షకు చదివి ఆతరువాత “కరగ్రహ” శాఖలో తొత్తుగుండానే నెలకు ముప్పైరూపాయల ఖాయప్పదని ఏలాగో సంపాదించుకుని క్రమక్రమంగా తాలుకాలో ప్రప్రధమముస్తాగిరీలోకి వచ్చి అప్పటికెక్కడో ఉన్నాను. అతగాడు, ఏమన్నా తిన్నగా ‘రాయవెల్లూరు’ మార్గంపట్టి, అక్కడ యిచ్చిన శిక్షయొక్క ఛకాక్కు మొక్కులకు ఆగి మన్యంలో నవుకరీ పంతు కానిచ్చుకొని మైదానంమీద పాతుకునిపోయి, రక్షకాధికారంలో నాడక్కడ వున్నాడు—ఆ వాడిద్దఱం ఆలా కలుసుకోవడను నేటి నిజంగావింతే. అప్పటికప్పుడే మేమిద్దఱం ఒకరినొకళ్లం చూచుకొని 1925 వ సం|| 1930 వ సం|| 5 సంవత్సరాలు పైని, 1930 జనవరి, ఫిబ్రవరి, మార్చి కూడా కడచిపోతే అయిదు సంవత్సరాల మూడుమాసాలైం దన్నమాట.

“నాకు బదలీలేదు గిదలీలేదు ఊరకనేవచ్చా”నన్నాను. “ఊరకే! నన్ను చూడ్డానికే! ఏవి నీపెట్టె, బేడా, కోటూ జోడూ?” అని ఆత్రతగా అడిగినాడు. “ఉండు. చెబుతా. కథంతా చెబుతా. ఉండు. నీ వ్రాసి కోవడమైందా?” అన్నాను. “అయింది. వెధవ వ్రాతగోజూ ఉండేదే. రక్షకశాఖ అంటే ఇదే వచ్చు. ఇప్పటికింకా తిండిలేదు. తిప్పలులేవు. శవపంచాయితీ యొకటి చేయించి వచ్చేను. చెప్పు నీకథ” అన్నాడు. అంటే కళ్లల్లో ఆశపోసికొని జరిగిందంతా పూసగ్రుచ్చినట్లు చెప్పి, “ముందాజోడూ గొడుగూ సంగతి కనుక్కోవాలోయి.” అన్నాను.

“ముండాజోడు ఆకజోడైతే మూడు పావులాలుండేవి, సీమజోడైతే మూడురూపాయలుండేని, గొడుగో రూపాయన్నర చేసేని” అని అంటూ అతడు లేవబోతూంటే, నేనూలేచి, “జోడు డాకుజోడేగాని దాని కొంచెం కిఱ్ఱుంచి ఆకిఱ్ఱునుబట్టి అంతా నన్నానవాలు పట్టడానికి వీలు: అది లేకపోవడంచేత నేనా మఱి రామసంద్ర రావుగారింటికి నేను వెళ్లినా వెళ్లనట్లే అయింది?” అన్నాను. “వెళ్లనట్లుగాదు, వెఱ్ఱిలగొట్టినట్లయింది, సిగోటు వారించి వెఱ్లగొట్టినట్లయింది. రాత్రి భోంచేసుకొని మనమిద్దఱం ఒక లాఠీభటుణ్ణి తీసికొని సోదాకు వెళ్లినట్టుగా వారింటికివెళ్లి అడేజావు బడేజావు

చేదాము. నాకీవూళ్లో మిక్కిలి దగ్గఱ నేస్తగాడు రామచంద్రరావే. మనమంతా కలిసి కోటి రాత్రో వేషక నాటకం వేదాము—రా! రా!” అని అక్కడే బాల్చీలో నీళ్లుంచే ముఖం తొంచ్చుకుంటూ ఆనీళ్లు కాళ్లమీదపోసికొని. “రా! రా! ఈబాల్చీలో నీళ్లుపెట్టి కాళ్లూ చేతులూ కడుక్కోని, లే! భోజనానికి ముందుకే!” అన్నాడు. అంటే నేను కొంచెం గొంకి “బైదీలకు వణ్ణం వండి వడ్డించి ఉంచినట్లు ఈయూర రక్షణశాఖాధికారులకు కూడా “స్టేషన్” లోనేనా ఏమిటీభోజన మేర్పాటు?” అన్నాను. రమాప్పంతులు చిరు వ్వనవ్వుతూ “కానోయి! “భాయి” మావాళ్లు పుట్టింటికి పుట్టికి వెళ్లినారు ఇంట్లో ఎవరూ వెనక సరాజేరు మరి. అందుచే వంటబ్రాహ్మణింటినుంచి రోజూ రెండుపూటలూ సమస్తం గిన్నెలదొంతిలో పట్టించుకొని యిక్కడకు తెప్పించుకొని యిక్కడే భోంచేస్తూ వుంటాను. భోంచేసి యీలాగే గస్తుతనిఖీగ్గాను బయలుదేఱిపోతూ వుంటాను” అన్నాడు. “అయితే నీకూ నాకూ కూడా సరిపోతుం దోయి! నీవొక్కడికీ తెప్పించుకొన్నది?” అన్నాను. “నీకూ నాకూనా? మఱియిద్దఱికా? తెప్పించుకునేది “పోలీసు” వారనుకున్నావా ఎవరనుకున్నావు?— చూడు కేరుబియ్యపన్నం పెట్టి పంపుతుంది పూటకూళ్ల పెద్దమ్మ. నేను తివ్వాసబియ్యపన్నం తినేసి—ఈవేళ నీవు వచ్చేవు కాబట్టి ఉండాలనుకో, మిగుల్దనుకో,—దానీ చిన్నమ్మకి రోజూ పూటపూట చెక్కపూటుగా ఱక్కిన తివ్వాసబియ్యపన్నం పాఱేస్తూంటాను. అలా పాఱేస్తూంటే మఱికేమన్నా స్తికి కిక్కుఱుమనకుండా గిన్నెల దొంతి అంతా తెల్లగా తోమేసేసి పంపుపూటింటికి అప్పజెబుతూంటుంది.” అన్నాడు అనోదర్జాగా. “అంతేనా? పక్కేసి ఎక్కాడు అంగీస్తుందా? నీకిగ్గు చిఱుడా, పంతులూ! నీగుణం పోనిగొట్టుకున్నావు కాదు. దానీదానికి మిగిల్చే తివ్వాడు బియ్యపుకణ్ణం నాకు పెడుతున్నా వంటావు! అట్లు తోంపమనవుకదా?” అని మాటకు మాటా భర్తీచేసి, “రా! రా!” అని చేనే ఆకులు వేసేసి అతడూ నేనూ కూర్చుని అక్కడే ఆగిన్నెల దొంతర గలగల మనేటట్టు యివతల కొక్కొక్కటే పెడుతూ—ఏముంటాయి గిన్నెల్లో?—అప్పడాలుంటాయా? మిర్యాలచారు, చిక్కుడుకాయకూర, మినప్పప్పు పచ్చడి, అవియివీ వెనుక తినవలసింది ముందు ముందుతినవలసింది వెనుక తింటూ అరగంటలో భోజనం ముగించేశాం.—

ఈలోపుగా రామచంద్రరావు గారింట జరిగిం దేమిటంటే—నీవు భోంచేస్తూ చూచేవా అదంతా అని చదువరులనుకొంటారేమో?—అప్పుడు తెలియకపోయి నా యీ దరిమిలానంతా అవగాహనే గానాకు లేకుంటే వ్రాయడమేలా? కథ ముగించడమేలా?

పాపారావు “రైలుస్టేషన్”కు కాళ్లేరికి మెయిలు అప్పుడే వెళ్లిపోయింది. టాంగాడీలో పడేయు దలచుకున్నదేమో పడేయలేకపోయి, యేం నిమిషం నాలుక్కు అనుకొని తన రెండు చక్రాల త్రొక్కుడుబండి నడిపించుకుంటూ ఎవరితోనో స్నేహితునితో కబురు చెప్తుకుంటూ ఆ స్నేహితునింటికేసి మళ్లీ అమార్గాన్నే వచ్చారాట్ట. ఆ వచ్చాడడంలోనే ఎక్కొచ్చిన బండివాడు బండి ఆమార్గానికి పట్టించి తోలుతున్నాట్ట. ఆనవాలుపట్టి పాపారావు “ఒరేవు! బండీలా తీసుకొచ్చేవేంవిరా! మా యింటిదారి మఱచిపోయావా? ఏమి?” అని గదినాట్ట. ఊళ్లో మనిషి ఊళ్లో పెద్దు ఊళ్లో పాపారావుకు పరకాయింపేగా మరి. బండివాడామాటకే నేలు నోండెం పోడిచినట్టయిపోయి, “లేదండి, లేదండి, వారు కొడుకూ కోడలూ బండిలో మఱచిపోయేరండి” అంటూ అవి పాపారావుకు అందిచ్చి బండి తోలుకుపోయినాట్ట.—పాపారావు నాగొడుగూ జోడూ తన త్రొక్కుడుబండి కట్టుకుని స్నేహితునితో “నాయను నిజాయితీవాడంటావా? దొంగ అంటావా?” అంటే స్నేహితుడు “నిజాయితీ దొంగ అనుకుంటా” నంటూ నిగరొచ్చే కళ్లు తేలగొట్టుకొంటూ “ఎవడైతేనేం గొడుగూ జోడూ నీకిచ్చివేసినాడుగదా” అని పాపారావునుండి వీడ్కోలుతీసికొని వెళ్లిపోయినాట్ట. పాపారావు నాగొడుగూ జోడూ తీసికొని తమయింటికివచ్చి, నాజాడ కక్కడా అగపడమి నింట్లో అడిగినాట్ట. “ప్రసాదరావు మావరాలేదా? యిక్కడకు?” అని—అనగానే రామచంద్రరావుగారు “ప్రసాదానికేమొచ్చె? ఉత్త

రంటపాబంగిలో వడేసినావా? లేదా?" అని అడిగినారట. "లేదు. దాటిపోయింది" అని ముఖం వేలాడేసుకుని పాపారావు అనేసరికి రామచంద్రరావుగారు రుద్రుడై రుద్రుడై వీరభద్రుడై "ఏం చెప్పినాయి దేవరుస అన్నీ దాటపెట్టేవు." అంటూ, "రేపైనా మరచిపోక తపాలా ముహూర్తం దాటపెట్టకపడెయ్యి. జరుగురు ఎందుకు పంపాననుకున్నావు అంకే నిలుచున్నపాటుగా? ఎందుకే వేళ తిండీతిప్పలూమాని ఆలా మెదడు గుంజు కరిగిపోయేటట్టు పనిచేశాననుకున్నావు?" అని లగ్నాష్టకాలు చదివినాట్ట. అప్పుడిల్లాలు లోపలనుంచివచ్చి "వెళ్లవలసింది ఉత్తరంగాని మనిషికాదుగదా. 'అయ్యో! అక్కడ కనిపెట్టుకుంటారు. వండియూ తెట్టియుంచుతారు మిగిలిపోతుంది.' అని అనుకోడానికి. అమాత్రానికి వాణ్ణి ఆలా అనాలా? అవతల వాళ్లు కాదనక పొద్దుటేరేపు ఉత్తరాల జవానుకేసి ఒకరిత్తమాపాకటి వదిలేరు. ఎల్లుండి మీ యుత్తరమందుకునేరు." అని భర్తను మందలించీ మందలించనట్లు మందలించిందట: తల్లి తనకేసుకుని రావడంవల్ల పాపారావుదీప మారిపోయియున్నాగాని కొంచెం ధైర్యంగా తనగదిలోనికివెళ్లి ఏవో కాగితాలు ఉత్తరాలు తన సొంతానివి తన తండ్రిగారివి—తన అప్పటి చొక్కా జేబులో నున్నవన్నీ—ఆచొక్కా లాల్చీ అవడం చేతతీసి కోటుజేబులో పెట్టుతలంపుతో—లుంగచుట్టి పైకితీసి అపాళంగా నాకోటు—తనగదిలో తనతండ్రిగారు తెలియక తగిలించిన, నాకోటు జేబులో కుక్కేసి తనమంచంమీద శయనించి దుప్పటి తన్నిపెట్టి గుర్రుపట్టి నిద్రపోయినాట్ట.

మేం భోంచేసిన అరగంట సావకాశంలో ఎంత పని జరిగిందో చూచినారా? కాలానికి సోమరితన మన్నమాట లేదు. లేదు. లేదు.

నేనూ రమణప్పంతులూ భోజనం అయినాక "కుహనాసోదాకు" బయలుదేరినాం. కూడా ఒక రక్షకభటుణ్ణి తీసికొని రామచంద్రరావుగారి యింటికి వెళ్లినాము. రమణప్పంతులు తనజవానుచేత "రామచంద్రరావుగారూ!" అని కేకేయించినాడు. రాత్రి ఒంటిగంట అయింది. ఇంట్లో అంతా పడుకున్నారు. తిరిగి కేకేసి తలుపుకొట్టినాడు రక్షకభటుడు. రామచంద్రరావుగారు లేచి కళ్లునలుపుకుంటూవచ్చి తలుపుగడతీసి "ఎవరు?" అన్నారు. రక్షకభటుడన్నాడు "తమకోసంగా మాపరిశీలనాధికారిగారు వచ్చే"గన్నాడు. అంటే "రమణప్పంతులా?" అని "రావోయి పంతులూ! మీకంతా రాత్రి తిరుగుడుపని మాకంతా పగలు నలుగుడు పని" అని. "ఎవరు? నీవెనకాల వారెవరు? ఏమిటి "నిశిరాత్రి" వచ్చే"వన్నాడు. రమణప్పంతులు "వారెవరైతేంగాని మీయింటికి నేనిప్పుడు వచ్చింది స్నేహితుడు రమణప్పంతులులాగు రాలేదు. పరిశీలనాధికారిగా వచ్చినాను. మీ యిల్లు సోదాచెయ్యాలి" అన్నాడు. అనేసరికి రామచంద్రరావుగారు "ఏదేం నీకు వెర్రెత్తిందా? పిచ్చిపట్టిందా? నేనేం దొంగననుకున్నావా? రాజద్రోహి ననుకున్నావా? రాజకీయపాఠశాలలో ప్రధానోపాధ్యాయుణ్ణి. నా యిల్లు సోదాయేమిటోయి? చూచుకో! నీకు కోర్కేవల్లా ఎక్కడ వెతికినా కుఱ్ఱాలు పరీక్షలకు వ్రాసిన ప్రత్యుత్తరపుస్తకాలుంటాయి. ఏన్నీ సంవత్సరం పదార్థవిజ్ఞాన పరీక్షాపత్రము ప్రవేశపరీక్షకీయ నియమించి, ముఖ్యపరీక్షాధికారిగాం జేసినారు. కుఱ్ఱవాళ్లకువచ్చిన రాజధాని మొత్తంమీదిసగటుకు రైల్లుండికి పంపవలసినదని పైనుండి తాఖీదు. దిక్కుమాలిన సహాయ్యపరీక్షాధికారులు అవసానకాలపు నిమిషానికిగాని తాముదిద్దిన పుస్తకాలు పంపరు. వచ్చేదా? ఈరోజల్లారాత్రి పదకొండుగంటల్దాకా పునః దిద్దిదిద్ది అసల్లకాటిగుర్తులేల్చి యిప్పుడిప్పుడాలా పెద్దబ్బాయిని మెయిల్లో ఉత్తరంపడేసి రమ్మని నేనిలా స్నానంచేసి భోజనంచేసి మంచంమీదొరిగేను. నీవు సోదాచేస్తే దొరికేవి అకుఱ్ఱవాళ్లు వ్రాసిన ప్రత్యుత్తరపుస్తకాలు వేలకువేలు చూచుకో—"అని రెండు కుర్చీలు నడవలోకీడ్చి "కూర్చోండి నీవూ వారూ" అని నావైపు చేయివిసరి, రామచంద్రరావుగారు "అమ్మా! దీపంతే!" అని కేకేసినారు. రక్షకభటుడు వీధిలోకి పోయి అగ్గిపుల్ల వెలిగించుకుంటూ అది వెలక్కపోతే నిలవలోఉన్న మరొకపుల్ల గీసికుంటూవున్నాడు.

రమణప్పంతులుకు ఏలాగు సోదా ప్రారంభించేదీ తోచడంలేదు. "అయితే ఈ ప్రసాదరావుగారి

కోటు తనరు దొంగిలించి తమయింట్లో దాచుకున్నా రట. వీరు నాసాహాయ్యంగోరినారు. అందుచేతనూ, దొంగతనం ఆస్తిపట్టుకొనుట నాసేవావిధికూడా అవడం చేతనూ మీయింటి కిప్పుడు వచ్చియున్నాను. ఏంచెబు తావు? దానికి జవాబు?" అని అడిగినాడు. అప్పటి కప్పుడే రామచంద్రరావుగారి భార్య లాంతరు తీసికొని వచ్చి గడపయీవల పెట్టి తాను గడపావల నించుని యుంది. రామచంద్రరావుగారు ఆ లాంతరులోని దీపం కాంతి హెచ్చించి నా ముఖంమీద కంటాపెట్టి "ఏమిటి ప్రసాదంభావా! ఎప్పుడువచ్చేవు? నీ కోటు పోవడ మేమిటి, మాయింట్లో ఉండడమేమిటి? అంతామాయగా ఉందే?" అన్నారు. అనేసరికి ఆయనభార్య లోపల నుంచి "అన్నయ్యగారా? ఆయనే కామోసండీ రాత్రి అబ్బాయి మెయిలుదగ్గఱకువెళ్ళి వచ్చేఅంతలో మనింటికి వచ్చివెళ్ళినది—"—అంది. నేనప్పుడింకెలా ఊరుకోగలి? "అవునమ్మా! విశాలాక్షమ్మ! నేనే. భావగారి యేమఱు పాటు అలాగుంది. ఏంభావా! అప్పడాలొత్తడం అయిందా యిప్పటికైనా?" అని అడిగాను.—రామ చంద్రరావుగారు నవ్వుతూ "అమ్మో! నేనప్పడా లొత్తినట్లు యీమీ అన్నగారితో ఎప్పుడు చెప్పావే?" అని సాగదీసి అడిగినారు. ఆయమ, రమణప్పంతులు న్నాడనో ఏమో సిగ్గుపడింది. రమణప్పంతులు "నాకు సెలవు మరి. ప్రసాదరావుగారూ! తెల్లారితే కనిపిస్తారా?" అని అడిగాడు—"ఇంక తెల్లారితే కనబడ్డ మేమిటి: ఇప్పుడు తెల్లవాఱుగట్ల నాలుగ్గంట్లబండికి వెళ్ళి పోతున్నా: సెలవు." అని రమణప్పంతుల్ని జవాబు సహా సాగనంపి, "విశాలాక్షమ్మా! నాకోటు ఇలా తెచ్చిపెట్టు" అన్నాను.

ఆవిడ "ఏంచేసినారండీ?కోటు?" అని భర్తనుఅడిగి నావైపునకుఁ జూచి "అప్పుడే వెళ్ళాలి? బండి తెల్లారి ఆరుగంటలకు—వేళమాఱింది. అయినా ఒకపూట ఉండ కుండానే వెళ్ళడం?" అంది. రామచంద్రరావుగారు "ఏమిటి? ప్రసాదం! నిజంగా నీకోటు మాయింట్లో వుందా? ఏమిటి? నా కేం జ్ఞాపకం లే—మెదడుపని ఖులభ మనుకుంటాం గాని అదే మనిషిని కదుర త్రిప్పినట్లు త్రిప్పేసి కాస్తంతా ఇతరం జ్ఞాపకం వుణ్ణీదు. ఈ రమణ ప్పంతుల్ని ఎక్కడ పట్టుకున్నావు? ఏమి" టన్నారు. అంటే చరిత్ర చర్వణంగా అదివఱకు రమణప్పంతులుకు చెప్పిందంతా రామచంద్రరావు గారితో చెప్పేను. చెప్పేసరికి తెల్లారొచ్చింది.

"అయితే కోటు మావాడి గదిలో తగిలించాను లాగుంది నడంగాలోద్దిసి, వాడిదనుకోని, నన్ను క్షమించాలి సుమా! ఈపూట కాగి జరిగిందాన్నంతా మాకొత్త అప్పడాలు కలుకలు లాడించడంలో మఱచిపోవాలి. మీచెల్లెలు కఱ్ఱ పెండలం అప్పడాలని అవని యివని సొగాగీడావేసి మహొస్తింది" అన్నారు. "నేనా మీరా నత్తింది?" అంది విశాలాక్షుమ్మ. "ఏమేవ్! నిజంగా అప్పడా లొత్తానసే చెబుతున్నావు లోకమందరి తోటి?" అని ఆమెనుంచి నా పెడకు దిరిగి "కఱ్ఱవాళ్ల పరీక్షాపత్రాలు దిద్దడం అనేది ఆడవాళ్లు అప్పడా లొత్తడం లాంటి పత్తిప నన్నానోయి ఒకనాఁడు. అక్కణ్ణుంచి పరీక్ష పత్రాలు నేను దిద్దేటప్పుడల్లా అప్పడా లొత్తడ మింకా కాలేదా" అని అడుగుతూ వుంటుంది —అది. ఎఱుగుదువుగా దాన్ని, నాతో ఆడే దాని వెటకారపు మాటల్ని?" అన్నారు రామచంద్రరావు గారు. నేనడిగేను "అయితే విశాలాక్షమ్మా! రాత్రి భావగారు భోజనం చేసేసరికి నీవు కాల్చిన అప్పడాలు మెత్తబడి పోయినాయా కరకరలాడాయా? ఎక్కడా వినబడలే దప్పుడు?" అని—రామ చంద్రరావుగారి కంటె నాకు విశాలక్షుమ్మ వద్దనను వెక్కువ.

విశాలాక్షమ్మ అంది "ఆయనకు మెత్తబడ్డా వొకటే కరకరలాడుతూన్నా వొకటే: పళ్లూడిపోయి నాయి. చప్పుడుకానివ్వరు" అంది.

"పరీక్షపత్రాలు దిద్దడంలో ముఖ్యపరీక్షాధికారి గా అయినారు భావగారు. పళ్లూడిపోతేం పళ్లుంటేం. అవి దిద్దడంలో అప్పడాలు మెత్తనా కరకరాకూడా తెలుస్తుందీ?" అన్నాను నేను.

"మీబోంట్లే తెలియడంలేదు. అప్పడాల మాటా యిక!" అని కుమారుని గదినుండి నాకోటు తెచ్చి నా

కిచ్చి "ఏది నీచెప్పులు జోడేది? ఏది నీగొడుగు?" అన్నారు రామచంద్రరావుగారు.

ఆమాటకు నిద్రనుండి మేలుకుంటూ పాపారావు ఈవలకు వచ్చి "ఇదిగో! ఇక్కడున్నాయి మామ జోడూ మామగొడుగూ" అని చూపించినాడు.

అదంతా యిదివరకే జోడూ గొడుగూ అక్కడ కెలావచ్చినాయో ఎందుకైనా మంచిదని చదువరుల కింత కుముందే తెలియజేసియున్నాను.

నే నాపాళంగా నాగొడుగు పుచ్చుకుని నాజోడు తొడుక్కుని, "సుశీలా! రాఘవా! ఏరి?" (వారిరువురు వారి యొడపిల్ల యొడపిల్లకంటె రెండేండ్లు పెద్దమగపిల్లవాడు). "లేవలే పాపారావూ! చూడు." అని నా బుజాల్నె కొకెక్కించుకుంటూ నాసొమ్ము-సంచీపైకి దీసి యందులోనుంచి యొక పావులాఎంచి, కొంచి, మించిన మక్కువను "చూడు పాపారావు ఈపావులా" అని ఇచ్చి "పావులాకు నాలుగో అయిదో బత్తాయికాయలొస్తాయి వాళ్లక్కనియ్యి దుకాణాలు తియ్యగానే" అని రామచంద్రరావుగారితో "ఆరుగంటల బండికి వెళ్లాలి జరుగురు సెలవుభావగారూ!" అని మరెవరి కేసి చూడకుండానే "వెళ్లొస్తా! విశాలక్షుమ్మా!" అన్నాను.

ఆ అనేసందడిలో నాసొమ్ముసంచీ పైకిదీసి తిరిగి లోపల దాచుకునే గందరగోళంలో నాకోటుజేబులో నుండి కొత్తకాగితాలు కొత్తయుత్తరాలు కింపబడ్డాయి, పెద్దగుంపుగా—

ఆగుంపులోనుండి ఒక కవరు రామచంద్రరావుగారు పైకిదీసి "నయమే! ఇది నీతోపట్టుకుని పోయేవు కావు. పాపని అయ్యో. ఇదే విద్యాశాఖాధ్యక్షులకు రేపటి కందవలసిన కాగితం." అని నేలవంకనుండి కొడుకు దిక్కు మొగంపై "ఏమిరా! ఇంత అజాగ్రత్త!" అన్నాడు. "లేదు. రాత్రి చీకట్లో ఆ నవాలు తెలియక తన కోటులో పెట్టుకొనబోయి అన్నగారి కోటులో పెట్టి వుంటాడు" అంది విశాలక్షుమ్మ. నేనన్నా "చూడు! చూడు! పాపారావు! ఇంకా ఏమైనా నా కాగితాలు మీకాగితాలు కలిసిపోయినాయో ఏమో" అని ఆకాగితాల మీద తలొంచి పాపారావు దూరాన్నుంచి తేటిపాటి చూస్తూంటే మరోకవరు పైకి తీసాను. దానిమ్మీదా "ఆలస్యపు రుసుము" అంటించియుంది. దానిమ్మీదా టపాగాడీ గత రాత్రిదాటిపోయినట్లే కనపడింది. పైవిలాసము. "కన్యకామణి లీలశ్రీకి" అని ఇంకా ఊరుపేరు అదీ ఉంది.

అదిచూచి నేను "ఇదికూడా తమ యుత్తరంలాగేవుంది. ఏరి కన్యకో కమాణిశ్రీగారికి విలాసం వ్రాసినారు" అని రామచంద్రరావుగారికి అందిచ్చాను. ఆయుత్తరం పైపేరుకోసం విశాలాక్షుమ్మ చేరదేసి తన కన్నులు రెండూ దోరవెట్టుకు చూస్తోంది.

పాపారావు తాండ్ర పాపయ్య వేషం మాపుటకు ముందు తన హృదయరంగం మీదికి సూత్రధారుణ్ణి గెంటుతూ వున్నాడు.

రామచంద్రరావుగారా యుత్తరం మీది చిరునామా దస్తూరీచూచి పాపారావుదగ్గరకువెళ్లి అతని ముఖం మీది కంటూ ఆకవరు పై వ్రాతవైపు పెట్టి "ఈదస్తూరీ ఎవరిదిరా! అబ్బీ!" అన్నారు. పా పా రా వు అతి మొం డి గా! "నాదే" నన్నాడు. "నిన్నా పిల్ల కెప్పుడూ ఉత్తరం వ్రాయవద్దని యిదివరలో మందలించలేదు నేనూ?" అన్నారు తండ్రిగారు. "మరెందుకూ వ్రాయలేదు "టెన్నిసు" ద్వంద్వం ఈసాయంకాలము పోటాపోటీగా మాయూర గరిడీసమస్థలంబున నాడుకుందాము, తప్పక సరిగా నాలుగ్గంటలకు రావలసిన దారు గంటల కాలైపోతుంది" అని వ్రాసినాను అన్నాడు సుతుడు.

రామ:—"మనం మరి వెళ్లడం లేదు మూడు ఘంటల బండికేగా?"

పాపా:—"ఎక్కడికీ?"

"ఓరి ఎంతమైమఱపురా! పరీక్షపత్రాలు వచ్చేటట్టు దిద్దినవాణ్ణి నాకైనా లేదురా అంత మైమఱపూ! వారమ్మాయిని చూచివద్దాము నీవూ నేనూ అమ్మాయీ

సాయంకాలము మూడుగంటలబండికి నెల్లూరువెళ్లి అని నే చెప్పలేదు నీకు? చెప్పలేదూ! బట్టలూ అవీ చాకల్దానింటి వద్దనుంచి వచ్చేటట్టు చూసుకోమనలే?" అన్నారు రామచంద్రరావుగారు. "ఓసీ! చవలా! రెక్కలు ముక్కలయ్యేటట్టు అప్పడాలొత్తి వడియాలుపెట్టి మీనాయనగారి పరీక్షాపత్రాలు దిద్దడమాటంకమంటే ఆయద్దంకికూడా వడివడితీరేటట్టు నేనుకూడా ఆపుస్తకాలు మడతపెట్టి యిన్ని విధాల కొట్టుమిట్టాడి పనిచేస్తే యీసాయంత్రం సరిగా నాలుగు ఘంటలకు జాటీబంతులాటరా?" అంది విశాలాక్షమ్మ.

పాపారావు ఏమీ నోట మాట రాకుండా ఉన్నాడు.

అతనికి ఇరవైయేండ్లవయస్సు. పట్టపరీక్షాభద్రుడై యాపై మఱిదేనికి జదువుదామా అనే సందిగ్ధావస్థలో నుండి యేమీ తోచక యిప్పటి కారునెలలయి "లాన్ టెన్నిసు" ఆటలోపడ్డాడు. ఆపడ్డంలో అతనితో జతగా ఆడేపిల్ల యొకతె దొరికింది. ఆపె రోజూ తనూరినుండి అతగాని యూరు పనిగట్టుకొని ఆటకోసం రావడం పోవడంవుంది. అదంతా అదివఱకే నాకు కించిత్తెలుసు. దాన్నిబట్టే యీయువకుడు మెయిల్లో పడెయ్యబోయే యుత్తరం ఎవరికా అని అడగాలి అని ఆదిని అనుకొని మహాద్భాగ్యమేమీ అని మానేశాను.

పాపారావువ కెలాగన్నా సాయపడాలని బుద్ధి పుట్టిందినాకు. అతగాని యౌవనరూపం, అతగాని యుత్సాహం, అతగాని నిజమైన గంభీరస్వభావము అనిమిష మందు వెల్లివిరిసి పోతూంటే!

"ఎన్నేళ్ల పిల్లండీ మీరితనికి పెళ్లికూతురు చూపులకై చూపించేదీ?" అన్నాను నేను రామచంద్రరావుగారివంక తిరిగి. "ఏమే! అమ్మీ! ఎనిమిదేళ్లుండవు?" అన్నారు రామచంద్రరావుగారు భార్యవంక తిరిగి. "ఉండకేం? వాళ్లమ్మ పదకొండోయేట సమర్తాడింది?—ఉండకేం? ఉంటాయి." అంది విశాలాక్షమ్మ.— "ఇతడీ సాయంకాలం "టెన్ని" స్సాడ బొయ్యే పిల్ల కెన్నేళ్లుంటారు?" అన్నాను. పాపారావు "పద్దెనిమిదేండ్లు ప్రసాదం మామా! రేపామె పుట్టిన సుదినమట. పద్దెనిమిదేళ్లు రేపటికి పూర్తి యౌతవట." అన్నాడు. "అయితే అది నిన్ను పెళ్లాడడానికి పనికివస్తుందిరా! నీతో కాపురం చెయ్యడానికి పల్లటరా? నీదే కులమో దాందే మతమో!" అన్నారు రామచంద్రరావుగారు కొడుకుతో. "పెళ్లికీ పేరంటానికీ పనికిరాకపోతే టెన్నిసు ఆటకేం?" అన్నాను నేను. "అయితే ఆట అయిపోయి నాక ఆరుగంటలబండిలో బయలుదేఱుతాడేమో అడుగు" అని భారమంతా నామీద మోపేటట్టురిమినారు రామచంద్రరావుగారు. పాపారావు నే నడుగకుండానే "బయలుదేఱకేం!" అన్నాడు. "ప్రసాదం! నువుకూడా రావోయి! మాతో. వీడు మాటతిరుగుడుగాడై పోతున్నాడు మఱీన్ని!" అన్నారు రామచంద్రరావుగారు. "వీడు మఱి పోయినవాడై పోతున్నాడంతకంటె అంతకంటె ఉండండి: రాండి! అన్నగారూ!" అంది విశాలాక్షమ్మ. "మీరిద్దఱూకూడా సాయంత్రం వీళ్ల టెన్నీసు ఆట చూడ్డానికి వస్తామూ అంటే ఆగుతా" నన్నాను నేను.

అలాగేనని భార్యాభర్తలిద్దఱూ వాగ్దానం చేసినారు—ఒకఘడియ పాపారావుతోకూడా వెళ్లి 'లిలీశ్రీ'కి పాపారావుచే—టపాగాడీలో గతరాత్రి పాపారావు పడవేయదలచుకొని పట్టుకొనివెళ్లి బండి దాటిపోవుటచే పడవేయలేక తిరిగి తెచ్చుకొన్న ఆయుత్తరమందలి యంశములు ముక్తసరుగతింతిగుండా పంపించడంలో ఏశాస్త్ర ఇటూఅటూ తోడయినానో, మఱితక్కిన కాలమంతా రామచంద్రరావుగారితో వారితక్కిన పిల్లకాయలతో కాలక్షేపము చేసినాను. నేనూ రామచంద్రరావుగారు పాపారావు అందఱుకలసి ఒక్క అప్పడమ్ముక్క అంచైనా మెత్తపడిపోకుండా వజ్రసోపేతంగా భోంచేసి యిష్టాగోష్ఠినడపి సాయంకాలం నాలుగ్గంటలయ్యేసరికి ఆటలాడే "క్రీడీ సమస్థలం"కు వెళ్లినాము.

జనం కిటకిటలాడిపోతూ సున్నపుగీతలు గీచిన చతురాంగణము చుట్టూ వున్నారు. పాపారావు, లిలీలిరువురు మిక్కిలి నిక్కచ్చిగా ఆడుతున్నారు. పాపారావు బంతి దుసెల్లిపోయేలాగు ఏలాకొట్టినాడో అని

ఒకవైపువారంటే, లిలీ బంతిని మొత్తేసిందని మరోవైపువారు, పాపారావు వలకు బరాబరి ఆడితే, లిలీ జనపనార పేళేసినట్టు పేళేసి వెనక్కి పంపిందిరా, అని ప్రక్క ప్రక్కలవారు, ఒక్కరి కనులు మరొక్కరివి కానట్టుగా మెచ్చుకున్నారు ఆయిద్దర్నీ అందరూ. తీవ్రంగా నాలుగ్గంటలు మొదలు ఆరుగంటలవరకు కాడినాగుగాని ఆట పరిసమాప్తమై పోయింది. తిరిగి మరునాటికి సశేషం అన్నారు.

"ఏమిటి, భావగారూ! ఏమిటి విశాలాక్షమ్మా! పెళ్లికూతురు చూపులకు వెడదామా? అడుగో! పాపారావు!" అన్నాను.

పాపారావు ఆసమయమందు తన యీడుజోడు ఆటకత్తెతో చిరునవ్వు నవ్వుతూ తనుచుట్టు జనం చూస్తూ కొనియాడుతూ వుంటే అడుగులో అడుగు వేసికొంటూ హాయిలు పోతూవున్నాడు. రామచంద్రరావుగారూ విశాలక్షమ్మకూడా వారి నభినందిస్తూ పరికిస్తూ, "ఈయాట లేలాద్దురుటి? రేపటికి సశేషమన్నారుగా" అన్నారు.

ఈయాట సశేషం అంటే పెండ్లి నాల్గవనాటి శేషహోమం లాంటిదన్నమాట. నాకు సెలవిప్పించండి." అని జనంలో కలసిపోతూ రామచంద్రరావుగారిని విశాలక్షమ్మను "దిగడండి దిగడండి" అని నడుస్తున్నా, నా దారిని నేను.

పాపరావు నన్ను నాదారిని కాచుకున్నట్టు కనిపెట్టి చూచి తనసంగాతకత్తె నెక్కడున్నదాని నక్కడ నిలిపి, నావెనకాలే "ప్రసాదం మాంవా! నీమేలు మరువ నేనంటూ" వన్నాడు. నేనన్నా "నీమేలు మరువ: నాకెట్టుకోదూ, నాకీలు గొడుగూ, నీమూలంగా తిరిగి దొరికాయి. శుభం. ఉండు." అని వెనక్కి వెనక్కి అతణ్ణి చూస్తూవచ్చేశా,—అతణ్ణి అంటే "కన్యకామణి లిలీశ్రీని, యువక రత్నం పాపారావుని అన్నమాట.

## పద్మము

ఉభయభాషాప్రవీణ మిన్నికంటి గురునాథశర్మ గారు

ఫలములమాధురీగుణము; పత్రములం జిగిసొంపు; కేసరం
బులను బసిండిసిగ్గులును, బువ్వులసౌరభ, మెల్లచోఁ దళ
త్తళలును గల్గియుంటివి: ముదంబె సరోజమ! కాని నాళమం
దలమె మహోగ్రకంటకము లందునఁ బాత్రమవైతి నిందకున్.

సాటి గానివారి సాటి యగుటకంటె!-సిరులఁ బాసి యునికి కరము మేలు
కుముదవిభవ తౌల్యమమరునం చనికదా!-తమ్మి రేలఁ జక్కఁదనముఁ బాయు.

సారెకు సారెకుం దిరుగు, సర్వవిదుండును బోలెఁ జెంగటన్
జేరి యొనర్చు గోలఁ, దననెచ్చెలిదండును బైకిఁ బంపు, దు
ర్వార మదంబు నొందు, మకరందముఁ దృప్తిగఁ గ్రోలుచుండు నో
నీరజమా! మధువ్రతము నిన్ బలుతిప్పలు పెట్టసాగెడిన్.

ద్విజరాజౌటయెగాక షోడశకళా విభ్రాజితుం డిందుఁ డ
క్కజ మయ్యెన్ మొగ మేల త్రిప్ప? నలుపంగారాదె యాతిథ్య మం
బుజనీ! రేదొర నీసడింప నగునే?—హో కైరవిణ్యాస్యమున్
భజియించెన్ "దెగుదాఁక నేటికి బిగింపన్" లేరఁటే నీసముల్?

తమదారిఁ దాము చనుచు-న్నమనుష్యులఁ బిల్వ నేల? నలినీ! దళమం
దమరినజల బిందులము-త్యములంచును జూప నేల? తన్ను లవేలా?

ఒక్కచోఁ బుట్టి పెరిఁగితి రొక్క చోటఁ-గళల నేర్చితి రొకచోటఁ గ్రాలుచుంటి
రైన రాజ్ఞి నీయప్ప సహస్రదళము-లకును, నీవో శతదళమ్ములకె గదమ్మ.

జీవనవంతురాలయి విశేషముదంబుల నాళభద్ర పీ
ఠావసథాధిరూఢ యయినన్నిదినాలఁ గరోపగూహన

ప్లావితఁ జేసి నేఁ డొకనెపంబున స్థానము వీడె నంచు నా
నావిధ బాధలం గలఁచినాఁ డినుఁ డబ్జదళంబు నద్దిరా!

నిరతము నిద్రలేచి ద్విజనిర్మలమంగళగీతికా పరం
పర, హరిసేవలన్ సల్పి వల్లభుపాదము లంటి మ్రొక్కి బం
భర ముఖయాచకాళి కతిమంజుల మార్దవ మాధురీ మరం
దరసము చూఱలిచ్చెదవు ధన్యవు పో బిసినీప్రసూనమా!

జీవన మింత కల్గి పరిశీలన సేయఁ గళల్ ఘటిల్లి ల
క్ష్మీవతి వై విరాజిలుచుఁ జెంతకుఁ జేరిన యాచకాళి కాం
క్షావిధిఁ దీర్పకున్నఁ ద్రిజగంబుల నీయపకీర్తివల్లికల్
మోవులు సాగకుండునఁటె ఫుల్లమనోజ్ఞబిసప్రసూనమా!

ఏకరముల నాశ్లేష సుఖైకమగ్న-సలిపె నాకరములనే ప్రచండకిరణుఁ
డిప్పుడు స్థలాంతరమున నిన్నేఁపఁ-దొడఁగె వరుల ఎగ్గుసిగ్గులు లేవు వారిజంబ!

జంఘాలుం డినుఁ డెల్లరేలును బ్రవాసంబందె వర్తించి మా
సంఘంబుం గికురించెఁ జుమ్మని యమర్షాయుక్తి నిందోక్తులన్
సంఘర్షింప వలం క్రియల్ గొనవు భాస్వత్సత్సతీధర్మము
ల్లంఘింపం దొరఁకొవు పద్మిని! భవచ్చారిత్ర మొప్పంగదే!

కుముదిని వెన్నియోగతులఁ గూడి విభున్ గళలీనుచుండ, ని
త్యము నిది యేమికర్మము: మహావిరహంబున రేల వేఁగె దో
కమలిని! దేశద్రిమ్మరినిఁ గాంతుని నమ్మి యెడంద, నిట్టి క
ష్టములను బొందలేవిఁక 'విడాకు' గ్రహింపుము స్వేచ్ఛ గల్గెడిన్.

కాంతుని యింగితాకారమ్ములం దెలియఁగలేక గడగడలాడు సౌరు
నీకంటె నాప్తులు నా కౌరు లేరు లేరని తదేకత నాథు నరయు తీరు
తలఁపుల సిగ్గు దొంతర లటు విప్పఁ గందోయి నాఁగఁ బెదవిపై మెలుంగు

పొలకువ వట్టి సముచితవిధుల్ దీర్చు చదఁగి మడఁగియుండు నాహారంగు
నాపరస్పర విశ్వాస మాపరహిత-భావ మామిథునైకతా బద్ధసౌఖ్య
మొక పతివ్రతాధర్మమందె కలదమ్మ-పద్మినీ! "విడాకుం" గొనఁ బడయలేవు. ౨

సంపెఁగ సొంపు నింపక, విశాలతఁ జూడక గేదఁగిన్, నిగా
రంపు హొయల్ గులాబిఁ గని రంజిల, కవ్వల పాని మల్లె లా
లింపక, మావితీపికిఁ జలింపక, కల్వమృదుత్వ మొప్ప కా
సంపదచేడ శీలము పొసంగుటఁ గా నినుఁ జేరెఁ బద్మినీ!

నీట నటియించు నీకును నింగిఁ దిరుగు-రవికి నేరీతిఁ బ్రణయాంకురమ్ము లొదవె?
అంతరం బెన్ని యామడ లంబుజంబ!-దవ్వుదాపులు ప్రేమకు నివ్వటిలవా?

సమయానుకూలముగఁ గా-లము గడపెద వొరుల బాధలం బెట్టక నై
చ్యమునకు నీ వొగ్గక నీ-రముకొలఁది చెలంగుచుఁ సరః ప్రభవంబా!

'అడవి పువ్వులు'




## మిత్రద్రోహి

పూర్వం, ఒక నెమిలి, ఒక కోడి ఒక మేకా—జట్టుగా ఉండేవి. వాటి నేస్తం దినదినాభి వృద్ధిపొందుతూ, ఒకటితో ఒకటికి 'ప్రాణమైనా అర్పించేస్తా' మన్నంత స్నేహం కలిసింది.

ఉండగా, ఉండగా—నెమిలియింట్లో కార్యంవచ్చింది. కోడినిపిలిచి, ఒకరూపాయ ఇచ్చి, "మాఅమ్మా! మాయింట్లో కార్యం కదామఱి, నువ్వునాకు కాస్త ఆసరాకావాలి, ఈరూపాయకు ప్రశస్తమైన నెయ్యితెప్పించి పెట్టాలి. ఇది నీవంతు, నీఉపకారం మఱచిపోను లే" అన్నది. అందుకుకోడి, "ఓశ్! ఇదెంతపని, మనమేకదగ్గఱ పాలున్నాయిగదా, దానితో చెపితే చిటికలో సప్లయిచేస్తుంది, దీన్ని గురించి పెద్దఆలోచనేమిటి?" అని జవాబు చెప్పింది. వెంటనే ఆరూపాయి మేకకిచ్చి నేతి బేరం పురమాయించింది; మేక 'ఊ' కట్టింది.

కొన్నాళ్ళయ్యేసరికి, కార్యంరోజువచ్చింది. నెమిలి "నెయ్యోయ్! నెయ్యోయ్!" అని కోడికి కేకవేసింది. కోడి "కాస్తరూకోయ్! కాస్తరూకోయ్!" అని అరిచింది. వీటికి సమాధానంగా "నాకేమీ తెలియు"దని చెప్పడానికి మేక "బె-ఎ-అ-అ" అన్నది. అనుశ్రుతంగా వస్తున్న వీటి అరుపులరహస్యగాథ యిది.

ముద్దా విశ్వనాథము

---

## కందిపచ్చడి

ఓ వూళ్లో ఓ కరణం వుండేవాడు. ఆయన ప్రాయం వుడిగినతర్వాత రెండోపెండ్లి చేసుకున్నాడు. ఆ పెండ్లాం చాలా గడుసుది.

ఓనాడు సాయంత్రం కరణం లెక్కలు తనిఖీచేయడానికి తాశీల్‌దారు ఆవూరికి వచ్చాడు. రాత్రికి కరణం యింటికి తిండికి కబురు చేశాడు. తాశీల్‌దారుకి తిండి పెట్టడం కరణం భార్యకు ఇష్టంలేదు. కాని మొగుడి పోరు పడ లేక 'నువ్వేం నోరెత్తకుండా వుంటే రెండు మెతుకులు పడవేస్తా' నంది. మొగుడు అదే చాలనుకొని అందుకు వొప్పుకున్నాడు.

రాత్రి తొమ్మిదయింది. తాశీల్దారు భోజనానికి వచ్చాడు. కాళ్లు చేతులూ కడుక్కొని కరణమూ, తాశీల్దారూ తిండికి కూచున్నారు. వాళ్లింట్లో ఆ రాత్రి కందిపచ్చడి చేశారు. భోంచేసేటప్పుడు తను చెప్పినమాట మరచిపోయి కరణం 'ఓ శేయ్, ఇంకొంచెం కంది పచ్చడి వడ్డించు' అని జబర్దస్తీగా అన్నాడు. ఆమెకు మండిపోయింది. ఉన్న పచ్చడంతా తెచ్చి చెరికొంచెం వేసేసింది. భోజనం అయింది. దినం కరణం ఎంగిలిచేయి కడుక్కోడానికి వాకిట్లోకి పోయేవాడు. నాడు తాశీల్దారుకు నీళ్లచెంబు యిచ్చి చెయికడుక్కోడానికి వాకిట్లోకి పొమ్మని తాను దొడ్లోకి వెళ్లాడు. తాశీల్దారు వాకిట్లోకి వచ్చాడు.

కరణం భార్య దడదడ వాకిట్లోకి వచ్చి మామూలు ప్రకారం తన మొగుడే వచ్చాడనుకొని చీకట్లో చెయ్యి కడుక్కుంటూన్న తాశీల్దారు బుగ్గలు రెండు పట్టుకొని 'ఇంక ఎపుడు కంది పచ్చడి అడగవుకదు, అడగవుకదు' అంటూ చితికిపోయేట్టుగా నులిమిపెట్టింది. తాశీల్దారు దిగ్భ్రమపడి, 'ఇదేమికర్మం' అనుకొని 'నేను...' అని ఏమో చెప్పబోతూంటే,—'అదుగో, మళ్లీ నోరెత్తుతున్నావ్' అని రెండు దవడలు వాచేటట్టుగా చడామడా కొట్టేసింది. ఏట్లాగో తప్పించుకొని తాశీల్దారు 'నేను మీాయింటాయన కాదమ్మా, నేను మీాయింటాయన కాదమ్మా' అని గట్టిగా కేకవేశాడు. ఇదేమిటో అని యిరుగుపొరుగువాళ్లంతా అక్కడ చేరారు. ఇంతలో కరణం దొడ్లో చేయి కడుక్కొని అల్లరివిని లోపలినుంచి దీపం తెచ్చాడు. అంతా గుట్టు బయటపడిపోయింది. అందరు ముక్కుమీాద వేలు పెట్టుకొన్నారు.

కథ కంచికెళ్లింది. మనం ఇంటికొచ్చాము.

'ఒకరు'

---

# *కంటకారి కషాయం

ఒకవూళ్లో ఒక బ్రాహ్మడు వుండేవాడు. ఆయన ఆ గ్రామానికి పురోహితుడు. ఆయన చిన్నప్పుడు రెండు సంస్కృతమ్ముక్కలు చదువుకున్నాడు. తనకంటే పండితుడు లేడని విర్రవీగుతూండేవాడు. ఆవూళ్లో అందరూ ఆయన యెట్లా చెప్పితే అట్లా వినేవాళ్లు. ఆవూళ్లోనే ఒక వైద్యుడు వుండేవాడు. ఆ వైద్యుడు బాగా చదువుకున్నవాడు. పురోహితుడికి ఏమీా రాదని ఈయనకు తెలుసు. అందుకని పురోహితుణ్ణి లక్ష్యపెట్టేవాడు కాడు. ఇది పురోహితుడికి ఇష్టపడేదికాదు.

ఒకమారు పురోహితుడికి తీవ్రంగా జ్వరం వచ్చింది. ఇష్టం లేకపోయినా వూళ్లో వున్న వైద్యుడే మందివ్వాలి కాబట్టి ఆయన్ను పిలువనంపించాడు. వైద్యుడు వచ్చిచూచి "అయ్యా, మీారు నేడు 'లఘులంఘనం' చెయ్యండి." అని

---

* కంటకారి = వాకుడుచెట్టు.

చెప్పి యింటికి పోయినాడు. 'లఘులంఘనం' అంటే-తేలికగా గంతుట- అని అర్థంచేసికొని పురోహితుడు తలవాకిటికొచ్చి కడపమీది నుంచి కిందికి, కిందినుంచి కడపమీదికి చాలా సేపు గంతి పోయిపడుకున్నాడు. వళ్లు అలిసి నందున ఆ రాత్రి జ్వరం యెక్కువగా వచ్చింది. మన్నాడు మళ్లీ వైద్యుణ్ణి పిలిపించాడు. ఆయన యేమీ అడక్కుండా "నేను 'బృహల్లంఘనం' చెయ్యండి" అని చెప్పిపోయినాడు. అంతే, ఆ బ్రాహ్మడు 'బృహల్లంఘనం' అంటే పెద్దగంతు అని అర్థం చేసుకొని వాకిటితిన్నెపయినుండి కిందికి, కిందనుండి తిన్నెపయికి గంతుతూ కొంచెం సేపటికి అలిసిపోయి వీధిలో బొక్కబోర్ల పడి మూర్ఛపోయినాడు. ఆయన పడినశబ్దం విని, భార్య ఇంట్లోనుంచి వచ్చి చూచి మళ్లీ వైద్యుడికి చెప్పిపంపింది. వైద్యుడు వచ్చి చూచి 'ఈయనకు జ్వరం చాలా యెక్కువైంది. కంటకారికషాయంపెట్టి అందులో వీటి నివ్వండి' అని యేవోమాత్రలు ఆమె చేతికిచ్చి యింటికి పోయినాడు. మొగుడు కొంచెం తెప్పిరిల్లింతర్వాత ఆసంగతి ఆయనతో చెప్పింది భార్య. ఆయన కంటకారి—కంటక=ముల్లుకు, అరి=శత్రువు - ముల్లుకు శత్రువు=చెప్పు అని అర్థంచేసుకొని పాతచెప్పుల అట్టలు తీసి నీళ్లలో వేసి కాచి ఆనీళ్లలో మాత్రచాది తాగాడు మన్నాడు తెల్లారేటప్పటికి కాళ్లూ, చేతులూ వాచాయి. అంతే, పురోహితబ్రాహ్మడు 'ఇది వైద్యుడు కావాలని చేసినపని. చిక్కాడు దుర్మార్గుడు నాచేత. వీడిపని పట్టిస్తా' నని గ్రామాధికారిని పిలిచి ఆయనతో తగవంతా చెప్పేడు. ఆయన వూళ్లో పెద్దలనంతా చేర్చి వైద్యుణ్ణి పిలిపించాడు. పురోహితుడు వైద్యుడు తనకు చెప్పినదీ, తాను చేసినదీ, తనతగవంతా చెప్పినాడు. వైద్యుడు నేను 'ఆయనను లఘులంఘనం, బృహల్లంఘనం చెయ్యమన్నాను. ఎట్లా చెయ్యాలని ఆయన నన్ను అడగలేదు. ఆయనకు తెలుసునని నేనూ చెప్పలేదు. కంటకారికషాయం మాటకూడా ఇంతే. ఆయన తెలుసుకోలేక చేసుకున్నదానికి నేనేమి చేసేది' అన్నాడు. పురోహితుడి తెలివితేటలకు పొట్ట పగిలి పొయ్యేటట్టు అందరూ నవ్వుకొన్నారు. పురోహితుడు మొహంచిన్నపుచ్చుకొని ఇంటికి పోయాడు. కథ కంచికెళ్లింది, మనం యింటికొచ్చాం.

రామనాథదత్త.

---

## పిచిక దంపతులు ౧

చిలుకూరి లక్ష్మీనరసమ్మగారు

కిచకిచమంటూ - కిలకిలమంటూ
కేరుతు తుళ్లుతు - కిందికి మీదికి
గిరగిర తిరుగుతు - గెంతులు వేస్తూ
పిచికా, పిచికీ - ఉండేవి.

పిచికమ్మిక్కడ - కిచకిచమంటే
పిచికయ్యక్కడ - కిచకిచమంటూ
వెంటవెంటనే - వెంబడించుతూ
విచ్చలవిడిగా - తిరిగేవి.

పిచికమ్మంటే - పిచికకు గొప్ప
పిచికయ్యంటే - పిచికికి గొప్ప
పిచికా, పిచికీ - విశ్వములోపల
తామే గొప్పని - తలచేవి.

పిచికి మీదను - పిచిక కిందను
పిచికి కిటికిలో - పిచిక ఇంటిలో
పిచికియు ముందు - పిచికయు వెనుక
వింతవింతలుగ - నడిచేవి.

పిచికకు పిచికికి - పిల్లలు ఉన్నా
పిల్లల దారిని - పిల్లల నంపి
పెణకల లోపల - పిడకల లోపల
పెద్దరికాలను - చేసేవి.

పిచిక దంపతులు - పెళ్ళికి పోయి
పెళ్ళికి వచ్చిన - పెద్దల చూడక
పెళ్ళికి తామే - పెద్దల మనుకొని
లొడలొడ సందడి - చేసినవి.

పిచికా పిచికీ - వింతగ తిరుగగ
పెళ్ళికి వచ్చిన - పేరంటాళ్లు
సందడి కొంచెము - చాలించం డన
పిచికలు తుర్రున - వెడలినవి.

పిచికల ఆటల - పిచికా పిచికీ
పెద్దల మనుకొని - పరుగులు పెట్టగ
చాలిం చండని - సాగ నంపుతే
తుర్రున అప్పుడె - తొలగినవి.

పెద్ద మాటలను - శ్రద్ధగ నేర్చి
పిచికల సభలను - పెద్దగ చేయగ
పిచికికి నోరే - పెగలక పోతే
పిచికా పిచికీ - బెక్కినవి.

పిచిక 'కిచ' అనగ - పిచికి 'కిచ, కిచ'
'కిచ, కిచ' అంటే - 'కిచ, కిచ, కిచ,' మరి,
'కిచ,కిచ, కిచ,' అన - 'కిచ,కిచ, కిచ,కిచ,'
"కిచ,కిచ,కిచ,కిచ, - ఒకటే కిచకిచ."

## ఇచ్ఛావిహారము ౨

ఆకాశానికి - నిచ్చెన వేసి
నిచ్చెనమీదికి - ఎక్కి నిలబడి
రూపాయలను - అరరూపాయల
ఏరుదమా
ఒడిలో నింపుదమా.

నిండినఒడిలో - నుండినరూకల
తిండికి లేక - తిరుగుతుండే
తిరిపెగాండ్లకును - తృప్తిగ ఇస్తూ
పోదామా
ఆకలి తీర్చుదమా.

చందమామలో - చక్కగ కూర్చొని
ఏకులు వడికే - ఆముసలమ్మకు
రాట్నము తిప్పగ - సాయము చేస్తూ
ఆడుదమా
అమృతము త్రాగుదమా.

మబ్బులమీదను - చక్కగ కూర్చొని
చెల్, చెల్, అంటూ - సవారిచేస్తూ
ఎనిమిదిదిక్కుల - కెగురుతు లోకాల్
చూదామా
హాయిగ తిరుగుదమా.

రెక్కలు కట్టుక - రింగున ఎగిరి
సూర్యునితోడను - సాయంకాలము
పోతూ తిరిగి - ఉదయానికి ఇలు
చేరుదమా
అవ్వకు చెప్పుదమా.



## ఉల్లునను, పట్టునను పుష్పములు

కొ. నరసింహాచారిగారు

ఇంతకుముందు ఉల్లున ఒక విధమగు పుష్పములను చేయుటనుగుఱించి ప్రమోదూత స౹౹ భాద్రపదమాస భారతి సంచికయందు చెప్పియుంటిని. ఇప్పుడు ఉల్లునను, పట్టునను మఱియొక విధముగ పుష్పములను చేయుటను గుఱించి చెప్పెదను.

### ఉల్లు పుష్పము

ఆఱంగుళముల నిడివిగా చీపురుపుల్లలను మూడింటిని దీసికొని చిత్రము 1 యందు జూపినరీతిని నక్షత్రాకారముగ బట్టుకొనవలెను. మనము పుష్ప మేరంగున నుండవలెనని కోరుదుమో ఆరంగు ఉల్లుదారమును దీసికొని నక్షత్రమున మధ్య ఏదైన నొక పుల్లనుండి ప్రారంభించి ప్రతిపుల్లకును పైనుండి క్రిందివైపుగా అన్నిపుల్లల చుట్టును చుట్టుచు రావలెను. (చిత్రము 2, క నుండి ఆరంభించుచు, చుట్టుటను చూపును). పుష్పమునందలి మధ్యభాగము పుప్పొడితో జేరియుండును గాన, ప్రారంభమున దానికి తగినటుల పసుపువర్ణముగల ఉల్లును చుట్టుట మంచిది. పసుపురంగు ఉల్లును పుల్లలపై ఒక అంగుళము మూయునటులను చుట్టి పిమ్మట పుష్పపత్రములకు సరియగు, రోజా, ఊదా, నీలము మొదలగు రంగులలో నేదైన యొకరంగు ఉల్లును చుట్టవలెను. పత్రములకుగాను ఉల్లును మఱి రెండంగుళములవఱకు పుల్లలు మూయునటుల చుట్టవలసియుండును.

(చిత్రము 3 చూడుడు). కావలసినంత వఱకు ఉల్లును చుట్టినపిదప నూలుకొనను కడపటి యొకటిరెండుపుల్లలకు ముడివేసిన యెడల చుట్టినభాగము వీడిరాకుండును. పిమ్మట నొకసూదియందు కొంత దారమును దీసికొని, ఒకపుల్లయొక్క యొకకొనలో చిత్రము 3, ర వద్ద చూపినరీతిని గ్రుచ్చవలెను. పిమ్మట నా పుల్ల రెండవ కొనవైపున జాగ్రత్తగా లాగిన యెడల, సూదియు దారమును రెండవకొన

నుండి వెలుపలికి వచ్చును. ఇప్పుడు ఊల్లుఅల్లి కలో పుల్లకు బదులుగా దారము దూర్చబడి యున్నది. ఈరీతిగనే తక్కిన రెండుపుల్లల కును సూదిని (దారముతో గలదానిని) గ్రుచ్చి రెండవవైపున వెలుపలికి లాగినయెడల, పుల్ల లన్నిటికి బదులుగా దారములు వచ్చును.



(చిత్రము 10 చూడుము). ఇట్లు దూర్చబడిన దారముల కొనలు ఆఱు ఉల్లుఅల్లికచుట్టును తెలియుచుండును. ఆఱు దారపుకొనలను పుష్పము యొక్క వెనుకప్రక్క చేర్చి పట్టుకొని పుష్పమున గలఉల్లును కొంచెముగా మధ్యకు అదిమిన యెడల చిత్రము 12 నందు జూపిన రీతిని ఒక ఉట్టివలె నేర్పడును. పిమ్మట దారముల నన్నిటిని చేర్చి ముడివేసి, చిత్రము 12 నందు వ అను మధ్యభాగమును లోపలికి అదిమినయెడల, చక్కని రోజాపుష్పమువలె నేర్పడును. పుష్పమునకు వెనుక నొకవంపు సూదిని (Hairpin) గ్రుచ్చి శిరమున ధరించవచ్చును.

పట్టు పుష్పము

చొక్కాయలు రవికెలు కుట్టునపుడు కత్తిరించబడు చిన్నచిన్న తునుకలను పాఱవేయక ఉపయోగకరములగు వస్తువులుగ జేసికొనవచ్చును. పట్టుగుడ్డలయందు వచ్చుతునుకలను పుష్పములుగా కట్టవచ్చును. అట్టి పేలికలను, చిత్రములు 4, 5, 6 నందు జూపిన విధముగ మూడుపరిమాణములు గల వలయములుగా కత్తిరించి వాటియందు పుష్పపత్రములనుగూడ కత్తిరించవలెను. ఒక్కొక్క పరిమాణమున 3 లేక 4 వలయము లుండిన జాలును. పెద్దవలయముల నడుగునను, చిన్నవాటిని పైనను చిత్రము 11 నందువలె చక్కగా నమర్చుకొని మధ్యవాటినన్నిటిని చేర్చి కుట్టవలెను. పుష్పము మధ్యభాగమున సరిగను కుట్టిన యెడల బాగుండును. సరిగ సాధారణముగా చిత్రము 7 నందు చూపబడినట్టి బండ్లకు చుట్టి విక్రయించ బడుచుండును. ఒకబండి క్రయము 3 లేక 4 అణా లగును. ఒకబండియందలి సరిగ యనేక పుష్పములకు చాలును. ముందు సరిగను చిత్రము 8 చూపినవిధముగ కట్టుకొని అట్టి మూడునాలుగు తునుకలను చేర్చి చిత్రము 9 యందువలె కట్టవలెను. పిమ్మట దానిని పుష్పముయొక్క మధ్యభాగమున పెట్టికుట్టినయెడల చక్కని పుష్ప మేర్పడును.

ఈపుష్పమునకు వెనుకగూడ నొక సూదిని గ్రుచ్చి యుపయోగించుకొనవచ్చును.



---

# త్యాగవైభవము

శ్రీ జనమంచి వేంకట్రామయ్యగారు

కాటికే గద పెంచుట కండ లనుచు
  నున్నరవ్వంత నేతితో నొక్కజోతిఁ
బెట్టి తులసమ్మకడ నొక్కవృద్ధవనిత
వట్టి యన్నమె తిను ఘృతవర్జితముగ.

పిల్లపా లని తల్లులు వేఁడికేని
లే దనకుఁడీ మనకుఁ జల్ల లేక యున్న
గొల్లకడ నేదొ కొని పోసికొంద మనియె
నావుపాఁడి గలట్టి గృహస్థాకండు.

*                    *

పెనిమిటికి బిడ్డలకు బంధుజనులకు నిడి
తాను వడ్డించుకో నున్న తఱిని నచట
నుండియో రాతిరి యవేళ నూడిపడిన
యొక్కయాగంతుకున కున్న దూఁడ్చి పెట్టి
వండుకొనలేక యిల్లాలు పండుకొనియెఁ
గుడవకయును గుడిచినట్లు కడుపు నిండ.
ప్రక్క నిదురించు బిడ్డపైఁ బ్రాఁకవచ్చు
త్రాఁచుపామును నరికట్టఁ దలఁచి పట్టి
పెనఁగులాడి మూర్ఛిలి దాని విసముచేత
వ్రాలి యొకతల్లి యమృతత్వపదవిఁ బడసె.

*

గాయములచేత దూపిల్లునాయకునకుఁ
బాటుపడి యెవ్వఁడో యిడ నోటికడను;
కాని యాదొప్పెఁడుజలంబు నాన కతఁడు
వ్రణితుఁడయి యానపడి చూచు భటుని కీయఁ
బనిచి చనెఁ దాను పూర్ణజీవనముఁ గ్రోల!

*

స్త్రీల, శిశువుల నెక్కించి చిన్నపడవ,
నోడ యడుగంటుచుండంగ నుల్లములను
నిశ్చలధ్యాననిరతులై నిలిపి దేవు
భటులు నిల్చిరి ధీరులై బార్లు దీరి;
దప్పిగొన్నట్లు కడుపారఁ ద్రావి యోడ
యూరు పోకుండె; నందున్నవారు నకట
—దలలు మునిఁగిన వరిచేలవలెను గాక—
తేలి రబ్ధిపయిఁ గలపతెప్పలట్లు!

***

పాఱెను ధూమశకటి దుర్వారగతిని;
గట్టు తెగఁ గొట్టి యేఱునున్ గండి చేసి;
లంకె వదలించి యంత నిశ్శంకముగను
జనకతప్రాణములు నిల్పి చనియె నూర్ధ్వ
గతిని, యంత్రంబుతో నధోగతిని గనియు.

***

తనకుఁగల సర్వమిచ్చి గతాసుఁ డయ్యె
దాసుఁ డతఁడు యలోకనివాసుఁ డయ్యె;
దేశసేవానముద్ర యాత్రికుల కెల్లఁ
ద్రోవఁ జూపెడు జ్యోతియై ధ్రువుఁడువోలె.

***

దేశబంధవిముక్తికై తెంపుసేసి
లోకకల్యాణమార్గంబు లోఁ దలంచి
త్యాగి యయ్యె జీవన్ముక్తుఁడయ్యెఁ గనెడు
బంధనము మహాత్ముఁడు సత్యసంధుఁ డిపుడు.

*

ప్రేమమహిమమె యీత్యాగవిభవమెల్లఁ
బ్రేమ లేకున్నఁ ద్యాగమే లేదు మనకు;
చిత్రములు చూడ స్త్రీప్రేమచేష్టితంబు
లద్భుతంబులు పరమగుహ్యార్థములును.

అన్నిటిని జుట్టుకొనెడు నత్యాశ గాదు
అన్ని డిగ్రమింగులయకాలయముఁడు గాదు
చేతులను జాఁచుఁ గౌఁగిటఁ జేర్చుకొఱకె
కడుపులోఁ బెట్టుకొనుఁ బ్రాణ మిడెడుకొఱకె
ఏమి కావింపఁజాల దీప్రేమ? మేను
కోసి యిచ్చును చెప్పులు కుట్టి యిచ్చు;
నిచ్చునందాఁక నిలు పోప దేమి చెప్పఁ!
ప్రేమకును నాశకును బట్టు విడుపు లేదు.

గొబ్బూరి వెంకటానంద రాఘవరావుగారు B, A.

హిందువు లన్నను, వారిమత మన్నను, వారి గ్రంథములన్నను, వారి దేవతలన్నను, వారి సంఘ జీవనమన్నను, వారి యాచార వ్యవహారములన్నను ఇతర మతములవారికి రోత, అసహనము, ఘృణము, వేళాకోళము మొదలగు భావములే ఇపుడు ప్రబలియున్నవి. ముసల్మానులే సర్వాధికారులైన దినములలో హిందువులను వారు పెట్టిన బాధలకు మితిలేక యుండెను. ఇటీవల క్రైస్తవాధికారము ప్రబలినది మొదలు ఆమత వ్యాపకులు చేసికొనుచున్న యాత్మస్తుతి, పరనింద యెటులుండునో గ్రహింప వలెనన్న ముర్డక్ (Murdoch) దొరగారు క్రైస్తవ మతజ్ఞానము బోధించుటకు పూనుకొనిన సమాజము తరఫున ప్రకటించిన వ్యాసములు కొన్ని చూచిన చాలును. "క్రైస్తవు లోకరూల హిందూ మతమును, హిందూదేవతలను దూషించుచునే యున్నారు. మనము మాత్ర మూరకుండ నేల" యని ముసల్మానులు కూడ గ్రంథ ప్రకటన మూలముగ హిందూ దేవతలను, మతమును కసితీర తిట్టి దూషింపసాగిరి. ఈవిషయమై హజరత్ మెహరె అలీ సాహెబుగారు గద్దే-హిందూ చరిత్రమునందు వ్రాసిన కొన్ని పద్యము లిచట వ్రాయుచున్నాము. ఇందు భావములే ప్రధానముగాని ఛందో వ్యాకరణ విషయము లంత ముఖ్యములు గావు. కావున నట్టిలోపములు మన్నింప బడును గాక.

" సీ. శివునియాలియు గౌరి శ్రీవిష్ణునకు లక్ష్మి
మరి సరస్వతిదేవి బ్రహ్మసతియు,
హరునివాహన మెద్దు, హరికి తెల్లనిగద్ద
బాతు హంసే బ్రహ్మవాహనంబు

* * * * *

వీరి కిళ్లాలు వేరయ్య వివరముగను
ఆయుధము వేరు సంతు వాహనము వేరు
ముగ్గురికి చావు అయినది ముప్విధమున
ఇట్టి ముగ్గురు ఒక్కటైన మెట్లు అగును?... ... ౧.

" సీ. బంట్రోతు అయిన భస్మాసురుడు తరిమితే
పారిపోయెను శివుడు పరుగులెత్తి
విష్ణు మోహినిరూపు వేషమున వచ్చెను
హరుడు అబ్బెబ్బె తా చెఱుపుకొనెను

* * * * *

పాపకర్మను దుర్గుణుని పొఱుబోతు
మే * * * నుకోసుకొని తుదకు వాడు చనెను. ౨.

" సీ. కోతిరూపంబైన పోతుహన్మంతునే
వేహాగ్లు దైవముని వేసుకొనిరి
మాతిగొంతిని[1] మాలమాదిగల్ మ్రొక్కిరి
కోమట్లు కన్యను కొల్చుకొనిరి
అడ్డబొట్లందరు హరహరా బల్కిరి
సుద్దబొట్లంత హరి పెద్ద యనిరి
జంగంబులందరు లింగడని బల్కిరి
పంగనామములంత రంగ డనిరి
కంసాల్లు మ్రొక్కిరి కంచికామాక్షికి
పంచపాండవు లనుచు చెంచు లనిరి
రామానుజకూటముల్ లక్ష్మునకు మ్రొక్కిరి
గొంటె లందరు గూడి కృష్ణు డనిరి
శాక్తేయసూత్రులు శక్తులకు మ్రొక్కిరి
తేలీలు దుర్గను యేలుకొనిరి.

ఇట్లు యీహిందువుల్ హీనులను తలచిరి
వాళ్లు నచ్చిన వెనుక పోలికలకు
మ్రొక్కుచున్నారు విగ్రహాల్ చెక్కు
కొనుచు................................ 3.

" సీ. కృష్ణు రాధకు మొగుడు విష్ణు పెనిమిటె శివుడు
బ్రహ్మదేవగ సరస్వతికి మొగుడు

1. మాతిగొంతి = గొంతెమ్మ. చూ "గొంతెమ్మ కోర్కులు."

రాముడాలిని బట్టి రావణబ్రహ్మ మా
యెత్తుకొనిపోయెనూ చిత్తమంచి
అర్జునుడు ద్రౌపదిని అర్జనచేసితే
అతని అన్నలు దమ్ము లంత దాచె
... ... ... ...
గొల్లకృష్ణుకు మేనత్త పెండ్లమాయె
పెద్దబ్రహ్మకు కూతురే పెండ్లమాయె
చెడినదని తీసి రాముడా సీతనేలె
ఐదుమొగులకు ద్రౌపది ఆలియాయె
వావియెక్కడ మరిమీకు వరసయొకడ
ఇట్టి ఛండాలపశునడత హితులవిడిచి......... ౪.

" సీ. పంచపాండులకథల్ పంచవిధంబులు
వ్యభిచారిపుత్రులు విభజనమగ
జూజంబులాడి తనురాజ్యంబునోడుకొని
చెడిపోయి తిరిగిరి అడవులంట
అన్యదేశమునుంచి కన్యకను తెమ్పుకొని
వరుసగా చెరిపిరి వక్కస్త్రీని
జంతువులలోనైన యింతబిడితము లేని
విపరీత ముండునా విహితులార
లంజపుత్రులు లుచ్ఛాలు జూజగాళ్లు
పాండ్రాజుకు వకడైన పుట్టలేదు........... ౫.

" సీ. రామాయణము బొంకు భారతంబే రంకు
గొల్లభాగవతంబు బొల్లియనుచు
వేదాంతమంతయు చేదస్తమేననుచు
హిందుసామ్యంబులే హిందులార
రంకు రొందుకు మీకు బొంకు రొందుకు మీకు
పలుగుచేదస్తంబు రేల మీకు........ ౬.

" సీ. గాలిన్ని ధూళిన్ని నీరున్ను నిప్పున్ను
ఐదుభూతాలనుచు ఆకశముతో
... ... ... ...
వానదేవుండనిరి వాయుదేవుండనిరి
అగ్గిదేవుండనిరి యొగ్గు విడిచి......... ౭.

" సీ హోలిపండుగయనుచు గోలపెడుదురుగదా
నెత్తిన్ని నోరున్ను మొత్తుకొనుచు
కాముడనుశివ్యంబు కాల్చుకొందురుగదా
శివమతంబా మీకు సిగ్గు కాదా ?
బూతుమాటకదా బూతుపాటకదా
బూతులాటకదా నోట మీకు
నట్టిపండుగు మీర లంత చేతురుగదా
బొందిలీ లేమి మరి హిందు లేమి
పార్వతిసిగ్గునే పానవట్ట మనిరి
శివుని యంగంబవందులో లింగమనిరి
బూతుపూజలు ఇకనైన నూతవేసి
కొల్వవలె లోకరక్షకు క్రమముగాను........ ౮.

" సీ. మీరు భగవద్భక్తి బాగుగా మానుకొని
విగ్రహపుపూజలే యిష్టమనిరి
పంచిశము పేడలే బహు శుద్ధి యనుకొని
యిల్లువాకిళ్లల్ల చల్లుకొనిరి
మలమూత్రమే దోషములు తీర్పు ననుకొని
పేడవుండలు పంచితాలు తినిరి
పసరపీయున్న పరిశుద్ధి యెట్లు అగును ?
పేడతింటేను పాపములు కొట్టబడునా ?...... ౯.

౨. ఇట్టి పద్యము లనేకములు రద్దే హిందూ నరిత్రమునందు గలవు. ఇటీవల మిస్మేయో 'Miss Mayo' అను క్రైస్తవ కన్య Mother India అను గ్రంథము ప్రకటించి హిందువులంతటి పనికిమాలినజాతి మరి యొకటి లేదని ప్రపంచమునకు చాటినది. గోమయ గోమూత్రములను గురించి పై 9-వ పద్యమునందు వలెనే యామె వ్రాసిన యసందర్భములు విమర్శించుచు క్షయరోగ చికిత్సా విశారదులగు డాక్టరు ముత్తుగారు ఆరోగనివారణమున కాపదార్థము లెట్లుపయోగపడునో, అందెట్టి శుద్ధిశక్తులు గలవో వివరించి ప్రత్యుత్తర మొసగి మహోపకారము గావించియున్నారు. మొహారీ అల్లీ సాహేబుగారి వంటి తురకలును, మేయో కన్యవంటి క్రైస్తవులును చేయు దూషణముల వివరము లింతటితో చాలించి మనవారల యభిప్రాయము లెట్లున్నవో పరిశీలింతము.

3. పాశ్చాత్య విద్యాపద్ధతులకును, యోచనాసరణికిని, విమర్శన మార్గమునకును అలవాటుపడిన మన పిన్న పెద్ద లనేకులు మన హిందూ మతాచార వ్యవహార

ములయందేమి, పురాణ గాథలయందేమి, దేవతలయందేమి, మిక్కిలి యనాదర భావముతో నున్నారు. కొందరు విమర్శకులు భారతాది గ్రంథములను తీవ్రముగ విమర్శించి విపరీత భావములను ప్రకటించుచున్నారు. శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రులవారు తుని సాహిత్య పరిషత్ సభలో కుంతిని, ద్రౌపదిని, పాండవులను, వ్యాసునిగూర్చి చేసిన విమర్శ పై ౫-వ పద్యమునకు చాల సమీపమున నున్నది.

౪. పరిశుద్ధాస్తిక మతమను పేర దేశమున కొంత వఱకు వ్యాపించిన బ్రహ్మసమాజ మతస్థులు మన ఉపనిషత్తులు మొదలగు మహోన్నత మత గ్రంథముల యందత్యంత గౌరవము గలవారయ్యును, విగ్రహారాధనమునందును, హిందూ దేవతల యందును, వారొనరించినట్లు పురాణముల యందు వర్ణింపబడిన విషయము లందును, అనాదరమును, అగౌరవమును కలిగియున్నారు. వారి విమర్శనములు, పైతురక దూషణములంత మోటుగా లేకున్నను హేళన భావముతోనే కూడియున్నవి. ఇంగ్లీషు విద్యాభ్యాసము చేసినవారును, చేయుచున్నవారును, మత విషయములందు స్పష్టమైన భావములు లేకయున్నవారనేకులు గలరు. వారి చిత్తవృత్తులకును, పసుపాయమునకును వ్యతిరేకమై వెగటుగ దోచు ప్రతి విషయమును నాన్ సెన్స్ (Nonsense) అని దూషించి పరిహరించుటయే వారి మతమయిన ట్లగపడుచున్నది. ఈ 'నాన్సెన్సు' మతమే యిప్పటి యాంగ్ల విద్యావంతులలో విశేష వ్యాప్తిగల్గి యున్నదేమో యని తోచుచున్నది.

౫. ఇక మనకవులు, గ్రంథకర్తలు నేమి వ్రాసిరో చూతము.

౬. బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారాంధ్రలోకమున సుప్రసిద్ధులు. వారు రచించిన 'గణపతి' యను హాస్యరసమైన యాఖ్యాయిక పీఠికలో నిట్లు వ్రాసిరి: "ఆంధ్రభాషలో దేశచరిత్రాత్మకములు, తదితర గ్రంథములు నయిన యాఖ్యాయికలు ఎన్నో నేను వ్రాసి, హాస్యరస ప్రధానమయిన యాఖ్యాయిక యొకటియైనను నేను రచియింపకుండుట శోచనీయమని ప్రొఫెసరు వేమూరి విశ్వనాథ శర్మగారు ఆంధ్రభారతిలో వ్రాసియుండిరి. వారి వ్యాసము చదివిన పిదప హాస్యరసమయిన యాఖ్యాయిక వ్రాయవలెనని నాకు సంకల్పము కలుగగా నే నీగ్రంథమును వ్రాసితిని. నా ప్రతిజ్ఞలో నే నెంతవఱకు కృతార్థుడ నయితినో చదువరులే నిశ్చయింతురు గాక."

౭. పై యాఖ్యాయికకు కథానాయకుడగు గణపతి తన తండ్రి చనిపోయిన తరువాత తన తల్లియు తానును మేనమామగారి యింట చేరి యెన్నెన్నో వెకిలి పనులు చేయుచుండెను. చిన్ననాటి నుండియు గుఱ్ఱమెక్క వలయునని గణపతి కుబలాటము కలిగెను. అర్థము లేని గణపతి వంటి వ్యర్థున కది యెట్లు సాధ్యమగును? గుఱ్ఱము లేనపుడు గాడిదనేల యెక్కకూడదు? అని పూర్వపక్ష సిద్ధాంతములు చేసికొని, చాకలిగాడిదనెక్కి, ఐరావతము నెక్కిన దేవేంద్రుని మించి యూరేగెను.

౮. "గణపతియొక్క యీ ఖరవాహనారోహణ వృత్తాంతము విని, యది యనార్య కార్యమనియు, అతడు సజ్జన దూరుడనియు, వట్టి నిర్భాగ్యుడనియు పాఠకులు నిశ్చయింతురని సందేహము" కలిగి గ్రంథకర్తగారు అట్టి తలంపు న్యాయమైనది కాదని నిరూపించుటకొక మహోపన్యాసము గావించియున్నారు అందలి ముఖ్యాంశము లిచట వ్రాయుచున్నాము.

౯. "ఎవరిమాట యెందుకు? అసాధారణ ప్రభావ సమేతులగు దేవతలను జూడుడు:

(౧) దేవతలకెల్ల దొరయై ముజ్జగంబుల యేలికయై, కల్పవృక్షము, కామధేనువు, చింతామణి మొదలగు కామ పదార్థముల కొడయడైన నిర్జరేంద్రునకు మేఘములు వాహనములు. నీరు, గాలి, మెఱుపు, పొగ మొదలగు పదార్థములతో జేయబడిన మేఘమా అతనికి వాహనముగా నుండవలసినది?

తక్కిన వేల్పులం జూడుడు.

(౨) సకల యాగములకు, సకల స్మార్త కర్మలకు నాధారమైన యగ్నిహోత్రునకు వాహనము గొఱ్ఱె.

(౩) దక్షిణ దిక్కునకు నాయకుడై ధర్మాధర్మ విచారణ నిపుణుడైన యమధర్మరాజునకు వాహనము దున్నపోతు.

(౪) జలధి నాయకుడైన వరుణుడు మొసలిపై నెక్కును.

(౫) మహాబలుడై సముద్రజలమును పైకెగర గొట్టియు, మహావృక్షములను గూల్చియు, క్షణకాలమున జగన్నిర్మూలనము చేయగల వాయుదేవుడు లేడి మీద స్వారిచేయును.

(౬) "తత్రాదౌ పూజనీయో గణాధిపః" అన్నట్లు సకల శ్రౌతస్మార్త కర్మలకు ముందు పూజనీయుడగు గణాధిపతి ఎలుక నెక్కి, పందికొక్కు నెక్కి బయలుదేరును. ఉమామహేశ్వరుల కుమారుడైన గణపతి కింతకంటె వేఱు వాహనము లేకపోయెనా? కొంప త్రవ్వునట్టి యెలుకా వాని తురంగము? సకలగృహార్తియగు మార్జాల చక్రవర్తి కొక్కెక బళ్ళుగా నుపయోగించు నెలుకమీద నాప్రముఖ గణపతి యెక్కుగా మరి గణపతి గాడిద మీద నెక్కుట తప్పా?

(౭) ఇక మన్మథుడు లక్ష్మీనారాయణుల పుత్రుడు. గరళకంఠుని వంటి మహాదేవుని జయించినవాడు. సంపదకారుడు. (సకల భువనం వ్యాకులయతి). సకలలోకములంగల సకల జంతువులను పూవుటమ్ములతో గొట్టి పడవైచునట్టి మన్మథుని వాహన మేమో యెఱుగుదురా? చిలుక!

(౮) ఆ మన్మథుని తండ్రియగు నారాయణుని తురంగ మేమో యెఱుగుదురా? బొల్లి గద్ద! ఎక్కడ దిక్కు లేనట్లు తండ్రీకొడుకు లయిన మాధవ మన్మథులు రెక్కలాడిన గాని డొక్కాడని దిక్కుమాలిన పక్షులపై నెక్కుచున్నారు.... శ్రీమన్నారాయణు డెక్కుటకు లోకమున బొల్లి గ్రద్ద తప్ప వేరేమియు లేకపోయెనా?

(౯) ఇక శివునిమాట దడవ బనియే లేదు. ఆయన వెల్లయెద్దు నెక్కి విహారము చేయును. అడ్డమైన గడ్డి కఱచునట్టి పశువు గాదనా శివు డెక్కవలసినది?... వెన్నముద్దవలె విసపుముద్దను మ్రింగి... తన లోకోపకారశీలతయు, నిస్పృహాత్వమును వెల్లడిచేసినట్టి మహనీయు డెద్దెక్కుట బాగున్నదా?

(౧౦) కుమారస్వామి తారకాసురుని సంహరించినాడు. క్రౌంచ పర్వతమును భేదించినాడు. అతడు నెమిలిమీద నెక్కును. వన్నెల చిన్నెల బండారమే కాని నెమిలి గొప్ప యేమున్నది!

(౧౧) బ్రహ్మదేవుడు చతురాననుడట! సురజ్యేష్ఠుడట! హిరణ్యగర్భుడట! ప్రజాపతియట! వాణీనాథుడట! సృష్టికర్తయట! వానచుక్కలు మీద పడిన మాత్రాన తోక త్రెంచుకొని పారిపోవు హంస యతని వాహనమంట?

(౧౨) మహిషాసుర మర్దనియగు కాత్యాయని సింహ మెక్కును.

... ... ... ...

నిగ్రహానుగ్రహ సమర్థులు నిరుపమాన మహిమాన్వితులు, కల్యాణ గుణసంపన్నులు, కామరూపులు, సకలలోక పూజ్యులు సర్వధర్మ పరిజ్ఞాతలు నయిన దేవతలే గొఱ్ఱెనెక్కి, బఱ్ఱెనెక్కి, ఎలుక నెక్కి, చిలుక నెక్కి, ఎద్దునెక్కి, గద్ద నెక్కి, మఱియు నిచ్చ వచ్చిన జంతువులను పులుగుల నెక్కి సిగ్గులేక, చింతలేక, బెదురులేక, బిడియములేక తిరుగుచుండగా, నీ ప్రజ్ఞయు లేక మనుష్యమాత్రుడై కించిజ్ఞుడై బాలుడైన గణపతి గాడిద నెక్కి తిరుగుట యేమితప్పు? మూషకము ముఖ్యత యేమి? ఎద్దు ఎక్కువేమి? గ్రద్ద ఘనత యేమి? గాడిద చేసిన కానిపని యేమి?... కాబట్టి గణపతి గార్దభ మెక్కినంతమాత్రముచేత నింద్యుడని మీరు భావింపవలదు."

౧౦. శ్రీ లక్ష్మీనరసింహముగారు తక్కిన దేవతలను, వారివారి వాహనములను వివరించి మహోపన్యాసము గావించినారు; కాని వర్ణనీయాంశమైన గాడిద మీదనెక్కి తిరుగు దేవతలను ప్రశంసింపక, యే హేతువుచేతనో విడిచిపెట్టినారు. దేవతలలో అశ్వినీ దేవతలకు వాహనము గార్దభము. చిత్తగింపుడు:—

ఋగ్వేదము, I. 84-9:—

"కదా యోగో వాజినో రాసభస్య యేన యజ్ఞం నాసంతోక్య"...........................

కృష్ణ యజుర్వేదము, IV. 1-2:—

"యుంజాథాగ్ం రాసభం యువమస్మిన్ యామే."

ఐతరేయ బ్రాహ్మణము, IV. 2-9.

"...సగర్దభరథే నాశ్వినా...."

యజురారణ్యకము, I. 1. 10-1.

"...తావశ్వినా రాసభాశ్వాహవం మే..."

౧౧. దేవతల వాహనములను గూర్చిన పైమహోపన్యాసములో "దేవతలకు కడుపు నొచ్చినను కాలు నొచ్చినను మరే రోగము వచ్చినను, ఆపద వచ్చి, మందులు మాకులు నిచ్చి రక్షించు వైద్యశిఖామణులే గాడిదమీద నెక్కి తిరుగుచుండగా మా గణపతి గాడిదమీద నెక్కినచో వచ్చిన తప్పేమి?" యని వారు ప్రశ్నించి యాక్షేపకులకు బదులుచెప్పిన బహుసమంజసముగా నుండెడిది. అయిన నేమి? కానిండు. గ్రంథకర్తగారు వ్రాయని దానిని గూర్చి యిపుడింత యనుమానమేల? గణపతి గార్దభవాహన నగ్న సందర్భమున మన త్రిమూర్తులు, అష్టదిక్పాలకులు లోనగు వేల్పులయొక్క వాహన విచారము లోకానికి తెచ్చి సమకూర్చి, మన మీ దేవతలను గూర్చి యేకాగ్రచిత్తముతో గాఢముగా యోచించుటకు మంచి యవకాశ మేర్పఱచినందుకు శ్రీలక్ష్మీనరసింహముగారికి కృతజ్ఞులమై నమస్కరించి యుత్తరాంశముల నర్పింతము.

౧౨. మన దేవత లెట్టివారు? కొందఱు దేవతలకు పక్షులు వాహనములగుట యేల? మరికొందఱకు జంతువులు వాహనములగుట యేల? విష్ణుదేవునకు పండుకొనుటకు పాము తప్ప మరొకటి లేక పోయినదా? నలుల బాధ పడలేక యతడు శేషశాయి యయ్యెనా? లేక మరేమైన కారణ మున్నదా? అతడు గరుడవాహనుడే గాక గరుడధ్వజు డెట్లు కాగల్గెను? అతడు ఆషాఢ శుద్ధ యేకాదశి (శయన యేకాదశి)నాడు పండుకొనుట కారంభించి, భాద్రపదశుద్ధ యేకాదశి (పరివర్తన యేకాదశి) కి ఒత్తిగిలి, కార్తికశుద్ధ యేకాదశి (బోధనైకాదశి) నాడు నిద్రమేల్కాంచు టేమి? ఈశ్వరుడు వృషభవాహనుడగుటయే గాక, వృషభధ్వజు డెట్లయ్యెను? భాద్రపదశుద్ధ చతుర్థియు, చైత్రశుద్ధ చతుర్థియు గణపతి పూజ లేల? భాద్రపదశుద్ధ పంచమి ఋషిపంచమి కానేల? మార్గశిర శుద్ధషష్ఠి సుబ్రహ్మణ్య షష్ఠియట? ఇట్లే రథసప్తమి, జన్మాష్టమి, శ్రీరామనవమి, మహానవమి, విజయదశమి, భీష్మఏకాదశి, క్షీరాబ్ధిద్వాదశి, నరకచతుర్దశి, దీపావళి అమావాస్య, శ్రావణపూర్ణిమ మొదలగునవి మనకు ముఖ్యములగు పండుగలు కానేల? ఈ ఏకాదసు లేమి? కార్తిక సోమవారము లేమి? చాతుర్మాస్యము లేమి? మహాలయ పక్షము లేమి? ధనుర్మాసము లేమి? పామరులు చేయు 'గవిగమ్మ' పండుగలు, నూకాలమ్మ పండుగలు నేమి? ఒకొక్క దేవతకు, సంవత్సరములో నొకొక్క దినము ముఖ్యమయి, ఆదినమున నాదేవతను తప్పక హిందువులు పూజించుట యేల? నోములు, వ్రతములు, పుట్టలలో పాలు, శివరాత్రి జాగరములు, జ్వాలాతోరణములు, హోలిపండుగలు, కామదహనములు, వీనికి అర్థ మున్నదా? లేక పూర్వకాలపు వెట్టి ఋషులు పిచ్చిపట్టి వ్రాతలు వ్రాసినారా? ఈ దేవతలను, ఈ యీ పురాణములను, గాథలను, నోములను, వ్రతములను. "Sheer Nonsensê", యట్టి యపభ్రంశములని పరిహరించుట యుక్తమా? అటుగాక "ఆ మహాఋషులు బుద్ధిమంతులే; విశేష పరిశీలనచేసి సరిగానే వ్రాసి మంచియేర్పాటులు చేసిరి. కాని, తెలిసియు తెలియని మూర్ఖత్వము చేతను, అజ్ఞానముచేతను, తగు పరిశ్రమలోపముచేతను మనము అవివేకులమై, తాను పడి ఈయీరాదు అచ్చిరాదు "అనునట్లు,సర్వజ్ఞులను గర్వముతో మన మా మహాత్ముల నిందించి వారి యెడ మహాపరాధము చేయుచున్నాము" అని యనుకొనవలెనా? ఏ దృష్టితో వార లీవిశ్వమును పరికించి, ఏయం

* శ్రీలక్ష్మీనృసింహముగారు ఋగ్వేదము ఆంధ్రవచన గ్రంథరూపమున రచించి ప్రకటించిరని వింటిమి. అట్టి గ్రంథరాజము పఠించు భాగ్యము మన కింతవఱకులభించలేదు. ఎపుడు కలుగునో తెలియదు.

శములను గమనించి, ఏమేమి వ్రాసిరో అన్వయించు కొనుటకు తగు ప్రయత్నములు చేయవలెనా? వారల "యసంబద్ధ ప్రలాపములు సమన్వయించుటలో మరి కొంత కాలముకూడ వ్యర్థము చేయ నేల?" యని త్రోసి వైవవలెనా?

౧౩. ఇన్నిమాట లేల? వారు రచించి భద్రపఱచి గుప్తముగా నుంచిన గ్రంథపేటికలకు సరియైన తాళము చెవి వెదికి తగిల్చి త్రిప్పి, పెట్టెలు తెఱచి వానిరహస్యము భేదింపవలెనా? మన తెలివి తేటలకు మనమే సంతోషించు కొనుచు మనపూర్వులు వట్టిమందబుద్ధులనియు, వాండ్రకారుకూతలతో మనకేమిపనియనియు నిరసించి హేళన చేయవలెనా?

౧౪. మనపూర్వగ్రంథములలోనివిషయములమీద దురదృష్టవశముచే మన కేర్పడిన నిరసనభావమే మనల నింతకు తెచ్చినది. భర్తృహరిచెప్పినట్లు, "దృప్తులమైకరిభంగి సర్వము తెలిసితి మంచుగర్వితమతిన్ విహరించితిమి." ఇక 'నీనితాంతగర్వముగతము' గావించి, శాస్త్రతులును, ఉజ్జ్వలమతులు నైన పూర్వఋషుల సన్నిధిని నిలిచి వారల గ్రంథములయందలి యంశములు సరిగా బోధపరుచు కొనుటకు తగు ప్రయత్నములు చేయవలసియున్నది.

౧౫. పూర్వులగ్రంథపేటికలకు, సరియైనతాళము చెవి పెట్టి తెరువవలె నంటిమి. ఒకపెట్టెకు ఒకతాళముండును. ఆతాళము తగిల్చి త్రిప్పినప్పుడే ఆమూత తెరువబడును. మరియొక తాళము చెవికి పెట్టి తెరువం బడదు. అలాగుననే ఒకకవియొక్క మనోభావము సరిగా బోధపరుచుకోవలెనన్న పక్షమున నాకవి యే దృష్టితో రచనము చేసెనో ఆదృష్టితోనే మన మారచనమును మాచి యవగాహనము చేసికోవలెను. లేనియెడల మన కాశవన మసందర్భమని తోపకమానదు. ఇందు కొకటి రెం డుదాహారణములు:—

౧౬. చాటుపద్యమణిమంజరిలో నొకపూర్వ కవి వ్రాసినపద్య మిట్లున్నది:—

"ఉ. కన్యకునైదుజంఘలును కన్యకునాగకుచంబులెన్నగా
గన్యకు నాల్గుకన్బొమలు కన్యకునేడువిశాలనేత్రముల్
గన్యకు ద్వాదశంబు నలికానను గల్గునులక్షణాఢ్యకా
కన్యకు నీకు నింకపదిగావలె కస్తురిరంగనాయకా."

ఈపద్యము పైపై చదివి సర్వజ్ఞుడ ననుకొను నాంగ్ల పండిత విమర్శకుడు "My Lord! What a monster! Five legs! Six breasts! Four eye-brows! Seven eyes! Twelve waists and Ten more such monsters for you!"—"అయ్యో దేవుడా! ఎక్కడిరాక్షసిరూపమిది. ఐదు కాళ్లు, ఆరు కుచములు, నాల్గుకనుబొమలు; ఏడుకన్నులు, పండ్రెండు నడుములు; ఇటువంటివార లింకను పదిమందట! ఇటువంటి ఘోర రాక్షసి ఎవరికైన నెనటనైన నెప్పుడైన కనబడెనా? వినబడెనా? తాటక, శూర్పణఖ మొదలగు రాక్షస స్త్రీలైన ఇట్టివారు కారే? ఇట్టిది సీతచుట్టు కాపున్న రాక్షసస్త్రీలలో ఒక్కతెయయిన లేదు. దీనిని 'సులక్షణాఢ్య'అని వర్ణించిన కవి మనుష్యుడే అయినయెడల ఈపాటికి పిచ్చి ఆసుపత్రిలో పడియుండడా? Sheer Nonsense: ఇటువంటి absurd వ్రాతలే మన వాళ్లవి"అని 'లెక్చరు'కొట్టును.

౧౭. ఇట్టియవకతవక విమర్శనమునకు కారణ మేమి? కవి యేదృష్టిలో పద్యము రచించెనో ఆదృష్టితో చూడక విమర్శకుడు వేఱదృష్టితో పై కగపడునట్టి బాహ్యార్థములో తృప్తిపొంది కవిని దూషింపసాగినాడు. అన్వయము పొసగలేదు. ఒకడు మిన్నేటికి దారితీయుచుండ రెండవవాడు వల్లకాటికి దారితీయుచున్నాడు. కవిది యూర్ధ్వదృష్టి, అతడు రాశిచక్రమును చూచుచు, ఉపమానములను వెదుకుచు, కథానాయికను వర్ణించుచున్నాడు; ఆవక్రమనం దాయాస్థానములను(ఇండ్లను) ప్రశంస చేయుచున్నాడు. విమర్శకుడో, కేవలము అధోదృష్టిలో నున్నాడు; సంఖ్యలను లెక్కలుపెట్టు కొని తడుముకొనుచున్నాడు; అన్వయము కుదురక, చీకాకు పడి తిట్టుచున్నాడు. వానికర్మము! పోనిండు.

౧౮. కవి చూచినకనులతో మనము రాశిచక్రము నొకసారి తిలకింతము. కన్యారాశితో నారంభించి రాసులను క్రమముగా పరికించి చూతము. వర్ణింపబడిన కన్య యెట్టి దనగా:—




(౧) కన్యకు ఐదు — ౫-ఐదవస్థానము:— మకరము. ఇట్టిజంఘలులేక పిక్కలు కలది. అనగా మకరము వంటి పిక్కలు కలది.

(౨) కన్యకు ౬—ఆరవ యిల్లు:— కుంభము. కుంభమువంటి స్తనములు కలది.

(౩) కన్యకు ౪—నాల్గవయిల్లు:— ధనుస్సు. ఇట్టి కనుబొమలు కలది.

(౪) కన్యకు ౭—ఏడవయిల్లు:—మీనము. ఇట్టి విశాలనేత్రములు కలది. మీనాక్షి

(౫) కన్యకు ౧౨—పండ్రెండవ యిల్లు సింహము:—సింహమువంటి నడుము కలది. సింహమధ్య. ఇట్టి సులక్షణములు గల కన్యకకు నీకును—

(౬) కన్యకు ౧౦—పదవస్థానము మిథునము; కావలె. అనగా మీరు దంపతులు కావలెనని కవిభావము.

ఇందు అసందర్భ మేమియు లేదు. సర్వమును కరతలామలకము.

౨౦. ఇట్టిదే మరియొకటి, సంస్కృతశ్లోకము:—

శ్లో. “సంతప్తా దశమధ్వజాదిగతినా సమ్మూర్ఛితా నిర్జలా
తుర్యద్వాదశవ ద్ద్వితీయ మతిమన్ ఏకాదశాభ స్తనీ;
సా షష్ఠీ శరమధ్యమాచ నవమభ్రూ స్సప్తమీవర్జితా
ప్రాప్నోతి హ్యష్టమవేదనాం త్వ మధునా తూర్ణం
తృతీయో భవ.”

ఒక కన్య మన్మథతాపముచే కుంది కృశించుచుండెను. ఆమెయవస్థ యెటులున్నదో తెలుపుచు నామె యభిమత మీఁడేశ్వరుని వేరొక డామె ప్రియునకు హితవు గఱుపుచున్నాడు. ఎట్లనగా:—

ఇచట మేషమాదిగా రాశిచక్రమును గమనింపవలెను:

(౧) మేషము. (౨) వృషభము. (౩) మిథునము. (౪) కర్కాటకము. (౫) సింహము. (౬) కన్య. (౭) తుల. (౮) వృశ్చికము. (౯) ధనుస్సు. (౧౦) మకరము. (౧౧) కుంభము. (౧౨) మీనము.

సా షష్ఠీ=ఈకన్య; దశమధ్వజ ఆదిగతి నాసంతప్తా: దశము=౧౦=మకర-ధ్వజుని యొక్క అనగా మన్మథుని; ఆది=౧=మేష-గతినా: మేషారూఢుడు — మేషవాహనుడు అగు అగ్ని చేత: అనగా మన్మథాగ్ని చే; సంతప్త యగుచున్నది.

ఇంకను ఎట్లున్న దనగా:

నిర్జలా, { తుర్య = (౪)కర్కాటకం } { ద్వాదశవత్ = ౧౨ మీనము-వలె — }

నీటిలోనుండి పైబడిన చేపవలెను, ఎండ్రివలెను—కొట్టుకొనుచున్నది.

ఈమె యెట్టిది? సౌందర్యము వర్ణింపబడుచున్నది.

ఏకాదశ = ౧౧ = కుంభస్తని.

శర = ౫ = సింహమధ్యమ.

నవమభ్రూ = ౯ = ధనురాకారము గల కనుబొమలు కలది.

సప్తమీవర్జితా ౭ = తులావర్జిత: సాటి లేనిది.

ఇట్టిసౌందర్యవతి నీకొఱకు అష్టమవేదనా =౮= వృశ్చికము: తేలు కుట్టినట్లు బాధపడుచున్నది. కనుక, ద్వితీయమతిమాన్ = ౨ = వృషభమతిమాన్;

ఓ కొమ్మ ముగ్ధా = పలుకా! నీవు వెంటనే సఖీముముగా ఆమెతో సృతీయో భవ=3 = మిథనము కమ్ము; ఆమె మనోభీష్టము తెలిపేర్పుము —అని.

౨౧. ప్రసన్న రాఘవ నాటకమునందు రావణుడు జనకుని సందర్శించి ముందు కన్యను సీతను తనకు చూపుమని కోరెనట! ధనుస్సు అనగా శివుని విల్లు విఱిచిన పిదపగాని సీతను చూపజాలమని జనకుడు ప్రత్యుత్తర మిచ్చెను. కన్య ముందా? ధనుస్సు ముందా? ఖగోళ రీతిని కన్య ముందు; ధనుస్సు వెనుక; కనుక కన్యను చూపుమని రావణుడు నమస్కరించినట్లు ఆనాటకమునందు కలదు

౨౨. ఒకకవీశ్వరుఁ డొకవనితామణి సౌందర్యము వర్ణించుచు,

"గురుణా స్తనభారేణ ముఖచంద్రేణ భాస్వతా,
శనైశ్చరాభ్యాం పాదాభ్యాం రేజే గ్రహమయీవసా."

అని యామెయవయవములకు గ్రహములతో నుపమానములు కల్పించినాడు.

౨౩. ఆంధ్రమహాభారతమున నన్నయభట్టారకుడు క్షీరసాగరమథనము సేయుటకు సముద్రము "దింబునుంబోలె నహి మకరభరిత"మని వర్ణించినాడు. ఖగోళమున నాక్షత్రములు సర్పాకారముగలవి మకరము ప్రత్యేకముగా నొకరాశియే. సముద్రములో గొప్పమొసళ్ళును, పాములు నుండును గనుక, ఆకాశమువలెనే సముద్రమును అహిమకరభరితమని వర్ణింపబడినది.

౨౪. బమ్మెరపోతరాజు గజేంద్రమోక్షము నందలి సరోవరము 'శింశుమార చక్రముంబోలె గురుమకరకుళీర మీనమిథునమ'ని వర్ణించినాడు. గంగావతరణమునందును ఇట్టివర్ణన మున్నది.

౨౫ ఈవిధముగా మనపూర్వు లనాదికాలము నుండి ఖగోళశోధ చేయుచు, తాము గమనించిన యంశములు గ్రంథస్థము చేయుచు, చక్రనియమపద్ధతులతో వానికథ స్థాన దేవతలను, ధ్వజవాహనాది సంజ్ఞలను, ఉదయాస్తమానాదిగమనవిశేషములనుపట్టి సంవత్సరమునందాయాదినము లాయాదేవత లు ముఖ్యముగా పూజింపబడుట కేర్పాటులు చేయుటయేకాక, ప్రకృతిలో వానివా నిచ్చేష్టలను స్పష్టముగా వివరింపగల రమ్యకథాజాలమును రచించి వేదములలో, బ్రాహ్మణములలో, పురాణములలో, చేర్చి శాశ్వతముగా నిలుచునట్లు చేసిరి ఆ తపశ్శాలులయోపిక, పట్టుదల, సూక్ష్మదృష్టి, పరిశీలనసైపుణ్యము, గ్రంథరచనాసామర్థ్యము, ప్రకృత్యంశము లందఱకును సుబోధమగునట్లు కథలకల్పించు నేర్పును మనము గ్రహింపగలిగిన కొలదిని అద్భుతపడ వలసియుండును. కాన ముందు వ్రాయబోవు వ్యాసములలో వాని నొక్కొక్కటిగా వివరింప యత్నింతము.

---

## మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేద లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము.

మేనేజరు, 'భారతి.'



శ్రీమతి రాం పియారి కన్య

'సినీమా' నటి.

'శ్రీ కృష్ణ ఫిలిం కంపెని' వారి ప్రదర్శనములయందు నాయకపాత్రములను ధరించును.



శ్రీమతి సీతాదేవి కన్య

దేశాంతరములయందును ప్రసిద్ధికెక్కిన 'సినీమా' నటి.




# కళ - మానవజీవితము

నాట్యకళాప్రపూర్ణ శ్రీ టి. రాఘవాచారిగారు

[తిరువాంకూరు సంస్థానపు కళామహోత్సవముల సందర్భమున (1930) నవంబరు 19-వ తేదీ ప్రారంభమైన 6-వ కళాసమావేశమున కధ్యక్షత వహించిన సుప్రసిద్ధనటశేఖరులును, ప్రఖ్యాత కళారాధకులును, నాట్యకళాప్రపూర్ణ బిరుదాంకితులు నైన శ్రీమాన్ తాడిపత్రి రాఘవాచార్యులవారు మానవుని విజ్ఞానాభివృద్ధికి కళ లెట్లు తోడ్పడును అను విషయమును, రంగస్థల పాత్రములను చర్చించు భావపూరితమగు గంభీరోపన్యాసమును గావించిరి. అందు ముఖ్యముగ రంగమును గూర్చి ఉపన్యాసభాగ మిది.]

వ్యక్తిజీవితమునను, సమష్టిజీవితమునను గూడ అన్ని సమస్యలను నిర్భయముగ నెదుర్కొనుచునే ప్రాచీన భారతీయ కళలును, మతమును గూడ ఆశయములై యుండెను. హృదయ ప్రవృత్తిని అతి జాగ్రత్తగా పరిశీలించుచుండి దానిలోనికి ప్రవేశించి, సంపూర్ణముగ హృదయమును స్వాధీన పరచుకొని, సదాశయములతో దానిని ప్రతిధ్వనింపజేసి, యటుపై ప్రపంచమున కంతకును సాధ్యము లగునట్లు ఆ యాశయములను ఆచరణకు దెచ్చుటయే వానిపని. పుచ్చుకొన్న దానికంటె నెక్కువ యిచ్చుటయే జీవిత ప్రయోజనమై యుండెను. కాని యిట్లు చేయవలయు నన్నచో ఒకడు తనంతట తానే సృష్టి గావించుటకు సమర్థుడై యుండదగును. మానవ హృదయము సమగ్రముగ శిక్షణమునకు లోబడి యున్నప్పుడే యిట్టి నిర్మాణసామర్థ్యము సాధ్యమగును. ఇట్టి అసమగ్రజ్ఞానమగు హృదయము తన్ను తాను బయలుపరచుకొన వలయు నన్నచో కవిత్వము, సంగీతము లలితకళలు నందుకు సాధనములని చెప్పబడినది. ఈవిధముగ అత్యుత్తమమగు కవిత్వమును, సంగీతమును, కళను వెలువరచు హృదయముగూడ అత్యుత్తమమగు పరిణతి గలదియే యై యుండదగును. ఈ నియమము ఒక వ్యక్తి విషయమున నెట్లో జాతి విషయమునగూడ



నాట్యకళాప్రపూర్ణ శ్రీ టి. రాఘవాచార్యులుగారు

వల్లే వర్తించెను. ఇట్టి నిసర్గ-శంకములగు నాశయములకు మనః ప్రవృత్తి విరుద్ధముగ నుండినచో నట్టి మనుష్యునకు తగినంత పరిణతి లేదనియే మనవారెంచిరి. మతము భిన్నత్వములకు వెనుక నేకత్వమే యున్నదని బోధించెను. అట్టి యైక్యమును గ్రహించుకొనవలయు నన్నచో హృదయమును పూర్తిగ ప్రేమతో నింపవలసి యుండెను. ఈప్రేమకు మనుష్యుడు, పశువు వను భేదము లేదు. ఈసందర్భమున కళోపాసకునకు అతని కళయే తన హృదయ ప్రవృత్తిని వెల్లడించు చుండెడిది.

## నాటకరంగము-జీవితైక్యము

ఈ సిద్ధాంతమునే నాటకరంగమునకుకూడ వర్తింపజేసి చూడవచ్చును.

నాటకరంగములకు మరియొక విశేష మున్నది. ఇప్పుడు నట, ప్రేక్షకుల యిద్దరి అపరిణత హృదయములును, పరిణతి గాంచి, సమగ్రత నందుచున్నవి. 'యద్భావం తద్భవతి' అను లోకోక్తి సర్వసాధారణమైనది. ఇది వాస్తవమైనది కూడను. నాటకరంగమున నటుడొక్కడే తను భావించు కొనుచున్న రీతిగ పరిణమించుటలేదు. తన వ్యక్తిని పూర్తిగ నంతరింప జేసికొన్న త్యాగాగ్నిలో ప్రేక్షకులనుగూడ కరగించి తనతోపాటు కొనిపోవుచున్నాడు. ఏకాగ్రత గల కళారాధకుడు దృశ్యాదృశ్యములకు పరస్పరానుబంధము గలిగించు తన ప్రయత్నమున ప్రకృతిలోపలి యంశములను, ప్రకృత్యతీతములగు నంశములనుగూడ ప్రదర్శించుటకు సమానముగు స్పర్థతో ప్రయత్నించును. ఈ యాశయమును జేరుటకై ప్రకృతి సర్వస్వమును తానే యావరించి జీవిత సమస్యలన్నిటిలోను తానే కేంద్రస్థానము నాక్రమించుకొనును. అన్ని యనుభవములును తనకు గావలయునని యతడు ప్రయత్నించును. విలక్షణ స్వరూపమును, సలక్షణ స్వరూపమునుగూడ సమాన ప్రేమతో వీక్షించును. పాప పుణ్యము లతని కజ్ఞాన విజ్ఞానములు. అవిద్య విద్య, అపజయము జయము, కీర్తి అపకీర్తి, కరువు సమృద్ధి, దుఃఖము సుఖము, దురదృష్టము అదృష్టము, విరూపత్వము సురూపత్వము—ఈ యన్నిటిలోను తానే యై ప్రబోధము వడయుట కతడు ప్రయత్నించును. ఇట్టి ప్రయత్నముతో నతడొక "మహానుభావుడై" ప్రాణికోటి నంతను తన ప్రవాహములలో ముంచియెత్తు ప్రేమ జలధారను సాక్షాత్కరింప జేసికొనుటకు తన్ను సమర్థునొనర్ప నాదివ్యజ్యోతిని గోరి ప్రార్థించును. కళోపాసకుని సర్వమును ప్రేమాస్పదమే. ఏలయన, ద్వేష మున్నచో భయ ముండును. భయ మున్న నజ్ఞానముగూడ కలదన్న మాటయే. అది మానవుని నిర్మాణశక్తిని చంపివైచి యతనిని మానవకోటి యభివృద్ధికి పాలలో నొక విషబిందువుగా జేసి వైచును.

## నటకుని ఆశయము

ఏకాగ్రతగల కళారాధకుడు—నటకుడు—రంగస్థలముమీదికి వచ్చునపుడు అధమపక్షము తన్ను తాను మఱతురుంగుటయును, ఇతరులు తమ్ము తాము మఱచిరిగికొనునట్లు చేయుటయును మాత్రమైన అతని యుద్దేశమై యుండవలెను. అతనికి రంగస్థలమే ధ్యాన ప్రదేశము. అప్పుడే యతడు పూర్ణుండై తన్నుతాను తెలిసికొనుటకును, ఇతరులను తెలిసికొనుటకును గూడ ధ్యానమగ్నుడు కావలయును. ఒక మామూలు జపమునకు ఒక యేకాంత స్థానము, ఒక ప్రశాంతి, ఒక స్నానము, ఒక మడి—యిదంతయు కావలసియుండును కాని రంగస్థలముపై నటకుని జపమునకు కళాదేవత పరివార మంతయు పూర్తిగ నవసరము. అతని ధ్యానము అతని కొక్కనికి సంబంధించినది కాదు. తన్నుమాత్రమే కాక ప్రేక్షకవర్గము నంతను గూడ మనసులో నుంచుకొని యతడు ధ్యానము సాగింపవలసియుండును. అది యొక సమష్టి జపము. ఈమహాసంఘములో ఎక్కువవారు తక్కువవారు, చదివినవారు చదువనివారు, సంస్కృతి సంపన్నులు సంస్కృతి విహీనులు, అజ్ఞానులు జ్ఞానులు—ఇంతమందియు గలిసియుందురు. ధ్యానప్రదేశమగు నాటకశాల పరిశుభ్రమై యుండి ధ్యాననిరతికి తోడ్పడునదిగా నుండవలయును. ఆవరణ మంతయు, ఎదుటి దృశ్యము లన్నియు, ధ్యానాస్పదమగు వస్తువుతో సమన్వయించి యుండదగును.

## నాటకరంగముపై తెరలు

ఒక కుంటి ఖడ్గమృగమును జూచుచు శ్రీకృష్ణునిపై ధ్యానముంచవలెను. మదరాసు వీధిలో నున్న కిరసనాయిల్ టాంక్ బొమ్మలను తెరపై జూచి అదియే ద్వారకగ భావించుకొనవలసినదని నటకు లడుగుట యన్యాయము. శకుంతల విహారస్థానమున జనరల్ పోస్టాఫీసు గోపురమును రంగురంగులతో చిత్రించియుంచుట మనశ్శాంతికి భంగము గలిగింపక తప్పదు.

## సంగీతము

ఇంక సంగీత మన్నచో సంగీతము నిజముగ సంగీతమై యుండవలెను. రోగము గొన్న పిల్లి యరపు కాకూడదది. రంగస్థలముపై సంగీతములకు స్థానము లేదని యెంచువాడను కాను నేను. భావప్రదర్శనమే నటకునికి ప్రధానముగ చూచుకొనదగినది. సంగీతముమూలమున గాని ప్రస్ఫుటము గాజాలని భావములు కొన్ని యుండవచ్చును. ఆత్మను అత్యున్నతమగు స్థానమున జేర్పగల ప్రబలసాధనము సంగీతము. నిరంతర బాధాకరమగు అశాంతి నణచివైచి మనస్సును కాపాడ గలిగినది సంగీతము. సంగీత మన్నప్పుడు మంచిసంగీతమని నా యభిప్రాయము. సౌందర్యము నుత్తమోత్తమముగ వర్ణింపగల కవిలో సంగీత మున్నది. ప్రేమలలాటమునకు "కోహినూర్" వజ్రము సంగీతము. అంధకారమయమగు నహంకారమును బంగారముగా మార్చి రసవాదజ్ఞాన కీయగల యద్భుతసాధనము సంగీతము. వ్యక్తి ఆత్మను అనంతత్వమునకు జేర్పగలిగినది సంగీతము. ధ్యానములో నున్నవానికి పట్టుమడి సంగీతము. పూజాస్థానమై యున్న నాటకరంగమునుండి సంగీతమును నేను దూర మొనర్పను. కాని రంగస్థలమునకు సరియైన సంగీతము నమర్చుటకు గొప్ప సంగీతశాస్త్రజ్ఞు డుండవలెను. అట్టివాడే నాటకమునను, రంగస్థలముపై ననుకూల సంగీతమునకు అర్హస్థాన మేదో నిర్ణయింపగలుగును. రసానుగుణ్యము, సమయానుకూలము నగు రాగము నతడే నిర్ణయింపగలడు. దినచారమునకును, సంగీతమునకును సన్నిహిత సంబంధము గలదను సంగతి నెరిగినవారు చాల తక్కువమంది. ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలము, రాత్రి వీని యన్నిటికిని గూడ ఆయా సమయములను మనోహరముగ వర్ణింపగల ప్రత్యేక రాగములు గలవు. ఈ దినచారములో ప్రతిక్షణమునకును, ప్రతి నిమిషమునకును ప్రత్యేక లక్షణ ముండును. సంగీతము ఆయా సమయములతో మేళవించి యుండజాలక పోయినచో కళాభిజ్ఞుని విన్కికది కఠోరముగనే యుండును. నాటకములో అనుకూలమగు సమయ మొకటి యున్నదను సంగతి నెరిగినవారు చాల తక్కువగ నుందురు. మామూలు నటకుడు నాటకము నంతయు పూర్తిగ చదివి అందలి ప్రతిరంగమునకును గల సమయ మర్యాదను గ్రహించుట కెన్నడును ప్రయత్నింపడు.

## నటకుని జ్ఞానశూన్యతకు ఫలితము

ఇట్టి యజ్ఞానమునకు గల ఫలితము మిక్కిలి పరిహాసాస్పదమైనది. ఉదయమున 7 ఘంటలవేళ ఒక రాజుగారు కొలువు తీర్చియున్నా రనుకొనుడు. కాని రంగస్థలముపై నప్పుడు శోభాయమానములగు చిత్రవిచిత్రములగు దీపములు! ఇంక నక్కడ నున్న మంత్రిగారు ఒక గొప్ప శత్రువు వచ్చి ముట్టడి సల్పిన వృత్తాంతమును కర్తీ లేని మధ్యమావతిరాగముతో పద్యములోనో, పాటలోనో తెలియజెప్పును. ఇందుల కతనికి ప్రశంసలు. ఈనటకుల యజ్ఞానమును మించగలిగినది మరల ప్రేక్షకుల యజ్ఞాన మొక్కటియే. నటకు లొక్క రవ్వంత విచక్షణతో నాలోచించి యుండినచో ఉదయమప్పుడు దీపముల యవసర ముండదనియు, మధ్యమావతి కది సమయము కాదనియు బోధపడగలదు. నాటకముకళాసౌందర్యమునకు సంగీత మెక్కడెక్కడ వన్నె దెప్పునను నంశము నాలోచింతము. భక్తి, సంతోషము, ప్రేమ, దీర్ఘాలోచన—ఇవియన్నియు సంగీతమునకు స్థానమీయ గలిగినవిగా నుండవచ్చును. కాని యేదో యొక మృగమును వేటాడు నాందోళనమున బడియున్నప్పుడు కాని, యుద్ధరంగమున శత్రువు నెదుర్కొనుచున్నప్పుడు గాని, భైరవికి, కాంభోజికిని స్థానము లేదను విషయమున మీరు నాతో నేకీభవించెద రనుకొందును. వేటరంగములో

గాని, యుద్ధరంగములో గాని, పాట లెందుకు గావల యునో నాకు బోధపడుటలేదు. శత్రువులను నిర్మూలించుటకీ పాట లేమైన నుపయోగించునేమో నాకు తెలియదు. ఇట్టి సందర్భములో సంగీత మొక హంతకుని బోలియుండును. నాటకశాలలోని విమర్శకు డీమృత్యు సౌందర్యమునకు సులభముగ లోబడిపోవుచున్నాడు. నిజముగ సంగీతజ్ఞు డగువాడు ఇట్టి పొరపాటులను సులభముగా తప్పించుకొనవచ్చును.

ఇట్లు మంచినాటక రంగము, మంచి చుట్టుపట్లు, మంచి సాధనసంపత్తి, మంచి సంగీతము—వీని కన్నిటికని తోడు ఒక మంచి నాటకము, మంచి నటకుడు, మంచి విమర్శ—ఇవికూడ కావలసియుండును. ఇవి యన్నియు గలిసియున్నచో నప్పుడు మానవుని యంతర్బుద్ధికి ప్రబోధ మొసంగగల పవిత్రమగు నీసంస్థ (నాటకరంగము) పరమసుందరము కాగలదు.

## మంచినాటకము మంచినటకులను దెచ్చుకొనగలదు

కాబట్టి యిప్పుడు ప్రధానముగా కావలసినది మంచినాటకము. భోజనపదార్థములు సిద్ధముగా నున్నచో వడ్డించువారికిని, తినువారికిని లోటుండదని లోకూరుగా రన్నట్లు, నాటకము మంచిదొకటి తయారైనచో నది తనవెంట తానే మంచి నాటకరంగమును, నటకులను దెచ్చుకొనగలదు. ఈమహా కార్యమునకై నిశ్చయముగ నిరంతర దీక్షతో పనిచేయుగలయువకులగు స్త్రీ పురుషులు బయలుదేరవలయును. (75 ఏండ్లకు లోబడియున్న వారందరు యువకులే; నాశబ్దకోశములో ముసలితనమను మాటకు చోటు లేదు. స్త్రీలు సర్వదా యువతులే)

## నాటకముల యితివృత్తములు

దుర్బలమగు 'జోహుకుం' తత్త్వమును విడిచిపెట్టి నిర్భయముగ విశ్వామిత్రుని రీతి నూతనసృష్టి గావింపగల కవులు మన కిపుడు కావలయును. యుధిష్ఠిరునిచే స్వర్గద్వారమునగూడ సర్వజీవ సమత్వమును ప్రకటింపజేసి, తుకారామ్‌చే రొట్టె నెత్తుకొనిపోయిన కుక్కకు నేయికూడ నిప్పింపగలిగిన ప్రేమభావము నెరిగిన కవులు మనకు కావలయును. నూఱుమంది భార్యలను గలిగియుండి నూటొక్కటవ భార్యనుగూడ పెండ్లియాడి యామెకోరిక ననుసరించి యేకాదశీ వ్రతమునకై తన పుత్రులను వధింప సంసిద్ధులగు మహానుభావులను నాయకులుగా జేయుని నాటకకారులు మనకు గావలయును. దుష్టులంశులకు సంపూర్ణముగు ధిక్కారము జూపగల శకుంతలలను నిర్మించు నాటకకారులు కావలయును. విశేంతు రత్నకొలయములను స్థాపింపగల సావిత్రులను సృష్టించు కవులు గావలయును. మానవునకును మానవునకును మాత్రమే కాక మానవునకును ఈశ్వరునికిని గూడ గల సంబంధమును వెలిబుచ్చుచు, విద్యకు కేంద్రస్థానముగ నాటకరంగము లుండవలయు ననెడు మన ప్రాచీనాశయమును ఆచరణలో బెట్టగల కవులు కావలయును

## భౌతికజీవితము - ఆధ్యాత్మిక జీవితము

నాటకము మనజీవిత మెట్లున్నదో యను సంగతిని, దానితోపాటు అది యెట్లుండవలెనో య నంశమును గూడ చిత్రింపవలసియుండును. ఒక పరిమాణౌచిత్య బుద్ధి లేక, తగు శిక్షణ లేక, అదృశ్యములు, నజ్ఞేయములు నగు నంశముల గూర్చి ధ్యానించుచుండినచో, మన యెట్టయెదుటనే మన కుండవలసిన రవ్వంత యధికారమును సడలిపోయి, మన జీవితము పరస్పర సంబంధము లేని సంఘటనములతో నిండిపోవును. ఆధ్యాత్మిక జీవితమునకనవసరమగు ప్రాముఖ్యము నిచ్చినచో మానవజీవిత మొకమారు గల్లంతులో పడిపోయి భౌతిక జీవితమునకునష్టము గలుగును. అట్టి ప్రాముఖ్యము భౌతిక జీవితము ఆధ్యాత్మిక జీవిత రాజ్యమున ప్రవేశించు నాస్థానమున మానవుని దూరము చేసివైచును. సహజపరిస్థితులను బట్టియు, చుట్టుపట్ల గలిగిన మార్పులను బట్టియు అహంకార ధౌర్త్యము మూలమున మనము ప్రాచీనాశయమును పూర్తిగ మరచిపోయినాము. సృష్టికర్తను సృష్టినుండి, పరమేశ్వరుని మానవుని నుండి, తండ్రిని బిడ్డలనుండి వేరుపరచ యాలోచింప సాగినాము. కాబట్టియే మన నాటకరంగముల నన్నిటిని

దేవ దేవతలతో, పల్లీ పరిణయములతో నింపి వైచు చున్నాము. దేవతల ప్రేమలను, దేవతల దుఃఖములను చిత్రించు చున్నాము. సాధారణ జీవితమునకు సంబంధించిన యంశములు రంగస్థలమునకు అనర్హములని భావింపబడుచున్నవి.

## మానవజీవితము - నాటకము

ఈప్రవృత్తి యెంత శీఘ్రముగ మారిన నంత మంచిది. ఇటుపై కవులకు, నాటక కారులకు పరమేశ్వరునికిని మానవునికిని మానవునికిని మానవునికిని గల సంబంధములను గూర్చి చర్చించుటయే యాశయమై యుండవలెను. మానవుల పరస్పర సంబంధమును గూర్చిన సమస్యలు పరిష్కారము గోరునవి వేలకు వేలుగా గలవు. నాటక రంగము విద్యాస్థానముగ నుండవలసినచో–విద్యాస్థానమే యది కేవలము–అస్పృశ్య జీవితమును చిత్రించుట కే గాని పనిరాని యుండరాదు. ప్రత్యక్ష జీవిత సమస్యలను గూడ నది చిత్రింప వలసియుండును. ఒకవైపు సృష్టి జీవితమునకు సంబంధించిన ప్రాచీన విజ్ఞానాగులను బయల్పరచుచు, రెండవ వైపున వ్యక్తి జీవితమునకు గల ప్రాధాన్యమును, సంఘ జీవితములో మేళవించి పోవుటకది యొనర్చు సహజ ప్రయత్నములను, మన సాంఘిక జీవితమును భిన్నము గావించుచున్న నేటి స్థితిగతులను గూడ నాటకము వెల్లడించుచుండవలెను. పైకి నాయకుడు ముందు మనచుట్టు నేమున్నదో మనము చూడవలసిన దగును. ముందు దగ్గర నున్నదానిని గమనించి తరువాత దూరస్థమగుదానికి బోవలయును.

## జీవితము నున్న దున్నట్లు చిత్రించుట

శ్రీరాముడు రాజై రాజ్యమునకు సంబంధించిన సమస్యల నెట్లు పరిష్కరింప గలిగెనో తెలిసికొనుటకు మన మెక్కువ యుత్సాహము జూపవలయును. మనదృష్టి యచ్చటనే యుండవలెను. ముందు నాటకములు జీవితము నున్న దున్నట్లుగ జిత్రింపవగును. దీనినిబట్టి జన సామాన్యమున మనః ప్రబోధము కలుగును. సంపూర్ణమగు స్వభావము గలిగిన ఒకరి జీవితము జనసామాన్యమున కంతకు నాదర్శమై యుండునని చెప్పుదురు. మానవుడు సంపూర్ణత్వమును జెందవలయునని కావించు ప్రయత్నములను, వాని జయాపజయములను తెలిసికొన ప్రయత్నించుట మిక్కిలి ప్రబోధకరమైనది; మిక్కిలి ఉపయోగకరమైనది. ఒక గొప్పవాడు గావించిన స్వేచ్ఛావిహారము కన్న అతడట్టి గొప్పవా డెట్లయ్యె ననునంశము ఎక్కువ ఆకర్షకమైనది; ప్రబోధకరము, ఉపయోగకరము నైనది ప్రతి మానవునిలోను గొప్పశక్తులు గలవనియు, అందరును గొప్పవారగుటకు, సంపూర్ణత గాంచుటకు నవకాశ మున్నదనియు నిరూపించుట ఉత్తమోత్తమములగు ప్రబోధములలో నొకటి. విద్యకు ప్రధానాశయము మానవునిలోని దేవత్వమును బయల్పరచుటయే యని విజ్ఞులంగీకరించిన యంశము. ఇది కళలమూలముగనే సాధ్యమగును. అందుకు నాటకము ప్రధానసాధనము. ఆధునిక జీవితమునకు సంబంధించిన ప్రధానసమస్యలను అవి మానవ హృదయము నెట్లు పరిణమింప జేయుచున్న దియు, మానవునిలోని దేవత్వము నన్ని యాతంకములను, తొలగించునని యీసమస్యలను పరిష్కరించుట కెట్లు ప్రయత్నించునదియు నాటకములలో చిత్రితమై రంగస్థలమున ప్రదర్శింపబడవలెను. గొప్పవారు సాధారణ పరిస్థితులను ధిక్కరించి యున్నతముగ నిలిచిరి కావున గొప్పవారు కాగలిగిరను నంశమును రంగస్థలముమీద నుండి స్పష్టము గావలయును. ఇట్టి సాధారణ పరిస్థితులకు కారణములైనవి సాధారణ జీవితములకు సంబంధించిన సమస్యలే. అందుచే మన నాటక కారులిక ముందు తమ దృష్టిని వాని వైపు మరల్పవలయును.

## ప్రబోధము కళకు గల యుద్దేశము కాదా?

కళకుగల యాశయము ప్రబోధము కాదను నభిప్రాయమును నే నంగీకరింపను. జీవితముయొక్క పరమాశయమే జ్ఞాన సంపాదనము. జీవితముయొక్క స్వయం ప్రకటనము కళ. నాటకరంగము లలితకళ లన్నిటియొక్క మేళగింపు. అందుచే విద్యకు కేంద్రస్థాన మది. చదువుల బడికన్న నెక్కువ యుపయోగకర మది. దేవాలయమున కన్న ఎక్కువ శక్తిమంత మది.

## నాటకరంగము - మతవిద్య

మన ప్రస్తుత విద్యా విధానములో మత విద్య లేకుండుటచే అది లోపభూయిష్ఠమైనదని యీ నడుమ నెవరో యుపన్యసించుట నేను వింటిని. ఇది నిజమే. మానవుని నడవడియే అతని నిర్మాణ సామర్థ్యమున కాధారము. నిజమగు మత పరిజ్ఞానమే యిట్టి నడవడికి పునాది. మతమునకు విద్య స్థాన మీయనిచో అది నేతిబీరకాయ. ఏ మతమునకు గాని ప్రధానాశయములు రెండు: సర్వ సమత్వము, ప్రేమ. మతబోధకై మన విద్యాలయములలో ప్రయత్నములు జరుపుటలో గల కష్టములు మీకు తెలియును. శ్రీవైష్ణవులకు శ్రీవైష్ణవ గురువులు, అద్వైతులకు అద్వైతగురువులు, మాధ్వులకు మాధ్వగురువులు, ఈవిధముగ నెందరో కావలసియుండును. ఈ గడబిడ యంతయు విద్యాశాఖాధికారికి పిచ్చియెత్తించి వేయును. ఈ సందర్భములో నాటకరంగ ముపయోగింపగలదు. మన పూర్వౌన్నత్యమునకు దారిచూపిన మతవిషయ కార్యములను మనయెదుట బెట్టుటకు నిర్భయముగ నాటకరంగము ప్రయత్నింపవచ్చును. మన నాటకములు మన జీవిత సమస్యలనుగూర్చి చర్చించి, మనసంఘములకు భావి సౌభాగ్యమునకు దారిచూపవలయును. రాజకీయసమస్యలు, పరిపాలన సమస్యలు, సంఘ సంస్కార సమస్యలు, వేదాంతసమస్యలు, నివియన్నియు నాటకరంగము ద్వారా జనసామాన్యమునకు వెల్లడి కావలయును.

## కేవల సాధారణాంశములనే చిత్రింప నక్కరలేదు

జీవితము నున్నదున్నట్లుగ నాటక రంగముపై ప్రదర్శింప వలెననుటలో కేవల సాధారణములగు సంఘటనములను చిత్రింపవలయు ననునర్థము లేదు. ఏవో కొన్ని కొన్ని స్వభావముల స్థితినిగూర్చి మాత్రమే తెలియజేయు సంఘటనములవలని ప్రయోజన మంతగా నుండదు. మామూలు పరిస్థితులతో సమన్వయించుకొనిపోవు స్వభావముల స్థితినిగూర్చి మాత్రమే యవి మనకు తెలియజేయగలవు. కాని మానవుని ప్రయత్నబలమును, నిర్మాణ సామర్థ్యమును విశదపరచు జీవితసంఘటనములు గూడ గలవు. మానవునిలోని యీ నిర్మాణ సామర్థ్యమే, యీ ప్రయత్న బలమే యతనిని చుట్టుపట్లనున్న వాతావరణమునుండి పైకెత్తి యున్నత స్థానమున నుంచును. అందుచే మన ప్రాచీన జీవితమునకు గాని, వర్తమాన జీవితమునకుగాని సంబంధించిన యిట్టి సంఘటనములనే మన నాటకకారు లెత్తుకొనవలయును. క్రొత్త క్రొత్త కవులను, నాటక కారులను గమనించి ఊరు, పేరు లేక తిరుగుచున్న యిట్టివారి కుత్సాహమిచ్చి సరియగు నాశయములను వారియెదుట బెట్టి ఉపయోగకరములగు నాటకములను తయారు చేయించుట యిట్టి యుత్సవముల ప్రధాన కర్తవ్యమై యుండదగును.

## ఉత్తముడైన నటకు డెవరు?

ప్రస్తుతము మనకుగల నాటకకళ యేస్థితిలో నున్నదో కొంచె మాలోచించి చూతము. కళకు, విద్యకు ఆవేశమే ఆధారమైనప్పుడు నాటకకళపట్ల ఈ నియమము మరింత బలముగా వర్తించును. ఆవేశముగల నటకుడే నిజముగ నటకుడు. ఎట్టిభయమును లేక నిష్కపటముగ నే నీమాట చెప్పగలను. అష్లీ డ్యూక్ గారన్నట్లు, ఒక నటకుని శ్రేష్ఠత్వమును నిర్ణయించునది అతని వేషము గాదు, కంఠస్వరము గాదు, రంగస్థలవిహారము గాదు, భావసూచనయు గాదు, తుదకు ముఖముపై భావమును ప్రకటింప గలుగుటయు గూడ కాదు. అది వీని కన్నిటికిని పైనున్నది. మానవహృదయము తన పరిణామదశలో ఏదోయొక మెట్టు నందుకొని, నాకింకను జ్ఞానము ప్రసాదించి పైకి గొనిపొమ్మని ప్రార్థించు నవస్థను ప్రకటించుటయే యది. "నేను" "వాడు" కాగోరు ప్రయత్నములో నారంభదశ యిది. ఆత్మతిరస్కారము, ఆత్మవిస్తరణము క్రొత్తవారి బట్టుటకు—ఈదారి విలక్షణముగ గూడ నుండవచ్చును—ఇదియే ఆరంభ ప్రయత్నము. ఆత్మ యహంకార బంధములు విదళించుకొని విశ్వ ప్రేమ సముద్రమున దుముకుట కిది ప్రథమ ప్రయత్నము.

## నటకుడు - ప్రేమ

ఇట్టి మహాకార్యమునకు దిగుటకు ముందు ప్రేమను సంపాదించుకొనవలసి యుండును, మీ హృదయమును

ప్రేమ మయము గావించుకొనుడు. మీరు నటకులు కాగల్గుదురు. నాటకరంగముపై ప్రతిష్ఠ గడించుకొన గోరువారికిదియె నేనీయగల సలహా. శ్రీకృష్ణుడొకగొప్ప నటకుడు. ఆతని హృదయమున ప్రేమ తప్ప మరియొకటి లేకుండుటయె దీనికి కారణము.

## నేటి నట 'సింహములు'

కాని నేటి నటులను సులభముగ పట్టి యీయవచ్చును. చుట్ట యలవాటొకటి, పెద్ద గొంతుక యొకటి వీరిలో చాలమందికి లక్షణముగా నున్నది మన నటకోత్తములు సుబ్రహ్మణ్యులుగా వచ్చినను సరే, కర్ణులుగా వచ్చినను సరే, ఔరంగజేబులుగా వచ్చినను సరే, "జయజయ గోకులబాల" వారు పాడిన జాలును, మనకు పరమానందము. ఒక ఆఫీసులో గుమాస్తాపని గాని, ఒక బడిలో నుపాధ్యాయ పదవి కాని కావలెనన్న, దానికి యస్. యస్. యల్. సి. సర్టిఫికెట్టు, ఒక యోగ్యతా పత్రము ఇది యంతయు నవసరముండును. ఇంక నాటకరంగమునకు గావలసినది, ఒక పెద్దకంఠము, సిగరెట్లమీద తాంబూలముమీద గల విపరీతాభిలాష—ఇవి రెండును మాత్రమే.

ఇంక చాలమందికి బహుమాన పతకముల మాలల మీద, పత్రికలలో బొమ్మలు ప్రకటించుకొనుటమీద ఆశ. మనలోని నటసింహము లన్నియు గలిసి యొక ఆఫ్రికా యెడారిని పూర్తిగా నింపివేయగలవు. రంగరత్నముల గుంపు ప్రపంచమున కంతకును చెందిన ఒక వజ్రశాలకు సరిపోవును. మొన్న నిప్పుడో ఒక జ్యోతిర్మార్తాండని గూర్చి నేను చదివితిని. ఉత్తముడగు నటకుని సన్మానించి వెల్లడించు పద్ధతి యిది. ఈ బిరుదుల యాబలాటము ముఖ్యముగా ఆంధ్రదేశములో మరింత విపరీతముగా నున్నది. (ఈ నిరుపయోగములయిన బిరుదుల మాలలే మనను బానిసతనమున గట్టివైచుచున్నవనియు, మనవారు వీనినుండి తప్పించుకొన్ననాడు స్వరాజ్యము లభింపగలదనియు నేనొకప్పుడు చెప్పుచుండువాడను.)

## నేటి నాటకసంఘములు - ప్రాచీనాలయములు

మన నటకులలో నాటకము నంతను పూర్తిగా చదివి యేపాత్ర కర్థ స్థాన మేకో, పాత్రల పరస్పర సంబంధ మెట్టిదో తెలిసికొనుటకు ప్రయత్నించువా రెంతమంది కలరొ యని నాసందేహము. ఈ సందర్భములలో ప్రొఫెషనల్ సంఘములకన్న అమెచ్యూర్ సంఘములవారి తప్పు పెద్దది. అమెచ్యూర్సువారి బాధ్యత యెక్కువగా నుండుటయే దీనికి కారణము. దక్షిణ హిందూదేశములో అమెచ్యూర్ సంఘము లంతరించుట కెంతో కాలము పట్టదని నాయభిప్రాయము. ఏలయన, ప్రాచీన భారతీయ కళాలయములును, నేటి యీ సంఘముల యాశయములును ఒక్కటిగా నుండుటలేదు. భిన్నత్వమునకు వెనక నున్న ఏకత్వమును నిరూపించుటయే ప్రాచీన కళకు ఆశయమై యుండ నేటి యీ సంఘములు భిన్నత్వము వంకకే దారి చూపుచున్నవి. మామూలుగా నీ అమెచ్యూర్ సంఘము లన్నియు నాటకరంగము నభివృద్ధికి దెచ్చుట, నాటక కళను పోషించుట యున్నగు ప్రయత్నము లొనర్చుట తమ యాశయము లని ప్రకటించుకొను చుండును. నాటకమును బట్టియే నాటకరంగముండును. కాని యీ సంగతి గమనించు వారెవ్వరును లేరు. సరియైన నాటకములను వ్రాయించు ప్రయత్నము లేవియు నగపడవు.

## నేటి నటకులు రంగస్థలముపై ప్రవర్తించువిధము

సాధారణముగా నాయికా నాయక పాత్రలను ధరించువారే ప్రదర్శనమునకు కావలసిన నాటకమును నిర్ణయింతురు. వీరి కెల్లప్పుడు తామే పైకి రావలయునన్న ఆశ యొకటి యుండును. అటుపై పాత్రనిర్ధారణములో జాతిభేదములు. ఒకసారి నాయికా నాయకులైనవారు సర్వదా నాయికా నాయకులే. అప్పటినుండి వారు క్రిందికి దిగరు. ఇట్టి గౌరవము కావలెనను కోరిక యితరులకుగూడ నుండుట సహజము. వెంటనే యెక్కువ తక్కువల భావ మొకటి వెలికి వచ్చును. నిజముగా నిదియే మన యభివృద్ధి కాటంకము, ఇంతటితో సేవకులు

మున్నగు పాత్రల ధరించుట కందరును నిరాకరింతురు. ప్రతివారికిని రావదుస్తు లవసరము. అటుపై స్థానేశ్వర యుద్ధములో భారత సామ్రాజ్యమును విచ్ఛిన్న మొనర్చిన పిశాచము (అంతః కలహములు) రంగస్థలమున నవతరించి నాయికా నాయకు లారంభించిన విధ్వంసకార్యము పూర్తియొనర్చును. అటుపై నాటకము నడపువారు నాయికా నాయకు లిద్దరు, వారి మిత్రులు కొందరు, కేవలము తటస్థులై యుండు హార్మోనియం మద్దెలవాండ్రు, ఏదో నిర్లక్ష్యముగా కాలక్షేపము చేయు రంగాధ్యక్షు డొకడు. ఈరోజులలో వీనికి తోడు సాంఘిక సమస్య యొకటి. ఇట్టి స్థితిలో, రాజకీయ రంగములో నలవరచు కొన్న స్వాతంత్ర్య భావములకు సమస్యా భావములకు లోబడి మన యువకులు నాటక పాత్రములను వరుస వెంబడి నందరకు నీయవలసి యుండునని తీర్మానములను సూచించు చుందురు. వీరి యభిప్రాయములో నాటకకళ యభివృద్ధియు, హాలీ పెద్ద దినములయు నొకేరకమైనవి కెందినవి. నిజమునకు సర్ జాన్‌స్టన్ ఫోర్బ్సు రాబర్ట్‌సన్ గారన్నట్లు, బోధించి నటుని తయారు చేయజాలము; నటుడు జన్మతః నటుడై యుండవలెను.

## అమెచ్యూర్, ప్రొఫెషనల్ సంఘముల సంబంధము

ఇట్టి యీ పరస్పర విరుద్ధములగు స్థితిగతులలో మేనేజిమెంటు సంఘమువారికి వేరు దారి యేమియు నుండదు. అందుచే నెవరో యొకరు సాధారణ సంఘమును సమావేశ పరుపవలెనని సూచింతురు. సాధారణ సమావేశమునకును గడబిడకును తప్పనిసరి యనుబంధము. ఆఖరుకు గట్టిగా మాట్లాడగలిగినవారు ప్రముఖులౌదురు. ఇంతే దీని ఫలితము. ఇట్లు కాక యేవైన కొన్ని ముఖ్యాంశములను గూర్చిన సూచనలు వచ్చినచో, నాయకుడు వెంటనే తప్పి కొనుటయు, వెంటనే పోటీసంఘ మొకటి యేర్పరచుటయు సంభవించును కడచిన 20 ఏండ్లనుండియు నేను నాలుగు పెద్దపెద్ద అమెచ్యూర్ సంఘములతో సంబంధము కలిగియుంటిని. ఇంచుమించుగా నెల్లప్పుడును ఈ సంఘముల స్థితి యొకేరీతిగ నున్నది. ఆరంభ మెంత యందముగ నుండునో ఆఖరు కది అంత యసంగతముగ నంతమొందును. ప్రొఫెషనల్ సంఘములలో వ్యాపించియున్న అర్థములేని వ్యవహారములను, నమ్మకములను అంతరింపజేసి రంగాభివృద్ధికి అమెచ్యూర్ సంఘము లెక్కువగా తోడుపడుచున్న మాట వాస్తవమే. ఒక గొప్ప యాదర్శము నవి నెలకొల్పుచున్నవి. కాని తమ కార్యమును నిరంతరముగ కొనసాగించు కొనుటకు దగిన నిర్మాణసాధనములు వానికి లేకున్నవి. ఇట్టి నిర్మాణ కార్యములలో ధనసంపత్తి ప్రధాన స్థానము నాక్రమించును అమెచ్యూర్ సంఘములవారు వ్రాయించు క్రొత్త నాటకములు బాగుగ రచింపబడక పోవుటచే ప్రేక్షకుల నాకర్షింప లేకున్నవి. అందుచే వారి యుత్సాహ మంతయు చల్లచల్లారిపోవుచున్నది. ఇట్టి స్థితిలో కొన్ని సంఘము లసలే యంతరించి పోవుచున్నవి. మరికొన్ని పరల ప్రాత నాటకములను బట్టుకొని యెట్లో జీవితము నీడ్చుకొని వచ్చుచున్నవి.

అమెచ్యూర్ సంఘముల కే నిరంతరముగ నభిమానించుకొని యున్నంతకాల మిట్లే స్థితిగతు లుండునని నా యభిప్రాయము. క్రొత్త క్రొత్త పోకడలకు దారి చూపుట అమెచ్యూర్ సంఘములవారికిని, వారి యీ కార్యమును తమకుల కట్టుబాట్ల సహాయముతోను, సాధనసంపత్తి సహాయముతోను బలపరచి స్థిరపరచుట ప్రొఫెషనల్ సంఘములవారికిని పనియై యుండవలెనని నా యభిప్రాయము. ఈ మహాకార్యమున ఈ రెండు సంఘములవారికిని పరస్పర సాహాయ్యము, సామరస్యము నేర్పడవలెను. అమెచ్యూరు సంఘములవారు పైసంఘములలోని సుగుణమును కనిపెట్టియుండి అట్టిదానికి సహాయము చేయుచుండవలెను.

## నాటకరంగము: పత్రికలు

ఈ సందర్భమున బాధ్యత పత్రికలకుగూడ కలదు. కళా విమర్శకులు హృదయ పూర్వకముగ నీ విషయమున నభిరుచి గలిగించుకొని, ప్రజలలో ప్రబోధము గలిగించుటకు తోడుపడవలెను.

నటకులనుబట్టి ప్రేక్షకులు, అట్లే ప్రేక్షకులను బట్టి నటకులు నేర్పడుదురు. మంచి నాటకములను ప్రదర్శించి ప్రేక్షకులు వాని నామోదించునట్లు చేయుట నటకునిపని. ఇట్టి యామోదము లేకపోయినచో నటకుని కార్యోత్సాహము క్షీణించును. సరుకు మంచిదైనచో కొనువారి కేమియు లోటుండదు. అట్లే తమ యాదర్శములను దీక్షతో నంటిపెట్టుకొనియుండి కార్యమునకు గడంగినచో మంచినటకులును, మంచినాటకమును కేవల సంకుచితాభిప్రాయులగు ప్రేక్షకులనుండి కూడ నామోదము బడయగలరని నేను చెప్పగలను. సాధారణముగా మానవ స్వభావము అపజయముచే కలతనొందక యుండజాలదు. క్రొత్త నాటకమును, క్రొత్త యాదర్శమును అంటిపెట్టుకొని యుండగోరువాడు ధనాభావమును దాటి బ్రతుకలేకున్నాడు. అధమపక్షము నతనిని వెనుకనుండి ప్రోత్సహించి సంతోషము గలుగజేయువారైన నున్నచో తనజీవితము నతడు నిలుపుకొనగలడు. కళాసంస్థల కార్యక్రమమునకు ప్రేక్షకులు లేని లోపము భంగకరముగా నున్నది.

ఇది యిట్లున్నను వీని కెక్కువ నష్టము పత్రికల యుపేక్ష. వ్యక్తులకెట్లో యట్లే పత్రికలకుగూడ కీర్తికక్కుర్తులపై నాశ. అందుచే కీర్తికక్కుర్తి నుదారముగ పంచిపెట్టగలుగువానికి పత్రికలలో ననుకూలమగు స్థానము లభించును. ఈవిధముగ ద్వారము కడనే తోడేలొకటి యెదుర్కొనుటచే కళాసంస్థలు తుదకు ఆకున కందని, పోకకు పొందని యీపత్రికల విశేషణముల మూలమున తమ యుత్సాహము నంతయు గోల్పోయి పూర్తిగ నంతరించి పోవుటయో, పేకాటలోనికో పత్రికా పతనము లోనికో దిగుటయో సంభవించుచున్నది. పత్రికలు తమ బాధ్యతను నిర్భయముగ నిర్వహింప వలసినదని నేను కోరుచున్నాను. భారతీయ కళాదర్శములు, ధర్మాదర్శములు, కవిత్వాదర్శములు, వీనిలోగల ప్రతిష్ఠయే భారతదేశమునకు గల ప్రతిష్ఠ. ప్రాచీనాశయములను వానిచుట్టును పెరిగిన డొంకలనుండి తప్పించి శుభ్రపరుపగల కార్యము పత్రికలే జయప్రదముగ నిర్వహింపగలుగును. మన కళాజీవితమును, అన్య జీవితభాగములను గూడ క్రుంగదీయుచున్న యాదుర్వస్తువును ప్రత్యక్షీకరించి, మన మనుసరించుచున్న దురాదర్శములను మనకు బయల్పరుపగలవి పత్రికలే. నిర్దాక్షిణ్యములగు నాచారములను, భయావిష్టములగు మూఢ విశ్వాసములను అణచివేయవలెను. విధ్వంస కార్యముగూడ అభివృద్ధి కొక సాధనమే. అభివృద్ధికిగల యాటంకములను నిర్దయముగ నిర్మూలించి వేయుదగును. పత్రికలు మన కీ యమూల్య సహాయము నీయగలవు.

## జనసామాన్యము సంస్కరణమునకు విముఖమా?

జనసామాన్యములో సరియైన యభిప్రాయములను, అభిరుచులను గల్పించు టెట్లను ప్రశ్న రావచ్చును కాని నిజమునకు మన యభివృద్ధి కాటంకముగ నున్నవారు— రాజకీయముగ గానిండు, సాంఘికముగ గానిండు, కళావిషయమున గానిండు,— చదువుకొన్నవార మనుకొను సగముసగ మెరిగినవారే కాని పామరజనము గాదు. ఆడంబరప్రియులగు కొందరు బయలుదేరి వారిని పెడదారికి బెట్టకున్నచో, ఏ మంచియాదర్శమునైన సరే సరళముగ వారి యెదుట నుంచినప్పుడు 'పామర జనులు' హృదయపూర్వకముగ దానిని ప్రశంసింతురు. అందుచే ముందుగా నీ సగముసగము జ్ఞానము సంపాదించుకొన్న విద్యావంతుల భావములకు సంస్కృతి గలిగింపవలయును. ఇట్లు చేసినచో జనసామాన్యము తనంత తానే యున్నతి మార్గము నవలంబించి రాగలదు; శీఘ్రకాలములో మన కళాజ్యోతిని, విజ్ఞానజ్యోతిని మరల వెలిగించుకొని యుజ్జ్వలనము గావించుకొనగలము; నిఖిలప్రపంచ కళామహోత్సవములో ప్రముఖతమమగు భాగస్వామిత్వము బడయజాలక పోయినను, ప్రముఖులగు భాగస్వాముల స్థానములోనైన నుండగలుగుదుము.

—ఆంధ్రపత్రికనుండి.

---

# ఆకాశ దీపము

విశ్వనాథ సత్యనారాయణ గారు, M. A.

[పది పదునొకొండేండ్ల క్రింద నొకనాఁడు శైవదివ్యకార్తికి కాకాశదీపము నామనసు లోనికిఁ జూచినది. ఏఁటేటఁ గార్తికము వచ్చినది. పోయినది. నేను ఊణెయించితిని. ఈయేఁట ఆభావము మ్రొక్కుకొని తీర్చుకోని మ్రొక్కువలెఁ గుత్తుకమీఁదఁ గూర్చున్నది. అసలు ఋణమే చెడ్డది. అందులో శివఋణము మఱీ చెడ్డది. పదియేండ్ల క్రింద నింత దక్కునో దక్కదో శివదేవునకు, నేఁ డిది వడ్డితో గుంజుకున్నాఁడు.]

ఇంద్రియముల్ కుదించుకొను హృత్కళికాస్థితసంవిదాకృతిన్
చాంద్రమసంబు మేఘపరిష్వక్తము రేఖకైవడిన్
సాంద్రతమాలికాజరఠశాఖికలోఁ దుదిపూవుపోలికన్
తంద్ర, సుకార్తికీఘటగతప్రభుదీపిక తా జయించెడిన్.

పాపపుఁబెల్లుచేఁ జివురుపాటు ఘటిల్లిన జీవికిన్ మన
స్తాపము పుట్టి సన్నగిలి దైవపుఁ జింతల నక్కిపోవున
ట్లా పలితారుణంపుమిను కాఁగిన మబ్బులు క్రమ్ముదెంచు నీ
మాపులయందు కార్తికికమాఃపరిపూతత కొల్లవెట్టెడిన్.

ఇంచిన పున్నెపుమ్మలత లీచియువెల్గులత్రోవ లెల్ల వా
లించిన కోర్కిచెట్టు కదలించిన కొమ్మలసందునుండి రా
లించిన పూల జల్లులవలెన్ శివభక్తిఫలంబు భావినే
ళాంచిత భద్రతా విభవ మంతయు గర్భిత ఫక్కి చూపెడిన్.

నల్గడఁ దోరహత్తుగఁ బెనంగొనఁ జాలకయున్ వియత్పథిన్
వెల్గులచేత మింటి కొనవెట్టిన తారవిధాన దూరముల్
గల్గిన యాత్మదర్శన ముఖంబునఁ జూచిన త్రోవ లంతటన్
మేల్గిలకొట్టుచున్ వెలసె మిన్ననఁ గార్తికదీప వైఖరుల్.

కోటిక నందదేవు నిరుకొమ్ముల సందున నిష్ఠ భూతియో,
పేరిన శీతశీభవదభీష్టద శైవదృగంత రేఖయో,
శ్రీరజతాద్రి కొమ్ముకొన చిందిన విదిర్చిన వెల్గుముక్కయో,
తీరిక బాహులీగగనదీపికగాఁ గనవచ్చుఁ గంటికన్.

ఊర్ధ్వ వియద్ఘటీ గత మృదూర్జిత దీపపు మంద పూతకాం
త్యార్జవరేఖ, ధూర్జటి మహః పరిభావి విచిత్ర దీధితిన్
స్వర్జయ సత్యలోకజయ వైష్ణవలోకజయ ప్రగల్భతా
ధూర్జగమై, సనాశివపృథుస్థితికృత్కిరణాప్తి మొప్పెడిన్.

తుదితటి, చీఁకటుల్ మలయుత్రోవల చుట్టుల బొడ్డుఁగందు నో
ప్పిదమగు శైవమా మొదలి వెల్గువలెన్, ధ్వజపట్టనందిరా
డ్వదనమణి ప్రథన్ వెలుఁగుటం జను నియ్యది దివ్య శాశ్వతీ
పదమయి, మంచుఁగొండపనుఁగు పట్టి సమాదృత పాత్రదేశమై.

నక్తము లుండి, భక్తులు, కనంబడునంతకుఁ జూచుచున్, వినా
భక్తులు, పోయి, లేఁగునుకు పొందిన నిద్దుర పున్నెపుఁగలన్
ప్రాక్తన పుణ్యమూర్తి కను, బాహుల దీపికఁ గాంచి చేపుంస్
ముక్త విలోచనాస్రులయి మోడ్తురు కేలు, తదూహామూర్తికిన్.

ప్రాస గదా త్రిశూల కరవాల పినాకధనుల్, మహోగ్రచ
ర్మాసమ చేలు, రాననవమచ్ఛిఖనేత్రులు, నర్ధదేహకాం
తా సుకుమార మూర్తులు, సుధాపసుపేత శిరస్కులుం, బొరిం
దోసిలు లొగ్గి వచ్చి, ప్రమథుల్ ఘటదీపికఁ గొల్చుచుందురున్.

భూతాకుంచిత పంచకంబు వినయంబుం బొంది నిశ్చేష్టమై
చేతోవ్యగ్రతఁ దాల్చి, శైవ పరమ శ్రీ సచ్చిదానంద వి
ద్యాశత్త్వమ్మునకున్ ఘటీశిఖ మహా తాదాత్మ్యనై ఽభ్యృత
జ్యోతి ర్వ్యాఖ్య పొనర్చుచున్నది, ప్రియా చూడామణి శ్రేణికిన్.

# ప్రాణాయామము

పెద్దిభొట్ల వీరయ్యా గారు, B. A., B. L.

ఇదివరలో ఆహారనియమములనుగురించి వ్రాసిన వ్యాసములో ప్రాణరక్షణకు కావలసిన జీవపదార్థమును ప్రాథమికవస్తువులనుండి సాధించవచ్చునని బార్త్రిలాట్ అను పాశ్చాత్యప్రకృతిశాస్త్రజ్ఞుడు తెలియపరచియున్నాడనియు, యోగాభ్యాసముచేయువారు కొంతకాలమాహారమును వర్జించియుండుటవల్ల నట్టిది వారికిగల జీవపదార్థము నుత్పత్తిచేసికొనగల శక్తిని తెలియజేయునని, శరీరమందలి మాలిన్యము నశించుటకు ప్రాణవాయువు ముఖ్యావశ్యకమని విన్నవించియున్నాను. హైందవశాస్త్రములందు నమ్మకముగల వారికిని ఆధ్యాత్మికధర్మాచరణము గలవారికిని ప్రాణాయామావశ్యకత బోధపడియుండవలెను. హిందూదేశపుదుస్థితి యెంతవరకు వచ్చినదో! మన మతధర్మముల ముఖ్యసూత్రములను పాశ్చాత్యస్త్రీలు మనకు బోధించుచుండుటయు, నిప్పటికి మనలో నాంగ్లేయవిద్య నభ్యసించువారిలో పెక్కండ్రు అట్టిబోధలను సహితము లక్ష్యము చేయకుండుటయు, కలికాలమహిమయే గదా! ఈమధ్య ఒక అమెరికాదేశపు స్త్రీ చెన్నపట్టణములో ప్రాణాయామమునుగురించి ఒక వ్యాసమిచ్చుటయు, నందు ప్రాణాయామముయొక్క మాహాత్మ్యమును పాశ్చాత్యులెట్లు గుర్తించుచున్నది స్పష్టపరిచిన సంగతి యుపత్రికలలో చూచియున్నాము. అమెరికా ఇప్పటికి యోగాభ్యాససంబంధమైన పుస్తకములు మున్నూటికి పైగా వెలువరించియుండెను. దివ్యజ్ఞానసమాజ పుస్తకశాలలో నిట్టి పుస్తకములు కొన్ని గలవు. జస్టిస్ సర్ వి. రామేశం పంతులుగారి లైబ్రరీలో నిట్టి పుస్తకము లనేకములు గలవు. ఈ గ్రంథరాజములకు ప్రాతిపదికము మన సంస్కృతగ్రంథములే యనియు, పాశ్చాత్యులలో గొందరికి మన మతధర్మములయందుగల విశ్వాసము విశేషకృషి చేసి యిప్పటి ప్రకృతిశాస్త్రబోధలను జతపరచి కొన్ని గ్రంథములను వ్రాయుటకు కారణమైన దనియు విదితమగుచున్నది.

జర్మనీ, అమెరికా మొదలగుచోట్ల గొప్పగొప్ప ప్రకృతిశాస్త్రజ్ఞులు యోగాభ్యాసనిమగ్నులగుచున్నారు. మనలో ముఖ్యముగ నాంగ్లేయవిద్య నభ్యసించిన బ్రాహ్మణులెందరో సంధ్యావందనము మాని ప్రాణాయామమనగ నేమో యెఱుంగనిస్థితిలోనున్నారు. వీరికి పాశ్చాత్యానుకరణమువల్ల మన మతధర్మములందు ద్వేషపడినవారైనను వ్యసనమే ప్రధానముగానున్నది. అభ్యాస మనునది బాల్యమునుండి యలవాటు కావలెను గాని ఇప్పుడు తలచినంతలో సమకూరునదికాదు. చెట్టై వంగనిది మానై వంగునా! కొందరికి పాశ్చాత్యబోధలవల్లనేమి యితరకారణములవల్లనేమి, యోగాభ్యాసము మంచిదని తెలిసినను దాని ననుష్ఠించుట వీరికి తరముకాదు గదా. ఇప్పటివరకు నలవాటుపడిన కాఫీ, చుట్ట మొదలగు అభ్యాసములను మొదట విడిచిపెట్టుటకే వీరికి సాధ్యముకానప్పుడు మంచివగు నూతనాభ్యాసము లెట్లు చేకూరగలవు. దురభ్యాసములు సులభముగ పట్టుపడగలవు. మంచిఅభ్యాసములవలనకు పెక్కుసంవత్సరములు పట్టును. అందుచేతనే హైందవులలో ద్విజులగువారు పిల్లవానికి ఉపనయన సంస్కారమునుండి ప్రాణాయామవిధానమును బోధించుచున్నారు. మన ఋషుల కాయాభ్యాసమునందలి మహత్తు పూర్తిగా తెలిసియుండుటచేతను అట్టిది సంఘమునకమూల్యమని వారు నమ్ముటచేతను దాని నొకరహస్యవిద్యగా నేర్పరిచి గురుబోధకు ప్రాధాన్యమిచ్చియున్నారు. పితృవాక్యపరిపాలనము ముఖ్యమని నమ్మ ఆర్యసంతతిలో ప్రాణాయామమున కట్టిప్రాధాన్యము మహర్షి వాల్మీకి ఇచ్చెనో శ్రీమద్రామాయణమున "చరితంరఘునాథస్యశతకోటిప్రవిస్తరం..." అనుశ్లోకములోని శత=మూడు, కోటి=ఎనిమిది అనగా 3 × 8అగు 24 అనియు, రామాయణము 24,000 శ్లోకములుగలదని సాంఖ్యశాస్త్రమునుబట్టి నిర్ధారణచేయుచు ప్రాణాయామమునకు ప్రాధాన్యమగు గాయత్రీమంత్రములోని 24 అక్షరములను రామాయణమున ప్రతివేయి

శ్లోకములకు నొక్కొకటి ప్రథమాక్షరముగా నేర్పాటు గావించుటయు, రామాయణకథయందు రాముని పితృవాక్య పరిపాలనమునే ప్రధానాంశముగ జేయుటయు మొదలగు సంగతులవలన స్పష్టమగుచున్నది. ప్రాణాయామమువల్ల దీర్ఘజీవితము సాధ్యమగుచున్నది. ప్రాణవాయువగు ఆక్సిజను అట్టిశక్తికి కారణమైయున్నది.

ఆంగ్లేయవిద్య నభ్యసించువారికి ప్రాణవాయువుయొక్క ప్రాముఖ్యము తెలియుచున్నది. ఆక్సిజను లేనిచో ప్రాణమే యుండదు. కాని ఆక్సిజనువాయువే అగ్నిని గలిగించుచున్నది. ఆక్సిజను లేనిది దీపము వెలుగజాలదు. ప్రాణికోటి జీవింపజాలదు. ఈ ప్రాణవాయువును ఇతర వాయువులును కొన్ని పాళ్ల ప్రకారము మనము పీల్చెడి గాలిలో మిశ్రితమైయున్నవి. ప్రాణవాయువు హైడ్రొజను అను వాయువుతో గలిసిన నీరేర్పడుచున్నది. మనశరీరమునందలి మలినపదార్థములు సాధారణముగా కార్బను అను ఘనపదార్థముతోను, హైడ్రొజనుతోను గూడినవైయున్నవి. ప్రాణవాయువు కార్బనుపదార్థముతో గలిసిన బొగ్గుపులుసుగాలి యేర్పడును. ఈ గాలి విశేషమైనయెడల దీప మారిమాపోవును. కాబట్టి మనము పీల్చు ప్రాణవాయువువల్ల మనశరీరమునందలి కార్బనుపదార్థములు చెడుగాలిగా వెలుపలకు రాగలవని, హైడ్రొజను భాగము నీరుగామారి వెడలునని తెలిసికొనుచున్నాము. దేహమునందు పరిశుభ్రమైనరక్త మేర్పడుటకు జీర్ణపదార్థము పైన్యాకోశము దాటి ఊపిరితిత్తులకడ్డకు వచ్చి తనలోని మాలిన్యమును పోగొట్టుకొనుటకై ప్రాణవాయువుకొరకు నిరీక్షించుచుండునను సంగతి ఆహారనియమమును వర్ణించుటలో స్పష్టపరచబడియుండెను. తగినంత ప్రాణవాయువు చిక్కనపక్షమున మలినపదార్థములు దానిచే భస్మీపటలమై వెలుపలకు పంపబడుటయు, పరిశుభ్రరక్తము నాళముల వెంట ప్రసరించి నరములకును కండరములకును పుష్టిని గలిగించుచుండుటచేత మన ఆరోగ్య మేర్పడుచున్నది. ఊపిరితిత్తులు సరిగా పనిచేయనియెడలను, తగినంత ప్రాణవాయువు పీల్చకున్నను మనుజుని శరీరమున కల్మషపదార్థము నిలిచి రక్తముతో మిశ్రితమై దేహమున వ్యాపించి యనేకవిధములగు వ్యాధులకాకరమగును. పాశ్చాత్యశాస్త్రజ్ఞులు ప్రాణవాయువును సేకరించుపద్ధతిని కనుగొని దానివల్ల ననేకవ్యాధులను కుదుర్చుచున్నారు.

పాశ్చాత్యులు దుర్గంధభూయిష్ఠములగు ప్రదేశములందు తగినంత ప్రాణవాయువును యంత్రద్వారమున చేర్చి అట్టివి వాసయోగ్యములుగ జేయుచున్నారు. మిణుగురు పురుగుయొక్క శరీరములోని ఊపిరితిత్తులంతటను దట్టముగా వ్యాపించియుండుటచేత నదలి ప్రాణవాయువుయొక్క శక్తివల్ల ప్రకాశమానమగుచున్నదని శాస్త్రజ్ఞులు నిర్ధారణచేయుచున్నారు. దీర్ఘములగు ఉచ్ఛ్వాసనిశ్వాసములవల్ల తగినంత ప్రాణవాయువు దేహమునకు రాగలదనియు, దానికే డబ్బు పెట్టికొనవలసిన యెడల నెందరో కొనుటకు సిద్ధపడుదురనియు డాక్టరు బాబుకాకు అనువారు వ్రాయుచున్నారు. అమెరికాలో గొప్పశాస్త్రవేత్తయగు డాక్టరు జార్జి కారే యనువారు అనేక శాస్త్రములను పరిశోధించితిమనియు, రసాయన విద్యుచ్ఛాస్త్రముల వల్లనేమి, ఇతరములవల్లనేమి, ప్రాణమునకు, వాయువునకు భేదముకనుపించలేదని "వాయుః ప్రాణః" అను శ్రుతిని సమర్థించుచున్నారు. మంచుగడ్డకు నీటికి నెట్లు అభేదమో అట్లే వాయువునకు, ప్రాణములకు నభేదమును స్థిరపరచుచున్నారు. మానవశరీరములో $72\frac{1}{2}$ కోట్ల ఊపిరితిత్తులున్నవనియు, వానిని వరుసగ నేలమీదపరచిన 1400 చతురపుటడుగుల మేడలో నిముడునని శాస్త్రజ్ఞులు పరిశీలించియున్నారు. సాధారణముగా మనుజునకు ప్రతిదినము కావలసిన ప్రాణవాయువు 1600 గ్రైనులుండునని యంచనావేయబడినది. లండను ఆసుపత్రిలో శారీరశాస్త్రోపాధ్యాయులుగ నుండిన డాక్టరు లియొనార్డు యర్స్కినుహిల్ అనువారు ఒక సంచినుంచి ప్రాణవాయువును పీల్పించి పరుగెత్తుపందెములో అలసటజెందినవానిని మిగిలినవారికంటె ముందుగా పరుగెత్తునట్లు చేయగలిగెను. ప్రతిదినము మన ఊపిరితిత్తులనుంచి 9 అవున్సుల నీరును, 8 అవున్సుల బొగ్గుపదార్థమును వెలుపలకు పంపుచున్నామని శాస్త్రపరిశోధనలు దెలుపుచున్నవి. విలియమ్ ఆండర్సను, డాక్టరు బెనిడిక్టు, బాయిల్, మేహ్యు మొదలగు వారెందరో యోగాభ్యాసమును ప్రకృతిశాస్త్రపరిశోధనలకు లోబరిచి వ్రాసియున్నారు.

ప్రాణవాయువువల్ల అగ్ని ఏర్పడుననుటచే ప్రాణవాయువు అన్నిటిని మాడ్చివేయునని తెలియగలదు. తప్ అనగా కాల్చుట అనిఅర్థము. తపస్సు చేయువారు తను లోని మాలిన్యమును కాల్చివేయుచున్నారని స్పష్టమగు చున్నది. విశ్వామిత్రుడు రాజర్షియై యుండి తపస్సువల్ల బ్రహ్మర్షియైనటుల వినుచున్నాము. విశ్వామిత్రుడు గాయత్రీమనశ్చరణముచేసి తపస్సిద్ధిని పొందినందువ నిప్పటికి "గాయత్ర్యా గాయత్రీ ఛందో విశ్వామిత్రఋషిః" అనువాక్యమేర్పడినటులు చెప్పబడుచున్నది. హైందవులచే వాయుపుత్రులుగ పరిగణింపబడు భీమహనుమానులు మిక్కిలి బలపరాక్రమశాలులనుటవల్ల వారియొక్క యోగాభ్యాసమే యందులకు కారణమని వాయువును తమ గురువుగ నెంచిరని అనగా పిల్పుసమానునిగ జూచిరని సంస్కర్తలగువారు సహితమంగీకరింపవచ్చును. ఋషులు కేవలపారమార్థిక చింతతో భగవద్ధ్యానమునకు సాధనమనకయి అతిచంచలమగు కోతివంటి మనస్సును స్వాధీనపరచుకొనుటకు వాయువునకు తప్ప సాధ్యపడదని గ్రహించి అన్ని యింద్రియములను మనస్సువల్ల బంధింపవచ్చునని అందుకు ముందు మనస్సును స్వాధీనము చేసికొనుటకు ప్రాణాయామమే శరణ్యమని నిర్ధారణచేసినారు. 'ఇంద్రియాణాం మనోనాథః మనోనాథస్తు మారుతః' అని. యోగశ్చిత్తవృత్తినిరోధః అను పతంజలి సూత్రమును ప్రధానముగాజేసి హఠయోగ రాజయోగములను రెండుపద్ధతుల నవలంబించిరి. ఇక్కడను కఠినమార్గము సులభమార్గము లేర్పడుట మామూలుగా సృష్టిలో ప్రతివిద్యయునకు రెండుకలవు. లవపరమని నిర్ణయ మగుచున్నటులున్నది. హఠవాదులు వాయువునకు ప్రాధాన్యమిచ్చి రేచకపూరకకుంభకములను విధానములను శాస్త్రోక్తముగ నాచరించి సమాధిసిద్ధిని జెంది మనస్సును స్వాధీనపరచుకొనుచున్నారు. రాజయోగులన్ననో కష్టములకు బాల్పడక మనస్సునందే లక్ష్యముంచినయెడల యోగసిద్ధి తనంతట గలుగునని తలంచుచున్నారు. ఒకరు వాయువునకు ప్రాధాన్యమిచ్చుచున్నారు, ఒకరు మనస్సునకు ప్రాధాన్యమిచ్చుచున్నారు. పర్యవసానమున రెంటివల్లను యోగసిద్ధి, చిత్తనిరోధము రాగలవు. ఉచ్ఛ్వాసనిశ్వాసములను హంసలనుచున్నారు. సకారహకారముల ఉచ్చారణ మేర్పడు విధానమునుబట్టి వీనిని హంసలనుటకుకారణము. హంసలు దీర్ఘములగునెడల జీవితము దీర్ఘమగునని హంసల పరిమాణ మత్యల్పమగు వానికవసానము సామీప్యమందున్నదని తెలియవలెను.

ప్రాణవాయువు తగినంత దేహములోనున్నయెడల కల్మషపదార్థముల యునికికి తావులేదు. సాధారణముగ మన జనకగు గాయములు మొదలగువని మందులవల్ల నయమగుచున్నవని తలంచుట భ్రాంతి. గాయములమీద ఇతర మలినపదార్థస్పర్శ గలగకుండ మందులు కాపాడగలవేగాని గాయమునయమగుటకు ప్రాణవాయువేకావలెను. అట్టి ప్రాణవాయువు తగినంతగల యోగులకు గాయములన్న లక్ష్యములేదు వెంటనే వానియంతట నవి మానిపోవును. శరీరములో తగినంత ప్రాణవాయువులేని యతిమాత్రతో గిక గాయమేర్పడిన ప్రాణగండమే. వానికదెవరకే శరీరములో నేర్పడ్డ వ్యర్థపదార్థమును భస్మము చేయగలిగినంత ప్రాణవాయువు లేనికారణమున వానిశరీరము లోపలి వికారపదార్థము మూత్రముగుండా పోవలసి వచ్చుచున్నది. మనుజుని జీవితమునకు మెదడు, గుండె, ఊపిరితిత్తులు ముఖ్యాంగములవంటివి. ఇందులో ఏది నశించినను మిగిలినవి నశింపకతప్పదు. కాని ఈమూటిలో మెదడును గుండెను మాయిపమునిచ్చినటుల నస్థిలోనుంచ బడెను. కాని సృష్టికర్త 24 గంటలు తెరచియుంచు నాసికను ప్రాణవాయువును పిల్చునిమిత్తము ప్రసాదించియున్నాడు. కాబట్టి మనుజున కేర్పడురోగములను నశింపజేయగలశక్తి ముఖ్యముగ నూపిరితిత్తులకేగలదు. కొద్దిగా కల్మషపదార్థములు ఇతర అవయవములగుండా వెలుపలకు బోవుచున్నను నాసికకే ఇందునుగురించి ప్రధానమంత్రి హోదా గలదు. ద్రవపదార్థము మూత్రముగుండా 50 ఔన్సులును, చర్మముగుండా 18 ఔన్సులును, నాసికగుండా 9 ఔన్సులును ప్రతిదినము పోవును. కార్బను పదార్థము చాలవరకు నిశ్వాసములో వెలుపలకు బోవును.

హిందువులు మోక్షాపేక్షతో ప్రాణాయామము నపేక్షించుచున్నారు. యమనియమాసన ప్రాణాయామాదులను వరుసగ విధించుకొని క్రమాభ్యాసమువల్ల తమశరీరమునందలి మాలిన్యమును నిర్మూలముచేసి అందువల్ల మనస్సును ఆవరించిన మాలిన్యమును పోగొట్టుకొని అంతరచిదాకాశమున భగవంతునియొక్క ప్రతిబింబముగ ఆత్మను జూడగలమని తలంచుచు ధ్యానము, సమాధి నవలంబించుచున్నారు. యోగసిద్ధిపొందినవారికి అణిమాద్యష్టసిద్ధులు లభించునని హిందువులు తలంచుచున్నారు. అట్టివారికి ప్రాణాయామఫలితమున హెచ్చుశక్తిగలుగునని తలంపగలము. ప్రాణాయామవిధానమునకు ముందు పద్మాసనము మొదలగు ఆసనప్రకరణమును నేతి, ధౌతి, వస్తి మొదలగు కాయశౌచపద్ధతులను మనవారలవలంబించుచున్నారు. ఇవి అన్నియు శరీరపాటవమునకు, పారిశుద్ధ్యమునకు సహకారియగుచున్నవి. ఘేరండసంహితలో జలవస్తియని 84 విధానములలో నొకటిగలదు. అందు కటివరకు నీటియందుండి దేహమును పరిశుభ్రపరచు విధానముగలదు. జర్మనీశాస్త్రజ్ఞుడగు కూనీయొక్కపద్ధతి జలవస్తితో సంబంధించినది. ఇప్పుడెందరో ఈ పద్ధతి నవలంబించి శరీరారోగ్యమును పొందుచున్నారు. సరియైన ప్రాణాయామవిధానమున్నచో నిట్టి స్వల్పపద్ధతులనే నమ్ముకొనియుండవలెనా గదా.

పాటు అను చరిత్రకారుడు 1705 సంవత్సరములో లండను మెడికల్ జర్నల్‌లో అనేకదినముల పరీక్షమీద ఒకహిందూయోగి ఆహారపానీయములు లేకుండా చాలదినములు సమాధిలోనుండిన సంగతిని, 1835 సంవత్సరములో కలకత్తా మెడికల్ జర్నల్‌లో డాక్టర్ల సముఖమున కొన్నిదినము లావిధముగా నుండిన మరియొక యోగిని గురించి వ్రాసినదిన్ని, హోన్నిగ్‌బర్గరు విల్లియమ్సు మొదలగువారు వ్రాసినసంగతులు పాశ్చాత్యశాస్త్రజ్ఞు లంగీకరించి పరిశోధనలు జరిపియున్నారు. ఇటీవల 1923 లో సాహాయిగు అను ఫ్రెంచి పత్రికకు డాక్టరు ఆర్చుర్డు, డాక్టరు హెన్రీరైనికు సమాధిలోనున్న యోగిని పరీక్షించి సమాధిస్థితిలో బాధయనునది యుండదని నిర్ధారణచేసినటుల వ్రాసియున్నారు. కోడిరామమూర్తినాయుడుగారు మనకన్నులయెదుట గొలుసుతో కట్టబడి వాయువును పూరించి యెటులు గొలుసును సడలజేయుట, మోటారుల నాపుట మొదలగు పనులను సాధించుటయేగాక ప్రాణాయామమువల్ల తనుకట్టిపనిసాధ్యమైనదని బోధించుచుండుట లేదా. ఇంతమును ప్రాణాయామావశ్యకత కొందరైనను ఆంగ్లేయవిద్య నభ్యసించినవారిలో గుర్తించినను నూతనాభ్యాసము సాధ్యముకాక బాల్యమునుండి స్వమతమును నిర్లక్ష్యముచేసినఫలమును మనమిత్రులు పొందుచున్నారు. చెట్లు కొన్నివేలసంవత్సరములవరకు బ్రతుకుచున్నవి. వానికి కావలసిన జీవపదార్థమును నేలనుంచి, నీరునుంచి, గాలినుంచి యేర్పాటు చేసికొనుచున్నవి. మనమో మన జీవితములకయి కేవల మృతజీవపదార్థములగు శాకాహార మాంసాహారములపయి మాత్ర మాధారపడుచున్నాము. కాని స్వతంత్రముగ ప్రాథమికపదార్థముల నుండి జీవపదార్థమును సృజింపలేకున్నాము. బార్త్రిలాట్ యొక్క పరిశోధవల్ల యోగాభ్యాసమువల్ల నట్టిశక్తి మనకు నేర్పడుచున్నదని తెలిసినప్పుడును చారిత్రక దృష్టాంతము లందుకు సహకారిగానుండగా శాస్త్రముల గొడవ యెటులున్నను దీర్ఘజీవితమునకు సాధకమగు ప్రాణాయామమును గురించి తుదకు పాశ్చాత్యస్త్రీలబోధవల్లనైనను మేల్కాంచి తెలిసికొని యాచరణకు గడంగుట మనుష్యజన్మమెత్తిన ప్రతివ్యక్తికి నవసరమని విన్నవించుచున్నాను. లోనావాలా, బెంగళూరు మొదలగుచోట్ల ఇటీవల యోగాశ్రమము లేర్పడి పనిచేయుచున్నవి.

మనుజునకు శరీరమునందేభాగమునకైన వాపో మరియొక జబ్బో యేర్పడిన అప్పుడు అమృతాంజనము మొదలగునవి రుద్దుటచేత రోగికి కొంత హాయిగలుగుట గాంచుచున్నాముగదా. దీనికి కారణము ప్రాణవాయువే యని తెలిసికొనవలసి యున్నది. రక్తములో జీవాంకురములు కొన్ని తెల్లనివి యెర్రనవి మనపోలీసువారివలె శరీరమును కాపాడుచుండును. శరీరమున నొకభాగమున విషసంబంధమగు వస్తువుయొక్క స్పర్శ తగిలినప్పుడు చోరునుపట్టినటుల ఇతరభాగములందలి జీవాంకురములు సహితము నచ్చటికి కరుగిడి యచ్చట నదివరకు రోగిని బాధించుచున్న చెడుకండరములో కొంతభాగ

మును నోటనిడుకొని రక్తప్రవాహమునబడి క్రమముగ నూపిరితిత్తులవద్దకు వచ్చి యచ్చట అంకురబాహుళ్యమును బట్టి మామూలుకన్న హెచ్చుప్రాణవాయువును తీసికొనుటయు, చెడుకండగములోని చాల భాగమును దేహమునుంచి వెలుపలకు పంపుటయు తటస్థించినందున జబ్బు ప్రదేశమునకొంత తేపి గలిగి మంచికండర మేర్పడి బాధకు కొంత ఉపశమనము గలుగుచున్నది. దక్షిణపుగాలియగు పైరగాలియందు ప్రాణవాయువు విశేషముగనుండుటచే ఆగాలిసోకిన శరీరమున కారోగ్యము, సౌఖ్యము హెచ్చుటకు కారణమగుచున్నది. తగినంత ప్రాణవాయువును దేహమున ధారణచేయువారికి రోగమే దూరము కాగలదు. జీవితపరిమాణము హెచ్చును. కాని కత్తితోసామన్నటులు లోతునీటి యీతతో పోల్చదగినది హఠయోగమని పాఠకులు తెలిసికొనవలెను. కేవలము పుక్కిటి గాథలను బట్టి పుస్తకపరిచయమువల్ల సాధింపదగినదిగాదు. అందుకే మనఋషులు గురువుయొక్క యావశ్యకత నేర్పరిచిరి. ఏగురువైన అర్హుడైన శిష్యునకే యుపదేశముచేయగలడు. గురువునకుపంగనాములు బెట్టుశిష్యులు హెచ్చుగానున్న యీకాలమున సరియైన గురువులుగాని, సరియైన శిష్యులుగాని సకృత్తుగా లభించుచున్నారు. ఇంతగా వ్రాయుటలో ప్రాణాయామము మంచిదని, అవసరమని నమ్మి త్వరపడి ఊపిరిబిగసట్టువారికి ఊపిరితిత్తులుచెడి ప్రాణాపాయముగలుగుట నిశ్చయమని తెలియజేయుటకే. కాబట్టి ప్రాణాయామమును గురించి తెలిసికొని మన ప్రాచీన సంప్రదాయము లందు, సదాచారము లందు లక్ష్యముగలిగి వానిని క్రమముగా ననుష్ఠించుటకు ప్రయత్నించెదరని నమ్ముచున్నాను. ఇదివరకు వ్రాసిన ప్రకారము ముందుగా త్రాగుడునుగురించి వ్రాయుట మాని గాలిమాటలలోనికి దింపి కాలక్షేపము చేసినందులకు చదువరులను మన్నింపగోరుచున్నాను. త్రాగుడును గూర్చి వ్రాయుట వదలదలపలేదు. మరియొకసారి వ్రాసెదను.

---

## పర్యటనము

దివాకర్ల వేంకటావధాని గారు

అనుపై సర్వదిశాళిఁ గ్రమ్మిన తమిస్రాంతంబు గల్పింపఁ దూ
ర్వున జన్మించి క్రమమ్ముగా ననుపదమ్మున్ గాంతిచే మించుచున్
జని మిన్నంటిన సర్వపూజ్యమగు తేజఃపుంజ మెంతేనియున్
జను లల్లాడఁగఁ గ్రుంకెఁ బశ్చిమజిగీషాయాత్రపా లౌటచే.

అన్యతేజోవిలాసమే యండ యగుట-సర్వకర్మ స్వతంత్రత సమసి పోయెఁ
గన్నులందున మైకమ్ము గ్రమ్ముకొనఁగఁ-గ్రమముగా గాఢనిద్రాంధకార మలమె.

నాహృదయంబు దుఃఖ కదనంబున మున్గుట శాంతి వైభవ
శ్రీ హరియింపఁగాఁ బడెఁ గృశించిన తొల్లిటి చిత్తవృత్తికే
దోహద మాచరించునది తోఁచక పర్యటనం బొనర్పఁగా
గేహము వీడి వచ్చి తిలకించితి సర్వదిగంతరాళముల్.

తనతోడు నిల్వఁజాలని మిత్రు లెదురైనఁ బలుకరింపకయె యూవలకు నెట్టి
తనమార్గమున కడ్డుదగిలినవారల కరచరణాదులఁ గలియఁ గట్టి

తన యకృత్యములు మేల్కని కాంచి వెదరించు జనుల శీర్షములపైఁ జావ మోఁది
యొఱ లెఱుంగని నిద్ర కనఁగియుండినవారి ధనధాన్యరాసుల దరలఁజేయఁ
దగిన యదన వచ్చెనని యుబ్బి తస్కరుండు-నిర్నిరోధ ప్రచారంబు నెగడఁజేసి
యాత్మభాగ్యవిధాయక మౌచు నలరు-నా నిశారాజ్యదేవత కంజలి యిడె.

చల్ల నౌ గాలి తాను నిశాచరుండు-గాన వారింపఁగా లేఁడు కలుషమతుల
నదియునుం గాక యొక్క చాటైనచోట-నుండె దూరమ్మునందు నయ్యుత్తముండు

ముమ్మర మయ్యెఁ జీఁకటి, ప్రమోదముతోఁ దిరుగాడుచుండె ఘూ
కమ్ములు నచ్చటచ్చట వికాసము దాలిచి చెంగఁగాంతి లే
శమ్మును జిమ్మ రిక్కలు వెసన్ గను మూసెను ; నల్లమబ్బులుం
గ్రమ్మిన వానసమ్ముఁ దమిరమ్మనకున్ గయిసేఁత సల్పుచున్.

కాలము సర్వవేళల నొకానొకరీతి నెసంగఁబోదు, త
న్మూలమునన్ సమస్తమును బుట్టుకఁ గాంచు, రహించు, గ్రుంగు, ది
వ్యాలయగామియైన పరమాత్ముఁడు దద్వశుఁడై మెలంగు నీ
కాలమె కల్మిలేములకుఁ గారణ మంచుఁ దలంచుచుండఁగన్.

మనమునందలి యూహల కనుగుణముగ
నెల్లదిక్కులు మార్మ్రోయ నెలుఁగు తోడ
నెంతకాల మీ నిద్దుర యింకనైన
మేల్కనుండని తొలికోడి మేలుకొలిపె.

తూరుపుదిక్కు మోముపయి దోఁచెఁ గ్రమమ్ముగ రక్తకాంతి వే
వే రజనీవిలాసవతి విన్నఁదనంబును దాల్చి వెల్వెలం
బాఱుచు దూరదూరమునకుఁ బర్విడసాగె నిరంకుశంబుగా
నేరిని జీకికింగొనని యేల్బడి మాసెనటన్న చింతతో.

తరుణులు పూరుషుల్ గలిసి తాలిమితో నుదయించుచున్న భా
స్కరునకు లోకమాన్యునకు సాధు మనోహర మూర్తికిన్ యశో
భరితునకున్ మహాత్మునకు వందనము ల్పచరించుచుండ న
త్వరముగ నర్ఘ్యము న్వదలి వచ్చితి హెచ్చిన సంతసంబుతో.

---

# విష్ణుకుండి మూడవమాధవవర్మ ఆంధ్రసాహిత్యపరిషచ్ఛాసనము

కీ. శే. కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు

(భారతి ౭-వ సంపుటము, ౯-వ సంఖ్య తరువాయి)

## విష్ణుకుండి వంశానుక్రమ, కాలనిర్ణయములు

విష్ణుకుండి మూడవ మాధవవర్మకాలమును ప్రాతిపదికగా గైకొని ఆవంశము నందలి అంతకు పూర్వపురాజుల కాలమును కొంచెమించుమించుగ నిర్ణయింపవచ్చును. పుదుచ్చేరి నివాసియగు డాక్టరు డుబ్రాయ్ దొర తన 'దక్కనుదేశ ప్రాచీనచరిత్రము'న ఈయన్వయమునకు చెందిన వారివంశావతరణికను అమర్చియున్నాడు.[37] ఆవంశవృక్షమును వేయునప్పటికి ఈవంశములోని రాజులిచ్చిన తామ్రశాసనములు మూడుమాత్రమే కలవు. అయినను ఉన్నంతవఱకు అది సరియైనదిగనే గ్రహింపవచ్చును. అటుతరువాత విష్ణుకుండిభూపతుల తామ్రశాసనములు రెండు మాత్రమే దొరకినవి[38]: ఒకటి రెండవ మాధవవర్మ యిచ్చినది[39]; రెండవది కడపటి మాధవవర్మ యొసంగినది[40]. ఈశాసనముల వలన దెలియవచ్చిన నూతన విశేషములను బట్టి డాక్టరు డుబ్రాయ్‌దొర ఇచ్చిన వంశావళికకు రెండు తరములు మొదటను, రెండు తరములు కడపటను కలుపుచున్నాను. ఫలితమిది:

---

37. పుట ౯౦.

38. ౧౯౨౦-వ శాసననివేదిక, పుట ౯౭, పేరా ౭.

39. రెండవమాధవవర్మ ఈపూరుశాసనము; నెం 12 రు 1919-20; Ep. Ind. vol. XVII. p 334.

40. మూడవమాధవవర్మ ఈపూరుశాసనము, నెం. 11 రు 1919-20. గవర్నమెంటు శాసనశాఖవారు ౧౯౨౧వ సంవత్సరమున ఈపూరులో కనిపెట్టిన రెండుశాసనములలో (నెం 11,12 రు—1919-1920) ౧౧-వ నెంబరు శాసనము స్పష్టముగ మూడవమాధవవర్మకాలమున కొకశతాబ్ది పూర్వపుది. కాని ౧౨ వ నెంబరుశాసనము నిస్సందేహముగ మనశాసనము కాలపుదే ౧౨వ నెంబరు శాసనము నొసంగిన మాధవవర్మ కుబ్జవిష్ణువర్ధనుని కాలమునకు పూర్వపువాడు కాడనుటకు ఆసంవత్సరపు(౧౯౨౧)నివేదికలోనే చాల గట్టిప్రమాణము కలదు. ఆ సంవత్సరపు ౯ వ నెంబరుశాసనము కుబ్జవిష్ణువర్ధనుని మునిమనుమడైన మంగియువరాజు పెరిగిపెద్దవాడగనుండ నొసంగబడినది. ఈశాసనమువలన వత్సగోత్రుడును, అగ్నిశర్మమునిమనుమడును అయిన మందశర్మకొక గ్రామము దానముచేయబడినట్లు తెలియుచున్నది. ఇక నిప్పుడు మాధవవర్మ ౧౧-వ నెంబరు శాసనముమాత్రము. ఇందలి ప్రతిగ్రహీత వత్సగోత్రుడైన అగ్నిశర్మయే; ప్రాయికముగ ఇతడు మందశర్మతాతయై యుండవచ్చును. ఈమందశర్మ మంగియువరాజు భిక్షుడట. ప్రతిగ్రహీతయైన మనుమడు (మందశర్మ) దాతయైన మునిమనుమని (మంగియువరాజు)కాలమున నుండినచో ప్రతిగ్రహీతయైన తాత (అగ్నిశర్మ) రెండవదాతయొక్క ముత్తాత (కుబ్జవిష్ణువర్ధనుని)కంటెను పూర్వుడగుట అసాధ్యము. అందువలన ౧౯౧౯-౧౯౨౦వ సంవత్సరపు దాత మాధవవర్మ మనశాసనపు మాధవవర్మయేయనుట స్పష్టము. ఇదిగాక, రెండు శాసనములలోగూడ మాధవవర్మ తండ్రి గోవిందవర్మయే. రెండుశాసనములలోను త్రివరనగరభవనగత యువతీజనమనుగుతించిన సూచన కలదు. ఇరువురు రాజులును హిరణ్యగర్భ(బంగరు ఆవుయొక్క)ప్రసూతులనియే చెప్పబడినది. ఇరువురును సహస్రయాగములను, ఏకాదశాశ్వమేధములను జేసినవారే. ఈ కారణములవలన ఈ రెండుశాసనములలోను వర్ణితులైన రాజులొక్కరే యనుట నిస్సంశయము.

## విష్ణుకుండి వంశావతారక్రమము




మూడవ మాధవవర్మ పరిపాలనము ప్రారంభసంవత్సరము ౫౪౬ గ గ్రహించి, నగటున తరమునకు ఇరువదియైదు సంవత్సరములచొప్పున లెక్కవేసి ఈపై వంశవృక్షము నందలి రాజుల కాలమును కొంచె మించుమించుగ స్థిరపఱుపవచ్చును. నే నీవిధమున ఆయారాజుల పరిపాలనకాలములను కొంచె మెచ్చుతక్కువగ లెక్కవేసియున్నాను. రామతీర్థము శాసనము ననుసరించి ఇంద్రభట్టారకవర్మ అధమము ఇరువదియేడు సంవత్సరములు పాలించినట్లు మనకు తెలియును కావున అతని పరిపాలనకాలపరిమితి ౨౫ సంవత్సరములకు బదులు ౨౭ సంవత్సరములుగ లెక్కవేయవలసియుండును. ౧౯౧౯-౨౦ వ సంవత్సర శాసననివేదికలోని ౧౨-వ సంఖ్య శాసనము ప్రకారము అది ముప్పదియేడవ విజయరాజ్య సంవత్సరమున నొసంగబడినట్లు తెలియుచుండుటవలన రెండవ మాధవవర్మ కన్ని యేండ్లు వేయవలసియుండును. ఈవంశములోని రాజులు చాలకాలము పాలించుచువచ్చినట్లు కనబడును. అందువలన నగటున తరమునకు ఇరువదియైదేండ్లచొప్పున వేసిన లెక్క అతిశయోక్తము కాదు.

ఈవంశపు మూలపురుషుఁడు

ఈవంశమునందలి రాజులకు మూలపురుషుడుగ గ్రహింపదగిన మొదటి మాధవవర్మ మనలెక్క ప్రకారము ౩౪౭ నుండి ౩౭౫ వఱకు పాలించియుండవలెను. సముద్రగుప్తుని (౩౩౬ - ౩౭౫) యొక్కయు, అతనికొమారుడు రెండవ చంద్రగుప్తుని (౩౭౫-౪౧౩) యొక్కయు కాలముకూడ ఇదియే[41]. వాకాటకులలో[42] రెండవ రుద్రసేనుడును, రెండవ ప్రవరసేనుడును మొదటి మాధవవర్మకు సమకాలికులు. ఈ వాకాటకరాజులు అటు సామ్రాజ్యస్థాపకులైన గుప్తులతోను, ఇటు విష్ణుకుండి ప్రభువులతోను వివాహసంబంధమును గలిగియుండి రనువిషయమును మనము జ్ఞాపకముంచకోవలయును. రెండవ చంద్రగుప్తుని కూతురైన గుప్తప్రభావతి వాకాటకవంశజుడైన రెండవ రుద్రసేనునిభార్య[43]; రెండవ ప్రవరసేనునితల్లి. ఉక్కుల్లి శాసనమున రెండవ మాధవవర్మకొడుకైన మొదటి విక్రమేంద్రవర్మ 'విష్ణుకుండి, వాకాటవంశద్వయాలంకృతజన్మ' డని వర్ణింపబడి యుండుటంబట్టి మొదటి మాధవవర్మమనుమడైన రెండవమాధవవర్మభార్య వాకాటక రాజకుమారియని స్పష్టమగుచున్నది. ఒకవేళ అంత సన్నిహితము కాకపోయినప్పటికి మొదటి మాధవవర్మకును, అతనితనయుడు దేవవర్మకును కూడ వాకాటకులతో సంబంధ ముండినదన్న అది అసంభావితము కాదు. ఎట్లయినను, గుప్త వాకాటకులతోడి సంబంధముమూలమున నే విష్ణుకుండిప్రభువులు పైకివచ్చిరనుట స్పష్టము. మొదటి మాధవవర్మ తొలుత గుప్తుల యొద్దనో, వాకాటకులయొద్దనో సేనాధిపతిగ నుండి తన పరాక్రమముమూలమున ప్రముఖుడయ్యెనని నానమ్మకము. అతడు దక్షిణ హిందూదేశ జైత్రయాత్రలో సముద్రగుప్తుని అనుసరించిన సేనాధిపతులలో నొక్కడో, లేక అతనితో చేరిన దక్షిణ హిందూదేశ సాహసికుడై యతని కళింగరాజ్య ప్రతినిధిగ వెనుక నిలిచిపోయినవాడో యైనను ఆశ్చర్యములేదు. అప్పటి కతడు చాల చిన్నవాడుగనుండి యుండవలెను; పాతిక సంవత్సరములకంటె ఎక్కువ ఉండియుండవు. మొదటి రెండుతరములవఱకు ప్రాయికముగ నీవంశమునందలి నరపతులు సామ్రాజ్యబిరుదములను ధరించి యుండరు. కళింగరాజ్యముపై గుప్తులకు అధికారముపోయిన తరువాతను, రెండవ ప్రవరసేనుని పరిపాలనానంతరము ౪౨౦-వ సంవత్సరమునుండి వాకాటకవంశము క్రమముగ

41. ఎలన్ లు స్మిత్తుగారి 'ఎర్లీ హిస్టరీ' నుండి గుప్త రాజ్యకాలములను గ్రహించితిని.

42. స్మిత్తుగారు ౧౯౧౪-వ సంవత్సరపు ఆర్. ఏ. యస్. పత్రికలో (J. R. A. S., p. 328) ప్రకటించిన వ్యాసమునుండి వాకాటక రాజ్యకాలములను గ్రహించితిని.

43. ప్రొఫెసర్ పాఠక్ గారి శాసనము, Ind. Ant. Vol. XLI, p. 268. ఇటీవల నిది సంపాదకీయ విమర్శతో ప్రకటింపబడినది; Ep. Ind. Vol. XV, p. 39.

క్షీణించుచువచ్చిన పిదపను రెండవ మాధవవర్మయే మొదట స్వాతంత్ర్యమును ప్రకటించి యుండునని నాయుద్దేశము. వాకాటకవంశము ఆరవశతాబ్ది ఆరంభమువఱకు పరిపాలనము సాగించుచునే యుండినను వారు విష్ణుకుండి భూపతులకు శత్రువులుగనే కాని మిత్రులుగ నుండినట్లు కనబడదు. రెండవ మాధవవర్మ తాను త్రికూటమలయాధిపతినని చెప్పకొని యున్నాడు[44]. వాకాటక హరిసేన నృపాలుడు కళింగమును, త్రికూటమును, ఆంధ్రమును జయించినట్లు తెలుపుకొనియున్నాడు.[45]

రెండవ మాధవవర్మ స్వాతంత్ర్యమును ప్రకటించినకాలము వాకాటక చారిత్రమున ప్రాముఖ్యముగలది. పారక్ గారి శాసనము[46] ననుసరించి రాజ్యముచేయుటకు తగిన వయస్సురాని తన మనుమనికి ప్రతినిధిగా రెండవ చంద్రగుప్తుని కూతురైన గుప్తపద్మావతి అప్పుడు వాకాటక రాజ్యమును పాలించుచుండెను. వాకాటక రాజకీయవ్యవహారములను చక్కబెట్టుచుండినది స్త్రీయగుటంజేసి ఒకవేళ రెండవ మాధవవర్మ స్వాతంత్ర్యమును ప్రకటించి సమ్రాట్టుమాత్రమే పొందనధికారము గలబిరుదములను వహించి యుండును; లేదా పద్మావతికి సన్నిహిత బంధువు, అనగా ముందు తెలుపబోవురీతిని ప్రాయికముగ ఆమెకూతురి భర్తయై యుండుటచేత ఆమె తనపట్ల చూపుచుండిన మంచితనమును, దయను లాభకరముగ దీసికొని స్వతంత్రుడై యుండును.

ఈ వంశమువారి బిరుదములు:

సామ్రాజ్యాధికార సూచకములైన విష్ణుకుండిప్రభుబిరుదముల నిక పరీక్షింతము. విష్ణుకుండి ప్రభువులలో గొందఱు తాము సహస్రయజ్ఞములను జేసినవారమని, ఏకాదశాశ్వమేధములను జేసిన వారమని చెప్పుకొని యున్నారు; కాని ఒక్క మాధవవర్మ నామాంకితులే యిట్టి యసామాన్య గౌరవాంచితులుగ దెలుపబడుట విచిత్రము! రెండవ మాధవవర్మ ఈ పూరుశాసనమే[47] విష్ణుకుండి వంశజుల మొట్టమొదటి శాసనము. అందు రెండవమాధవవర్మ తాతగారైన మొదటి మాధవవర్మ అగ్నిష్టోమ సహస్రయాజియనియు, ఏకాదశాశ్వమేధావభృథావధూత జగత్కల్మషుడనియు వర్ణితుడయ్యెను. కాలక్రమము ననుసరించి ఈపూరుశాసనము తరువాత వచ్చునది రామతీర్థము శాసనము[48]. ఈపూరుశాసనమున మొదటి మాధవవర్మ కున్నట్టి బిరుదములే ఇందు రెండవ మాధవవర్మకును గలవు.

44. C. P. No. 12 of 1919-1920: Ep. Rep. 1920, p. 97.

45. హరిసేనుని అజంతా శాసనములు; Archaeological Survey of Western India, Vol. IV pp 53, 124, 129.

46. వాకాటక రాణి ప్రభావతీ గుప్త పూనాశాసనము; Ep. Ind. Vol. XV, p. 39.

47. C. P. No. 12 of 1919—1920.

48. Ep. Ind. Vol. XII, p. 133.

అటుతరువాత చిక్కుళ్ల శాసనమున[49] ఏకాదశాశ్వమేధావభృథావధౌతజగత్కల్మషుడనియు, క్రమసహస్రయాజియనియు, సర్వమేధావాప్త సర్వభూత స్వారాజ్యుడనియు, బహుసువర్ణ, పౌండరీక, పురుషమేధ, వాజపేయ, యూగ్య (? ఉక్థ్య), షోడశి, రాజసూయ, ప్రాధిరాజ్య, ప్రాజాపత్యాద్యనేక వివిధపృథుగురువరశతసహస్రయాజియనియు కీర్తింపబడియున్నాడు. మాధవమాధవవర్మ రెండుశాసనములును[50] వేయియజ్ఞములను, పదునొకండశ్వమేధయాగములను జేసినకీర్తి యతనికే యొసంగుచున్నవి. ఈవంశమున మాధవవర్మ నామాంకితులుకాని యితర భూపతు లెవ్వరు నిట్టిక్రతువులను జేసినట్లు కీర్తింపబడలేదు. అశ్వమేధయాగాదులను జేసిన కీర్తి గౌరవములు ప్రత్యేకమొక్క మాధవవర్మలకు ఎందువలన నీవంశమున సంప్రదాయముగ వచ్చినవో తెలియరాదు.

ఈ బిరుదములకు మూలము

ఇన్ని యజ్ఞయాగాదులు నిజముగా జరిగినవా లేదా యన్న విషయమునుగూర్చి యోజించుచో కేవలము వానిసంఖ్యయే యివి నిజముగ జరుపబడియుండవను ననుమానమునకు కారణమగుచున్నది. ఈ స్తోత్రకథలకును, ఆడంబర బిరుదములకునుగల ఆధారములకొరకు గుప్త, వాకాటక శాసనములను, అందు ముఖ్యముగ కడపటివారి శాసనములను మనము పరిశీలింపవలసియుండును.

కలియుగమున చాలకాలమునుండి ఆచరణమునలేని[51] అశ్వమేధయాగమును మరల ఉద్ధరించినవాడు సముద్రగుప్తుడు. అతని మనుమడు కుమారగుప్తుడు కూడ తాను అశ్వమేధయాగమును జేసినట్లు తెలుపుకొనియున్నాడు. ఈప్రభువులు గొప్పపరాక్రమవంతులైనప్పటికి తాము ఒక్కయశ్వమేధయాగముకంటె ఎక్కువ చేసినట్లు చెప్పుకొనియుండలేదు. కాని వాకాటకులలో ఈ డంబములు హెచ్చుగ గాన్పించును. రెండవ ప్రవరసేనమహారాజు చమ్మక్ తామ్రశాసనమున[52] మొదటి ప్రవరసేనుడు అగ్నిష్టోమ, ఆప్తోర్యామ, ఉక్థ్య, షోడశి, అతిరాత్ర, వాజపేయ, బృహస్పతిసవ, సాద్యస్కరయజ్ఞములను, నాలుగు అశ్వమేధయాగములను జేసినట్లును (అగ్నిష్టోమాప్తోర్యామోక్థ్య షోడస్యాతిరాత్ర వాజపేయ బృహస్పతిసవసాద్యస్కర చతురశ్వమేధయాజినః), అతని కుమారుడు మొదటి రుద్రసేనుడు దశాశ్వమేధావభృథ స్నానములను జేసినట్లును తెలుపబడెను. వాకాటకులకు బంధువులును, వారికి ప్రతిస్పర్ధులునైన మన విష్ణుకుండిభూపతులుకూడ ఈప్రగల్భోక్తుల విషయమున వారినే అనుకరించియుందురు. వాకాటక రుద్రసేనుడు పది అశ్వ

49. Ep. Ind. Vol. IV, p. 193.
50. ఈప్రస్తుతపు ఆంధ్రసాహిత్య పరిషచ్ఛాసనము: C. P. No. 11 of 1919—1920.
51. Fleet's Gupta Inscriptions, No. 10, p. 44; No. 12, p. 51 etc.
52. Ibid, No. 55, p. 235.

మేధయాగములను జేసిన, విష్ణుకుండి మొదటి మాధవవర్మ పదునొకండశ్వమేధయాగములను జేసెను. విష్ణుకుండి ప్రభువుల యశ్వమేధయాగములకును, వారి దాంభికబిరుదములకును మూలము నాకిదే యని తోచుచున్నది. పరస్పరము బంధువులైనప్పటికిగూడ ఈరెండు వంశములవారు నిజముగా ప్రతిస్పర్ధులని దీని వలనగూడ దెలియుచున్నది. వాకాటకులు కాని, విష్ణుకుండిప్రభువులు కాని వారిశాసనములలో వారికి చెప్పబడిన రాజకీయబిరుదములలో దేనికిగాని అర్హతగలిగినయంతటి పరాక్రమవంతులైన భూపతులు కారని నాయభిప్రాయము. ఈయుభయవంశములవారిలో వాకాటకులు ఎక్కువ పరాక్రమవంతులనుట నిశ్చయమే కాని వారికిని సామ్రాజ్యమని చెప్పదగిన ప్రశాంత విశాలరాజ్య మెప్పుడును లేదు [53].

వారి యిష్టదైవము

తమ శాసనము లన్నిటిలో విష్ణుకుండి నృపతులు తాము శ్రీపర్వతస్వామిపాదానుధ్యాతులమని చెప్పకొనియున్నారు. శ్రీపర్వతము మల్లికార్జును డనుపేరబరగు శివుని సుప్రసిద్ధాలయముగల శ్రీశైలమే. ఈ యాలయము (చిన్న రాజధానియందలి) కర్నూలు మండలమునంగల నల్లమలకొండల ఉత్తర తీర భూమిమీద నున్నది. ఇంతవఱకు మన మెప్పుడును విష్ణుకుండి ప్రభువులను మధ్యపరగణాలలోని వాకాటకులతో ముడిపెట్టుచున్నాము. అట్లయినచో 'దక్షిణాది'కి సంబంధించని యీరాజులకు శ్రీపర్వతస్వామి యిష్టదైవ మెట్లయ్యెను? ఈప్రశ్నమునకు ప్రత్యుత్తరము ద్వివిధము.

వాకాటకులది అసలు దక్షిణహిందూదేశవంశము. వాకాటక గృహపతియు, గృహపత్నియు(వాకాటకగహపతి, గహపతిని), చేసిన దానములను దెలుపు ప్రాకృతశాసన మొకటి అమరావతిలో గలదు [54]. కావున దీని ననుసరించి క్రీస్తుశకము ప్రథమ, ద్వితీయశతాబ్దులలో తెలుగుదేశమున వాకాటకవంశ మొకటి యుండెననియైన జెప్పవలెను, లేదా వారిలో తెలుగు దేశమునకు వచ్చుచు పోవుచుండు వాడుకయైన నుండె ననవలెను. కావున వాకాటకులతో సంబంధముగల విష్ణుకుండి వంశజులుకూడ దక్షిణహిందూదేశీయులే యని చెప్పదగును.

ఒకవేళ విష్ణుకుండి వంశజులు కేవల మాంధ్రరాజులేయని యనుకొన్నను వారు తెలుగుదేశమున రాజ్యము సంపాదించినపిదప శ్రీ పర్వతస్వామిని తమ యిష్టదైవముగ బెట్టుకొనియుండవలెను. వారి శాసనముల ననుసరించి వేంగిదేశము చాలకాలము క్రిందటనే

---

58. డాక్టరు దుబ్రాయ్‌గారన్నవాకిధికగౌరవ మున్నప్పటికి వాకాటకులను గూర్చిన వారి యభిప్రాయముతో నే నేకీభవింపజాలను. వారి యభిప్రాయములకు చూడుడు: వారి 'Ancient History of the Daccan', p. 71.

54. See 'Some Unpublished Amaravati inscriptions', Ep. Ind. Vol. XV. p. 267,

వారి యధీనత నుండినట్లు తెలియుచున్నది. చిక్కుళ్ల శాసనము (కృష్ణాజిల్లా) ఏలూరి యొద్దనున్న తె(ప్పె)న్దులూరు (దెందులూరు) నుండి యొసంగబడినది. రెండవ మాధవవర్మ ఈపూరుశాసనము గుంటూరుజిల్లాలో దొరకినది: అది అమరపురమునుండి యొసంగబడినది. బౌద్ధస్తూపముగల సుప్రసిద్ధమైన గుంటూరుజిల్లా అమరావతియే ఈ యమరపురమై యుండవచ్చును. శ్రీపర్వతమున కనతి దూరమున నున్న వేంగి న్నాక్రమించుకొనిన మొట్టమొదటి విష్ణుకుండిప్రభువు రెండవ మాధవవర్మయే యనియు [55], తన వంశమున శ్రీ పర్వతస్వామి నిలువేల్పుగ మొట్టమొదట నెలకొల్పినదియు అతడేయనియు నాయభిప్రాయము. ఈ నాసిద్ధాంతమును అతని ఈపూరుశాసనమే బలపఱచుచున్నది. ఈ వంశమువారి యితర శాసనము లన్నిటిలో మొట్టమొదట దెలుపబడురాజు శ్రీపర్వతస్వామిపాదానుధ్యాతు డని పేర్కొనబడియుండ ఈవిశేషణము ఈపూరుశాసనమున అందలి మొట్టమొదటిరాజగు మొదటిమాధవవర్మకుగాని రెండవరాజగు దేవవర్మకుగాని కాక మూడవరాజును, దాతయునైన రెండవ మాధవవర్మకు మాత్రమే కలదు. ఈకారణమున ఏకదశాశ్వమేధసంస్థాపకుడైన మొదటి మాధవవర్మ కాలమునగాని, అతనికుమారుడైన దేవవర్మకాలమునగాని ఈవంశము వారికి శ్రీపర్వతస్వామి యిలువేల్పు కాడని తేలుచున్నది. క్రీ శ. ౪౦౦ ల ప్రాంతమున వాకాటకరాజకుమారిభర్తయైన రెండవ మాధవవర్మయే యీవంశమున శ్రీపర్వతస్వామ్యారాధనము ప్రవేశపెట్టియుండును.

గాథ

పరంపరగ శతాబ్దములనుండి వచ్చుచున్న శ్రీపర్వతస్వామినిగుఱించిన యొకగాథకు ఈవిష్ణుకుండివంశజులకు ముడిపెట్టవచ్చునేమో చూతము [56]. గుప్తవంశజుడైన చంద్రగుప్తుని కూతురు చంద్రావతియను రాజకుమారి శ్రీపర్వతస్వామిని గామించి ప్రతిదినము నొక్క మల్లికాదామమును సమర్పించుచుండ నాస్వామినే పెండ్లియాడినట్లు స్థలమాహాత్మ్యమున పరంపరగ వచ్చు గాథ యొకటికలదని శాసనశాఖానివేదికలో దెలుపబడినది [57]. ఈస్థలమాహాత్మ్యముల కాలము మనకు సరిగా తెలియదు: వీనిలో కొన్ని ఒక తరముక్రిందట మాత్రమే పుట్టినవి. ఇట్టి సందర్భములలో పదుమూడవశతాబ్దినాటి యొక

55. శ్రీశైలము గుంటూరుజిల్లా సరిహద్దులకు ౫౦ మైళ్లకంటె ఎక్కుడు దూరమున లేదు: గుంటూరుజిల్లాను విష్ణుకుండు లాక్రమించినట్లు మనకు దెలియును. వినుకొండ గుంటూరుజిల్లా, వినుకొండ తాలూకాకు ముఖ్యస్థానము: రైలుస్టేషను. నేటికిని మహాశివరాత్రికి శ్రీశైలమునకరుగు యాత్రికుల కది మజిలీలలో నొకటి.

56. ఈసంబంధమును డాక్టరు డుబ్రాయ్ దొరగారే తమ 'Ancient History of the Daccan' (p. 73) లో మొదట సూచించిరి. చతురముగను, విచిత్రముగను జేసిన యీ సూచనకు వారు ప్రశంసనీయులు.

57. For 1914-15, p. 91.

తెలుగు కావ్యమున[58] ఈగాథకు ఆకరము దొరకుట నాకు సంతోషము కలిగించినది. ఆకావ్యమునందలి కథ యిది:

చంద్రవంశ్యుఁడైన చంద్రగుప్తజనపతి తనయ చంద్రావతియను కన్య తనతోడ సతులును దానును ఒకప్పుడు శ్రీపర్వతస్వామి కడ కరుదెంచి, భక్తితో ప్రతివాసరంబును మల్లికాదామ మర్పించుచు నాస్వామిని గొల్చుచుండెను. ఇట్లుండ నొక్కనాఁడు ఆమె 'హర్షము దొలకాడ కిన్నర గంధర్వగీత ప్రకలిత సన్నుత నాద ప్రసన్నతమిూఱ యతి మృదుమధుర సమంచితాలాపగతుల' 'నుమానాథు ప్రమోద నానందలీల' బాడ నాస్వామి ప్రత్యక్షమై 'యిచ్చమెయ్యది వేడుమిచ్చెద' నని పలికెను. అందులకు (తాను) 'ప్రేమమెలర్ప నర్పించిన యట్టి యీమల్లికాదామ మెల్లకాలంబు మీమౌళియందున మిళితమైయుండ దయ సేయు' మని యా చంద్రావతి వేఁడుకొనెను. అంతట నాయుమానాథు డాదామమును దనమౌళిని జాహ్నవీచంద్రమధ్యమున నుంచి యామెకోరిక దీర్చెను. ఆమల్లికాదామ మర్జున కాంతిని జెల్వగుటంజేసి శ్రీపర్వతస్వామి మల్లికార్జుననామంబున బ్రసిద్ధి గాంచె[59].

పదుమూడవ శతాబ్దినాటికే యీగాథ 'ఆదిమ యుగము'నాటిదని యూహింపఁబడుచుండినందున అధమ మది ఎనిమిదవతొమ్మిదవ శతాబ్దములనాటిదైన గావచ్చును. ఇక నీపై కథలో చంద్రావతిచంద్రగుప్తునికూతురనుటకుమాఱు ఆతనిమనుమరాలని యించుక మార్పు చేయుట కంగీకరించునెడల దానికిని, విష్ణుకుండి వంశజుల చరిత్రమునకును గొంతసంబంధ మేర్పడును. అదియునుగాక కూతురికి తండ్రిపేరుపెట్టుట కంటె మనుమరాలికి తాతపేరుపెట్టుట సహజముకూడ నగును. ఇక వాకాటక రెండవ రుద్రసేనునిభార్య పద్మావతి సమ్రాట్టులైన గుప్తవంశజులలో రెండవ చంద్రగుప్తుని (క్రీ. శ. ౩౭౫-౪౧౩) కూతురని మన మెఱుగుదుము. క్రీ. శ. ౫౦౦-౫౫౫ ప్రాంతపువాడు కాదగు ననుకొన్న విష్ణుకుండి రెండవమాధవ వర్మ వాకాటక రాజకుమారిని బరిణయమాడెననువిషయముకూడ జ్ఞాపకముంచుకొనదగును. ఈరాజకుమారి యెవరు? పద్మా

58. పాలకురికి సోమనాథవిరచితమైన పండితారాధ్యచరిత్రము. ఈ కవికి పెక్కుభాషలు తెలిసియును: ఇతఁడు తెలుగు కవిగను, కర్ణాటకవిగనుకూడ పరిగణింపబడుచున్నాఁడు వరసింహాచారిగారి 'కన్నడకవిచరితె' లోను, రావుబహాదరు కే. వీరేశలింగముగారి 'ఆంధ్రకవుల చరిత్రము'ను ఈతఁడు ౧౨౦౦ ల ప్రాంతపువాఁడని తెలుపబడినది. ఈకథ పండితారాధ్యచరిత్రమున పర్వతప్రకరణమునగలదు (పుట ౩౭౬, వరంగల్లుప్రతి) ఈ తెలుగుకావ్యమును పదునైదవశతాబ్దిని గురురాజను కవి సంస్కృతమున ననువదించెను. తెలుగు కావ్యమును గ్రహింపలేని అన్యభాషలవా రీగాథనుగూర్చి యీసంస్కృత గ్రంథమున జూడదగును (కర్ణాటానువాదముతో గల మైసూరుప్రతి ౧౯-౨౧) (పర్వతప్రకరణము, ౪-వ అధ్యాయము. శ్లో. ౧౯-౩౦).

59. ఇచట చంద్రావతి మల్లికార్జునుని వివాహమైనట్లు తెలుపబడకపోవుట గమనింపదగినది.

వతియు నామెకూతురును నిశ్చయముగ నాతనికి సమకాలికురాండ్రగుదురు కావున ఈరెండవ మాధవవర్మ వివాహమాడినది పద్మావతికి గూతురును, రెండవ చంద్రగుప్తునికి మనుమరాలును అయిన రాజకుమారినే యనియు, ఆమెకు దన తాత పేర చంద్రావతి[60] యని పేరుండెననియు నూహింపవచ్చును. ఈవాకాటక రాణి ప్రభావముననే రెండవ మాధవవర్మ శ్రీపర్వతస్వామ్యారాధకుడై యుండవలెను. ఒకవేళ గాథలో నున్నట్లు చంద్రావతి చంద్రగుప్తునికూతురే యనుకొన్నప్పటికి మాధవవర్మతండ్రి గోవిందవర్మయే యామెభర్తయనియు, రెండవ మాధవవర్మకు దన తల్లి మూలముననే శ్రీపర్వతస్వామి యిష్టదైవమయ్యెననియు తలంపవలసియుండును.

విష్ణుకుండి శబ్దోత్పత్తి

విష్ణుకుండిశబ్దము యొక్క వ్యుత్పత్తి మనకు స్పష్టముగ దెలియదు. ఒక దక్షిణహిందూదేశపుజాతిపేరే యీవిధముగ సంస్కరింపబడినట్లు తోచును. వినుకొండ[61] యను తెలుగుపదమును పరిపాలకవంశమువారిని మెప్పించుటకు గాను పండితులు విష్ణుకుండగా సంస్కరించి యుందురనుట యసంభావితముకాదు. ఒక ప్రత్యేక యజ్ఞాగ్నిహోత్రమునకు ‘విష్ణు’ అనునది ఒక సాంకేతికనామము[62]. ఒకవేళ నీ విష్ణుకుండివంశజులు తాము విష్ణుకుండము నుండి యుద్భవించినట్లు చెప్పకొని యుండవచ్చును. అట్లయిన వీరు అగ్నికులక్షత్రియులగుదురు. రెండవ మాధవవర్మ ఈపూరు శాసనమున ‘విష్ణుకుండ్యధిరాజ గుణవంతులు’ (విష్ణుకుండ్యధిరాజగుణవన్తః) ‘అజ్ఞప్తి’గ దెలుపబడియుండుటవలన ఈరాజుల కోవకు చెందని విష్ణుకుండులుకూడ గొంద ఱుండినట్లు స్పష్టమగుచున్నది. పూర్వోదాహృతసమానములోని అధిరాజ, గుణవత్పదములు నామవాచకములనుట తెల్లమే. ఏతన్నామాంకితులైన యిరువురునుగూడ విష్ణుకుండివంశమునకు జెందినవారలే. విష్ణుకుండులకు బంధువులైన వాకాటకులది విష్ణువృద్ధగోత్రము[63]. ఇది యాంగిరసగోత్రశాఖ. ప్రాయికముగ విష్ణుకుండి ఈరాజుల గోత్రముపేరై యుండును. శాలంకాయనులవలెనే గోత్రముపేరతమయింటిపేరుగా వీరును గ్రహించియుం

60. చంద్రగుప్తులోని ‘చంద్ర’పదమే అసలుపేరు. ఇట్లే చంద్రావతిలోని ‘చంద్ర’యే అసలుపేరు; ‘వతి’ యనునది స్త్రీ వాచకప్రత్యయము.

61. వినుకొండ గుంటూరుజిల్లాలలోని యొకపట్టణము. ఇచ్చటినుండి యాత్రికులు శ్రీపర్వతమునకు బయలు దేరుదురు. చిక్కుళ్ళ శాసనమును బ్రకటించిన డాక్టరు హుల్ష్ దొరగారీసంబంధమును సూచించిరి.

62. మహాభారతము (కృష్ణమాచారిగారి ప్రతి), వనపర్వము, అధ్యా. ౨౨౩, శ్లో. ౧౨.

63. మహారాజ వాకాటక ప్రవరసేనుని ౧, ౨ ‘సియోని’ శాసనములను (Fleet's Gupta Insicriptions, p. 245), ఇతని యితర శాసనములను జూడుడు. రఘునాథ భాస్కర గోడ్‌బోల్ విరచితమైన ‘భరతఖండాంచా ప్రాచీన ఐతిహాసికకోశము’ (మహారాష్ట్రము)న విష్ణువృద్ధుడు మొదట క్షత్రియుడై పిదప బ్రాహ్మణుడైనట్లు కలదు.

దురు. కాని యేప్రవరకాండలోను నాకీ గోత్రము కనబడలేదు.

ఇరువురు నిర్వాహకులు

సాధారణముగ ప్రతి తామ్రశాసనము నను ఆజ్ఞప్తియని యొకడు పేర్కొనబడును. ఈపదమును (ఇంగ్లీషులోనికి) 'ఎగ్జిక్యూటర్' అని అనువదించుట వాడుక. చేసిన దానమును సరిగా అమలు జరపి, దానిని రక్షింపవలసిన బాధ్యత ప్రాయికముగ నీ'యాజ్ఞప్తి'దై యుం డును. ఈశాసనమున హస్తికోశ, వీరకోశులు ఆజ్ఞప్తులు. ఈపదములకు సరియైన యర్థమేదో నిర్ణయించుట కవకాశములేదు. ఈపేరులే పృథ్వీమూలుని గోదావరిశాసనమునను[64], మొదటి జయసింహుని ఆంధ్రసాహిత్యపరిషచ్ఛాసనమునను[65] పేర్కొనబడుటవలన ఇవి మనుష్యులపేరులు కావనుట స్పష్టము. పృథ్వీమూలుని గోదావరిశాసనమును సంపాదకీయ విమర్శతో ప్రకటించిన ఫ్లీటుదొరగారి యభిప్రాయమున 'వీరిరువురును గజదళమునకును, గొప్పపరాక్రమకార్యములకు ప్రథితిగన్న వీరనికాయమునకును చెందవలసిన ధనమును జాగ్రత్తపఱచి దానిని వారికి వినియోగించు నధికారులు'. కాని ౩౩-౩౮ పంక్తులలో వీరు 'ఉభయగణౌ'— రెండు సైన్యములవారు— అని పేర్కొనబడిరి. ఈకారణమున వీరిని కేవలము సైన్యాధికారు లనుటకు వీలులేదు. సంస్కృతమున గణమునకు సాంకేతికార్థము కలదు. ౨౭ రథములు, ౨౭ గజములు, ౮౧ తురంగములు, ౧౩౫గురు పదాతులు కలసిన సైన్యమునకు గణమని పేరు (వాచస్పత్యము). కావున హస్తికోశ మన గజదళమునకు చెందిన వీరనికాయ మనియు, వీరకోశ మన పదాతివర్గ మనియు నర్థము చేసికొనవలసియుండును. అనుశ్రుతమైన హిందువుల చతురంగసేనలో మధ్యయుగమున రాజులసేనయందు గజ,పదాతి వర్గములు మాత్రమే యుండినట్లు కనబడును. అంతకు జాలకాలము పూర్వమే రథబలము లుప్తమైపోయెను. తురంగములు అరుదగుటవలన వానిని పశ్చిమదేశీయులు మాత్రమే వాడుక చేయువారు. కళింగము గజసైన్యములకు చాల ప్రసిద్ధి కెక్కినట్లు గన్పట్టును[66]. పృథ్వీమూలుని శాసనములో[67] కుముద (నైరృతిదిక్కు ఏనుగు), సుప్రతీక (ఈశాన్య దిక్కు ఏనుగు) అధిష్ఠితులైన రాజుల పోరాటమునుగూర్చి వింటిమి. మూడవ మాధవవర్మ ప్రపితామహుడైన ఇంద్రభట్టారకవర్మ శతసహస్రసంగ్రామముల నాలుగుదంతములు కల యనేకగజముల నెదుర్కొనినట్లు రామతీర్థము

64. J. Bo. Br. A. S., Vol. XVI, p. 116 (ll. 27-28): "స సర్వైరేవ పరిపాలనీయో విశేషేణ హస్తికోశ, వీరకోశాభ్యాం".

65. ఈవ్యాసమున కనుబంధము చూడుడు, పంక్తి ౨౨.

66. రఘువంశము, 4, ౮౦ లో కళింగాధిపతి 'గజసాధనః' అని పేర్కొనబడియున్నాడు. అంతే కాక తద్దేశాధిపతులు గజపతు లనుటయు ప్రసిద్ధమే.

67. J. Bo. Br. A. S., Vol. XVI, p. 116.

శాసనము[68] వలన దెలియుచున్నది. కావున కళింగదేశముపై ననేకపర్యాయములు దండయాత్రలునలిపి క్రమక్రమముగా దాని నాక్రమించుచు వచ్చిన విష్ణుకుండుల సైన్యమున కళింగ గజకళ మెక్కువగ నుండెడిదని యూహింపవచ్చును ఒకవేళ గోదావరిజిల్లాలోని యిప్పటి రామచంద్రపురము తాలూకామైన గుద్దవాది విషయమునసే ఈసైన్యములు స్థిరముగ దండువిడిసియుండిన నుండవచ్చును.

మాధవవర్మను గూర్చిన గాథలు

ఇక శాసనములను వదలిపైచి, పరంపరానుగతములైన గాథల నెత్తికొందుమేని మాధవవర్మనుగుఱించి తెలుగుదేశమున తరతరములుగ వినవచ్చు కథ లనేకములు కలవు. మెకంజీ సంపాదితములైన కైఫీయతులును[69], క్రీ. శ. పదునేడవ పదునెనిమిదవ శతాబ్దములలో రచియింపబడిన తెలుగుకావ్యములు సిద్ధేశ్వర చరిత్ర, సోమదేవరాజీయములును[70] కాకతీయ విజృంభణమునకు పూర్వము పరిపాలించినట్టియు, నిజాం రాజ్యమునందలి వరంగల్లుకు సమీపమున నున్న హనుమకొండ రాజులకు మూలపురుషు డైనట్టియు నొక మాధవవర్మను పేర్కొనుచున్నవి. ఈ రాజు తండ్రి సోమదేవ రాజని చెప్పబడుటవలన ఇతనిని మన మాధవవర్మలలో రెండవవానితోగాని, మూడవ వానితోగాని గుర్తించుటకు వీలు కాదు. ఇతడొకవేళ మనకు తండ్రిపేరు తెలియని విష్ణుకుండి మొదటి మాధవవర్మయై యుండవచ్చును. హనుమకొండ మాధవవర్మ శాలివాహన శకము ౨౩౦ మొదలు ౩౫౦ వఱకు (క్రీ. శ. ౩౦౮-౪౨౮) నూటయిరువది సంవత్సరములు పరిపాలించినట్లు చెప్పబడినది. ఒక్కరాజు నూటయిరువది సంవత్సరములు పాలించెననుట యతిశయోక్తియే కాని మనము నిర్ణయించిన కాలక్రమము ననుసరించి మన మొదటి మాధవవర్మ సరిగా ఈకాలపువాడే యగుట విచిత్రము.

బెజవాడలోని మల్లేశ్వరస్వామి దేవాలయావరణమున కాకతీయుల కాలము నాటి (పదుమూడవ శతాబ్ది) శిలాశాసన[71] మొకటి కలదు. అందు బెజవాడ రాజయిన మాధవవర్మను గుఱించిన చిత్రమైన వృత్తాంతము కొంత కలదు:

కలియుగమున అత్యంత ప్రాతన కాలమున ౧౧౭-వ శకవర్షమున మాధవవర్మ యనుపేర బ్రసిద్ధుడైన రాజొకడుండెను. ఈతని కుమారుడు తింత్రిణీ జీవినియైన (చింతచిగురు, చింతకాయలు అమ్ముకొని జీవనము గడపు

68. Ep. Ind., Vol. XII, p. 133.

69. ఏకశిలానగరవృత్తాంతమును జూడుడు.

70. సిద్ధేశ్వరచరిత్రము, కాచ సర్వప్పకృతము. అముద్రితము: అరుదుగ దొరకును. సోమదేవరాజీయకర్త కూచిమంచి జగ్గకవి.

71. Ep. Coll. No. 536 of 1909 (Ep. Rep. S. C.)

కొను) ఒకస్త్రీ బిడ్డను జంపినందువలన న్యాయమును పరిపాలింపఁగోరి రా జాతని కురిశిక్ష విధించెను. రాజుయొక్క న్యాయ్యబుద్ధి కెంతయు సంతోషించి మల్లేశ్వరస్వామి కనకవృష్టి గురియించెను. తత్కారణమున నా స్త్రీయొక్క శిశువును, రాజకుమారుఁడునుగూడ పునర్జీవితులైరి. ఈరీతిని మల్లేశ్వరస్వామి మాధవవర్మకీర్తి నీలోకమున సుప్రతిష్ఠిత మొనరించెను[72].

పదునైదవ శతాబ్ది నుండినట్టియు, ఒరిస్సా గజపతుల దండనాయకుఁడైనట్టియు తమ్మరాజు కొమారుఁడు బసవరాజను నతఁడు మాధవవర్మ వంశ్యుఁడని అతనిమంత్రి కంకితము గావింపబడిన యీ కాలమునాటి రెండు తెలుగుకావ్యములలో[73] వర్ణితమై యున్నది.

బెజవాడలో ఇంద్రకీలాద్రిమీఁది కనకదుర్గగుడిముందున్న యొక పగిలిపోయిన స్తంభ

72 Ep.Rep-(S. C). 1910, pp 71-72.

[మాధవవర్మను పేర్కొను ఇంతకు పూర్వపుశాసన మింకొకటి కలదు. అది పండ్రెండవశతాబ్దినాటిది. ఇదియే రెండవకాకతిప్రోలరాజు అనుమకొండశాసన మను పేర బరగుచున్నది. ఇందు రెండవ కాకతి ప్రోలరాజు ప్రెగ్గడయైన బేతనకుభార్య మైలమ క్రీ. శ. ౧౧౧౭లో 'కడలలాయబసది' యను జినాలయమును గట్టించెను. దానికి మహామండలేశ్వరుఁడైన ఉగ్రవాడి మేళరసుకూడ గొంత భూమి దాన మొసంగెను. ఈమేళరసు మాధవవర్మవంశోద్భవుఁడని యిట్లు తెలుపబడినది.

"అష్టావంతి సహస్రాణి దళకోపేన వాజినా మనంతం పాదసంఘాత మిత్యేతే మాధవవర్మవంశోద్భవకప్ప శ్రీమన్మహామండలేశ్వర ముగ్రవాడియ మేళరస..." దీని ననుసరించి చూచిన, మాధవవర్మ ఎనిమిదివేలయేనుగులకును, పదికోట్ల గుఱ్ఱములకును, అనంతమగు కాల్బలమునకు నధిపతి యని తెలియుచున్నది. —మ. సో. శర్మ.]

73. (౧) నాసికేతోపాఖ్యానము : దగ్గుపల్లి దుగ్గయ్య కృతము.

"చతురంగ బలములు జయవాడ దుర్గాంబ వరమునం బడసి దుర్వారలీల
జగతీస్థలంబెల్ల సాధించి జయ శాసనములు దిగ్దంతిదంతముల సలిపి
పేదబాలునకుఁగాఁ బ్రియసుత మోహంబు పట్టక బెజవాడఁ బాడి నిలిపి
కలయంగఁ బగమునఁ గాంచనవర్షంబుఁ గురియించి దేవతాకోటి పొగడ
నడుమ నెగడిన మాధవవర్మ..."

(౨) నంది మల్లయ్య, ఘంట సింగయ్య కృతమగు ప్రబోధ చంద్రోదయము. ఇందు బసవరాజు 'మాధవవర్మ భూమండలేశ్వర వంశజలధికి చందమామ' యని వర్ణితుఁడయ్యెను.

[బసవ భూపాలునికే కృతి యీయబడిన కావ్య మింకొకటి కలదు. అది దూబగుంట నారాయణ కవి విరచితమైన 'పంచతంత్రి'. ఇందు మాధవవర్మ ఇట్లు అభివర్ణితుఁడై యున్నాడు.

"మును బెజవాడ దుర్గమున ముగ్ధతనంబున మెచ్చఁజేసి పెం
పున రథ దంతివాజి భట భూరిబలంబులచేఁ గళింగ భూ
జన పతిఁద్రుంచి వేదసతి సంతతికై మహిఁ బాడి నిల్పి విక్ర
మ్మునఁ జిరకీర్తులం గనిన మాధవ వర్మ..."

రథ దంతి వాజిభట భూరిబలంబులు కలవాఁడని వర్ణితుఁడగుటచేత ఈమాధవవర్మయు, అనుమకొండశాసనమున మేళరసు పూర్వుఁడుగ జెప్పబడిన మాధవవర్మయు ఒక్కఁడే కానోపును. —మ. సో. శర్మ.]

మునీద శాలివాహన శకము ౧౪౪౦ (క్రీ.శ. ౧౫౧౨)నాటి శాసన[74] మొకటి కలదు. అందు విజయనగర సామ్రాజ్యము నేలిన కృష్ణదేవ రాయల దండనాయకు డొకడు తాను బెజవాడ మాధవవర్మ వంశములోని వాడనని చెప్పుకొని యున్నాడు.

విశాఖపట్టణము జిల్లాలోని విజయనగరము మహారాజును, తెలుగు దేశమున రాజులు, రాచవారనబడు తెగలోని చాల మందియు మాధవవర్మను దమ మూలపురుషునిగ జెప్పుదురు. ఈ విషయమున 'విశాఖపట్టణముజిల్లా మాన్యుయల్'[75] అను గ్రంథమున నిట్లు కలదు: "శాలివాహనశకవర్షము అయిదువందల పదునాలుగునకు సరియైన క్రీ. శ. ౫౯౨ లో మాధవవర్మ నాయకత్వమున రాజపుత్త్రులు వసిష్ఠ, ధనంజయ, కౌండిన్య, కాశ్యపగోత్రములవారు తెలుంగాణెమునకు వలసవచ్చినట్లు క్రీ. శ. ౧౫౪౦ నాటి దనబడు శ్రీకృష్ణవిజయ మను తెలుగు కావ్యమున గలదు. విజయనగరము రాజకుటుంబమువారీ మాధవ వర్మనే తమ మూలపురుషునిగ జెప్పెదరు. ఉత్తర సర్కారులలోని రాచవారందఱు విజయనగరము మహారాజునే తమ నాయకునిగ పరిగణింతురు. వలసవచ్చిన రాజపుత్త్రులు కృష్ణానదీతీరమున బెజవాడలో స్థిరనివాసములు కుదుర్చుకొని కాలక్రమమున నొక చిన్న సంస్థానమును సంస్థాపించిరి." పదునాఱవ శతాబ్దినాటి, అనగా మాధవవర్మ యనంతరము వేయిసంవత్సరములకు విరచింపబడిన కావ్యములోని ౫౧౪ వ శకవర్షము సరియైనదే యని గట్టిగ నొక్కి చెప్పలేము కాని మాధవవర్మ కీకావ్యమున దెలుపబడిన సంవత్సరము మనము మూడవ మాధవవర్మకు నిర్ణయించిన క్రీ. శ. ౫౯౪ తో దరిదాపుగ సరిపోవుటమాత్రము గమనార్హమైనది.

## అనుబంధము

### మొదటి జయసింహవల్లభుని పొలమూరు శాసనము

మొదటిరేకు : రెండవప్రక్క

1. [76] స్వస్తి శ్రీవిజయస్కన్ధావారాత్ మాతృగణపరిరక్షితానాం మానవ్యసగోత్రానాం (ణాం)
2. హారితీపుత్రాణామ్ అశ్వమేధయాజినాం చలుక్యానాం కులజలనిధి
3. సముత్పన్నరాజరత్నస్య సకలభువనమణ్డలమణ్డితకీర్తిః శ్రీ

74. Ep. Coll. No. 329 of 1892;S. I. I; Vol IV.

75. p. 277.

76. [ఇది నేను అసలురేకులనుండి చదివి, పరిశీలించిన పాఠము. —మ. సో. శర్మ.]

4. కీర్త్తివర్మ్మణః పౌత్రః అనేకసమరసంఘట్టవిజయినః పరనర
5. పతిమకుటమణిమయూఖావదాతచరణయుగలస్య శ్రీవిష్ణువర్ద్ధన
6. మహారాజస్య ప్రియతనయః ప్రవర్ద్ధమానప్రతాపో(పా)పనతసమస్త

రెండవ రేకు : మొదటిప్రక్క

7. సామన్తమణ్డలః స్వబాహుబలపరాక్రమోపార్జ్జిత సక[లయ]శో
8. విభాసితదిగన్తరః స్వశక్తిత్రయత్రిశూలావభిన్నప[రనర]పతి
9. సకలబలచేతసః బృహస్పతి రివ నయజ్ఞో మను రివ వినయ
10. జ్ఞః యుధిష్ఠిర ఇవ ధర్మ్మపరాయణః అర్జునవ దపరనర
11. పతిభి రనభిలంఘిత పౌరుష్యః అనేకశాస్త్రార్త్థతత్వజ్ఞః పర
12. మబ్రహ్మణ్యో మాతాపితృపాదానుధ్యాతః శ్రీప్రి(పృ)థివీజయసిఙ్ఘన

రెండవ రేకు : రెండవప్రక్క

13. ల్లభమహారాజః గుడ్డవాదివిషయే విషయమహత్త[రా నధికా]రపు
14. రుషాంశ్చ ఇమమర్త్థ మాజ్ఞాపయత్య(తి।అ)స్తి[।*] విదితమస్తు వో య[థా]స్మాభిః
15. గుడ్డవాదివిషయే పులొంబూరన్నామగ్రామః వేదవేదాంగ
16. విదో దామశర్మ్మణః పౌత్రాయ స్వపితురధికగుణగణాధి
17. వాసస్య శివశర్మ్మణః పుత్రాయ తైత్తిరికసబ్రహ్మచారిణే వేద
18. ద్వయాలంక్ర(కృ)తశరి(రీ)రాయ గౌతమసగోత్రాయ స్వకర్మ్మా[ను]ష్ఠాన

మూడవ రేకు : మొదటిప్రక్క

19. పరాయ పూర్వ్వాగ్రహారిక రుద్రశర్మ్మణే అసనపురస్థానవ(వా)స్తవ్యాయ
20. శ్రీసర్వ్వసిద్ధిదత్యా సర్వ్వకరపరిహారేణాగ్రహారీక్ర(కృ)త్య సమ్ప్ర[ద*]త్తః[॥*]
21. తథా భవద్భి రన్యైశ్చ ధర్మ్మాధిశ(గ)తబుద్ధిభిః పరిపాలనీయః[।*]
22. న కైశ్చి ద్బాధా కరణీయా। ఆజ్ఞప్తి రత్ర హస్తికోశ వీరకోశ(శౌ)[।*] జ్యా (వ్యా)
23. సగీతాః। బహుభి ర్వ్వసుధా దత్తా బహుభి శ్చానుపాలితా[।*] యస్య యస్య
24. యదా భూమి స్తస్య తస్య తదా ఫలమితి[॥*]సం॥ ౫ ॥[77] గి (గ్రీ?) ౮ । ది ౭—*

---

77. [గౌవర్మెంటు శాసనశాఖవారు సంవత్సరమును ౧౫ గను, దత్తగ్రామనామమును "పురెబూంర (పురె బూరు)" గను చదివియున్నారు.—*Vide*, Ep. Rep. 1914, p. 85; కాని యివి అపపాఠములు.—మ. సో. శర్మ]

# మనకు రెక్కలున్నచో



అప్పుడు మనదేవుళ్లు



ఉదయమే కాఫీక్లబ్బు వద్ద



భార్యకు కనబడకుండ రాత్రి
ఎగిరిపోవచ్చును



సొరుగంటి రహస్యాలు కనుక్కోవచ్చును



బ్రాండీ బుడ్లు చంకనున్నా కనబడవు



హిందూముసల్మానుకు వెయ్యి!



శ్రీమతి యమునాకన్య

మొంగలు చరిత్రకు సంబంధించిన 'ఢిల్లీ సింహాసనము' అను ప్రదర్శనమున నాయికపాత్రమును ధరించును.



శ్రీమతి సులోచన కన్య
బొంబాయిలో చేయుమంచిన తులసీవివాహము.

# మాయాచిత్రము

చిట్టాప్రగడ సీతారామాంజనేయులు గారు

'యా-మా-సా-మాయా'-అనిర్వచనీయా-మాయా; దురత్యయా-మాయా.

యా-మా-సా-యన, నేదిలేదో అదె, మాయావాదు! సద్వస్తు విం
దేమీ లేదట నిర్వచించుటకుఁ దానే సంసృతిన్ బూన్పఁగా
మామీఁదన్ బఱతెంచునంట! విదళింపన్ రాసి దౌనంట! నిం
కేమోయంట! మఱేమొయంట! వినుచుంటే! భక్తమూర్తీ! శివా!

అసలే లేనిది మాయ నాఁ బరఁగు టెట్లయ్యారె! నీ విశ్వమూ
ర్తి సమస్తం బిట ముస్కు-వేయు టెటు! లీ తీరెల్ల వ్యత్యస్తలో
క సమాధాన నిమిత్త మర్హమని పల్కం జెల్ల-దీ విశ్వ లీ
ల సమర్థింప ననర్థకల్పనము లేలా! భక్తమూర్తీ! శివా!

ఒకటే నాటక, మొక్కఁడే నటకుఁడీ యుష్మంబు మూలంబునం
దొకఁడే యా! నిట విశ్వరూపకము నా నొప్పారు నీ చిత్ప్రవృ
త్తి కనేకత్వ మహత్వ నీచతల నెంతే భేదదృశ్యత్వ మి
ట్లి కదా కల్గు! నిజాన, మాయ కెడ మేదీ! భక్తమూర్తీ! శివా!

మటుమాయాప్రకటీకృతంబా! మఱి యుష్మద్ది వ్యసంకల్ప్య మో
మెటు నిర్ధారణ సేయరాని దనుచో-నేకేశ్వరోపాసనం
బెటులా! బ్రహ్మ మిదం సమస్త మన కా యీమాయలం జిక్కఁ జూ
చుట చోద్యమ్మొ! త్వదన్య మెప్పగిది వచ్చున్! భక్తమూర్తీ! శివా!

నటరాజున్ మఱపించు చిన్మయ జగన్నాట్యంబు మాయామయం
బటు తోఁచున్-సృజన క్రమాక్రమిత విశ్వవ్యాజార్భటిన్-నిన్నుఁ బో
ల్చుటకున్ నీకె వశంబు కానటులఁ బొల్చున్ గాదె! నీతాండవో
త్కట కేళీ మహనీయ చిత్రము లనంతా! భక్తమూర్తీ! శివా!

---

# హిందూదేశము — ఫెడరల్ విధానము

కొన్ని అవసరమగు మార్పులు. చా. వెం. హనుమంతరావుగారు, M.A. B.Ed.

శ్రీమా. వెంకట రంగయ్య గారు జనేవరు మాసపు "భారతి"లో "ఫెడరల్ విధానము"ను గురించి వ్రాసిన వ్యాసమును చదివినవారికి ప్రస్తుతము ఆ విధానము ఎందులకు అవసరమో దానివలన దేశమునకు కల లాభనష్టములేవో స్పష్టపడును. కాని ఆ వ్యాసమును చదువువారికి "డొమినియన్" విధానమునకును "ఫెడరల్" విధానమునకును సంబంధము లేదనియు "ఫెడరల్" విధానము దేశములో ప్రవేశపెట్టుటవలన అధినివేశ రాజ్య ప్రతిపత్తి (Dominion Status) ఏర్పాటగుటకు అవకాశము లుండవనియు తోచుట కవకాశము లున్నవి. ఫెడరల్ డొమినియన్ విధానములకు సంబంధమున్నదో, లేక పరస్పరమగు వైరుధ్యమేమైన కలదో యనుప్రశ్న విచారణీయము.

శ్రీ వెంకట రంగయ్యగారు వ్రాసినట్లు ఫెడరల్ రాజ్యాంగ విధానమునందు ప్రధాన సూత్రము కేంద్ర ప్రభుత్వమునకును రాష్ట్ర ప్రభుత్వములకును మధ్యనుండవలసిన సంబంధమును నిశ్చయించి నిర్ణయించుటయే. కాని ఆ నిర్ణయములో ఇంగ్లండు దేశమునకును మనదేశమునకును ఉండవలసిన సంబంధములను నిశ్చయము చేయుటకు అవకాశములు లేవని తలంచుట పొరబాటు. ఫెడరల్ విధానము క్రింద నుండు హిందూదేశము "డొమినియన్ స్టేటస్" ను అనుభవింపకుండ యుండిన యుండవచ్చును; కాని అట్లు అనుభవించుటకు తీవ్ర ప్రతిఘటనము లేవైన నున్నవాయని ఆలోచించిన ఏవియు లేవనియే చెప్పవలెను.

ఎందువల్లననగా "డొమినియన్ స్టేటస్" విధానములో ఇమిడి యున్న ముఖ్యసూత్రము డొమినియనులు ఇంగ్లండుకంటె పేరుకుమాత్రము తక్కువ స్వాతంత్ర్యముగల దేశముల క్రింద పరిగణింపబడుచున్నవి కాని నిజముగ అన్ని విషయములందును (విదేశవ్యవహారములను నడుపుకొనుటయందుకూడ) అవి ఇంగ్లండుతో సరితూగు అధికారమును స్వాతంత్ర్యమును (Equality of Stat us అనుభవించుచున్నవి. అనగా డొమినియనులు తమ ఆర్థిక, వాణిజ్య, సైనికవిషయముల నన్నింటిని తమంతట తామే పరిపాలించుకొనుటకు సంపూర్ణాధికారము కల్గియున్నవనుమాట. ఇంగ్లండు దేశమును పరిపాలించు చక్రవర్తినే ఆ దేశపు ప్రజలుకూడ రాజుగా అంగీకరించునంతవరకే, అధినివేశరాజ్యములకును ఇంగ్లండునకును కల సంబంధమై యున్నవి. 1926, 1930 సంవత్సరములలో జరిగిన సామ్రాజ్య సమావేశముల (Imperial Conferences) లందు డొమినియనుల స్వాతంత్ర్య సూత్రమును సమానాధికారసూత్ర

మును పూర్తిగ ఇంగ్లండుచే అంగీకరింపబడినవి.

ఇప్పుడు ఇండియా దేశమునకు అట్టి అధినివేశ స్వాతంత్ర్యము వచ్చుటకు ఏర్పాటుకానున్న ఫెడరల్ విధానము తోడ్పడునా లేక ఫెడరల్ విధానము ఆ స్వాతంత్ర్యమును సంపాదించుట కడ్డుగానుండునాయను విషయమే ఈ సందర్భములో ఆలోచింపవలసినదిగా నున్నది. కనడాదేశము ఫెడరల్ విధానమునే కల్గియున్నది. ఆస్ట్రేలియా దేశము ఫెడరల్ విధానము క్రిందనే పనిచేయుచున్నది. కాని వాటికి డొమినియనుల కున్న స్వాతంత్ర్యమును పొందుటకు ఏమైన అభ్యంతరముకాని ఆటంకముకాని ఏమైన కలిగినదా? ఏమియులేదు. అట్లే హిందూదేశమునకుకూడ మనము ఫెడరల్ విధానమును స్వీకరించినప్పటికిని డొమినియన్ ప్రపత్తిని పొందుటకును ఇంగ్లండుదేశముతో సమాన స్వాతంత్ర్య మనుభవించుటకును ఎట్టి అడ్డుగాని యుండునని తలంపనక్కరలేదు.

కాని ఒక్క సంగతిమాత్రము మనము గ్రహించి జ్ఞాపక ముంచుకోవలసి యున్నది. ప్రస్తుతము రౌండు టేబిల్ సమావేశమునందు తయారుచేయబడి ఆమోదింపబడిన ఫెడరల్ విధానమునందు హిందూదేశమునకు పూర్తియగు డొమినియన్ విధానము నేకరింపబడినదని మాత్రము చెప్పుటకు వీలులేదు. రౌండుటేబిల్ వారు తయారుచేసిన చిత్తురాజ్యాంగ విధానము ప్రకారము మన దేశమునకు సంపూర్ణమగు బాధ్యతాయుత స్వపరిపాలనము (Responsible Self Government) ఈయబడి యుండలేదు. కొన్ని ముఖ్యవిషయములందు బ్రిటిషు ప్రభుత్వమువారి అధికారము ఇంకను పూర్తిగ ఆచరణయం దుండుటకు అవకాశము లేర్పాటు చేయబడినవి. సైన్యము, దేశసంరక్షణ, విదేశాంగ వ్యవహారములు, విదేశములలో చేయబడిన అప్పువిషయములు, స్వదేశసంస్థానముల వ్యవహారములు—ఈవిషయము లన్నింటియందును ఇంగ్లండు ప్రభుత్వమునకే పూర్తియగు అధికారము ఈయబడినది. ఇంగ్లండుదేశ ప్రభుత్వమనగా ఆప్రభుత్వపు ప్రతినిధియగు వైస్రాయికే ఈవిషయములను గూర్చి ఆలోచించుటకును నిర్ణయించుటకును అధికారమున్నదికాని హిందూదేశపు శాసనసభవారికిని ఆసభకు బాధ్యులగు మంత్రివర్గమువారికిని ఆ అధికారము లేదు అట్లే ఆర్థికముగకూడ వ్రాతలో అధికారము హిందూదేశ మంత్రివర్గమునకీయబడినప్పటికిని నిజముగ ఆచరణలో మాత్రము సుమారు 80% ఆదాయమును మ్రింగివేయు సైనిక వ్యయము విదేశపు అప్పు మొదలగు ఖర్చులు గవర్నరు జనరలు చేతులలోనుండుటచే మంత్రివర్గమునకున్న అధికారము చాల సంకుచితమైనదని చెప్పవలసియున్నది. ఈకారణము లన్నింటినిబట్టి హిందూదేశమునకు సంపూర్ణమగు బాధ్యతాయుతప్రభుత్వము రౌండుటేబిల్ సమావేశ ఫలితముగ చేకూరలేదని గ్రహింపనగును. సంపూర్ణ బాధ్యతాయుత

ప్రభుత్వ మెప్పుడు లేదో డొమినియన్ స్టేటస్‌కు ఆసమావేశమువారిచే ఆమోదింపబడిన విధానమునకు తగ్గిపోయినదని స్థిరపడినది. పైన చర్చించి తేల్చిన విధముగ మాత్రమే హిందూదేశపు భావి ఫెడరల్ విధానము డొమినియన్ విధానమునకు లోటుగానున్నది కాని రెండింటికిని పరస్పర వైరుధ్య ముండియుండలేదు.

ఇంకొక విషయముకూడ ఈసందర్భములో పరికింపవలసినది. గవర్నరుజనరలుకు సంపూర్ణ అధికారముతో వదలివేయబడిన విషయములు అట్టి అధికారముక్రింద కొంతకాలము మాత్రమే యుంచబడవలెనని మన దేశీయులు మొదటినుండియు కోరుచున్నారు. రౌండు టేబిల్‌సమావేశమందలి చర్చలలోకూడ ఈ విషయమై సూచనలు చేయబడి ఈ "రిజర్వు" చేయబడిన అధికారము "మార్పుపల" కాల (Period of Transition) మందు మాత్రమే గవర్నరుజనరలుచేతులలో నుండవలె ననియు అటుతరువాత ఏ ఆటంకము, లోటు లేకుండ హిందూదేశపు పార్లమెంటువారిచేతులలోనికి సంక్రమించవలెననియు ఒప్పుదల కాబడినది. ఈవిధముగ రిజర్వు అధికారములు హిందూదేశపు పార్లమెంటు మంత్రివర్గములవారి చేతులలోనికి మార్చబడినప్పుడు సంపూర్ణముగు అధినివేశ రాజ్యాంగవిధానము (Complete Dominion Status) హిందూదేశమునకు సంపాదింపబడినదని చెప్పుటకు ఏమాత్రమును సందేహించనక్కరలేదు. కాని ఆమార్పు జరుగుట కెంతకాలము కావలయును, ఎంత కాలము పట్టును అను విషయమును నిశ్చయించుట కింతవర కెవ్వరును ప్రయత్నించియుండలేదు. ఏది ఎట్లున్నను ఆకాలపరిమితి 25 సంవత్సరములకు దాటకూడ దను విషయము ఫెడరల్‌విధానమునందు ప్రవేశపెట్టబడిన ఆకాలమునకు చివరను మన దేశము బాధ్యతాయుత ప్రభుత్వమును డొమినియను ప్రపత్తిని అనుభవించు ననుకొనుటకు ఆశయుండును. ఈలోపుగ ఒకదానివెంబడి వేరొకటిగ గవర్నరుజనరలుకు సంకేతింపబడిన విషయములపై అధికారమును హిందూదేశపు మంత్రివర్గమువారి అధికారముక్రిందకు మార్చబడునట్లుచూచుట అవసరము. మరియు ఆ 25 సంవత్సరముల అనంతరము పూర్తిగ అధికారము మార్పు జరుగుటకును ఈలోపుగ జరుగు మార్పులకును మరలమరల ఇంగ్లండు పార్లమెంటువారి అవసరములేకుండ హిందూదేశపు పార్లమెంటువారి తీర్మానము చాలునని కూడ ఏర్పాటుచేయుట ముఖ్యము.

రౌండుటేబిల్ సమావేశములో ఆమోదింపబడిన ఫెడరల్ విధానము డొమినియన్ స్టేటస్ అడ్డుగా నుండునేమోయను అనుమానమునకు పూర్తిగ కారణము లేకపోలేదు. అది ఏమన మన దేశపు స్వదేశ సంస్థానాధిపతులము భావమే. మన దేశమున ఫెడరల్ విధానమును ఏర్పాటుచేయుటకు ప్రధానకారణము స్వదేశ సంస్థానములను అఖలభారత దేశమునకును సంబంధమున్న రాజకీయ విధానములోనికి తీసికొనివచ్చుటకు కల అవసరమే అయియున్నది.

రౌండుటేబిల్ సమావేశమునకు వెడలిన సంస్థానాధిపతులందరును ఏకగ్రీవముగ ఫెడరల్ రాజ్యాంగ సూత్రమును బలపర్చి వారుకూడ బ్రిటిషు రాష్ట్రములతోపాటు సమానమగు హక్కులతో ఆవిధానమును జయప్రదముగ కొనసాగించుటకు అంగీకారమును తెల్పియున్నారు. అట్టి అంగీకారమునిచ్చి హిందూదేశపు ఏకత్వము, సమ్మేళనమును ప్రపంచమునకు విశదపరిచినందులకు సంస్థానాధిపతులు వందనీయులే కాని వారు ఫెడరేషన్ (Indian Federation) లో చేరుటకుముందు చేయవలసిన కొన్ని ముఖ్యమగు పనులను చేయుటకు సంసిద్ధులై యున్నారా లేదా యను విషయమాలోచింపవలసి యున్నది. ఆసంసిద్ధతపైననే ప్రస్తుతము ఫెడరల్ విధానముయొక్క జయమును ముందు ముందు హిందూదేశము అధినివేశ రాజ్య స్వాతంత్ర్యమును సంపాదించుటకుండు అవకాశములును ఆధారపడియుండును. వారు చేయవలసిన పనులలో ముఖ్యమగు రెండింటిని ఈక్రింద పొందుపరుచుచున్నాము.

(1) సంస్థానాధిపతులు ఇండియన్ ఫెడరేషన్‌లో భాగస్థులుగా నుండి దానివల్ల వచ్చు లాభనష్టములను అనుభవించుటకు సిద్ధముగా నున్నామని ఒకవంక చెప్పుచు వేరొకవంక తమకు పై యధికారిగ (Paramount Authority) ఇంగ్లండు దేశపు చక్రవర్తియే యుండునట్లు ఏర్పాటు కాబడవలెననియు, హిందూదేశపు ఫెడరల్ ప్రభుత్వమువారికి ఏవిధమైన పై యధికారమునుగాని తమ తమ అంతర ప్రభుత్వములలో జోక్యము కలిగించుకొనుటకు హక్కుకాని యుండకూడ దనియు వాదించుచున్నారు. ఒకే ప్రభుత్వవిభాగము రెండుపైయధికారముల నెట్లు కొలువగలదు? ఫెడరల్ విధానములో వారు చేరినపుడు అన్ని విషయములందును ఆ ఫెడరల్ ప్రభుత్వము వారికి లొంగియుండవలెనేకాని కొన్ని విషయములలో ఆ ప్రభుత్వమువారికిని కొన్ని విషయములలో ఇంకొక పైయధికారికిని లొంగియుండజూచుట విపరీతపరిస్థితులను రాజ్యాంగ విధానమునందు తెచ్చిపెట్టుటయే యగును.

(2) సంస్థానాధిపతులు తమతమ సంస్థానములలో ప్రజలకు ఎట్టి స్వాతంత్ర్యము నిచ్చుటకుకాని ఇతర బ్రిటిష్ ఇండియా రాష్ట్రములలో నుండునట్టి రాజకీయ సంస్కరణములను ప్రవేశపెట్టుటకుకాని ఇష్టమును చూపుచున్నట్లు తలంచుటకు ఇంతవరకు ఏవిధమైన చిహ్నములును కాన్పించుటలేదు. ఫెడరల్ రాజ్యములోని అన్ని భాగములందును కొంచెము హెచ్చుతగ్గుగ ఒకేవిధమగు రాజకీయ విధానమములునం దుండుట ముఖ్యవిషయము. ఒక భాగములో సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వమును వేరొకభాగములో సంపూర్ణ నిరంకుశాధికారముగల రాజప్రభుత్వమును నుండిన ఇవి రెండింటికిని సమన్వయము కల్గించి పరిపాలించుట కేర్పాటయిన కేంద్రప్రభుత్వము ఎట్లు జయప్రదముగ కొనసాగును. కాన సంస్థానాధిపతులు వీలయినంత త్వరలో తమతమ సంస్థానములందు ప్రజాప్రతినిధి సభలను

స్థాపించి తమప్రజలకు ప్రభుత్వ విషయములలో జోక్యము కల్గించుకొనుటకు గల హక్కులను అంగీకరించుట ముఖ్యము.

పైన సూచింపబడిన మార్పులు సంస్థానాధిపతులు ప్రవేశపెట్టుటకు సంసిద్ధత చూపినప్పుడే వారు ఫెడరల్ విధానమును గూర్చి నిశ్చితాభిప్రాయులై యున్నట్లు తలంపవలసి యుండును. స్వదేశసంస్థానములలో ఇప్పటినిరంకుశప్రభుత్వము సాగుచున్నంతకాలము వారు ఫెడరల్ విధానములో చేరినను మనదేశమునకు సంపూర్ణమగు డొమినియన్ స్టేటస్ వచ్చునని నమ్ముటకు వీలులేదు. ఎందువల్లననగా సంస్థానాధిపతులు ఫెడరల్ ప్రభుత్వమునే తమపై అధికారిగ ఒప్పుకొనుట కిష్టపడునంతవరకు ఆ అధికారము గవర్నరు జనరలు చేతులలోనే యుండుట తటస్థించును. వైస్రాయి కట్టి అధికార మున్నంత వరకు "డొమినియన్ స్టేటస్" చేకురనేరదని ఇదివరలోనే చెప్పియుంటిమి. ఇదియుగాక పైన సూచించినట్లు సంస్థానాధిపతులు ప్రజాప్రభుత్వ విధానములను తమ సంస్థానములలో ప్రవేశపెట్టి, వారి ప్రజలను ఫెడరల్ పార్లమెంటు సభ్యులను ఎన్నుకొనుటకు హక్కునిచ్చుటకూడ ఈ సందర్భములో చాల అవసరమని గ్రహింపవలయును. అట్లు ప్రజలకు ఎన్నికహక్కు నీయనియెడల సంస్థానముల ప్రతినిధులందరును సంస్థానాధిపతులచే నియమింప(Nominated) బడుటయు వారు పూర్తియగు డొమినియన్ ప్రభుత్వమును ప్రవేశపెట్టు ప్రయత్నములకు అడ్డుగ నుండుటయు తటస్థించుటకు అనుమానములేదు.

ఇంతవరకును సూచింపబడినవి కాక వేరొక అవసర సంస్కరణము కలదు. అది ఏదనగా బ్రిటిష్ రాజధానులలో సంపూర్ణమగు రాష్ట్ర స్వాతంత్ర్యము (Provincial autonomy) నేర్పాటుచేయుట. రౌండుటేబిల్ సమావేశములో ఏకాభిప్రాయమే ప్రతినిధు లందరును వెల్లడించియుండిరి. కాని బ్రిటిష్ప్రతినిధివర్గములవారిని కూడగట్టుకొనుటకు చివరకు గవర్నరుకు కొన్ని అసాధారణాధికారములను (Reserved Powers) ఇచ్చుటకు నిశ్చయింపబడినది. ఇట్టి అధికారములు రాష్ట్ర స్వాతంత్ర్య సూత్రమునకు భిన్నములని ఎల్లరకును తెలిసినదే. వాటినితొలగించి రాష్ట్రములందు ప్రభుత్వాధికారమంతయు పూర్తిగ ప్రజాప్రతినిధుల చేతులయందే యుండునట్లు మార్పుచేయుటకు ప్రయత్నములు చేయవలసి యున్నది.

అట్లే కేంద్రప్రభుత్వ విధానములో గవర్నరు జనరలుకు కొన్ని స్వతంత్రాసాధారణ అధికారముల నిచ్చుటకు అంగీకరింపబడినది. ఆ అధికారములు గవర్నరుజనరలుచేతులలో నున్నంతకాలమును మన రాజ్యాంగ విధానము డొమినియన్ రాజ్యాంగవిధానములతో సరితూగునని తలంచుటకు వీలులేదు. అధినివేశ రాజ్యములలో గవర్నరుజనరలు మంత్రివర్గము వారి సలహాపైన మాత్రమే ఏపనియైనను చేయవలసియున్నది కాని తనస్వంత అధికారముపైనను స్వంత జవాబుదారీపైనను ఏవిధ

మైన పరిపాలనా విషయములలోకాని జోక్యము కల్గించుకొనుట కవకాశములేదు. ఇట్టి అసాధారణాధికారములు ప్రతి రాజ్యాంగవిధానమునందును కలవనియు వాటిని హిందూదేశ పరిపాలనావిధానములో కూడ ప్రవేశపెట్టుట వలన నష్టము లేదనియు కొందరు వాదించుట కలదు కాని మన దేశపు గవర్నరు జనరలుగా నియమింపబడినవా రాయధికారముల నింతవరకెట్లుపయోగించిరో గమనించిన ప్రతివారికిని వాటిని ఇకముందుకూడ తొలగింపక పోవుట వలన కల్గునష్టము స్పష్టముగ తెలియును.

ఇంతవరకును మన దేశమునకు ప్రసాదింపబడనున్న ఫెడరల్ విధానములో నున్న కొన్ని ముఖ్యములగు లోట్లను చూచియున్నాము. పైన చెప్పబడినదానిని బట్టి అధినివేశస్వాతంత్ర్యమునకును ఫెడరల్ విధానమునకును పరస్పరవైరుధ్యము లేదనియు ఆ ఫెడరల్ విధానములోనున్న కొన్నిలోట్లను సర్దుబాటుచేసిన కొలది కాలములో మన దేశము అధినివేశ స్వాతంత్ర్యము ననుభవించుట కవకాశము లున్నవనియుకూడ తెలినది. ఎంతవరకైతే ఆమార్పులు చేయబడునో అంతవరకుమాత్రమే ఆ ఫెడరల్ విధానము ప్రజల యామోదమునకు పాత్రమయి జయప్రదముగ కొనసాగుట కవకాశము లుండును. కాంగ్రెసుపార్టీవారు ఆవిధానమునకు సుముఖులుగా నుండవలెనని బ్రిటిష్ మంత్రివర్గమువారియొక్కయు వైస్రాయియొక్కయు ఆశయమేని, పైనచూపబడిన మార్పులను వా రంగీకరించుట ప్రధానవిషయము. రామ్సే మాక్డొనాల్డుగారును, ఇర్విను ప్రభువుకూడ కాంగ్రెసువారిని తృప్తిపరచుటకు కల ఆవశ్యకతనుగూర్చి వక్కాణించియున్నారు. వారు తమ పలుకుబడి నుపయోగించి రౌండుటేబిల్ సమావేశములో ఆమోదింపబడిన ఫెడరల్ రాజ్యాంగ విధానమును హిందూదేశీయుల కనుకూలముగ నుండునట్లు మార్చుటకు సహాయపడవలెను. స్వదేశసంస్థానాధీశులుకూడ వారుచేయవలసిన మార్పులను చేసి హిందూదేశపు భావిభాగ్యోదయమునకు తోడ్పడెద రని తలంపవచ్చును.

## భీష్ముఁడు

జి. జాషువ గారు

వృద్ధవీరుఁడ! నీవయ స్సెంత? చెపుము-తండ్రి మరణించియే మూఁడుతరము లయ్యె
బోర! భారతయుద్ధమధ్యంబునందు-పడుచుపార్థుని తల్లడ పఱచినావు.
కోడెవయస్సు నిన్నలమి గోటికి మీసము చిక్కునాఁడు, ము
య్యేడుదినాలు పోరు వెలయించిన భార్గవరాముఁ డెంతయు

ల్లాడనో! మూఁడుగాళ్ల ముసలయ్యావు నేఁటి కెదిర్చి కృష్ణుఁడున్
గ్రీడియుఁ దల్లడిల్లి రవని న్నినుఁదాకు మగండు పుట్టునే.

ఆరయ నీవు ధర్మజున కాయువుపట్టెఱిఁగింపకుండినన్
శౌరియు, సవ్యసాచి మరునాఁడు రణంబున నిల్తురే! కృపా
పారగ! నిక్కపుం గినుక పైకొని నీవు ధనుస్సుఁ బట్టినన్
నీరయిపోవె లోకములు? నింగి గుభిల్లునఁ గూలిపోవదే.

వెలిమావుల్ రుధిరంబు గ్రక్క గతి దప్పం దేరు నంధించున
మ్ములతో గాండివ మూడె సాగవు కరంబుల్ బావ! ఆలంబునా
వలఁగాదంచు ధనంజయుండు కనుల్ బాష్పంబుల న్నిల్పఁడే!
బలమో లేక మహత్వమో యిది? వచింపన్ రాదు గంగాసుతా!

"ఈసత్యవ్రతుఁ డెంత? వీనిపస మాయింతుం జుమీ" యంచు నీ
పై సింహాకృతి నెత్తివచ్చు హరి నాహ్వానించి, "నాతండ్రి! రా
వే సంసిద్ధుఁడ"నంచుఁ బల్కితివి దేవేంద్రాదిబృందారకుల్
దాసోహ మ్మనకుండిరే? గగనకుల్యాపుత్ర! నీభక్తికిన్.

గురువు గొడ్డలి ద్రిప్పుకొని తప్పుకొనుదాఁక మరలి వెన్కకు రాని మార్గణంబు
ముత్తరంబులనుండి మొదిరి ముద్దలుగట్టి చేవ డిందని పచ్చియౌవనంబు
వసుసప్తకము సానఁబట్టి జీవముఁ బోసి యొసఁగుకక్కసపుటాయుధబలంబు
స్వర్గతరంగిణీస్తన్యంబు బలిమిని సంప్రాప్తమైన తేజశ్చయంబు
గవ్వకుం గాని పాడుశిఖుండిముందు వ్యర్థపుచ్చితె పార్థుని పరువుకొఱకు?
జగము నగలించు నీదివ్యశంఖరవళి పవ్వళించెనె యమ్ములపడకమీఁద?

అంబ శిఖండి యయ్యె నతఁ డాఁడుది, వాని మొగంబు సూడ నం
చుం బరిపూర్ణపౌరుషవిశుద్ధికి భంగము గల్గకుండ, వి
ల్లంబులు పాఱవైచితివి యర్జునవీరుని కీర్తి నిల్పి; గం
గాంబిక ధన్య యయ్యెను గదా, నినుఁగాంచి, ధనుష్మదగ్రణీ!

కౌరవుని యాస గంగలోఁ గలసిపోయె-పరశురాముని వేఁడినిశ్వాసములకు
నింద్రగిరి గ్రాఁగి బూది యయ్యెనుగదయ్య-శంతనుకుమార, నీవిల్లు జారిపోవ.



## రోమకచక్రవర్తి ముస్సోలినీ

ప్రపంచమున గల నిరంకుశప్రభువులలో రోమక సమ్రాట్టు ముస్సోలినీ అగ్రగణ్యుడు. అతనిమాటకు తిరుగులేదు. అతనిమాటయే యాదేశమున లాక్రింద చెల్లుబడి యగుచుండును. కాని అట్టి నిరంకుశప్రభుపతం బుని యేలుబడిక్రింద గూడ రోముదేశము అత్యంతశీఘ్రముగ నున్నతస్థితి కరుదెంచుచుండుట మాదావహామె గాక విస్మయదాయకముగ గూడ నున్నది.

బ్లాకెట్టు రేషియోవలన నమితధనమును హిందూదేశము గోల్పోవుచుండ ఫ్రాంకుతన స్రాంకుననున, రోము తన లీరానాణెమునకును విలువ హెచ్చించి ధనవంతము లగుచున్నవి. ముస్సోలినీ యొకసభయం దిట్లు నుడివెను:

"కృత్రిమపు మారకపురేటు దేశముయొక్క ఆర్థిక విపత్తునకు మూలకారణము. మనదేశపు బావుటాయే యందువలనమున కూలిపోవగలదు. మనకు మనదేశపు బావుటా సంరక్షణ మెంతముఖ్యకర్తవ్యమో కరెన్సీసంరక్షణకూడ నంత ముఖ్యతమమే. నాప్రాణము లున్నంతవరకు మన లీరానాణెపు విలువను నేను సంరక్షించుటకే పూనుకొనెదను." చూచితిరా, నిరంకుశ ప్రభువైనను ఉన్నత దేశారాధకుడు.

అంతియ గాక ఇటలీయందుభూకంపము కఱవులు మొదలగు నీతిబాధలవలన చాల ధననష్టము సంభవించినది. ముస్సోలినీ తనధనాగారమును బూడ్చుట కదివరకే విపత్తులసమయమున ఘనోద్ఘనోడున దుఃఖించు ప్రజలపై నూతనము లగు పన్నుల విధింపలేదు. బడ్జెటునందలి లోటును మంత్రిమొదలుకొని బంట్రోతువరకుగల ప్రభుత్వసేవకులు తమ జీతములోనుండి నూటికిపండ్రెండువంతున మినహాయించి యిప్పటమూలముగా నాల్గువందలనలుబదిమూడు కోట్ల లీరానాణెముల సంపాదించి నష్టమును భర్తీయొనరించి లీరానాణెముయొక్క విలువను యుద్ధాత్పూర్వపు రేటునకు దేగలిగినాడు. బూటకపు సంస్కరణములు, అధికార విరహితములగు శాసనసభలు మొదలగు బొమ్మలాటలకన్న దేశము నుద్ధరింపదలచినయొక్క నిరంకుశాధికారియే మిక్కిలి కోరదగినవాడు. ఇటలీదేశము భూకంప అగ్నిపర్వత దవానలారిష్టముల నమితధననష్టమునకు బాల్పడినను పరదేశములవారి సాయమును ముస్సోలినీ నిరాకరించి తనకాళ్లపైననే ఇటలీని నిలువబెట్ట గలిగినాడు. అతడెంతఘనుడు. ముస్సోలినీ నిరంకుశుడయ్యును తన నిరంకుశత్వమును దేశారాధనకొరకు, దేశోద్ధరణ కొరకు వినియోగించుచున్నాడు.

పులవర్తి కమలావతీదేవి.

---

## మాంసాహార మెప్పుడెట్లు ప్రచారములోనికి వచ్చెను?

ఇప్పటివారిలోఁ జాలమంది మనుష్యులకు మాంసాహారము వారిజన్మతోడనే యుత్పన్నమైనదనియు, నా యాచారమునుబట్టి క్రమక్రమముగ వ్యాపించి

యిప్పటివఱకు నవిచ్ఛిన్నముగఁ గొనసాగుచున్నదనియుఁ దలంతురు. కాని బాగుగఁ బరిశీలించి చూచినచో నిందలి యంశము నిలుచునది కాదు. అధునాతనయుగము నందు సుప్రసిద్ధ పరిశోధకుఁడగు డా డార్విన్ పండితుఁడు తన పరిశోధనకు ఫలముగ మనుష్యులు తొలుత కోఁతి జాతిలోని వారే యనియుఁ, గాలపరిణామాదులంబట్టి కోఁతికిఁబుట్టినకోఁతియే మానిసి యయ్యెననియు సిద్ధాంతీకరించెను. ఈతని మతమునుబట్టి చూచిన మనుష్యుఁడు ఫలాహారియు, శాకాహారియుఁ గాని మాంసాహారియై జనింపలేదని తెలియకపోదు. కోఁతులు ఫలములను దినునవే కాని మాంసము తినునవి కావు. కావున వానినుండి యుత్పన్నులైన మానవు లాదిని ఫలాహారులే యని యనుకొనుట యుక్తము.

భగవన్నిర్మితములగు పదార్థములు తత్తద్ధర్మముల కనుకూలముగనే సృజింపఁబడు చుండును. చెట్లు మఱియొకచోటునకుఁ బోయి యాహారమును సంపాదింపఁ జాలవు కావున వాని యాహారము వానికాళ్ల క్రిందనే జత పఱుపఁ బడినది. సింహము, పులి, పిల్లి, కుక్క మొదలగు జంతువులు మాంసాహారులుగనే సృజింపఁబడినవి కనుక వాని యవయవములన్నియు మఱియొక ప్రాణిని జంపి తన్మాంసమును సంపాదించుటకు తగినవై యున్నవి. మాంసాహారులుగనే సృజింపఁబడిన ప్రాణులు తమ పొట్ట నింపుకొనఁ దలంచినచో మఱియొక ప్రాణిని జంపి తీరవలెను. లేనియెడల వానికాహారము లభింపనేఱదు. మనుష్యులు కూడ మాంసాహారులేయైనచో తక్కిన మృగములవలె నిశితదంతములు, నిశితనఖరములు, కఠిన హృదయము— ఇతర ప్రాణిని జంపుటకు వలయు రీతిగ—కలిగియుండక తప్పదు. కాని యట్లున్నదా? మానవుఁడే ప్రాణిని జంపనెంచినను నిరాయుధుఁడై సమసింపఁ జాలఁడు.

కాకి మొదలగు పక్షులు మాంసమునుగూడఁ దినును గదా, వానికి జంతువులను జంపునంతటి బలము కలిగియందుల కనువుగ నవయవములు లేవే, అమాదిరిగనే మనుష్యులుకూడ నున్నారనుకొనరాదా? అని సందేహము కలుగవచ్చును. కాని కాకి మాంసాహారియైనను చచ్చిన జంతువుల యొక్క మాంసమును ముక్కుతోఁ బొడిచి తినును గాని జంతువును జంపఁగల సామర్థ్యము దానికి లేదు. మనుష్యులో బ్రతికియున్న దానిని జంపి తిందరు గాని చచ్చినదాని మాంసమును తినరుకదా? కావున మనుష్యులు తొలుత ఫల శాకాహారులుగనే సృజింపఁ బడిరనియు, మాంసాహారుల కుండవలసిన యవయవరచన వారియెడ లేశమును లేదనియు, నమునుఁగారణాంతరముల నొక్కరు మాంసము భుజింపఁ దక్కిన వారుకూడ నారీతి నవలంబించిరనియు మన మెఱుఁగవచ్చును.

దక్షిణ దేశమున సారస్వత గౌడబ్రాహ్మణులు కలరు. వారు మత్స్యముల భక్షింతురు. కాని తొలుత వారు కేవల శాక-ఫలాహారులే. వారిలో గొప్పగొప్ప విద్వాంసులు కలరు. సరస్వతి వారి నాల్కచివరఁ దాండవమాడుచుండెడిది. ఏడెనిమిది వేల సంవత్సరముల క్రిందట గొప్ప కఱవు సంభవించెను. అపుడు వారికిఁ దినుట కేమియు లభింప లేదు. తమ జీవనమును, విద్యలను గాపాడుకొను టెట్లని వా రాలోచించి యాలోచించి, తుదకు చేఁపలను దిని ప్రాణములను నిలుపుకొనఁ దలఁచి యప్పుడా మార్గము నవలంబించిరి. ఆ యాచారమునుబట్టి పారంపర్యముగ నా యలవాటు వారికలోనికి వచ్చినది. ఆపత్తులలో నుపయోగించిన యాచార మలవాటుపడి వారు దానిని విడువకున్నారు. ఉత్తరదేశము నందలి గౌడ సారస్వతులు మాత్రము నేఁటివఱకు శాకాహారులుగనే యున్నారు.

వేలకొలఁది సంవత్సరము లుగడచినవి. ఆవెనుకటి యుగములఁ గనినచో నప్పటివారు చెట్లయంతటి పొడవుగలవారై యుండెడివారు. మనుష్యులు చెట్లనుండి ఫలములను దీసికొని వానిని భక్షించుచుండెడివారు. వారి యవయవరచన (అనఁగా పొడుగుపాటి కాళ్లు, చేతులు) తదనుగుణముగనే నిర్మింపఁబడినది. లేనిచో మానవుఁడు కూడ చతుష్పాత్తులరీతి నే యుండవలసినవాఁడే.

మన వాఙ్మయమునఁ బ్రాచీనతమమగు గ్రంథము ఋగ్వేదము. ఋగ్వేదమున నెచ్చటను మాంస మాహారమై యున్నట్లుగ వర్ణింపఁబడలేదు. అం దన్నవాచకశబ్దము

లన్నియు వనస్పతిపరములుగ నున్నవి. అన్నములలో సోమమే రాజు. అదియే దేవతల కాహారము. కావున మనుష్యులకుఁగూడ నట్లేయని యూహింపవలెను. దేవతలకు మాంసమే యన్నమై యుండు పక్షమున మనుష్యులకు నట్లే యుండవలసి యుండెడిదికదా! ఆవేదయుగమున మాంస మాహారరూపమున నుండినచోఁ దప్పక యది వేదమున నెచటనేని ప్రస్తావింపఁబడి యుండెడిది.

దేవతలమృతాంధసులు కాని మాంసాంధసులు కారు. "అమృతాంధ" శబ్దము వారియెడనే రూఢమైయున్నది. దేవతలకంటెను బూర్వమున నున్న జాతి రాక్షస జాతి. రాక్షసులును తొలిరోజులలో బ్రహ్మచర్యమును, ధర్మమును, తపస్సును ఒనర్చెడివారు. పరులను రక్షించుటకై యాత్మసమర్పణమును జేసెడివారు. కాని రాక్షసుల బల మధికమైన పిదపఁ దమసుఖముకొఱకుఁ బరులను సంహరింప వారు ప్రారంభించిరి. కాఁగా నెవ్వరు పరార్థమై యాత్మసమర్పణ మొనర్చిరో వారే, ఆ రక్షకులే, భక్షకులైపోయిరి. వారు సుఖలాలసులై పరులసుఖదుఃఖముల నెఱుంగక క్రమక్రమముగ మాంసాహారులైపోయిరి. కాన "పలాశి" శబ్దము రాక్షసులందే రూఢమై వాడఁబడుచున్నది. (పలమన మాంసము, అశి అనఁగ దినువాఁడు). అక్కృతన సుజనులైయుండిన రాక్షసులు, తమ స్త్రీల పాతివ్రత్య రక్షణముఁ గోరు రాక్షసులు, తుదకు దుర్జనులై పరస్త్రీలఁ జెఱఁబట్ట ప్రారంభించిరి. ఈ మీఁదఁ జెప్పినరీతిని మొదట శాకాహారులును, ఫలాహారులు నగువారు మాంసాహారులై పోయిరి

మహాభారతమున నొక యితిహాసము కలదు. వసు రాజని యొకరాజు కలఁడు. అతనిప్రోల దేవతలకును, ఋషులకును యాగము విషయమై వివాదము కలిగెను. యజ్ఞమునఁ దప్పక పశువును జంపవలెనని దేవతలును, నిర్మాంసయజ్ఞమే చేయవలయునని ఋషులును వాదించిరి. దేవతలయెడఁ బక్షపాతియగు వసురాజు పశువును చంపుటయే శ్రేయమని తీర్మానించెను. అక్కాలమున నిర్మాంసయజ్ఞమే యుత్తమ మనువారిసంఖ్య మిక్కిలి యెక్కువ యగుటచే వారా రాజును బదభ్రష్టునిగాఁ జేసిరి. ఋగ్వేదమునందు నొకానొకయెడ యాగములు వసంతాది ఋతువులలోఁ బ్రారంభింపఁబడుచుండునట్లును, నిసర్గసిద్ధములగు పదార్థత్యాగమునే నిర్వహింపఁబడుచుండినట్లును గలదు. క్రమక్రమముగ పశుహింస యజ్ఞమున నవకాశము కల్పించుకొనెను గాని తొలుత హింసలేని యజ్ఞములే యొనర్పఁబడుచుండెడివి.

పరిశీలించి చూచినచో నీయంశ మిప్పటి యజ్ఞములఁ బట్టియుఁ దేటతెల్లము కాఁగలదు. అందు "పూర్వవేది" యందుఁ గేవలము వనస్పతుల ధాన్యములనే హవనము చేయవలెను. "ఉత్తరవేది" యందు మాంసము హవనము చేయఁబడును. మొదటినుండియు మాంసాహారము ప్రచారమున నున్నచో నీ "పూర్వోత్తర" భేద ముండియుండదు. వసురాజు కాలమునఁగూడ మాంసాహారము ప్రచారమున లేదు. ప్రచారముననే యున్నచో వాదములును, రాజునకు రాజ్యభ్రష్టతయుఁ గలిగియే యుండకపోవును.

హిందువులలో నిపుడు చాలమంది మాంసము తినువారు కలరు. మాంసాహారము ప్రచారమునకు వచ్చిన పిదపఁగూడ పితృశ్రాద్ధ దినాది పవిత్ర దినములందునను, ఏకాదశి, పౌర్ణమి మొదలగు పర్వదినములందును మాంసము తినరాదను నియమము కలదు. తొలుతనుండియు మాంసమాహారముగ వాడఁబడినచో నీ నిషేధ మేల యుండును?

మానవుల తొల్లింటి యాహారము ఫలములు; ఆపిదపఁ గందమూలములు; క్రమక్రమముగ విషయలాలసులగుట ధాన్యముల లోనికి దిగినది. ఆధాన్యములలోను మొదట "అకృష్టపచ్యధాన్యమే" యాహారము. అనఁగా దున్నకుండఁ జల్లి పండించిన ధాన్యము. ఆపిదప "కృష్టపచ్యములు" భూమి దున్ని యూడ్చి పండించినధాన్యము

ఆపత్సమయమున నమలులోనికి వచ్చిన యాచారములను బట్టి తొలుతనుండియు నాయాచారములు కలవనుట యనుచితము. చీనాదేశమున నొకప్పుడు గొప్పకఱవు ప్రాప్తించెను. అపుడు జంతుమాంసముకూడ సరిపోవక పోవుటచే మనుష్యమాంసముకూడ నాహారముగనుపయోగింపఁబడెను. దానినిబట్టి మనము తొలుతనుండియు మనుష్యులు మనుష్యులనే చంపి తినెడివారని చెప్ప వీలగునా?

ఒక్క యీ కాలమునందేగాక మఱికొన్ని సమయములంబట్టియు మాంసాహార మాచరణమునకు వచ్చెను. యుద్ధము చేయు సైనికులకు దృఢమగు బలము కలుగుటకిది యుపయోగకారి యయ్యెను. అట్లే యమానుష కృత్యములకొఱకును, కొన్నికొన్ని మంత్రతంత్రములకును ఇది యుపయోగమునకు వచ్చి క్రమక్రమముగ నాచారమై పోయెను.

మన శాస్త్ర సంప్రదాయములం బట్టి చూచిన డా॥ డార్విన్ పండితుని మతము నమ్మఁదగినదియుండ వీలుపడదు. ప్రళయమున నణురూపమున నున్న ప్రకృతి తదనంతరము విస్తృతియై తత్తదిచ్ఛాది మూలమునఁ బరమాణు సముదాయ మొకటియొడఁ గూడి యొక్కొక వ్యక్తియై యుత్పన్నమగును. అన్ని జంతువు లొక్కమాఱే సృజింపఁబడినవి కాని నక్కనుండి కుక్కయు, కుక్కనుండి పిల్లియు నీరీతి నుత్పన్నములు కాలేదు. కావునఁ గోఁతినుండి మానిసి పుట్టెననుట నమ్మఁదగినది కాదు. ఆదిని లేక నడుమ వచ్చిన యీ యాచారము కులక్రమాగతమని పట్టుకొని కేవల స్వార్థ పరాయణులై మానవులు జీవజంతువులఁ జంపి భక్షించుట యుక్తమైన పని కాదు. పరాత్పరుని సృష్టిలో మనుష్యున కెంత హక్కు కలదో నోరులేని జీవజంతువులకుఁగూడ నంతటి హక్కు కలదు. తనయొడల గండ్లఁ బడుచున్నపుడు తన కెంతటి కష్టము కల్గునో మానవుఁడు యోచించినచో, జంతువులు జంపునపుడు దాని కెన్ని మడుంగులు బాధ, కష్టము కలుగునో యూహింపఁగలఁడు.

క్షణికమగు జీవితమున, అక్షణమున నెన్నవకోటి వంతు కాలపరిమితమగనో యుండు మాంసాహారాస్వాద జనితానందము ననుభవించుటకై గర్భనిర్భేదకములు, క్రూర కృత్యములొనర్చుట పాడిగాదు. అహింసయే యుత్తమ ధర్మమని యెంచినచో నడుమ వచ్చిన యీ మాంసాహారాచారము నాశనమై పోక మానదు.

(హిందీ "వైదికధర్మ" పత్రిక ననుసరించి.)

బులుసు వెంకటరమణయ్య

---

## ఎఱ్ఱాప్రగడయొక్క గురువు

పేరుప్రతిష్ఠలు గాంచిన పెద్దల జీవితవిశేషములను వినవలెనని అందఱకును కుతూహలముండును. హరివంశమును, నారసింహపురాణమును రచించి, భారతారణ్యపర్వశేషమును బూర్తిచేసి అనల్పకవితావైచిత్రిని ప్రకటించి ప్రబంధపరమేశ్వర బిరుదాంకితుడగు ఎఱ్ఱాప్రగడ యొక్క గురువుపేరు మన కింతవరకును తెలియలేదు. కాని యీమధ్య నేను చూడ దటస్థించిన ఒకతాటాకు గ్రంథమున నీపద్యము గలదు:

సీ. తమకటాక్షము బల్లిదపుకుంచెకోల యీ
 వైకుంఠనగర కవాటములకు
తనపాదతీర్థ ముత్కటనీలమేఘము సూ
 సకలచేతనచిత్త సస్యములకు
తనసుప్రసాదంబు విమలాంజనము పరం
 ధామస్వరూప విధానములకు
తనప్రభావము ఘోరతరపంచవదన సూ
 చండపాషండ వేదండములకు
ననగ కందాళ పరదేశికాప్పకగ్ర
శిష్యుడై మించు పెద్దింటి శింగరాత్మ
జాత తిరుమల తిరుమలాచార్యవర్య
సన్నుతియొనర్తు మద్గురుస్వామి నెపుడు.

దీనినిబట్టి పెద్దింటి శింగరాచార్యుని కుమారుడు తిరుమలాచార్యులు ఎఱ్ఱాప్రగడకు గురువు. ఈతిరుమలాచార్యులు కందాళ పరదేశికాప్పలాచార్యుని శిష్యుడు. వీరిరువురును వైష్ణవాచార్యులు. అయినను నృసింహపురాణమున,

క. గిరిశ పదభక్తిరసత
 త్పరభావము కలిమి శంభుదాసుం డనగా
 బరగిన గోవిందగుణా
 గర సంభృతసౌమనస్య ధన్యుడ వెందున్.

అని చెప్పికొనినదానినిబట్టి ఎఱ్ఱాప్రగడ శంభుదాసుడును, హరిదాసుడునుగూడ నైయుండెను.

నిడమర్తి సత్యనారాయణమూర్తి.

---

## కీ. శే. శ్రీ పారనంది రామశాస్త్రిలుగారు



1930 సం. డిసెంబరునెల 6 వ తేదీని సాయంకాలము నాలుగు గంటలకు స్వర్గస్థులైరి.

'అనాయాసేన మరణం వినా దైన్యేన జీవనమ్'

అను నుడి ననుసరించి యాత్మ గౌరవమున కే లోటును వాటిల్లకుండ బండితాగ్రగణ్యులని ప్రసిద్ధిఁ బొంది, గొప్పయాస్తికబుద్ధితో నిరతముఁ బరమేశ్వర పాదాబ్జమరందపానలోలుపభృంగులయి, సహస్రమాస జీవులయి, ప్రాణోత్క్రమణ సమయంబునను శ్రీకంఠ నామధేయచింతాయుక్తులయి స్వగృహంబునఁ బుత్త్రి పౌత్ర భ్రాతృ మిత్ర బృందంబులు గొలుచుమండ నీ మహానుభావులు నిజపుణ్యరాశిం గలిగిన యానందంబును బొంద దివిం జేరిరి. వీరు పర్లాకిమిడిపురవాసులు, సంస్కృతాంధ్రముల రెంటియందును గొప్ప ప్రసిద్ధిఁబొందిన విద్వాంసులు.

వీరు మొట్టమొదట పర్లాకిమిడి సంస్థానమునకుఁ జేరిన 'పెందువాడ' యను పల్లెటూరిలో జనియించి పరిసరగ్రామంబులఁ గావ్యనాటకాలంకారంబులఁ బఠించి శాస్త్రాధ్యయనముం బొనరింప బొబ్బిలికేగి యందు విఖ్యాతిఁ గాంచిన బ్రహ్మశ్రీ సుసర్ల సీతారామ శాస్త్రిలవారికడఁ దర్కాలంకార వేదాంతశాస్త్రముల నభ్యసించిరి. ఇట్లు కృతవిద్యులయి వీరు నిజానుజులు మొదలగు కుటుంబమును సంరక్షించుటకు నడుము గట్టుకొని నిలువంబడవలసి వచ్చెను.

'సిద్ధాంతమునకు మాలకుమారులను, సుప్రసిద్ధ కవిశేఖరులునునగు మ.రా.శ్రీ త్రిపురాన వేంకటసూర్య ప్రసాదరావు దొరవారికి జనకులునునగు మ.రా.శ్రీ త్రిపురాన తమ్మయ్య దొరవారు వీరి పాండిత్యమును నెఱింగి మైత్రి నెఱపి వీరి ననేకవిధముల గౌరవించిరి.

ఆ కాలములో విద్యాపరీక్షయందు నుత్తీర్ణులై సభలలోఁ బరీక్షనిచ్చి ఖ్యాతినిఁ గాంచుటయేగాక యనేక విద్వత్సభలలో తర్కశాస్త్రముపయి వాదప్రతివాదముల సల్పి నూటపదార్లు బహుమానములను శాస్త్రిలవారు పొందుచుండిరి. విద్యాభోజులని ప్రసిద్ధిఁగాంచిన పర్లాకిమిడి సంస్థానాధీశు లిట్టి పండితవతంసులు తమ తాలూకాలో నున్నారని యెఱింగి సంస్థానపు టున్నతవిద్యాలయములో నుపాధ్యాయునిగా వీరిని నియమించిరి. 1883 వ సంవత్సరములో 15 రూపాయీల వేతనముపయి నుద్యోగమునఁ బ్రవేశించిన వీరు 1911 వ సంవత్సరమున 50 రూపాయీల వేతనమును గ్రహియించుచుండి, కుమారుఁడు పట్టపరీక్షలో నుత్తీర్ణుఁడయి యుద్యోగమునందుఁ బ్రవేశించిన వెనుక విశ్రాంతిఁ గైకొని 19 వత్సరములు గౌరవవేతనమును బొందిరి.

ఆ దినములలో మ. రా. శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు తెలుఁగుభాషకు సంబంధించిన చర్చలను లేవఁదీయుఁగా నా చర్చల తత్త్వమును గనుంగొనుటకయి తను కప్రధానముగానుండిన యాంధ్రభాషా విషయమునఁ బనిసేయం దొడంగిరి. ప్రతిభాసంతులగు విద్వాంసులకు విజ్ఞానమునందలి యనాంతరశాఖాభేద మొక ప్రతిబంధక మెన్నఁడును గానేరదని మన మెఱింగిన విషయమేగదా? సుప్రసిద్ధగణాయన శాస్త్రవేత్తయగు పాశ్చరుగారఖండమగు సిద్ధాంతములను వైద్యశాస్త్రమునం దొనరించి యుండలేదా! అట్లే వీరును నాంధ్రభాషాతత్త్వమును బరీక్షించి యందలి సారమును నాంధ్రావళి కర్పించుటకు మహాప్రమాణగ్రంథ మగు నాంధ్రభారతము నామూలాగ్రముగాఁ బరిశీలించి దాని పయి నెన్నిటినో గ్రంథముల రచియించి యున్నారు.

## వీరి రచనములు

(1) ఆంధ్ర మహాభారత విమర్శనము—ఇయ్యది 500 పుటలలో వ్రాయంబడిన యముద్రితగ్రంథరాజము. భారతమునందుఁ బయలుదేఱు ననేకములగు ప్రశ్నముల కుత్తరము లిందున్నవి. భారతమునందలి చిక్కుగల పట్టుల నన్నిటిని విమర్శించి, భాషావిషయకములు, నర్థవిషయకములునగు చర్చలతో నీగ్రంథమును వీరు రచియించిరి. ఇందుద్యోగపర్వ విమర్శనముమాత్రము ముద్రితమైయున్నది.

(2) ఆంధ్రశబ్దచింతామణి కుద్ద్యోతినీ వ్యాఖ్యానము—ఇది ముద్రితము. ఈ పుస్తకమున వీరాంధ్రులకు మఱవరానియుపకారముఁ జేసిరి. ఆధునికులలో నాంధ్రశబ్దచింతామణి నన్నయకృతము కాదను వీరేశలింగము పంతులవారివాదమునకు ముఖ్యయుక్తి, భారతప్రయోగములకును చింతామణిలక్షణములకును వైరుధ్యము గలదను వాదమును, నుదాహరణపూర్వకముగ ఖండించి తమ వ్యాఖ్యానముచే నన్నయ కర్తృత్వమును స్థాపించిరి. ఇప్పు డంతకంతకుఁ బండితులు వీరి వాదమునే గ్రహించుచు వీరి యభిప్రాయమునే యామోదించుచు వచ్చుచున్నారు. ఇందు వీరి ప్రయత్నము మిక్కిలి ప్రశంసార్హము.

(3) కురుక్షేత్ర యుద్ధకాలమును నిర్ణయించుచు వీరొకగ్రంథమును వ్రాసిరి. ఇదియును జిజ్ఞాసువుల కమూల్యమైనది.

(4) భారతాద్యాంధ్ర గ్రంథపఠనముచే యతిప్రాసముల నిర్ణయమును గుఱించి వీరికిఁ గొన్ని నూతనములగు స్వతంత్రాభిప్రాయములు గలుగఁగా వాని నన్నిటినిఁ జేరిచి యొక్క గ్రంథమును రచియించిరి. ఆంధ్రభాషయందలి యతిప్రాసనియమములను గుఱించి తెలిసికొనఁ గోరువారి కిది మిక్కిలియు నుపయోగకరమైనది.

(5) 'జ్ఞ' అను వర్ణము కంఠ్యమా తాలవ్యమా యను విషయమును గుఱించి వీరు చేసిన విమర్శనమును దెలిపుచ్చిన సిద్ధాంతమును దప్పక పండితులయాదరమును బడయఁదగినవి. ఈ విషయమును గుఱించి వీరు వ్యాసములను వ్రాసి భారతిలోఁ బ్రచురించిరి.

(6) వేదాంతశాస్త్రమందుఁ బాండిత్యమును నభిమానమును గలవారు గనుక నాశాస్త్రమునందలి ప్రస్థానత్రయమును బెక్కుసారులు పఠించి జ్ఞానమార్గమును గర్మమార్గమును సమన్వయించుచు భగవద్గీతల కొక గొప్ప వ్యాఖ్యానమును వ్రాసిరి.

(7) ముఖలింగక్షేత్రమునకు సంబంధించిన పురాణగాథను గ్రహించి 'మధుకేశ్వరీయము' అను పేర నాటకముగా రచియించిరి. ఇది సంస్కృతమునందు వ్రాయఁబడినది. ఇది ముద్రితము.

వీరియెడల వీరియాస్థాన ప్రభువులగు శ్రీ శ్రీ శ్రీ కృష్ణచంద్ర గజపతి నారాయణదేవు మహారాజుల వారికిఁ జాల గౌరవమున్నది. ధర్మశాస్త్రమునం దేసందియము గలిగినను వీరి నిర్ణయమునే గ్రహియించుచుండిరి. ప్రస్తుతపు మహారాజులవారి పినతండ్రిగారికిని వీరియందు గౌరవముండుటచే సంస్కృత నాటకరచనమునకు వీరిం బ్రేరించుచుండిరి.

ధర్మశాస్త్రమునందు వీరికి గొప్ప యాదరమును బాండిత్యమును నుండెడిది. శిష్టాచారమునకు సరియగునట్లుగా ధర్మశాస్త్రముల నన్వయముచేసి వీరు పూర్వాచారములను రక్షించుటకు బద్ధకంకణులై యుండిరి. ఏనాఁడునుగూడ త్రికాలసంధ్యావందనమును విడువక దీక్షాపరులై కాలమునంతయు నిజముగ వైదిక జీవితముగాఁ గడిపిరి. వీరికిఁ బయి నాలుగైదుశాస్త్రములందును బ్రతిభమాత్రమే కాక వాదప్రతివాదములయందు గొప్పయుక్తి కలుగునట్లు సమాధానములిచ్చుశక్తి యపారముగా నుండెడిది. మొదట ధనవంతులు కాకపోయినను నాత్మగౌరవమును గాపాడుకొనుచు యాచనలకుఁ దక్కిన పండితులవలె నన్నిచోట్లకు నేగక దమకున్న దానిలోనే కాలక్షేపముఁ జేసికొనుచు జీవితమునంతను గడిపిరి. వీరికి నడిమివయసున భార్యపోయినను బిల్లలుండుటచే, బంధువు లెన్నిరీతుల బోధించినను వివాహమున కొప్పుకొనిరి కారు. పుత్త్రు లిరువురున్నప్పుడు, వయసు

యౌవనము దాటినప్పుడు వార్ధకములోఁ దన సంరక్షణమునకై పునర్వివాహ మొనరించుకొనుట యశాస్త్రీయమని వీరి నమ్మకము. ఉద్యోగమునుండి విరమించిన తరువాత సన్న్యాసాశ్రమము స్వీకరించుటకు యోచించిరి గాని యీ కాలములో సన్న్యాసాశ్రమము సరిగా జరుగదు గావున భ్రష్ట సన్న్యాసముకంటె వానప్రస్థమువంటి తమగృహస్థాశ్రమ జీవనమే యుక్తమని యెంచి యాయోజననుండి విముఖులయిరి. విశ్రాంతిఁబొంది జీవనముఁ జేసిన కాలమునందు వీరేపదార్థమునందును మమకారము లేక గ్రంథకాలక్షేపముఁ జేసికొనుచు విరామకాలమునఁ జతురంగము నాడుకొనుచు గాలమును వెళ్లఁబుచ్చిరి.

శరీరమునం దేవ్యాధియును లేకయే, పండుపండినట్లు పండి తుదిని వీరు 79 వ సంవత్సరములో గతించిరి. క్రమముగా శరీరము కృశించి తుదిరోజులవఱకును నిత్య కర్మానుష్ఠానములు వదలక, అనాయాసముగాఁ బరమపదించిరి. మరణకాలమున వీరి కిష్టమగు ప్రార్థనా శ్లోకములు చెవిలోఁ బెద్దకుమారుఁడు చదివి వినుపించుచుండఁగాఁ బరమేశ్వర నామమును స్మరించుచు దివిం జేరిరి.

ఇట్టి మహామహులయాత్మకుఁ బరమేశ్వరుఁడు శాంతి నొసంగుఁగాక. అమూల్యరత్నమగు వీరినిఁ బోఁగొట్టుకొనిన వీరి కుటుంబమున కెంతయు సానుభూతిని జూపించుచున్నాము. వీరిమరణ మాంధ్రలోకమున కొక గొప్ప లోటు.

'ఒక శిష్యుఁడు'

---

## కీ. శే. మౌలానామహమ్మదాలీగారు

### 'స్వరాజ్యమో, స్వారాజ్యమో' "రెంట్లో ఒకటి."

మహమదాలీగారు లండను నగరమునందు కడచిన జనవరి నెల 4-వ తేదీ యుదయము మరణించిరి. వీరి మృతివలన భారతదేశమునకు తీరని కొఱఁత ప్రాప్తించినది. మహమదాలీగారు తమ భయంకర శరీరస్థితిని సరకుగొనక, 'రౌండుటేబిలు' సమావేశమున తమ మతమునకును, దేశమునకును ప్రస్తుత సందిగ్ధస్థితియందు సేవ సలుపదలచి, ఇంగ్లాండునకు బోయియుండిరి. అచట సమావేశమునందు వీరు గావించిన మహోపన్యాసము దేశీయుల స్మృతిపథమునందు చిరస్థాయిగ వెలయగలదు.

### జీవిత సంగ్రహము

మహమదాలీగారు 1878వ సంవత్సరమునందు జననమొందిరి. వీరి తండ్రిగారగు అబ్దుల్ అలీఖాన్ గారు రాంపూర్ సంస్థానమునం దున్నతోద్యోగులుగ నుండిరి. మహమదాలీగారు జనించిన యనతికాలమునకే అలీఖాన్ గారు దివంగతులైరి. వీరియన్నగారగు షౌకతాలీగారి కపుడు వయస్సు రెండేండ్లుమాత్రమే. అలీసోదరుల తల్లియగు 'బీ అమ్మ' భర్తృమరణానంతరము తన పుత్రరత్నముల కడుశ్రద్ధతో పెంచి పెద్దవారలను జేసెను. ఈమె



ధైర్యసాహసములవలననే అలీసోదరులు దేశనాయకులయి మహోన్నతిని గాంచిరి.

---

## విద్యాభ్యాసము - విదేశగమనము

అలీఘర్ కళాశాలయం దున్నతవిద్యను బడసి, పిమ్మట మహమదాలీగారు ఇంగ్లాండునకేగి, ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయమునందు విద్య నభ్యసించిరి. 1898 నుండి 1902 వరకు న్యాయవాదివృత్తినుండి మాతృదేశమునకు మరలివచ్చిన పిమ్మట, వీరు బరోడాసంస్థానమందు నల్లమందుశాఖలో నుద్యోగము నిర్వహించిరి. కాని, తమకుగల యాశయముల కాయుద్యోగ మొప్పియుండనందున మహమదాలీగారు దానిని వదలుకొని, పత్రికాప్రపంచమున ప్రవేశించిరి.

'టైమ్సుఆఫ్ఇండియా', 'హిందూస్థాన్‌రివ్యూ', 'స్పెక్టేటర్' మున్నగు పత్రికలకు వీరు వ్యాసముల వ్రాయుచుండిరి. తమయాంగ్లవారపత్రికయగు 'కామ్రేడు' నందు వీ రానాటి సమస్యలను నిర్భయముగ విమర్శించుచుండిరి. ఐరోపా మహాసంగ్రామము ప్రారంభమయినపుడు 'టర్కీయొక్క కర్తవ్యము'ను గూర్చి వీరు 'కామ్రేడు'లో వ్రాసినవ్యాసము చరిత్రప్రసిద్ధము. ఈ వ్యాసమునకు ఫలితముగ వీరి పత్రిక లణచివేయబడుటయు, అలీసోదరులు నిర్బంధింపబడుటయు తటస్థించినది.

మహమ్మదీయసమితి 1906 లో స్థాపింపబడెను. ఈ సంస్థకొరకై మహమదాలీగారు మిక్కిలి పాటుపడిరి. 1912 లో బాల్కన్‌యుద్ధము జరిగినపుడు, టర్కీసహాయార్థమై వీ రాదేశమునకు వైద్యులను బంపిరి. తమ సంఘము వెనుకబడియున్నదని గ్రహించి, దానిని ముందుకు దీసికొని వచ్చి, వారిచేకూడ దేశసేవ యొనరింపజేయుటకు యత్నించిరి.

ఐరోపా మహాసంగ్రామము ప్రారంభమయినపుడు ఇండియాయందలి మహమ్మదీయు లగ్నిపరీక్షకు లోనైరి. టర్కీలో నుండెడి ఖలీఫాకు వారు మతవిషయకముగ లోబడియుండిరి. ఇండియాలో నాంగ్లేయులయధికారము క్రింద నుండిరి. తుదకు వారు గ్రేటుబ్రిటన్ పక్షమే యవలంబించి, స్వమతస్థులగు టర్కీదేశస్థులతో పోరాడిరి. కాని, టర్కీని బలాత్కారముగ 'టైమ్సు' పత్రిక దూర, మహమదాలీగారు కినుక జెంది, పూర్వోదాహృతమైన వ్యాసమును 'కామ్రేడు' పత్రికలో వ్రాసిరి. 1915 వ సంవత్సరము మేనెలలో 'ఇండియాదేశ సంరక్షకచట్టము' క్రింద మహమదాలీగారు నిర్బంధమునం దుంచబడిరి. 1919 సంవత్సరం డిసెంబరు నెల 25-వ తారీఖునాడు సార్వభౌముని ప్రకటన ననుసరించి వారు విడుదల గాంచిరి. అపుడు అమృతసరములో సమావేశమైయుండిన హైందవజాతీయ మహాసభవారు వీరికి గొప్ప స్వాగత మొసంగి, ప్రేమ గౌరవముల ప్రదర్శించిరి.

ఐరోపా మహాసంగ్రామానంతరము మహమ్మదీయుల పవిత్రస్థలములను గూర్చిన బ్రిటిషు ప్రధానామాత్యుని వాగ్దానము చెల్లింపబడకపోగా, అలీసోదరులు ఖిలాఫత్ ఉద్యమమును ప్రారంభించిరి. గాంధీమహాత్ముని నాయకత్వము క్రింద జాతీయమహాసభ యీ యుద్యమమునందు హృదయపూర్వకముగ తోడ్పడెను. 1920 సంవత్సరం ఆగస్టు 1-వ తేదీని అసహాయోద్యమము ప్రారంభింపబడి, యాసమాచారము ఇంగ్లాండునకు రాయబారము పోయియుండిన మహమదాలీగారికి దెలుపబడెను. గాంధీమహాత్మ ననుసరించి, అలీసోదరులానేకు హిమాచలము ప్రచారము సలుపుచు, యాత్ర సలిపిరి. 1921 వ సంవత్సరము సెప్టెంబరు నెల 14-వ తేదీని మహమదాలీగారు వాల్తేరు స్టేషనులో నరెస్టుచేయబడి, కరాచీనగరమునకు గొంపోబడిరి. అచట జరిగిన విచారణ చరిత్రప్రసిద్ధమైనది. అలీసోదరులకు 2 సంవత్సరముల కఠినశిక్ష విధింపబడెను. ఆ రోజులలో హిందువులకును, మహమ్మదీయులకును గలమైత్రికి అలీసోదరులతోపాటు శ్రీ శంకరాచార్య స్వాములును నిందితులుగ నుండుట తార్కాణము.

మహమదాలీగారు 1923 వ సంవత్సరము చివరభాగమున కారాగృహ విముక్తులయిరి. వెంటనే వారు రాజకీయరంగమున ప్రవేశించి స్వరాజ్యపక్షమువారికి ఎన్నికలలో పాల్గొనుటకు జాతీయమహాసభచే ననుమతి నిప్పించిరి. డిసెంబరునెలలో కాకినాడయందు జరిగిన దేశీయమహాసభకు మహమదాలీగా రధ్యక్షత వహించిరి. మహమదాలీగారు కాంగ్రెసు మహాసభసమా

వేళమున నొక దివ్యజ్యోతివలె ప్రకాశించిరి. ఆ పవిత్ర వాసరములు చిరస్మరణీయములు.

పిమ్మట నాల్గయిదు వత్సరములవరకు మహమ్మదాలీగారు కాంగ్రెసుకొరకయి కొద్దిగనో, గొప్పగనో కృషిసలుపు చుండిరి గాని, క్రమక్రమముగ వారికిని, కాంగ్రెసు సంస్థనకు అభిప్రాయభేదము గలిగి, తుదకు 1980 సంవత్సరాంతమునందు వారు రౌండుటేబిలు సమావేశమునకు దేశీయుల యిచ్ఛకు వ్యతిరిక్తముగ వెళ్లుటయు జరిగెను. కాని, యాసమావేశమునందు వారు హైందవుల దృఢనిశ్చయమును స్పష్టముగ జాటి, యెల్లరి మెప్పును బడయగలిగిరి.

మహమ్మదీయులకు పవిత్రస్థలమగు జెరుసెలం నగరములో వీరి మృతశరీరము సమాధిచేయబడెను. తమ మతమునకై తను జీవితమునంతను సమర్పించియుండిన వీరి నీవిధమున మహమ్మదీయప్రపంచము గౌరవించెను.

మహమదాలీగారి కీర్తి చిరకాల మీపవిత్ర భారతభూమియందు వెలసి, దేశారాధకులకు మార్గదర్శక మగుగాక!

సరస్వతుల చంద్రశేఖరశాస్త్రి

---

* శా. మాయాశీలురు చంచలాత్ము లసుకం
పాశూన్యు లాత్మైకకా
ర్యాయత్తుల్ సమయానుకూల హృదయ
వ్యాపారగోపాయనో
పాయజ్ఞుల్ మగవార లాపయి మహా
రాజుల్ మహావైభవ
శ్రీయోగాంధులు చెప్ప నేల మగవా
రి న్నమ్మఁగా వచ్చునే?" –వసు.

శ్లో. మాయాశీలాః ప్రకృతిచపలా
నిర్దయా ధూర్తవృత్తా
స్స్వార్థాయత్తా స్సమయహిత హృ
ద్గోపనోపాయదక్షాః,
సాధారణ్యా దితిహి పురుషా
స్తత్ర చాపి క్షితీశా
శ్శ్రీయోగాంధాః కిముత? పురుషా
నైవ విశ్వాసయోగ్యాః.

అయం శ్లోకః పురాణం సూర్యనారాయణశాస్త్రిణా త్రింశద్వర్షేభ్యః పూర్వమేవ రచిత ఇతి జానన్తు పాఠకా ఇతి కవయితా నివేదయతి.

---

శ్రీ బి. చెంగారెడ్డిగారు, బి. ఏ.




వీరిది నెల్లూరు. వీరు షేక్సుపియరు మహాకవి నాటకములయందలి పాత్రములను చాతుర్యముతో ప్రదర్శింపగలవారు. వీరిగాత్రము అద్భుతముగ మారుచుండును. వీ రిటీవల చెన్నపురమున కొన్ని ప్రదర్శించిరి.

---

# వీణాచార్య సంగమేశ్వరశాస్త్రి నిర్యాణము

పి. చిదంబరశాస్త్రి గారు



కీ. శే. వీణాచార్య తుమరాడ సంగమేశ్వరశాస్త్రిగారు, పిఠాపురము.

నీ గమన మెల్ల వేళల-నాఁగెడు సహృదయుల మూర్ఛ నందించి స్వవీ
ణాగానమూర్ఛనలచే-నేగితివే? దివికి సంగమేశ్వరశాస్త్రీ!

ప్రాచీనం బయినట్టిమార్గమున సంపాదించి వైదుష్య మ
ర్వాచీనుల్ గొనియాడు నూతనకళావైదగ్ధ్యముం గాంచి వీ
ణాచార్యుం డను ఖ్యాతి కెక్కి భువిలో నాకంబునన్ నీ కళా
వైచిత్ర్యంబును జూప నేగితివె? విద్వద్గాయకగ్రామణీ!

రోహణాచలము నారోహింప నీవీణె మెట్టులే కదలనిమెట్టు లయ్యె
ఆకాశవీథికిఁ బ్రాఁకఁగా నీవీణె తీఁగలే దృఢమైన తీఁగ లయ్యె
గోలోకమునకు నేగుటకునై నీవీణె గానమే దేవతాహ్వాన మయ్యె
అమరగాయక జైత్రయాత్రకై నీవీణె స్వానమే దుందుభిస్వాన మయ్యె

పారలౌకికసుఖములు వడయ నన్య-సాధనము లేల ? నీకు నారాధనీయ
చరితునకు దశదిక్ప్రతిష్ఠాపితప్ర-శస్తిఘనునకు సంగమేశ్వరసుధీంద్ర !

ముదుసలివై నిన్ను మదిలోన నెప్పుడు ధ్యానించుచుండు నర్ధాంగిఁ బాసి
దిక్కు మొక్కును లేని పక్షివై నిను నమ్ముకొనియుండు నాత్మజాతను దొఱంగి
లోకచర్యారీతి లో నెఱుంగక యమాయికవృత్తి నుండు పుత్త్రకుఁ విడిచి
నీపాటపై దృష్టి నెలకొల్పి జగ మెఱుంగనియట్టి రసికవర్గమును వీడి
స్వర్గమున కీవు దిగ్గునఁ జనుట చూడ-నారదునకును దుంబురునకును దగవు
గలుగ మాధ్యస్థ్యమునకు నిన్ బిలువ నంపె-శక్రుఁడని తోఁచె వైణికసార్వభౌమ !

కమ్మనితేనెసోన లొలుకన్ బలికించెడి వీణెపల్కు లం
దమ్ముల కందముం గొలుపు తానము లబ్బురపాటు గూర్చు రా
గమ్ములు సొంపు నింపు స్వరకల్పనలున్ గలలోనఁగూడ భా
వమ్ములఁ జిత్రితంబు లగు వైఖరిఁ జేసితి వైణికాగ్రణీ !

భ్రమపడుచుండు రజ్ఞులు ధరన్ మరణించితి వీ వటంచు ని
క్కము గమనించి చూచు నెడ ఖ్యాతిశరీరముతోడఁ బొల్చి ని
త్యముగ రసజ్ఞకోటిహృదయంబులలో నెలకొన్న నీ కజాం
డములు మునుంగుదాఁక మరణం బన నున్నదె ? సంగమేశ్వరా !

---



శ్రీమహారాణి లలితకుమారి

కీ॥ శే॥ మండీ మహారాజుగారియొక్క భార్య. కాన్పూరున జరిగిన స్త్రీ సారస్వతమహాసభకు అధ్యక్షురాలు.




ప్రెసిడెన్సీ కాలేజీ విద్యార్థినుల నూరుగజముల పరుగు



౧. జలపాతము

'పాపనాశనము' వొద్ద.



౨. ఒంటిమెట్ట శ్రీ కోదండరామస్వామి దేవాలయము

(శ్రీ వాను దాసుగారు జీర్ణోద్ధారము కావించినది)

ఈ రెండును శ్రీ యం. కే. రంగస్వామయ్యంగారు తీసిన ఛాయాచిత్రములు.

337




## 'భారతీయ చిత్రకళ' 2/1931

కర్త:—శ్రీయుత తలిశెట్టి రామారావుగారు
బి. యే. బి. యల్.

శ్రీయుత రామారావుగారు భారతి యందలి, వారి వ్యంగ్యచిత్రరచనల మూలమునను చిత్రకళావిష యిక వ్యాసములవలనను, ఆంధ్రలోకమునకు చిరపరిచితులు. వీరు తమగ్రంథమునందలి విషయములను, అనేక పూర్వ విరచిత సుప్రసిద్ధ ఆంగ్ల గ్రంథములను చక్కగా పఠించి విమర్శించి వ్రాసినటుల తోచెడిని. భారతచిత్రకళయొక్క ప్రాభవమును ప్రాబల్యమును, చర్చించుచు, ఇతర దేశ చిత్రకళాసంప్రదాయములతో నెట్లు సమ్మిళితమయినదియు, ఆదేశచిత్రకళా సంప్రదాయముల నెట్లు మార్చినదియు వ్రాసి భారతీయచిత్రకళయొక్క యౌన్నత్యమును వెల్లడించిరి.

బౌద్ధయుగమాది పాశ్చాత్యయుగపర్యంతము భారతీయ చిత్రకళ యనుభవించిన బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యదశలను విశదీకరించి, యికముందు మనచిత్రకళకు, నాశమే గతియగునేమో యని శంకించి, అట్టి నాశమును పొందనీయక జేయుటకు ఆంధ్రలోకము నందలి చిత్రకారులను, చిత్రకళాభిమానులను, ప్రోత్సహించుటకే గ్రంథము వ్రాయబడెననుటకు సందియము లేదు.

భారతీయ చిత్రకళను గుఱించి, పూర్వము, భారతీయులును, నిష్పక్షపాతబుద్ధిగల ఆంగ్ల పరిశోధకులును వ్రాసిన గ్రంథములందుగల విషయములుగాక నూతనాంశములు చాలలేకున్నను, ఈ గ్రంథము ఆంధ్రమున రచింపబడినందున ఆంధ్రలోకమునకు మిక్కిలి లాభకరమై యున్నది.

కో. నరసింహాచారి

---

## జర్మనీదేశపు విద్యావిధానము

గ్రంథకర్త : డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు

ఏదేశములో గాని ప్రజాజీవనము ఆదేశపువిద్యావిధానముపై ఆధారపడి యుండుననుట సామాన్యోక్తి. హిందువులు ఆధ్యాత్మిక మగ్నచిత్తులుగా వ్యవహరించిరనుచో, వారివిద్య ఆశ్రమవృక్షమగుటయే దానికి కారణము. అట్లే జర్మనులు ఆధునిక పరిశ్రమలందు ప్రజ్ఞాధికులగుటకు కారణముకూడ, యిట్టి సంకల్పముతో నెలకొల్పబడినవారి విద్యావిధానమే. ఆ విధానమెట్టిదో దాని లక్షణశేషము లెట్టివో, ఫలితములెట్లు పరిణమించుచున్నవో తెలుపుటయే చిలుకూరి నారాయణరావుగారి గ్రంథోద్దేశ్యము. జర్మను విద్యావిధానము నుదాహరించుటలో గ్రంథము సమగ్రముగానేయున్నది. స్వల్ప విషయములుకూడా అనేకము చొచ్చుకొనినవి ప్రపంచములో సాధారణముగా అన్నిదేశములకు అన్ని విశ్వవిద్యాలయములకు సామాన్యమైన లక్షణములుకూడ యెక్కువగా వివరణచేయబడినవి. మరి జర్మనువిద్యయొక్క అంతస్స్వరూపమును గూర్చి వీరు ప్రశంసింపలేదు. కావున వీరు వర్ణించినది కేవలము బాహ్యాకృతి మాత్రమే. ఇందుచేత నీ గ్రంథమువలన ఉపయోగము లేక పోలేదు.

నారాయణరావుగారు గ్రంథమునం దొసగిన ఆయాసంఖ్యలను (Statistics) ఏ గ్రంథములనుండి గ్రహించిరో తెలుపలేదు. అందువలన అవి సరియైనవో కావో చదువరి నిర్ణయించుటకు వీలు లేదు. గ్రంథకర్త గారియందు అప్రతిహతమగు విశ్వాసమే శరణ్యము. ఒకటి రెండుచోట్ల యీ సంఖ్యలు అసంబద్ధములుగా గూడ నున్నవి. ఉదాహరణము—కిండర్ గార్డన్ బడులనుగూర్చి వ్రాయుటలో "జర్మనీలో నూటికి పదిమందిపిల్లలు ఈ కిండర్ గార్డన్ బడులకు పోలేరు. తక్కిన తొంబైమంది తమయిండ్లలోనే చదువుకొంటారు" అని 22 వ పుటలోగలదు. 24 వ పుటలోనే, "పిల్లల మొత్తము సంఖ్యలో నూటికి ఇరవై ఇద్దరు ఈకిండర్ గార్డన్ బడులలో చదువుకొంటారు" అనియుంగలదు. ఈ రెంటికిని సమన్వయ మెట్లో!

నారాయణరావుగారు గ్రంథమునంతను వ్యావహారిక భాషలోనే రచించినారు. అందువలన అందరును దీనిని చదివి సులభముగా విషయమును గ్రహింపవచ్చును. కాని యిట్టి గ్రంథములు పామరజనపరితోషకములు కావుగదా: విద్యాపోషకులు, విద్యార్థులు, ఉపాధ్యాయులు ప్రభుత్వవ్యవహర్తలునే గదా యీ విషయమందాసక్తిగలవారు. గ్రాంథికభాషలో రచించినను దొసఁగులేదు. కాదు కూడదని నారాయణరావుగారధిక్షేపించుచు, పీఠికలో "గ్రాంథికభాష అంటే ఏమిటో తెలుసుకోడానికి ఎంత ప్రయత్నించినా, దాని తత్వము మాకేకాదు. ఇప్పటివరకున్నూ ఎవరికిన్నీ బోధపడలేదు" అని వ్రాసినారు. ఇది సమంజసము గాఁజాలదు.

వాడుకభాషపై నింతపామరత్వము గలవారు గ్రంథనామమును ముఖపత్రముపయి ఆంగ్లమున నేల లిఖించిరో తెలియరాదు.

(గు. వెం. సు.)

---

భావనాయిక (ఖండకావ్యము)

ఫూల్స్కాప్ సైజు, పు 24, వెల రు 0-౩-0, గ్రంథకర్త: పండిత బులుసు రామజోగారావుగారు తిరువల్లికేణి, చెన్నపురి.

## పారిజాతాపహరణ విమర్శ విమర్శము

[పారిజాతాపహరణ వ్యాఖ్యానమగు పరిమళోల్లాసమునుగుఱించి భారతి వ్రాసిన విమర్శముపై విమర్శనము.]

జనమంచి శేషాద్రిశర్మగారు

విమర్శకుల లక్షణము.

ధీరులగు పండితశ్రేణ్యులారా! సావధానముగా నిందలి విషయములను చిత్తగింతురు గాక.

గ్రంథవిమర్శకులు నిర్మత్సరులును, ప్రశాంతచిత్తులు నగు పండితులుగా నుండవలయును. దోషజ్ఞులుగా నుండవలయుంగాని దోషైకదృక్కులుగను, దోషాన్వేషణాతత్పరులగను, దోషోద్ఘాటనలోలుపులుగ నుండఁదగదు. గుణగ్రహణపరాయణులై నిష్పక్షపాతముగా గ్రంథముల గుణాగుణంబులఁ జూపువారుగ నుండవలయును. దోషముల నెత్తి మాపునప్పుడు మత్సరభావమునఁ గటూక్తులతోఁ బొడుచునట్లుండిన వారివలెఁ గాక మృదువచనములతోఁ జూపందగును. గుణబాహుళ్యమును, దోషాల్పతయు నుండునెడ బహుళముగా నుండు గుణములంగూర్చి బహుధాభినందనమును, అల్పములుగ నుండు దోషములంగూర్చి యల్పముగ దోషప్రదర్శనము చేయందగు. కేవలదోషభూయిష్ఠంబగు గ్రంథముల విషయంబునను పరుషములు, పరిహాసోక్తులును, నిందావచనములు నుడువక సదయముగా దోషబాహుళ్యముం బ్రదర్శించి గ్రంథకర్త యట్టి బహుళదోషములకుం జోటీయక గ్రంథముల రచించుట యొప్పునని హితోపదేశము చేయుట యార్యులగు విమర్శకుల ధర్మము. ఇంకను సుకవిపండితవ్రాతసంస్తూయమాన పాండిత్యవిశేషభూషితులగు పెద్దలు వ్రాసినగ్రంథములపై విమర్శనము వ్రాయునపు డీధర్మము నెంతయో యధికముగఁ బాటింపఁదగు. ఎట్టి మహావిద్వాంసులు వ్రాసిన వ్రాతయందును దోషము లుండవచ్చును. వెదకినను గొందఱు కనిపెట్ట నోపుదురు. కాళిదాసాదిమహాకవుల కావ్యములలోను విద్వాంసులు కొన్ని దోషములను జూపియున్నారు. అంత

మాత్రముననే యమ్మహాకవుల యశస్సునకు లోటు వాటిల్లెనే. సర్వజ్ఞుఁడు పరమేశ్వరుం డొక్కరుండు గాక యన్యుండు కలఁడే. గొప్పవిద్వాంసులు వ్రాసిన గ్రంథములలో స్ఖాలిత్యము లుండునేని వానిని మెల్లన నెత్తి చూపుట యోగ్యులక్షణము. పరుషోక్తులు నెత్తిపొడుపు మాటలును, నిందావచనములును, నిందాగర్భితభాషణంబులును జెప్పుట సాధువిమర్శకుల లక్షణములు గానోపవు. "అనిందాపరకృత్యేషు సర్వత్ర మధురా గిరః" అను నీతివచనములును సాధువు లెప్పుడును మఱువరు. పైనుదాహరించిన యట్టి యుదారగుణోపేతులగు విద్వజ్జనులు చేయు సాధువిమర్శనములను గ్రంథకర్తలు కృతజ్ఞులై శిరసావహింతురు. ఇతరులును దానిని గారవింతురు.

ఇఁకఁ బ్రస్తుతమునకు వత్తము. పారిజాతాపహరణ మహాకావ్యమునకు బ్ర. శ్రీ, మ-రా-శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారు వ్రాసి యాంధ్రపత్రికా ముద్రాక్షరశాలయందే ముద్రింపించి ప్రకటించిన పరిమళోల్లాసమను వ్యాఖ్యానముం గూర్చి "భారతి" వ్రాసిన విమర్శములో నావ్యాఖ్యానమున నొక్క సుగుణమైన నున్నదని చెప్పెనా. దానియం దన్నియు దోషములే కాని సుగుణ మొక్కండును లేదనియే కదా భారతి యభిప్రాయము. ఇట్లు సుగుణలేశరహితంబును, సర్వదోష సహితంబును నగు వ్యాఖ్య వ్రాసిన నాగపూడి కుప్పుస్వామయ్యగా రాంధ్ర లోకమునకు గొప్ప యుపకారము చేసిన వా రనఁదగి యుండఁగా, "నేటికి శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారును రసప్రబంధమును, తమ కెక్కుడు మక్కువ కలదియు నగు పారిజాతాపహరణమునకు పరిమళోల్లాస మను పేర నీవ్యాఖ్యానమును రచియించి సహృదయాంధ్రలోకము యొక్క కృతజ్ఞతకు పాత్రు లయిరి" అని భారతి వ్రాసినది. వ్యాజస్తుతియుఁ గేలిపూర్వము నగుంగాని నిక్కముగానోపునే. ఒక సుగుణమును మాత్రము భారతి చూపినది. "గ్రంథ ముద్రణాదులు చాల సుందరముగ నున్నవి" అని. దీనికిఁ గారణము ముద్రాపకులకుఁ దెలిసియే యున్నది. ఈసుగుణము వ్యాఖ్యాతకుఁ జెందనేరదు.

"చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున గల అయిదు సంపూర్ణ తాళపత్ర మాతృకలు వీరె పాటిరైన ప్రయత్నించియున్నచో వీరికి లభింపక పోయెడివి కావు. మఱియు స్ఫురించిన తెలుఁగున సాహసించి పాఠనిర్ణయము కావింపవలసిన యావశ్యకము తప్పిపోయి యుండెడిది. వ్యాఖ్యానింప బూనిన గ్రంథము యొక్క మూలమును నిర్దుష్టముగా జూచుకొనకున్నచో వ్యాఖ్యానము దోషజుష్టమయి యల్ప ప్రయోజనకరము కాగలదు." అని భారతి వ్యాఖ్యాతను దూషించి "అల్పమాత్ర పరిశ్రమముననే యిన్ని పాఠములు లభించినవి" అని తన్నుఁ బొగడుకొనియెను. భారతికి లభించిన పాఠములు "తవర్చి యాత్మనతోమణి, తనర్చ నాత్మనతోమణి, మించినరహి, నించినరహి, వాసనయుం, వాసనలం." ఇట్టి నీరసపాఠభేదములును, "కులమ్రుదుజ, కూటమూర్ధజ" మొదలగు నపపాఠములు నై యున్నవి. ఇవి యిట్లుండఁగా వ్యాఖ్యాత సాహసించి చేసియున్న యాదిగుఁ గనఁబఱచిన పాఠనిర్ణయములను గుఱించి భారతి యేమియుం జెప్పక మిన్నకుండనేల? కఠినములగు నీపట్టులందుఁ బాఠము లెట్లుండవలయునో భారతి చెప్పవలయుఁ గదా!

పరస్పరాశ్లేషములు—పరస్పరాన్వేషణములు

కోపాద్వేగమున—కోపోద్వేగమున

శోభవిభ్రమ—శోభవిశ్రమ

సమయనిర్గత—సమయనిర్గమ

నేలపురుటింటి—నెలపురుటింటి

పాడమెక—పాలిచెక

స్వాపక్రియాదోలికల్—స్వాపక్రియాలోలికల్

రాత్రసాలితిలకాంచద్దీధితి — రాత్రసాసిలతికాంచద్దీధి

జనితశ్రీకర్షణా—జనితల్మీకర్షణా.

మొదలగునవి.

వ్యాఖ్యాతగారు చేసియున్న పాఠనిర్ణయము లన్నియు సమంజసము లనియు సరసము లనియుఁ బలువురు విద్వాంసులు చెప్పియున్నారు. కొన్ని సవరణలు కీర్తిశేషులగు వేదము వేంకటరాయ శాస్త్రులుగారు చూచి యవి మంచిసవరణ లనియుఁ దమకు స్ఫురిం

లేదనియు వ్యాఖ్యాతగారితోఁ జెప్పినారని తెలియ వచ్చెడు.

ఇఁక నర్థకల్పనలంగూర్చి భారతి వ్రాసిన విమర్శ నము నర్చించుటకు ముం దీవిమయమై వ్రాసిన భూమి కను గనుఁగొందము: "మల్లినాథ సూరి యవలంబించిన పద్ధతిని నే ననుసరింపఁబూనితి నని మాత్రము వాక్రువ్వఁ గలను" అని వ్యాఖ్యాత వ్రాసిన దానింగూర్చి భారతి "అని మరల తమకు సామర్థ్యము గలదని ప్రకటించిన పారిజాతాపహరణ గ్రంథ వ్యాఖ్యాత యెడల మఱింత యెక్కువగా వర్తింపవలసి యుండును. కాని వ్యాఖ్యా నము తన్నియమమునకు లోనయినదని చెప్పుటకు వలను గాకున్నది." అని సోత్ప్రాసముగా వ్రాసినది కాక మఱియు నీదిగువఁ గనఁబఱచు చున్నట్టి వ్యాఖ్యాతృ పాండిత్యాభావ వ్యంజక వాక్యములను వ్రాసినది:

"వ్యాఖ్యానములు ప్రతిపదార్థము, భావార్థము, విశేషార్థము, ధ్వన్యాదులు, అలంకారములు, వానిలక్షణ ములు, విశేషార్థాదులు, వానిని ప్రతిపాదించుట కావశ్య కములయిన ఇతరగ్రంథప్రమాణములు మొదలయిన విషయ ములుగలిగి చేత నొలిచిపెట్టిన అరటిపండువలె పాఠ కులకు సుగ్రహముగ నుండదగినది. ఏవంగుణ విశే షణ విశిష్టములగు వ్యాఖ్యానములను సర్వంకషపాం డిత్యమండితులు ప్రతిభాశాలురునగు వారలు రచియింప గల్గుదురు. వ్యాఖ్యాత లట్టివారు కానినాడు తత్కృత వ్యాఖ్యానములవలన గ్రంథస్వరూపభావాదులు పాఠ కులకు సరిగా గోచరము కాజాలవు. పారిజాతాపహరణ వ్యాఖ్య యావిషయమున నెంతకు జాలునదియు నీక్రింది యుదాహృతభాగములను స్థూలదృష్టికి గోచరించిన వానిని బరికించినచో పాఠకు లెఱిఁగి తెలిసికొన గలుగుదురు."

విశేషార్థములు, విశేషార్థాదులు—అను నీరెండు లక్షణములకు భేదమేమియో తెలియకున్నది. దీనిచే వ్యాఖ్యాత ప్రతిభాశాలి కాఁడనియు, వాతనికి వ్యాఖ్యా నము వ్రాయఁగల పాండిత్యము లేదనియు నీవ్యాఖ్యా నము దోషభూయిష్ఠమై పాఠకులకు నిరుపయోగకరమైన దనియు భారతియభిప్రాయ మనుట తెల్లము. మల్లినాథ సూరిపద్ధతిని నే నవలంబింపఁబూనితినని వ్యాఖ్యాత వ్రాసి నది తమకు సామర్థ్యము కలదని ప్రకటించుట యగునా? ఈవ్యాఖ్యానము భారతి కించుకేని రుచింపకున్నను గవి సార్వభౌమబిరుదాంచితులగు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణ మూర్తి శాస్త్రులుగారు, బ్ర॥శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రులుగారు, బ్ర॥శ్రీ గుర్జాడ సుబ్రహ్మణ్యశర్మగారు మొదలగు పెక్కండ్రు పండితవరేణ్యు లీవ్యాఖ్యానము కరము సరసముగా సహృదయానందసంధాయకమై ప్రశం సార్హమై యున్నదనియుఁ బద్యముల భావములును ధ్వన్యాదు లిందు లెస్సగా వివరింపఁబడి యున్నవనియు నభిప్రాయపడియున్నారు. ఒక్కవిద్వాంసుఁడీవ్యాఖ్యా నము మూలగ్రంథమునకు మెఱుఁగు దెచ్చుచున్నదని వచిం చెను. నాయభిప్రాయముకూడ నట్టిదియే. ప్రతిపదార్థ ము, అలంకారలక్షణములు అను నీరెండుతప్పఁ దక్కిన భారతీప్రోక్తవ్యాఖ్యానలక్షణము లన్నియు నీవ్యాఖ్యాన మున భారతీతెరులకు సమగ్రములుగాఁ గన్పట్టుచున్నవి. ప్రతిపదార్థము వ్రాయమికిఁ గారణము వ్యాఖ్యాత దెప్పియే యున్నారు. అలంకారలక్షణములను వ్రాయమింగూర్చి ముందు చర్చింపఁబడును. ఇది వ్రాయమి "నొప్పలోపమని యు సంస్కృతప్రాయపదములకు రూపనిష్పత్తి వివరించి యునికి యనావశ్యక మనియు నిట్లే అనావశ్యకములగు వానినిఁ బెంచివేయుట ఆవశ్యకములగు వానిని త్రుంచివేయు ట నీవ్యాఖ్యానమున నప్పుడప్పుట గాననగును" అని భారతి నిరంకుశముగా దోషోద్ఘాటనము చేసినది. అవక్తవ్యోక్తి, వక్తవ్యత్యాగము లించుకేనియు లేకయు నాతివిస్తృత మును నాతిసంగ్రహమును గాకయు నొప్పు నీవ్యాఖ్యాన మును భారతి యిట్లు నిందించుట తగ్గదియు ననుచితము. పరిమళోల్లాసమును గొండెఱు నారీమణులు సమగ్రముగాఁ జవిచి మూలమునందలి పద్యములతాత్పర్యములు రసభా వాదులు తమకు లెస్సఁగాఁ దెలియుచున్నవని యభిప్రా యపడి యున్నారు.

నాగపూడి కుప్పుస్వామయ్యగారి కాంగ్రలోక మున నలువది సంవత్సరములుగాఁ బ్రసిద్ధపండితు లను ప్రఖ్యాతి కలదు. ఆంధ్రభాషా గ్రంథములకుఁ దొలు దొల్త విమర్శన పద్ధతుల ననుసరించి నూత్నమార్గమున న ఘ్ఘాతము వ్రాసినవారు వీరే. ఆనందముద్రాక్షర

కాలాధికారులు ప్రకటించిన యాంధ్ర భాగవతమునకును నిర్వచనోత్తర రామాయణమునకును గంకంటి పాపరాజ కృతోత్తర రామాయణమునకును వీరు వ్రాసిన పీఠికలే తరువాతివారికి మార్గదర్శకము లయ్యెను. "గద్యం కవీనాం నికషం వదంతి" యను నాచార్య దండి వచనము చొప్పునఁ బద్యరచనకంటె సరస గద్యరచనయే కష్టతరమను భావంబున వీరు బహుకాలమునకు ముందే భారత సారమను గద్యగ్రంథమును రచియించి యాంధ్ర పండితులచేఁ బొగడ్తగాంచిరి. వీరిపద్యరచనలు సరళము లై రసవంతములై యొప్పారు నని యెల్లవారు నెఱుంగుదురు. వీరి యనర్గళ పాండిత్యమును గీర్తిశేషులైనకొండ వేంకటరత్నము పంతులుగారును, వేంకటగిరి మహారాజుగారు (వారు పరమపదించిరి), వేదము వేంకటరాయ శాస్త్రులుగారు, తంజనగరము తేవప్పెరుమాళ్లయ్యగారు మున్నగు విద్వాంసులును, ఇపుడు సజీవులై యుండు బ్ర శ్రీ వావిలికొలను సుబ్బరావుగారును, బ్ర. శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులుగారును, వఝ్ఝల చిన్న సీతారామస్వామి శాస్త్రులుగారు లోనగు సుప్రసిద్ధ కవి పండిత ప్రవరులును గీర్తించి యున్నవారని పెక్కండ్రవలన విన్నవాఁడను. వీరు నవుడెల్ల నాంధ్ర మహాగ్రంథముల నధికాసక్తితోఁ బఠించుచుఁ గవి పండిత వరేణ్యులను గారవించుచు రసజ్ఞులై యధునాతనాంధ్రభోజు లన వెలయు శ్రీపిఠాపురము మహారాజుగారు వీరియెడలఁ దద్దయు గౌరవముచేయుచు వీరిపాండిత్యముం గొనియాడుచుందు రని నేను విని యున్నవాఁడను. అనేక కవి పండితులు తమతమ గ్రంథములను వీరికిం బంపి వీరిచే నుపోద్ఘాతము లొండె, నభిప్రాయము లొండె వ్రాయించుకొని ప్రకటించి యున్నవారు. అనేకాంధ్రపండితసభలలో వీ రగ్రాసనాధిపత్యమును వహించియున్నారు. చిన్నయసూరిగారికి బిదప నిర్దుష్టముగను భాషాశైలి ననుసరించియు సులలిత మధుర పదకలితముగను గద్యములు రచియించుటయందు వీరు నిస్సమానులు. సామాన్యముగా వీరు పండితులకు వ్రాయు లేఖలును సలక్షణంబగు శైలినే వ్రాయుదురు. సంస్కృతమునందును వీరికి మంచి పాండిత్యమును, సరసమృదు పదవిలసిత కవిత్వము చేయుటయు పుణ్యమును గలవు. వీరి గీర్వాణ భాషా కవిత్వవిచక్షణతకు మెచ్చి శ్రీశృంగేరి జగద్గురువులవారును, శ్రీకుంభకోణము జగద్గురువులవారును గొప్ప బహుమతు లొసంగి వీరిని గారవించి యున్నారు.

వేదము వేంకటరాయ శాస్త్రులుగారు చెప్పిన చొప్పున గొప్ప విద్వాంసులును మంచి లాక్షణికులునగు నాగపూడి కుప్పుస్వామయ్యగారి పాండిత్యమును దూలనాడుట భారతికి న్యాయ్యము గాదని విన్నవించు చున్నవాఁడను. పరిమళోల్లాసమునం దంతటను సలక్షణమగు శైలియే యవలంబింపఁబడి యున్నది. ఇం దెచ్చటను లక్షణవిరుద్ధము లగు వాక్యములు లేవు. ఇట్లు లాక్షణికంబగు శైలిని వ్రాయఁబడి యున్నను నీవ్యాఖ్య సుబోధకరిత నొప్పారుటచే నందఱికిని సుబోధంబై యుండును. ఆంధ్రభాషాకావ్యములకు వ్రాయఁబడి యుండు నేయితర వ్యాఖ్యానములు నేయితరవ్యాఖ్యానమును లాక్షణిక శైలిని వ్రాయఁబడి యుండలే దని చెప్పవచ్చును.

ఈవ్యాఖ్యానము మొదటఁ గుప్పుస్వామయ్యగారు వ్రాసియుండు తొమ్మిదిపద్యములును నవరత్నము లని చెప్పనొప్పు. ప్రథమపద్యమునఁ బారిజాతాపహరణ కావ్యమునందలి ప్రధానకథ నంతయు సూచించి శ్రీకృష్ణస్తుతి కావించియున్నారు. మొదటి రెండు పాదములలోఁ గృష్ణుఁడు పారిజాత కుసుమమును రుక్మిణీదేవి కొసంగుటయు దానికి సత్యభామ యతనిపైఁ గోపించి శోకించుటయు "నాకానీతము పారిజాత నగమున్ దానిచ్చి" యను పదములచేఁ గృష్ణుఁడు స్వర్గమునకుఁ బోయి పారిజాత వృక్షమును దెచ్చి సత్యభామ కిచ్చు కథయు "ముని వంద్య" యనుటచే నారదమహాని కృష్ణుని వినుతించుటయుఁ "బుణ్యచరిత" యనుటచేఁ బుణ్యక వ్రతాచరణకథయు సూచింపఁబడినవి. ఇట్లు ప్రతి పద్యమును జమత్కార విలసితమై యలరారెడు.

వ్యాఖ్యానావతరణికయందు ననేకములగు శ్లేషయాంశములను సరసముగను సంగ్రహముగను వ్యాఖ్యాతగారు సూచి యీకావ్యమునందలి పాత్రముల గుణాగుణముల

నెంతో మనోహరముగ వివరించి యున్నవారు. వీని నొక్కదానినైన భారతి పేర్కొనెనా! వీనిలోను వ్యాఖ్యలోను నొక సుగుణమైనను భారతికంటికి గోచరింపక పోయెంగా. అన్నియు భారతికి నింద్యములే యయ్యెను. ఇదియా సువిమర్శలక్షణము?

భారతి చేసిన విమర్శమునకు బదులు వ్రాసెదరా యని నేను వారికి వ్రాయంగా వారట్టి తలంపు తమకు లేదనియుం దమ వ్యాఖ్యానమునందలి దోషములను జూపినందులకుం దమరు భారతిదెసం గృతజ్ఞులమై యున్నామనియు వ్రాసిరి. వీరు పరమ శాంత స్వభావులు. వాస్తవంబగు వినయసంపత్తి కలవారు. ఒరులు తమ్ము నిందించినను బదులు చెప్పక యోర్చియుందురు. మఱియు మనంబునను వారిపైం గినుకం బూనరు. ఇట్టి యుదారగుణులగు పండితశిరోమణులు భారతి వ్రాసిన దానికి బదులు వ్రాయుమి వింతగాదు.

"తెలిసినదానిని వ్రాసితిం
దెలిసిన దని తలంచి వ్రాసితిం దెలియక నా
తెలియమి వ్రాసిన నలుసులం
దెలిపెదరని తలంతు నెప్ప తెలిసినవారిన్"

అని వ్యాఖ్యాతగారు వ్రాసినదానిచే వీరిగర్వరాహిత్యము నార్యపండితులదెస వినమ్రతయుం దమదోషములం దెలుపువారియెడలం దాము కృతజ్ఞులమై యుందుమను భావంబును స్పష్టమయ్యెడు. ప్రమాదము లెవ్వరికి లేవు? భారతి విశేషించి పొగడిన మనుచరిత్రమునందు

క. వానికిం బురూరవుండను ప్ర
జ్ఞానిధి యుదయించె సింహసదృశుండు తదా్యు
జానికి నాయువు తనయుం
డై నెగడె నతండు గనె యయాతినరేంద్రున్.

అనియున్నది. ఇచ్చట నాయువునకు యయాతి తనయుం డని పెద్దనార్యుండు చెప్పినది పొరపాటు. ఆయువునకు నహుషుండు పుత్త్రుండు. నహుషునకు యయాతి పుత్త్రుండు. పెద్దనార్యుండు వ్రాసినది పొరపాటని వ్యాఖ్యాతగారు నలువది సంవత్సరములకు మునుపే కనుంగొని తమ పుస్తకములో

"తదా్యుజానికి నాయువు తత్సుతుం
డౌనహుషుం డతండు గనె యయాతినరేంద్రున్."

అని పద్యమును సవరించి వ్రాసికొనియున్నట్లును నా కొక్కసారి వారే చెప్పియున్నారు.

"మదిరాక్షి" అను శబ్దమునకు మల్లినాథసూరి వ్రాసిన యర్థము తప్పని దుర్గాదాసద్వివేది యను పండితుండు సాహిత్యదర్పణము తృతీయపరిచ్ఛేదము 267 శ్లోకమునకుంగల వ్యాఖ్యకుం డిప్పణము వ్రాసి (195పుట) వేఱొకయర్థము నిచ్చియున్నారు. ఇదియు వ్యాఖ్యాతగారే నాకుం దెలిపిరి. ఇట్టి పెంకెటిమహనీయులయెడలను స్ఖాలిత్యములు సంభవించుట కలదు ఇంక భారతివిమర్శనమునకు సమాధానములు వ్రాసెదను.

ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునం గల మాతృకలను జూచియే దంపూరు వేంకటసుబ్బాశాస్త్రులు వనపాకము శ్రీనివాసాచార్యులు వేదము వేంకటరాయశాస్త్రులు మున్నగు పండితోత్తములు పాఠములను నిర్ణయించి తమ టీకాద్యములను ముద్రింపించి యుండుటచే వెండియు వానినే మాటిమాటికిం బరిశోధించుటయం దంత ప్రయోజనము లేదు. మఱియు నవి ముఖ్యములే మెండుగాం గానంబడును.

భారతిచూపిన పాఠములు సమంజసములు కావు. కావుననే పూర్వోక్తపండితులు వానిం ద్యజించిరి.

ఆత్మవక్షోమణిచేత నిద్దపుం గాంతిం దనర్చుచున్న పనుటకంటెం గౌస్తుభము నిద్దపుం గాంతిం దనర్చి యను టయే సరసము.

లక్కాంబిక - ముద్రితాదర్శములలో నన్నింట నిట్లే యున్నది. ఆపేరు బుక్కాంబిక యని యుండవచ్చును. లక్కాంబికయైన నుండవచ్చును. లక్కాంబిక యని యాదర్శములలోనుండు పాఠముంగూర్చి యీపేరు పొరపాటుగా నుండవచ్చు నని తోంపంగలదా?

రాధాతనయా - ఈపద్యములో - నిపుణకరణశోయనకుల్ - యమకమును బరికించిన రోంగరపదయునకుల్ - అనునంతమే సరియని భారతిచెప్పుచున్నది. యనకుల్ - అనునక్షరవ్యావృత్తి చాలదా. సదయునకుల్ - అను

పాఠము స్వీకరించినచో గ్రిస్తార్థకల్పనము చేయవలసి యుండును. కావున దానిని పాఠాంతరముగా వ్యాఖ్యాత గ్రహించుటయే సరి. వే. వేంకటరాయశాస్త్రి ప్రభృతి పండితులు దీనినే గైకొనిరి. దీనికిఁ దరువాతి పద్యము లలోఁ "కుమారునకుఁ" "సంభారునకుఁ" అనియు, 'జల ధికిఁ' 'గృహాంగణనిధికిఁ' అనియుఁ 'ప్రవీణునకుఁ' 'కృపాణునకుఁ' అనియు 'నారణికిఁ' "ధారణికిఁ" 'నాయకమణికిఁ' అనియు నొక్కొకపర్ణమున కవ్యా వృత్తి కన్పట్టెను.

ఈపద్యములో 1-3 పాదములలో నొకతీరున యమకము గలదని భారతి వ్రాసెనుగాని వీనిలో యమక ము కన్పట్టదు.

కూలముద్రుజ—ఈ పాఠమునకంటెఁ 'కూట మూర్ధజ' యను పాఠము గైకొనఁదగిన దని భారతి సూచించెదు సుశబ్దగుణ భాసురంబును సరసార్థ విశి ష్టంబునగు "కూలముద్రుజ" యను పాఠమునకంటెఁ 'కూటమూర్ధజ' యను పాఠము భారతి కిష్టమైన నగుం గాక. దానిక (భట సాముజహయముల) కూట—సమూ హముల యొక్క, మూర్ధజ—తలలనుండి పొడమెడు, క్షతజ—నెత్తురు, అని యర్థము చేయవలయును. అట్లయిన గజ తురగాముల తలలమీఁదనే కృష్ణ గాయలు కొట్టి నెత్తురులు ప్రవహింపఁ జేసె ననియు వాని యితరాంగ ములపైఁ గొట్ట లేదనియు చెప్పవలెను. యుద్ధములో శత్రువుల శరీరముల నంటటను గొట్టుటయును నఱకుట యును గలవు కాని తలలమీఁదనే కొట్టుదురనుట యెంత చమత్కారముగా నున్నదో విమర్శకులు నిర్ణయింతురు గాక. అదియుఁగాక 'మూర్ధజ'—అను పదమునకు సాధారణముగా వెండ్రుకలను నర్థము గలదు గావున నదియే తొలుత స్ఫురించును. అది యిప్పుటఁ బొసఁగ మిచే నైయట్లు యోగి కార్థ కల్పనము చేయవలసి యుండును. సుశబ్దముగుటచేఁ గాళిదాసుఁడు మొదలగు మహాకవులు దీనిం బ్రయోగించి యున్నారు.

'మదోదగ్రాః కకుద్మంతస్సరితాం కూలముద్రుజాః
లీలాఖేల మనుప్రాపు ర్మహోక్షాస్తస్య విక్రమమ్.'
—రఘువంశము, 4 స. 22.

ఘనతాయనకారక—"తారక" అని యుండవల యునని యుఁ బద్యమునందలి యమకమును గుర్తింపమిచేఁ గలిగిన దోషమిది యనియు దీనికి వ్యాఖ్యానము సరిగా లేదనియు భారతి చెప్పుచున్నది. సరియైన యర్థమే దియో భారతి తెలుప లేదు. యమకమును గుర్తింపని దోషము ప్రాచీన పండితుల కందఱకును వేదము వేంకట రాయశాస్త్రులవారికిని గలుగుటచే వారికిఁబోలె వ్యాఖ్యా తకు నీదోషముండిన నుండుంగాక. ఈపద్యమున యమ కము లేదని మాత్రము చెప్పక తప్పినది కాదు.

నలువు—నలవు—అని యుండవలయునని భారతి తెలిపెడు. అది నాయికాద్యోతకశబ్దము కాదు. తక్కిన పాదములలో ద్యుతి ద్యోతక పదములు ప్రయుక్తములు. కేశపర్ణనమునందు వింతనలు పనిసచో సరసముకాని నలు వనిన సారస్యములేదు.

ఆకాంత—ఏకాంత అని యుండవలయునట —ఏకాంత గృహంబకు—అనుటలో సారస్యమేమి? క్రోధాగారమే యేకాంత గృహమునినచో నద్యోకాంత గృహంబుకు. అని యుండవలదా. ఆ పాఠము నంగీకరిం చినచోఁ బద్యమునందలి వాక్యమునకుఁ గర్తృ పదమేమి? సత్యభామ యను పదము నధ్యాహారము చేసికొనవలయుఁ గదా. అది సరసమా? అట్టు నది తిమ్మన వ్రాసియుం డునా?

నల్లపిలు నారసి—నలుగడలను వెదకుట యే లొకొ? ఇటునటు కనుంగొనునపుడే కృష్ణుఁడు సత్య భామకుఁ గన్పడఁడా!

బాష్పకణికా—కళికా అను పాఠమే భారతి సమంజస మనుచున్నది. "కన్నీటిబొట్లు క్రిందికి జారు నది మొగ్గవలె సొగడనను గలిగియుండు." ననుట కార ణమఁట. నీటిబొట్టు కంటినుండి జాఱునపుడు బొట్టువలె నుండక మొగ్గవలెనుండు నా? ఒకవేళఁ గంటినుండి క్రిం దికి జాఱినపిదపఁ గన్నీరు మొగ్గవలె నున్నదని యొప్పు కొన్నను గంటిలో నున్నపుడు మొగ్గవలె నుండదు కదా. కంటిలోని బాష్పజల బిందువులచే లోచనములు తరళీ కృతము లయ్యెనే కాని బహిర్గతములైన పిదపఁ గళికా

కారము దాల్చిన బావ్వములచే లోఁ ఎనాంతములు తరళీకృతములు కాఁనేరవు గదా. కావున బావ్వకణికా—అని వ్యాఖ్యాతగారు సవరించిన పాఠమే సరసము.

నిన్నుఁ బాసినను నో—పనినో అని యుండఁదగుననియు నరకాసుర యుద్ధము వృత్తాంతము సూచించునన్న ఎక్కుడు సరసముగా నుండుననియు భారతి చెప్పెడు. చనునో. అనునది తిద్ధరాగ్మకరూపము. కాలత్రయ బోధకము. భావి యుద్ధమును సూచించుననుటయే చమత్కారమని పలువురగు సహృదయుల యభిప్రాయము. ౨-౨౯ పని-అని అని యుండవలయునని భారతి చెప్పుట సరియే. పని యనుట యచ్చుపొరపాటు. దీనిని వ్యాఖ్యాత సవరించిరియు నెండియు ముద్రాపకులు సవరింపరైరఁట. కావునఁ బద్యముల యకారాది సూచికలో "అని" యని సవరింపఁబడియున్నది. దానిని భారతి చూడలేదు. ఆక్షేపించానుపాయే దానికిం గలదుకదా.

జాజిపువ్వులు—కాజిపువ్వులు—అను పాఠము మంచి దని భారతి వచించెడు. కాజిపువ్వులు ప్రసిద్ధములు కావు. కావుననే వేదము వేంకటరాయ శాస్త్రులుగారు జాజిపువ్వులను పాఠమే స్వీకరించిరి. (చూ-వ్యాఖ్య.)

తరుణ గోత్తణ్ణకఁబులు—తరళ (సరళ) అను పాఠములు మేలని భారతి సూచించుచున్నది. వానికర్థమెంత సరసమో పండితు లూహింతురు గాక.

ఆ ౫-౪౪ కొనియెను నామోద—కొనియెన నాఘ్రాత. అనుపాఠముండిన లెస్సగానుండునని వ్యాఖ్యాతగా రూహించి వ్రాసిరి. (చూ—వ్యాఖ్య)అది భారతి కంటికేల కనఁబడలేదో?

భారతిసూచించిన టక్కినపాఠము లెవ్వియు సరసములు గావు. వానిం గూర్చి ప్రస్తావించుట యనావశ్యకము.

ఇఁక వ్యాఖ్యానముపై భారతి వ్రాసినదానిం గూర్చి పరిశీలింపవలసి యున్నది.

౧ సత్యభామాభోగసక్తి—దీనికి వ్రాసిన యర్థమేల భారతికి సమంజసముగాఁ దోఁపదో? ఆయర్థమే సమంజస మని నాయభిప్రాయము.

౨ ఘనతాపని......దీనికి వ్యాఖ్యాత వ్రాసిన యర్థము తప్పని చెప్పఁదగదు. భారతి వ్రాసినయర్థము సరసముగానే యున్నది. కాని చంద్రునిదానమున నుపమానముగాఁ జెప్పుట యంత ప్రసిద్ధము కాదు. ఆంధ్ర కవులు కొందఱుమాత్రము చెప్పియున్నారు.

౩ నరకాసుర దమనుఁడు—దీనికి భారతిసూచించు భావమును వ్యాఖ్యాత (ఈ) అనుబంధములో (X పుటలో) వ్రాసియే యున్నారు. స్తనకల్యపరీక్ష చేసిన భారతి కదియేల దృగ్గోచరము కాదయ్యెనో? భోజకన్య యను పదమెట్లు సాభిప్రాయమగునో తెలిసినది కాదు.

౪. అక్కాంత—ఏకాంతగృహంబు—ఇచ్చట నేకాంత అనుపదము నిరుపయోగమైనది. అరసి యనుటకంటెఁ గన్గొని యనుటయే సరసము. సత్యభామ వెదసుటయేలనో? కృష్ణుఁడు వేలగించెనా? లెస్సగా వెదకి చూచినంగాని సత్యభామకంటికిం గన్పడఁడో కో?

బావ్వకణికా—కళికా-అని యుండవలయునని భారతి ప్రసంగించెను. దీనిం గూర్చియు మున్నే వ్రాసియున్నాఁడను. కణికా—అను పాఠముఁ గైకొనినఁగాని యర్థము చమత్కారముగా నుండదు.

౫ వనుభవదీయదానుని...దీనికి సరియగు సంస్కృతశ్లోకము వ్యాఖ్యాత వ్రాయమియు నొక దోషమొకో?

౬. ఆయత తేజముల్...దీనికి భారతి చెప్పిన యర్థ మిసుమంతయు సరికాదు. తేజముల్—అనఁగాఁ బ్రకాశములని యర్థము. కిరణములనుట సరికాదు. సాయం సమయమున సూర్యకిరణములు దీర్ఘములుగ నుండుననుట సరికాదు. నీడలు దీర్ఘములుగ నుండును గాని కిరణము లొకతీరుననే యుండును.

౭. 'తాఁకియుం దలచెడువారు లేరు' దీనికి వ్యాఖ్యాత వ్రాసిన దానికంటె భారతి వ్రాసినది యెట్లు విలక్షణమో తెలియకున్నది.

౮. గజకచ్ఛపశిలనఘాతుకుండు—గజకచ్ఛపములు తొలిజన్మమున క్షత్రియులని వ్యాఖ్యానముఁ గలదు.

సంస్కృతమున వ్యాసమహర్షి విభావసుఁడును సుప్రతీకుఁడును దొలిజన్మమున మహర్షులని చెప్పెను.

"ఆసీద్విభావసుర్నామ మహర్షిః కోపనో భృశమ్,
భ్రాతా తస్యానుజశ్చాసీత్సుప్రతీకో మహాతపాః"

మహర్షులు విప్రులుగాను, విశ్వామిత్రునివలె క్షత్రియులుగాను, నారదునివలె దేవతలుగా నుండవచ్చును. నన్నయభట్టు విప్రు లని వ్రాసెను. తిక్కనసోమయాజి తొల్లి వారలు మధుకైటభు లను దనుజేంద్రు లని వ్రాసెను.

క. 'విను మధుకైటభు లనియెడు
దనుజేంద్రులు కశ్యపంబు దంతియు నై పు
ట్టినవారు త మ్మెఱుంగమిఁ
బెనఁగుదు రొండొరులతోడ భీకరభంగిన్.'

—ఆనుశాసనికపర్వము, అ. ౧.

ఇప్పట్టున వ్యాఖ్యాత వ్రాసినది పొరపాటనవచ్చును. కాని పైనున్న భేదములంగూర్చి యేమి చెప్పందగునో?

౯. జాజులుప్రసాదము—దీనికి భారతి వ్రాసిన యర్థము సమంజస మనఁదగదు. "ఒకమహానుభావునకు మ్రొక్కినచో నాతఁడు కొన్నిజాజులు ప్రసాదముగ నిచ్చును. అవి శిరోజముల కలంకారముగ ముడుచుకొనుటకును ఉపయోగించునవి. కావున నవి ఉభయథా ప్రయోజనకరములగును" అని భారతి వ్రాసినది చిత్రముగా నున్నది "ఒకమహానుభావునకు మ్రొక్కినచో నాతఁడు ప్రసాదముగాఁ గొన్ని జాజులనే యిచ్చునని యేమి సిద్ధాంతమో తెలియరాదు. మల్లెపువ్వులు, సంపెంగపూవులు, మొగలిపూవులు, తామరపూవులు, చేమంతిపూలు, పారిజాతకుసుమములు, పొన్నపువ్వులు, పొగడపూలు, దవనము, మరువము మొదలగువాని నీయఁడా? ఎవరైనఁ దనకు నమస్కరింపవచ్చినపుడు వెదకియైన నా "మహానుభావుఁడు" జాజిపువ్వులనే తెచ్చి ప్రసాదముగా నిచ్చును గాఁబోలును? మల్లెల నిచ్చెనేని మల్లెలు ప్రసాదము. అని సామెతరావలయుఁగదా. అట్టిసామెత లోకవ్యవహారమునఁ గలదా. గరుత్మంతుఁడు కృష్ణుని కార్యమేకాక తన (పగదీర్చుకొను) కార్యమును సఫలమగునని పొంగినాఁడు. ఈ రెండు కార్యములును సమకూరును. అని భారతి వివరించినది. వ్యాఖ్యాత "ఈ" అనుబంధములో "జాదులనఁగా మనోరథసిద్ధియని యర్థము చెప్పవచ్చునని ప్రకరణముంబట్టి యూహింపఁదగియున్నది." అని వ్రాసిన దానికంటె భారతి వ్రాసినది యెట్లు భిన్నమో విశేషమో తెలియకున్నది. "జాదులు ప్రసాదము" అన్న సామెతయని భారతి వ్రాసినది. అట్టి సామెతను జనులు వాడుచున్నారా?

౧౦. నొగలన్—దీనికి "మెడమీఁదనుంచి కట్టెడుకొయ్య" అని యర్థము వ్రాసియున్నారేమియని మేము వారి నడుగఁగా వారు "మెడమీఁదనుంచి కట్టెడుకొయ్యతో బండిని జేర్చి కట్టెడు నిడుపగుకొయ్య" యని వ్రాసినట్లు తమకు జ్ఞాపకమున్న దనియు నచ్చుఁగూర్చువారో కాక లేకరియో పొరపాటున విడివియుండవచ్చుననియుఁ జెప్పిరి. నొగకును గాడికిని భేదము వ్యాఖ్యాతకుఁ దెలియుదని సూచించుట ధర్మేతరము.

౧౧. ఆయతభూర్జపత్రములు—భూర్జపత్రములన్ భుజపత్రవృక్షముల వెడలైన పత్రములయందు - అని యర్థము. వ్యాఖ్యానములో "భుజపత్రము లనెడు వెడల్పయిన పర్ణములయందు" అని యున్నది. భూర్జశబ్దమునకు నిఘంటుప్రమాణము వ్యాఖ్యాత వ్రాసియున్నారు. భుజపత్ర, భుజ, భూర్జ శబ్దములు పర్యాయపదములు. కావున భూర్జపత్రములనఁగా భుజపత్రములని యర్థము. ఇచ్చటఁ బత్రములనఁగాఁ బర్ణములనియే యర్థము. దగ్గరనున్న బర్ణములయందుఁ బెట్టుకొని జనులు భుజింతురు, కాని కొన్ని పట్టలయందుఁ బెట్టుకొని తినరుగదా. అన్నము నుంచుకొని తినఁదగినపర్ణము విశాలముగా నుండును. కావున వ్యాఖ్యాత వ్రాసిన యర్థమే సమంజసమైనది.

మఱియు "ననంగ లేఖక్రియలకు విద్యాధరాంగన లుపయోగింతురని కాళిదాసమహాకవి వర్ణించియున్నాఁడు." అని వ్యాఖ్యాత వ్రాసి కుమారసంభవ శ్లోకము నుదాహరించి యుండఁగా దానియందలి "భూర్జత్వచః" అను పదములవలన భుజపత్రవృక్షముయొక్క

పట్టులని స్పష్టముగాఁ దెలియుచున్నను గేవలము దోషోద్ఘాటన తత్పరతి సహించి వ్యాఖ్యాతవాక్యము పర్ణముల నుపయోగింతురను నర్థము నిచ్చుచున్నది. అని భారతి వ్రాయుట తగదు.

మఱియు భూర్జపర్ణములమీఁదను బూర్వకాలమున లేఖములు వ్రాసెడు వాడుక కలదని తెలియవచ్చెడు. ధన్వంతరినిఘంటువునందు "భూర్జో భుజో బహుపుటో మృదుత్వక్ఛ్లేష్మపత్రకః" అని భూర్జవృక్షపర్యాయశబ్దములు గలవు. దీనిచే భూర్జవృక్షపత్రములను బూర్వకాలమునందు వ్రాయుట కుపయోగింపఁబడుచుండెనని తెలియవచ్చెను. విక్రమోర్వశీయమునందుఁ గాళిదాసమహాకవి 2 వ యంకము, 11 వ శ్లోకమునకుఁ బిదప,

ఊర్వశీ—(ఛాయా) హా ధిక్. హా ధిక్. మామేవ మనుగచ్ఛతి. సఖి. అసమర్థా స్మ్యగ్రతో భూత్వాత్మానం దర్శయితుమ్. తత్ప్రభావనిర్మితేన భూర్జపత్రేణ లేఖం సంపాద్యాన్తరా క్షేప్తుమిచ్ఛామి.

రాజా—(విభావ్య) నాయం భుజంగనిర్మోకః. భూర్జపత్రగతోఽయ మక్షరవిన్యాసః.

ఇది తెలుపఁబడిన పరిత్రాంశము కాదా. "మఱియు నేవిధమునను సంబంధములేని అనంగలేఖ క్రియతో నిక్కడ పనియేమి" అని భాంతి యాక్షేపించినది. భూర్జవృక్ష మెల్లచోటులకు దొరకునదికాదు. ఆ వృక్షము మఱియొకవిధముగా నుపయోగింపఁబడునను సంబంధము కలదు. కావుననే దానిని రసికులకు చదువరులకుఁ దెలుపుటకై వ్యాఖ్యాత వ్రాసెను.

౧౨. బాసవప్ప వరగండాంక—"ఇది కన్నడబిరు" దనియు దీనికి "ఆడినమాటను తప్పనివారికి మగఁడు. అని యర్థ" మనియు భారతి వ్రాసినది సరియే యగుంగాని మగఁడనుటకు బదులు శిక్షకుఁడని వ్రాయుట యుక్తము. కన్నడములో 'బాసె' అను శబ్దముగలదు. దానికి మాట, ప్రతిజ్ఞ—అనునర్థములుగలవు. 'బాసు' అను శబ్దము కన్నడములో లేదు. తప్పెదవరు—తప్పువవరు. అనికలదు. కావున నిక్కడఁబాఠము "బాసె దప్పువరగండాంక" అని యుండఁదగు. "భాష.గెదప్పువరాయరగండ,—అని యొక శాసనమునందున్నట్లు తెలియవచ్చెడు.

౧౩. అన్యతోదరి—ఇది సాభిప్రాయమని వ్యాఖ్యాతయుక్తి చూపలేదని భారతి వ్రాయఁగాక. దాని సారస్యమును వ్యాఖ్యాత సుత్రింపమి వింతగాఁ దోఁచునని వ్రాయుట యనుచితమగు వ్యాఖ్యాతృనిందయగు.

౧౪. చిలువయును పదమునకు వ్యాఖ్యాత వ్రాసిన యవయవార్థము సమంజసమేకాని తప్పుకానేరదు. శబ్దరత్నాకరమునందలి రూపనిష్పత్తియు నర్థాంతరముగా గ్రహింపఁదగు.

౧౫. చక్కగావించితివి—నఱకితివి. అనిననేమి? నశింపఁజేసితివి. అనిననేమి? చక్కుఁ అనఁగా ఖండము. అని శబ్దరత్నాకరమునఁ గలదు. అయినను

"పదమునంబుచేసెఁ జక్కాడె నుగ్గాడెఁ
జదపెఁబ్రిసవడఁచెఁ జాపిఁజెడపె
నలుమిచేసెఁద్రుంచెఁ బరిమార్చెఁ దెగటార్చె
మన్నిగొనియెఁదునిమె నుడిసెనఁగ
హతము గావించెననుటను నాఖ్యలయ్యె" అని యాంధ్రనామసంగ్రహము.

౧౬. కుహళీ—దీనికిఁ బూగుత్తులను నర్థము సరికాదనియుఁ బోకపొత్తు అని యర్థమనియు భారతి వ్రాయుచున్నది. అది సరికాదు. అది యుదాహరించిన కవి కర్ణరసాయనకావ్యములోని పద్యమువలననే కుహళి యనఁగా గుత్తియనియే యర్థము చెప్పవలయునని స్పష్టమగును. కాకున్నఁ బూగశబ్దము పునరుక్తమగును.

వసుచరిత్రము ఆ. ౨.

క. మందారముకుళకుహళీ
కందళితమరందతుందిలమిళిందవధూ
బృందాభినందితంబగు
మందానిలమొలయు విచిత్రమార్గక్రమమై.

దీనికి వ్యాఖ్యాత మందార = దేవతావృక్షభేదముల యొక్క, ముకుళ = మొగ్గలయొక్క, కుహళీ = గుత్తుల

యందు, కందళిత=ఉత్పన్నమగుచున్న. అని వ్రాసియున్నారు. ఇక్కడ భారతి చెప్పిన చొప్పునఁ బోకపాత్తులని యర్థము చెప్పినచోఁ బోకమ్రాని ప్రస్తావమే లేని యీ పట్టున నది యపార్థమగును.

౧౭. ఎలదేఁటిదాఁటులో—దీనికి భారతిచెప్పిన దాని నర్థాంతరముగా గ్రహింపనగుంగాని వ్యాఖ్యాత చేసిన యర్థము సరికాదని చెప్పఁదగదు మఱియు దాఁటుటవలన దప్పి పుట్టెననుట సరసము కావున నీ యర్థమును సమంజసము. మూఁగఁబడి చుట్టుకొనియని యర్థము. స్వార్థమునఁ బడుధాతు వనుప్రయుక్తము.

౧౮. పెరిగిన పోరరక్కముల పెల్లున—దీనికి వ్యాఖ్యాత వ్రాసినది సరికాదని చెప్పి భారతి విశేషమేమియు వ్రాసినట్లగపడదు. వ్యాఖ్యాత విపులముగా నర్థము వ్రాసియున్నారు. భారతి రఘువంశ శ్లోకమొకటి వ్రాసినది ఇంతకంటె విశేషమేమియుఁ గానము ఈ శ్లోకమునందు సముద్రమునఁ దామ్రపర్ణీసంగమస్థలమునందు ముక్తికోత్పత్తి కలుగుట ప్రసిద్ధమని మల్లినాథసూరి వ్రాసెను. "తామ్రపర్ణీసంగమే ముక్తికోత్పత్తిరితి ప్రసిద్ధమ్."

౧౯. ఇంద్ర ద్రుమోత్పాటనంబు — దీనికి దేవదారు వృక్షమని వ్యాఖ్యాత వ్రాసినయర్థము పొరపాటన వలయును. మద్దిచెట్టను నర్థమే సరసము. అయినను భారతి దీనిఁగూర్చి విపులముగఁ జెప్పక వదలినది.

౨౦. కదనాభిశంసియై—అభిశంసియై నిందించునదియనియు స్తుతించునదియు (వనఁగాఁ దెలుపునదియనియు) నర్థములు కలవు. వ్యాఖ్యాత వ్రాసిన అర్థములోఁ బొరపాటేమియుఁ గానరాదు.

౨౧. మానసవేగరథ్యమును—గుఱ్ఱము కలదియు ననుటయే సరి. వ్యాఖ్యానమునఁ "గలదియు" ననుపదము లేమి ముద్రాస్థాలిత్యమనవలయుంగాని యీ యల్పవిషమున వ్యాఖ్యాత తప్పువ్రాసెననుట యనావశ్యకము. దీనికిఁ బిమ్మట రెండుసమాసములకును బహువ్రీహ్యర్థద్యోతకమగు "కలది"యను పదమును వ్యాఖ్యాత వ్రాసియే యున్నారు.

ఇంతటితోఁ దృప్తినొందక భారతి యనుపశాంతావేశముతో "నిట్టి వెన్నియైన జూపవచ్చును. గ్రంథవిస్తరభీతిని విడువఁబడియె" నని వ్రాసినది. ఇది పరిహాసోల్లాసమును జూడనివారికి దీనిమీఁద నరుచి పుట్టించుటకై యీసుతో వ్రాసినవ్రాఁతవలెఁ గన్పట్టుచున్నది.

అలంకారలక్షణములను వ్రాయవలసినచో వస్తూత్ప్రేక్ష, హేతూత్ప్రేక్ష, గమ్యోత్ప్రేక్ష, అర్థశక్తిమూలధ్వని మొదలగు దాని లక్షణముల నెంత విస్తరముగా వ్రాయవలసియుండును. కావున వ్యాఖ్యాత వానిని వ్రాయరైరి. "కొన్ని సంస్కృతపదములకు రూపనిష్పత్తులు వ్యాఖ్యాత వ్రాసియునికి పండితపామరుల కనావశ్యక"మని భారతి నుడువుచున్నది. పామరులకును నాంధ్రపండితమ్మన్యులకు నెట్లున్నను జిజ్ఞాసువులకవి యావశ్యముగాఁ దెలుపఁదగినవే. మఱియు "ననావశ్యకములగు వానిని పెంచివేయుట యావశ్యకములగు వానిని త్రుంచివేయుట నీ వ్యాఖ్యానమున నచ్చటచ్చటఁ గానవగు." నని భారతి పలికెను. ఈ వ్యాఖ్యానమందట్టివి లేవని సరసులగు పండితోత్తముల యభిప్రాయము.

"గ్రంథావతరణికాభాగమున గలచరిత్ర విషయములకు ఇంకను విపులమగు విచారణమావశ్యక"మని భారతి చెప్పెను. సంగ్రహముగా నున్నచో విపులముగా నుండవలయు, విపులముగా నున్నచో సంగ్రహముగా నుండవలయు. అను నిట్టి విమర్శన మెట్టివారు వ్రాసిన దానిమీఁదను జేయవచ్చును.

మనుచరిత్ర పారిజాతాపహరణ కావ్యముల తారతమ్యమును వ్యాఖ్యాతసహేతుకముగా నిరూపించి పారిజాతాపహరణమే మేలగు కావ్యమని నిర్ణయించియుండఁగా భారతి యేవో కారణములను పీఠికయందు పేర్కొన్నారని వ్రాసి వ్యాఖ్యాతకుఁ బారిజాతాపహరణముపైఁగల "యెక్కువ మక్కువ"యే కారణముగావలయునని యొత్తి పొడుపుమాట పచించినది. వ్యాఖ్యాతకుఁ బారిజాతాపహరణమందుఁ గల గుణాధిక్యమువలననే నిక్కముగా దానిపై మక్కువ యెక్కువయనఁదగు. అకారణముగా జనులకు మక్కువ యెక్కువయగుట యసంభవము. అనుదారగుణులకుమాత్ర మకా

రణముగా దేనిపైనైనను మక్కువతక్కువ యగుటయు నీకుతోడరుటయు సంభవింపవచ్చును. "మక్కువ యెక్కువ"యని రెండుమాఱు లీవిమర్శనమునందు భారతి వ్రాయుటచే వ్యాఖ్యాతకుఁ బారిజాతాపహరణ మహాకావ్యముపై మక్కువ యెక్కువగా నుండుటయు వారి యందు గొప్ప దోషమని భారతి భావించుట స్పష్టము. తమయందుఁ గలవని భారతి చూపిన యనేకదోషముల తోడ నీ గొప్పదోషముం జూపినందులకు వ్యాఖ్యాత భారతిదెసఁ గృతజ్ఞులగుదురుగాక. భారతి యభిప్రాయ మెట్లున్నను పై రెండు కావ్యములలోను సర్వవిధంబులను మనుచరిత్రకంటెఁ బారిజాతాపహరణమే రసవత్తరకావ్యంబని నాయభిప్రాయము, ననేక పండితవతంసుల యభిప్రాయము నైయున్నది. ఒక్క యుదాహరణము మాత్రము చూపెదను. మ. రా. శ్రీ ఆంధ్ర శేషగిరి రావుగారు "ఆంధ్ర సర్వస్వము"ను పత్రికలో నిట్లు వ్రాసియున్నారు:

"అర్థసంపద—భావచమత్కృతి, రసపుష్టి, సందర్భశుద్ధి, సత్పురచనాకౌశలము, కవితాసంభారములనెల్ల నేర్చి కూర్చి తెలుఁగు పలుకుబడుల గుబాళింపులతోఁ గావ్యమును భోగ్యద్రవ్యముగా నొనర్చి ఆంధ్ర ప్రబంధ కవులలోఁ దిమ్మన పేరుమిగిలినాఁడు. వేయేల? దేశభావములందుఁ దెలుఁగు లెస్సఁగా సృష్టిపఱచిన కావ్యస్రష్టలలోఁ దిమ్మనార్యుఁ డుత్తమశ్లోకుఁ డనఁ జెల్లును.

ఆంధ్రప్రబంధ భాండారమునఁ బ్రథమస్థానము ప్రభావతీ ప్రద్యుమ్నమునకుఁ జెందుట నిర్వివాదాంశము. ద్వితీయస్థానము మనుచరిత్ర, వసుచరిత్ర, పారిజాతాపహరణములలో నెద్దానికి లభించుననుట విమర్శకులు పరామర్శింపవలసిన విషయము. ఈ సందర్భమున నెంతయేని అవకాశము గలదు భేదాభిప్రాయములకు. పారిజాతాపహరణమే ద్వితీయస్థానమున కర్హమని నా వాదము. పాక్షికబుద్ధితో విమర్శకులాస్థానమును పారిజాతాపహరణమున కీయకున్నచో నదియే మను వసుచరిత్రల మెడఁగట్టి కట్టి వెన్నడఁజేసి ఆస్థానము నాక్రమించి అలంకరించి మించఁగలదు. అందులకుఁ గారణము లీవ్యాసమున నాయూతావుల వివరించియే యుంటిని."

మనుచరిత్రము పారిజాతాపహరణమువంటి కావ్యములకు మార్గదర్శకమని భారతి వ్రాయుట వింతగానున్నది. ఆ రెండు కావ్యములును నించుమించుగా నొకకాలముననే పుట్టినవి. మఱియు లెస్సగాఁ బరికించినచోఁ బారిజాతాపహరణమే మనుచరిత్రమునకంటె మున్నుగా రచియింపఁబడినదనియుఁ దెలియవచ్చెడిని. మనుచరిత్రమునందు (ఆ. ప. ౩౮) "కటకపురిఁగాల్చె గజరాజు కలఁగిపఱచె" నని కృష్ణరాయని వర్ణించు పద్యమునఁ జెప్పఁబడినది. పారిజాతాపహరణమునందు (ఆ. ప. ౨౩) "బలనికాయము కాలిసుట్టుల నడంచుఁ గటకమును నింకననుమ నత్కలమహీశుఁ డనుదినమ్మును వెఱచు నెవ్వనికి" నని చెప్పఁబడినది. ఈ రెండింటిని బరిశీలింపఁగాఁ బారిజాతాపహరణము వ్రాయునప్పటికిఁ గృష్ణరాయఁడు కటకమును జయింపలేదనియు, మనుచరిత్రము రచించునప్పటికి జయించియుండెననియుఁ దెలియవచ్చుటచే మనుచరిత్రమునకంటెఁ బారిజాతాపహరణమే మున్నుగా రచియింపఁబడియెనని చెప్పవలసియుండుఁ గదా. అట్లయినచోఁ బారిజాతాపహరణమే మనుచరిత్రమునకు మార్గదర్శక మనఁదగియున్నది.

కడపటి భారతి "యాదగాని కాలి కేని తన్నుడినట వ్రాయుట రసాభాసముకాదు కాబోలు. కడునీతికరము కాబోలు." అనియుఁ "బారిజాతాపహరణము నకే చప్పిడిపద్యములు ఎక్కువగా గలవని చెప్పవచ్చు" ననియు "నిట్లు కుతర్కమున కెన్నియైన లోపములు కనుపడుచుండుననియుఁ గాని నిష్పక్షపాతదృష్టిని జూచిన నభయగ్రంథములును దాని దాని యునికినిబట్టి యది యది రసవంతముగనే యున్నదని సహృదయులు భావింపకపోరు" రనియుఁ జెప్పి ముగించెను.

"దాని దాని యునికినిబట్టి యది యది రసవంతముగనేయున్న" దనుకడలఁ దారతమ్యవిచారణమునకుఁ బ్రసక్తియే యుండదుకదా. "దానిదాని యునికినిబట్టి" అనఁగా నర్థమేమో తెలియకున్నది. నిష్పక్షపాతముగా సకారణముగా వ్యాఖ్యాత వ్రాసి తమ యభిప్రాయమును దెలిపియుండఁగా వారు "కుతర్కము"చే నిట్లు వ్రాసిరని సూచించుట మిక్కిలి శోచనీయము, వ్యాఖ్యా

వ్రాసినది భారతికి సమ్మతము గాకున్నచో నది సరికాదని వ్రాయుట యుచితము. కాని వ్యాఖ్యాత వ్రాసిన కారణములు "కుతర్క" మని నిందచేయుట యార్యజనులకుఁ దగునా? "మతియుఁ బారిజాతాపహరణమునసే చప్పిడిపద్యములు ఎక్కువగాఁగలవని చెప్పవచ్చును." అని భారతి వచించెను. ప్రతిపద్యరసాన్వితంబని సకలాంధ్ర విద్వద్వరేణ్యులు కీర్తించుచున్న యక్కావ్యరత్నముపై భారతి కట్టియభిప్రాయముదయించుట నంది తిమ్మకవి దౌర్భాగ్యోదయముచేనని యూహింపవలసియున్నది.

"ఆసుదాని కాలిచేత తన్నుతినుటమాత్రము రసాభాసముకాదు కాబోలు" అని భారతి వ్రాసినది వింతగానున్నది దీనిచే రసాభాసమనఁగా నేమియో భారతికిఁ దెలియదనుట తెల్లంబయ్యెను. సాహిత్యదర్పణము తృతీయపరిచ్ఛేదము కడపట రసాభాసము వివరింపఁబడియున్నది. దానింజదివియుండినచో భారతి పైకనఁబఱచినట్లు వ్రాసియుండదు. దంపతుల ప్రణయకలహంబున నాయికకుఁ బ్రణమిల్లుటయు నాయికచేఁ బాదాహతిం బొందుటయు రసాభాసము కానేరదు. రసాభాసశబ్దమునకే యీ ప్రకరణమునఁ బ్రసక్తిలేదు. వ్యాఖ్యాత యిప్పట్టున విపులముగా నలంకారశాస్త్రచర్చ చేసి మానభేద తదపనోదనవిధానభేదములను వివరించి యుద్గ్రంథములనుండియు యుదాహరణములను వ్రాసియున్నారు. అవియే చాలినవైనను నింకొకటి పురాణమునుండి యెత్తివ్రాసెదను. శివుఁడు పార్వతీదేవి ప్రణయకోపము నుపశమింపఁజేయుటకై యద్దేవికిఁ బ్రణతుఁడైనట్లు వేదవ్యాసమహర్షి వ్రాసెను.

శ్లో. యద్యేవం కంపితా భీరు త్వం తదాహం నవై పునః,
నర్మవాదీ భవిష్యామి జహి కోపం శుచిస్మితే;
శిరసా ప్రణతే నైవ రచితస్తే మయాఽంజలిః.
—(మత్స్యపురాణము, ౧౫౪ అ. ౧౩-౧౪ శ్లో.)

ఈ పరిమళోల్లాసమునందలి విశేషములఁ గూర్చి పేర్కొనవలసియున్నను గ్రంథవిస్తరభీతిచే వదలెదను. నిక్కముగు స్థాలిత్యములను జూపిన తావులమాత్రము వ్యాఖ్యాత భారతి దెసఁ గృతజ్ఞులై యున్నవారని విన్నవించుచు నింతట నీవిషయము విరమించుచున్నాఁడను. ఇందుఁగల ప్రమాదములను బండితాఖండలులు క్షమింతురని ప్రార్థించువాఁడను.

---

## వైద్యగ్రంథవిమర్శన సమాధానము

నాచే రచింపబడిన ఆయుర్వేదౌషధ రత్నాకరమును, ఆంధ్రభైషజ్య రత్నావళియు 1931 జనవరిసెల ప్రభ్యూష భారతి సంచిక యందు విమర్శింపబడినవి. అవి బర్బరకు తగుసమాధానము వ్రాయుట చాల అవసరమేయని తలచి క్రిందివిధమున సమాధానమును వ్రాయబూనుచున్నాను.

ఈ గ్రంథమునందలి యోగములకు ఆకరములను తెలిపినచో బాగుండెడిది అని వైద్యవినోదిగారు వ్రాసిరి. ఈ గ్రంథమునందలి యోగములు ఎట్లు గ్రహింపబడినదియు, దేనినుండి గ్రహింపబడినదియు, ఎవరెవరివద్దనుండి గ్రహింపబడినదియు మొదలగు సంగతులన్నియు స్పష్టముగ వ్రాయుచు ఆకరములను తెలుపకపోవుటకు కల కారణమునుకూడ ప్రథమద్వితీయ ముద్రణముల యొక్క విజ్ఞాపనములయందు వ్రాసియే యున్నాను.

లోకనాథ రసము.— బసవరాజీయమందు క్షయప్రకరణమున చెప్పబడిన యోగమునకును నేను వ్రాసిన యోగమునకును ఏమియు భేదము లేదు. భేదము కలదని వ్రాయుటకు కారణము తెలియదు. భేదమునుచూపింపుడు.

వంటసువర్ణ సూర్యావర్తి.—నాకు లభించిన ఈయోగములలో అనుభూతములును, ప్రసిద్ధములును, చక్కగ పనిచేయునవియు నగు రెండుయోగములను వ్రాసితిని. మతిభేదములుకల యోగములు ఇంకను నావద్ద కలవు. నేను వ్రాసిన యోగములనుబట్టి చూచినచో వైద్యవినోదిగారి వద్ద యోగమే మతిభేదము కలది (మార్పు కలది) అయి ఉండ కూడదా? వారిదే సర్వసిద్ధాంతమైన యోగమని చెప్పుటకు వారికి ఏమైన అవకాశము కలదా?

సువర్ణ లోకనాథ రసము.— దీనికిని వంటసువర్ణ సూర్యావర్తికి వ్రాసినసమాధానమునే సమన్వయించుకొనవచ్చును.

వసంత కుసుమాకరము.—దీనియందలి సూత శబ్ద విషయమై నాఅభిప్రాయమును ఎంతమాత్రము సరిగ కనుగొనజాలక, అనవసరముగ ఏదియో వ్రాసిరి. ఇందు కేవల రసమునే గాక రసభస్మనే వేయవలెనని నాఅభిప్రాయము కాని రససిందూరాదులను వేయకూడదని నాఅభిప్రాయము ఎంతమాత్రము కాదు. అట్లయినచో ఆమతభేదములను ఎందులకు వ్రాసితిని? అట్టి అభిప్రాయము దేనివల్లను స్ఫురించుట లేదు. అనవసరముగ భ్రమపడిరి. ఇప్పుడైనను సరిగ చూచుకొనవలయును. సాధ్యమైనంతవరకు వ్యాకరణ యుక్తముగను, అర్థసమన్వితముగను ఉండవలెనని అనేక యోగములయందు ఇటులనే సంస్కృత పదములను మార్చితిని అట్లే ఇక్కడను కూడ మార్చితిని. కాని పాదరసభస్మ అని అర్థము వచ్చుటకు ఎంతమాత్రము నే నట్టి శ్రమను పడియుండ లేదు. అట్టి అర్థము కావలసినచో సూతశబ్దముచే కూడ వచ్చుటకు ఏమియు అభ్యంతరము లేదు. రసరత్నసముచ్చయము, అమరకోశము మొదలగు చాల గ్రంథముల యందు సూత పారద శబ్దములు పర్యాయ వాచకములుగనే చెప్పబడియున్నవి. వైద్యవినోదిగారు సూతశబ్దముచే రససిందూరమె గ్రాహ్యము కాని పాదరసభస్మ గ్రాహ్యము కాదు అని స్పష్టముగ వ్రాసిరి. మతభేదముచే రససిందూరము గ్రాహ్యము కావచ్చును కాని ఇతరము గ్రాహ్యము కాదు అని వారుచెప్పుటకు వారికి ఎంతమాత్రమును అవకాశము లేదని నేను ఘంటాపథముగ చెప్పగలను.

కాంతవల్లభరసము.—ఇందు "అనోరజః" అనెడి వివాదగ్రస్తమగు విషయమునకు వివరణమునందు కూడ ఇదమిత్థమని ఏమియు నిశ్చయింపలేదని వ్రాసిరి. వారికి కలిగిన ఆవివాదగ్రస్తమగు సందేహమేమిటియో వారు కొద్దిగనైనను సూచించినచో తత్సమాధానము వ్రాసెడివాడను. అట్లు ఏమియు సూచింపలేదు. కాని సందేహగ్రస్తములైన విషయము లన్నియు ఔషధవిషయములు మొదలగు విషయములలో నెచ్చటనో యొకచోట పూర్తిగ వివరించి వ్రాసియే యుందునని నాకు పూర్తి నమ్మకము కలదు. వారు ఆవివాదగ్రస్తమగు సందేహమును తెలుపవలయును. నే నిదివరలో నెచ్చటను వ్రాయకుండినచో వారికి ప్రత్యేకముగ వ్రాయగలను. యోగమందు "శిలాజతు" అని సామాన్యము కలదు. ఈశిలాజతుశబ్దముచే గోమూత్ర శిలాజతును గాని, కర్పూర శిలాజతునుగాని గ్రహింపవచ్చును. ఇదివరలో చాలమంది కర్పూరశిలాజతును వేయుచున్నమాట నిజమేకాని శిలాజతు శబ్దముచే గోమూత్ర శిలాజతును గ్రహించుటకు ఎంతమాత్రము అభ్యంతరము లేకపోవుటచేతను, గోమూత్ర శిలాజతునకు శాస్త్రమందు అమోఘములైన గుణములు చెప్పబడియుండుటచేతను, ప్రస్తుతము చాలమంది గోమూత్రశిలాజతునే వేయుచుండుటచేతను, గోమూత్రశిలాజతు వేయబడినదే అధికముగ పనిచేయుచుండుటచేతను గోమూత్ర శిలాజతు వ్రాయబడినది. యోగమందు ఇదమిత్థమని సూచింపకపోయినను ఇదివరలో కర్పూరశిలాజతు వేయుటకు ఎట్టికారణము కలదో, అట్టికారణముచే గోమూత్ర శిలాజతు కుప్పెలు కట్టుకొనునప్పుడు కలపవలయుననుటకు కారణముగ నూహించుకొనవలయును.

షడ్గుణ బలిజారిత మకరధ్వజము — ఈయోగము విషయమై విమర్శించుచు వ్యక్తిగతములుగ కొన్ని అనవసరములగు పదములను ప్రయోగించిరి. నే నట్టిపదములను ప్రయోగింప దలచుకో లేను. వీరు ఆయుర్వేద ప్రకాశము మొదలగు గ్రంథములనుండి ఆయా గ్రంథముల రీత్యా గంధక జారణమును, దాని గుణములను చాల విపులముగ వ్రాసిరి. కాని ఏదయినను ప్రస్తుతము వాడబడు మకరధ్వజమునకు బంగారము మొదలగువానియొక్క పరిమాణములు మొదలగువానినైనను వ్రాయక అక్కడను వచ్చునప్పటికి సంతోషించి ఊరకుండిరి. కొంత మంది గ్రంథకారుల యొక్క అభిప్రాయము ప్రకారము అట్టి జారణము చేసి తయారుచేసికొనవచ్చును. కాని నేను వ్రాసిన విధమునకూడ నిస్సందేహముగ తయారుచేసికొనవచ్చుననియు, ఇట్లే చాలామంది తయారుచేయుచున్నారనియు, ఇట్లు తయారుచేయబడిన దానినికూడ "షడ్గుణబలిజారిత మకరధ్వజ" మనెడి పేరుతో నిస్సందేహముగ వ్యవహరింపవచ్చుననియు ఘంటాపథముగ చెప్పగలను. ఏమతభేదప్రకారము తయారుచేసినను నేను వ్రాసిన విధమునకు కూడ కొన్ని మతభేదములచే

జారితత్వము నిస్సందేహముగ కలుగును. జారణ, జారిత శబ్దములకు అర్థము గ్రహింపుడు. కాన 'వైద్యవినోది'చే ప్రయోగింప బడిన పొరపాటు, విస్మరించుట, ప్రమాద వశము మొదలగుపదములు వారికే సంక్రమించు ననుటకు ఎట్టిసందేహమును లేదు. నేను వ్రాసిన "షడ్గుణ బలిజారిత మకరధ్వజ" మునకు ఆకరము కావలసినచో 1922 మే నెల ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక 178 పేజీ—బంగాళీ భైషజ్య రత్నావళి 115 పేజీ—చూడుడు.

కాంతవల్లభరసము.— కాంతము ప్రధానముగ గలది అనెడి అర్థము స్ఫురింపవచ్చును. కాని ఇతరవస్తువులు కూడ చాలభాగములు కలసియుండి కాంతము రెండుభాగ ములు మాత్రమే హెచ్చుగ కలసియుండుటచే కాంతము ప్రధానముగ కలది అని వ్రాయుట ఇష్టము లేక అట్లు వ్రాసితిని. వైద్యవినోదిగారు వ్రాసినవిధమున కాంతము ప్రధానమైనది అనెడి అర్థము ఎట్లు వచ్చుచున్నదో తెలి యకున్నది.

కాలకూటము.—ఇట నేను వ్రాసినఅర్థము డొంక తిరుగుడుగ ఉన్నదట. అట్లుండునని తప్పుటర్థమును గాని, తలతిరుగుడర్థమును గాని వ్రాయనా? అమరకోశము నందును, చరకచికిత్సాస్థానమందును కాలకూటమును, నాభియును వేరువేరు విషములుగ చెప్పబడినవి. అట్లుండ కాలకూట శబ్దమునకు నాభి అని అర్థము ఎట్లు వ్రాయగలను? ఒక వేళ కాలకూటమును నాభియను నొకచోయని వైద్యవినోది గారివలె నేనుకూడ భ్రమపడినను, యోగమందలి భాగ ములు తెలియక నాభి ప్రధానమైనదని ఎట్లు వ్రాయ గలను? కొంచెమెచ్చుతక్కువ నాభితో సమానముగ కలియు వస్తువులిందనేకములు కలవు. మరియు నాభికంటె అధి కముగ కలియు త్రికటుకములే కలవే. ఇట్టివిషయములు చూచినప్పుడు సమాధానము వ్రాయుటకూడ చాల అనవసరమని తలచితిని. కానిలోకులకు తెలియుటకూడ కొంత అవసరమే యని వ్రాసితిని. "అనేక ప్రాచీన శిథిలగ్రంథములనుండియు, అనేకమందియొద్ద వ్రాతపుస్త కములనుండియు గ్రహింపబడి వ్రాయబడినది అని వారే వ్రాసుకొని ఆగ్రంథమునకు కృష్ణపండితీయమని అన్యనామమిడిరి," అని అధిక్షేపించిరి. ఏమి చిత్రము!

వాగ్భటము, బసవరాజీయము, శార్ఙ్గధర సంహిత, మాధవనిదానము, రసరత్నసముచ్చయము, మొదలగు అనేకగ్రంథములయందు ఆగ్రంథకర్తలు ఇతరగ్రంథములనుండియో ఆవిషయములను సంగ్రహించితిమని స్పష్టముగ వ్రాసికొనియే యున్నారుగదా! అప్పుడు బసవరాజీయము, మాధవనిదానము, శార్ఙ్గధర సంహిత మొదలగు పేరులచే వానినెట్లు వ్యవహరించిరి? ఇట్టి ఉదాహరణములు సంస్కృత గ్రంథములయందు గాని, తెలుగు గ్రంథములయందుగాని వేనకువేలు కలవు. నేను గ్రంథకర్తనే కానని వారు స్పష్టముగ వ్రాసిరి. అందుచే నాకు విచారము ఎంతమాత్రమును లేదు. కాని వారిఊహ ప్రకారము గ్రంథకర్త లెవ్వరో, గ్రంథశబ్దమున కర్థమేమి యో తెలియకున్నది. ఏది ఎట్లున్నను వీరి ప్రస్తుతపుఊహ ప్రకారముపైన ఉదాహరించిన గ్రంథకర్తలే గాక ఇతర గ్రంథములను గాని, ఇతరులయొద్ద విషయములనుగాని ఆధా రముగ చేసికొని వ్రాసితిమని వ్రాసికొన్న ప్రతివారును "గ్రంథకర్త"అని వ్రాసికొన్న పేరును చింపివేసి ఇదివరలో వ్రాసికొన్నందులకు వారిని క్షమాపణ కోరవలసినదిగ కన బడుచున్నది.

తుదకు వీరు ప్రకటన విషయమైకూడ జోక్యము కలుగ చేసికొనిరి. నేను గ్రంథకర్తనే కానప్పుడు "ఈ గ్రంథమును ఎవరును ప్రకటింప కూడదు" అని వ్రాసికొ నుట నాకు సంభావ్యము కాదట. ఇట్టి విషయములకు సమా ధానము వ్రాయుట అనవసరమే. ఎట్టివారు ఇట్లు వ్రాసికొనుటకు అర్హులో తెలియకున్నది. బసవరాజీయ ము మొదలగు గ్రంథములయందు ఎట్లు వ్రాయబడినదో నేనుకూడ అట్లే వ్రాసితిని. పాఠకులకు శ్రమ కలుగ కుండుటకై ఇంతటితో విరమించుచున్నాను.

## ఆంధ్రభైషజ్య రత్నావళి

ఇందలి యోగములు ఎట్లు గ్రహింప బడినదియు ఉపోద్ఘాత మందే స్పష్టముగ వ్రాసితిని. ఆయుర్వే దౌషధ రత్నాకరముకంటె ఈగ్రంథము ప్రశస్తముగ ఉన్నదట. నేను చాలా సంతోషించితిని. వీరి అభి ప్రాయ ప్రకారము ఆయుర్వేదౌషధ రత్నాకరము




విశేషించి బాగుగ లేనట్లేకదా. జనసామాన్య మందరిచే తను గాక కేవల వైద్యులచేతనే కొనబడు నీగ్రంథము ౯–౧౦ సంవత్సరములలోనే రెండు ముద్రణములు పూర్తి అయి మూడవ ముద్రణమునకు సిద్ధముగ నున్నది. ఆంధ్ర దేశమం దిదివరలో ఇట్టిగ్రంథము వెలువడలేదని అనేక మంది శ్లాఘించుచున్న సంగతి అందరికిని తెలిసిన విషయమే. ఈపుస్తకమును కొన్న వేలకొలది వైద్యులు, వీరి ఊహ ప్రకారము ఏమియు వివక్షణ లేని వారుగ కనపడు చున్నారు. ఇందు ప్రమాదములు లేకపోలేదట. ఇంతటితో నన్ను వదలి వేసినందులకు చాల సంతోషించు చున్నాను. రాస్నాతైల మందు ఏరండ తైలమునకు బదులు తిలతైలమును వాడినానట రాస్నాతైలము అనెడి పేరుతో అనేక తైల యోగములు కలవు. కొన్ని యోగములయందు ఏరండతైలము చెప్పబడియుండవచ్చును. నేను శ్రీగోపాలాచార్లుగారి వద్ద నభ్యాసము ప్రారంభించినది మొదలుగ నీ 17 సంవత్సరముల నుండియు ఈవిధముగనే చేయుచున్నాను. వారివద్దనున్న ఆరు సంవత్సరములుకూడ ఇట్లే తయారుచేసితిని. వారు నాకు ఈవిధముగనే 'నోట్సు' చెప్పిరి. అందుచేతనే శ్లోకము లేక వచనము వ్రాయవలసి వచ్చినది. ఇందుకూడ ఏరండతైలమే యని తగు ప్రమాణమును చూపించినచో నేను దిద్దుకొనుటకు ఎంతమాత్రము నభ్యంతరము లేదు.

అశోకమునకు నరమామిడి అని పొరపాటున అర్థము వ్రాసితినని వారు ఏదియో వ్రాయుచూ అది దొరకు మద్రాసు మలబారు మొదలగు అద్రస్సులు కూడ వ్రాసిరి. మలబారుదేశస్థులు మొదలగు ననేకమందియొద్ద మద్రాసునందే ఆరుసంవత్సరములు శుశ్రూష చేసి, అనేక వస్తుప్రదర్శనములను చూచి, అనేకమంది సహవాసము చేసి, అనేకచోట్ల పనిచేసిన నాకు ఈయడ్రస్సులును, అశోక శబ్దముచే దేనిని వాడవలసినదియు తెలియకున్నదా! వైద్యవినోదిగారు శ్రమపడి చిత్రగించిన అశోకమే వాడవలసినదిగ నాముఖ్యాభిప్రాయము. కాని దానిని మద్రాసునందును, ఈప్రాంతములయందును అశోకమనియు, నరమామిడి అనియుకూడ నిస్సందేహముగ వాడెదరు. అందుచేతనే తెలుగున నరమామిడి అని [illegible] నర మామిడిశబ్దముచే కొందరు ఇంకొకవస్తువును వచ్చును. దానికి నేనేమి చేయగలను? మూలికలగూర్చియుపై పెక్కు వాదములు కలవు. అవన్నియు విమర్శించి ఈపుస్తకమందు వ్రాయుట నావిధి కాదు. అట్లవి వ్రాయ మొదలిడినచో అట్టి మూలిక లనేకములు కలవు. వానినిగూర్చి వేరుగ కొన్ని పుస్తకములు వ్రాయుచున్నాను.

కుంకుమాదితైలము.—ఇందు కొంతమార్పు కనపడు చున్నదట. నేను రెండుయోగములను వ్రాసితిని. ఇంకను కుంకుమాదితైలయోగము లనేకములు కలవు. ఏయోగముతో పోల్చిన మార్పు కలదు? ఏయోగమున కాయోగమే సంబంధము. వైద్యవినోదిగారికి ఒకయోగము తెలిసిన మిగతయోగము లన్నియు ఆయోగమువలెనే యుండవలెననియా వారి అభిప్రాయము? ఎప్పుడును అట్లుండవు.

ఎట్టివారు గాని ప్రతివ్యక్తిని సంతోషపరప జాలరు. కుమారు అట్టి గ్రంథ ముండినను అనేక కారణములచే అనేకమందికి అనేక భావములు కలుగ వచ్చును. కాన ఒకవ్యక్తి మారుపేరుతో వ్రాసిన విమర్శన అంతగ పాటింప దగినది కాదని నాకు తెలియును. కాని జనసామాన్యము అంతగ గ్రహింపలేక, ప్రసిద్ధమగు భారతి పత్రికయందు ప్రచురింపబడుటచే ఆవిమర్శనను కొంతవరకైనను నమ్ముదురేమో యని సమాధానమును వ్రాసితిని.

ఆ॥ భి॥ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

## తెలుఁగు ప్రారంభవ్యాకరణము

క్రౌనుసైజు, పు 17, వెల రు ౦-3-౦. గ్రంథకర్త: సాహిత్యశిరోమణి ఉభయభాషాప్రవీణ కొండూరు నరసింహాచార్యులుగారు, బోర్డుమిడిల్ స్కూలు, కమలాపురము.

## శ్రీరామకథాంజలి (వచనము)

డిమ్మిసైజు, పు 225, వెల రు ౧-౪-౦, గ్రంథ రచయిత్రి: శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవిగారు. ప్రకాశకులు: గుడిపూడి రామారావుగారు, గాంధినగరు, బెజవాడ.

Printed and Published by G. Subbaramayya, at the Andhra PatrikaPress, No.7,Thambu Chetty St., Madras